# భారతి

సాహిత్య మాసపత్రిక



సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్

అక్టోబరు 1962

సంపుటము 39 : : సంచిక 10

విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## అక్టోబరు 1962

# శర్వరీ ప్రియ

శ్రీ బాలగంగాధర తిలక్

రావే నల్లని దాన నా మనసులో రాపాడు శోకాకృతీ
వేవేల్ చుక్కల సరాల దాల్చికొను నా వింతైన యిల్లాల, ని
ద్రావేశమ్మున లోకమెల్ల జడభూతమ్మయ్యె మేల్కొన్న నా
ఆవాసమ్ము రహస్యమిచ్చుటకు నేకాంతమ్ముగా రా చెలీ.

ఇంతచీకటి చిమ్ము వింత పెన్నెరులలో
నెలవంక మొగలిరేకుల రచించి
ఆరని మంచుముత్యాలతో కటిసీమ
మురువుగా మొలనూలు సరణి దీర్చి
శ్రవణావతంసమై జారు కల్హారమా
లారజమ్ముల దారులందు జల్లి
కోటి స్వప్నాలయ గోపురాంచలములు
కడగంటిచూపుల గడలుకొనగ

రావె తాపింఛ తరువాటి రథ్యలందు
రావె హిమసిక్త శాద్వలారామవీథి
రావె మిణుగురు లద్దిన రమ్యచేల
ముల కొసలు నేల జీరాడ మోహనాంగి !

పడమట సంద్రాన పడినంత భానుండు
లీలగా కదలె నీలాల కురులు
పంక్తిగా విహగాళి పయనించు సమయాన
నుదుటిపై తోచెను మొదటిచుక్క
బెదరుగా వనవాటి నొదుగ నల్లని నీడ
కచపాళి బాలేందు రచన సౌరు.
కీచురాల్ స్వాగతగీతాల పచరింప
చీకటిగజ్జెలు చిందు రవళి

# భా ర తి

నవవికచ కల్హారముల గంధానిలమ్ము
లరవిరియు సన్నజాజుల పరిమళము
లాలయ నీమేన రారమ్ము వలపు నింప
మూలగా గదిలోని నామ్రోల కిపుడు.

చిత్తుగా త్రాగివచ్చిన శ్రామికుని కన్ను
రెప్పలమైకమ్ము రేక హత్తి
జారచోరగణము స్థైర్యమ్ము నిలుపగా
క్రమ్ము చీకటి కవచమ్ము కూర్చి
పతివియోగాసహ్యా బాధానరకసీమ
తల్లడిల్లు సతికి నిద్రను ఘటించి
పాడింటి అరుగుపై పడి గతించిన ముష్టి
ముసలిపై నల్లని ముసుగుకప్పి

జరగిపోయిన నాటి మధుర దినాల
స్మృతుల తలచి తలచి బాష్ప సూక్తులాడు
విధుర జీవని కేకాంతవేళ కూర్చి
రమ్ము భావదుఃఖితుడ నా ప్రాంగణముకు.

పాపకార్యాచరణులకు ప్రబల శప్త
జీవులకు దుఃఖ సంతప్త దీనులకును
నీవు లేకున్న ప్రాణముల్ నిలుచు టెట్లు
అంధకారసుందరివి మా అనుగు చెలివి.

నీలోన వైదేహి నిందాచరిత్రమ్ము
జాలిజాలిగ కర్ణపాళి సోకు
నీలోన క్లియోపాత్ర నీహార సౌందర్య
మలసి వ్రాలిన విషాదాంత మొరయు
నీలోన ఫల్గున లాలితాస్ఫాలిత
గాండీవ గుణశబ్ద గాన మొలుకు
నీలోన సుగతుని నిర్వాణవేళాపి
మూఢ జగద్దైన్యమూర్తి తోచు

నీవు నేను నదృష్టాధ్వనీనుల మిరు
పురము సాగింతు మీా యాత్ర చిరము, స్థిరము
చిరమునైన వేకువ వెల్గు చేరుదాక
మరల రాతిరి పడనట్టి మంచిరోజు.

ఓసి నిశాచరోత్సవ మహోదయమా! గతకాలగాథ ని
శ్వాస రహస్యమా! భవుని స్వాంతములో మొదలింటి ఊహలో
పోసిన శిల్పమా! నమత మూర్తిని గొన్న దయానిధానమా!
నా సఖి! రాత్రిరాజ్ఞి! స్వరనైక సుఖప్రదశాలిసీ నమః.

మెత్తని పట్టుచీకటుల మేలిమి దుప్పటిలోన కౌగిలిన్
ఒత్తుము, నాకపోల గళ దూర్మికలైచను బాష్పవారితో
హాత్తెద నీయురమ్ము తడిమై ఒకవింత సొబంగు దాల్చ-యీా
మత్తున జోలపాడి నను మైమరపింపుము శర్వరీప్రియా!

# రఘునాథ రామాయణము

## శ్రీ పమిడిపాటి వెంకటరమణ

ప్రబంధకవికాలములో రససేచనతో తడిసి విరిసిన రసికహృదయమునకు కొద్దిగా వేడిగాడ్పు తగిలెనో లేదో అంతలో రసపూర్ణమైన ప్రపాశాలగా రఘునాథుని కావ్యజాల మవతరించినది. అందు తనివార రసపాత్రికల నందిచ్చు సౌందర్య సంశోభిత అయిన ఒక ప్రపాపాలిక ఈ రామాయణ రమ్యకావ్యము. ఆమె భావపూర్ణత్వము ఆకృతి రమ్యతకు దోహదమై నిండుదనమును సంతరించి ఆకర్షణీయముగ జేసినది.

కృష్ణరాయల తరువాతి అంతటి ప్రజ్ఞామూర్తి, సాహిత్యోపనిషదర్థచింతనాశీలి, రాజ్యకావ్య నిర్వహణలలో సమవర్తి, సవ్యసాచి రఘునాథుడు. భావసంపదలో, వర్ణనా వైదగ్ధ్యములో, నిర్మాణ ప్రక్రియలో, పరిశీలనాపరిజ్ఞానములో కృష్ణరాయల రచనారేఖలు మెరపుజీరగనైన కన్పట్టుచుండును.

శ్రీనాథుని కాలమున తెలుగుసాహిత్యము కొంతకు కొంత మోతాదునుమించి శృంగారపు ఒడుపులతో ప్రగతి సాగించినది. రాయలయుగమున శృంగారవైరాగ్యములకు కన్నెకయ్యము జరిగినది గాని శృంగారముదే పైచేయి అయినది. యతి విటుడగుటో విటుడు యతియగుటో అని వచ్చిన పోటీలో ఆ యుగాంతమునకు విటుడే యతిపై ప్రభుత ప్రారంభించినాడు. అది దక్షిణాంధ్ర సాహిత్యమున కారంభదశ. ఎందరో యతులు ఔచిత్యము విడిచి ఊరవిటులైనారు. రసికతపేరిట బజారుసింగారము కుళ్ళు కంపుతో కూడ గ్రంథముల కెక్కినది. ఈ రసికతకు రఘునాథుని కాలములో కొంతకు కొంత ఔచిత్యము లేకపోలేదుగాని తరువాతి కాలములో కట్టలు తెగి ప్రవహించినది.

దక్షిణాంధ్ర కావ్యరంగమున ఈ సూత్రధారుడు చల్లిన సుమవ్రజమే రామాయణము, వాల్మీకిచరిత్ర, శృంగారసావిత్రి, ఇంకెన్నియో కలవుగాని అవి గాలికి పోయినవి. అందు రామాయణ మనువాదకావ్యమే అయినను ఆతని కవితామార్గముల కన్నిటికి అది లక్ష్యముగ నిలుచును. ఆతడు వ్యక్తీకరించిన అభిప్రాయముల పరిశీలనతో ఆతని కవిత్వదృష్టి స్పష్టపడును.

మృదుశబ్ద పారంపరీ పరిపాకంబు,
లోకంబు నవసుధాప్లుతము సేయ
గందళద్రసగర్భ సందర్భసంశుద్ధి
బుద్ధిమంతుల తలంపులు గరంప
భంగ్యంతర వ్యంగ్యవైభవరీతి
నాతియుఁ బోలె నానంద మొసఁగ
నుల్లసద్భావవిధాన్యోల్లేఖి వైచిత్ర్య
చిత్రిత ప్రతిమలు శిరసులూఁప'.

చెప్పవలయుననినాడు కవిత్వము, మొత్తము రఘునాథుని ఉద్దేశము లన్నియు ఇందు గుత్తముగ జెప్పబడినవి. మృదులపదములతోడనే మధురమధువు నందీయవలెనట. ఈ విషయమునే తరచు ఊది చెప్పుచుండును. భావమెంత రమణీయమైనను భాష బరువగుటవలన ఆ రమ్యత్వము మొక్కపోవును. 'దబ్బముండులు' పెనచి మొద్దుకవిత చెప్పుట కాక 'తేటమాటల' తో ముద్దుకవిత చెప్పవలెనని ఆతని దృష్టి. అసలు దక్షిణాంధ్రకవుల—ముఖ్యముగ ఆ తత్త్వము మెదడుకెక్కిన కవులందరి—దృష్టి ఇదియే. అప్పటికి వచ్చిన కొన్ని ప్రబంధములలో చక్కని భావపుష్టి కలదు గాని సుఖావబోధన కనువైన భాష అటనట లోపించినది. సందర్భపుష్టికి రసనిబంధనపై రఘునాథుని దృష్టి అంతయు కేంద్రీకృతమైనది. పలుమా రావిషయమునే చెప్పుచుండును.

పలుకగవలె నవరసములు
గులుకం బద్యములు చెవులకున్ హృద్యముగా
నలుకక యట్టుగాకున్నం
బలుకక యుండుటయె మేలు బహుమానముగన్."

—రామాయణము.

చెవులకుఁ జవులై చల్లఁగఁ
గవులకుఁ దవులై సమస్త కావ్యకళా బం
ధువులై రససింధువులై
యవురా ! యనఁ గవిత లవని నలరఁగ వలదా."

—వాల్మీకి చరిత్ర.

రచియించిన నవరసరంజితమ్మైన కవిత్వమునే రచింపవలె. లేనిచో ఊరకుంట మేలు. 'సందర్భము నవరస నిష్యంది యగుచుఁ గవుల చెవులఁ దవుల నింపొందినఁదగుఁగాక' లేనిచో అది కవిత్వమేమి. అయితే రసనిష్యందులైన సందర్భములు చాల కలవుగాని ఔచిత్యము విషయమున అది బారెడు దూరములోనే తరచు సాగిపోయినది. మూలకథానిబద్ధరసమును మార్చకూడదను లక్షణమును త్రోసివేసి తదితర రసముల స్థానమునగూడ శృంగారమును పూరించినాడు. కేవలము యతిప్రాస తప్పనంతమాత్రమున అది కవిత్వము కాదు. అందెచటపట్టిన రసప్రసరణము జరుగుచుండవలెనట.

మూడవది ధ్వనిప్రధాన రచన. కవితారచన నాతి ప్రవర్తనవలె ప్రతి మలుపుకు, అడుగడుగున విశిష్టార్థ ప్రతిపాదకమ్మై ఆనంద పర్యవసాయి కావలె. కేవలము కావ్యప్రయోజనము మాత్రమే కాంతాసమ్మితముగ కాక ప్రతి రమ్య భావము ఆఫక్కికమే అయిన కావ్యము మధురపాకమున తయారగును. వివిధార్థరచనావైచిత్ర్యముతో ప్రతి విషయమును చిత్రింపవలయును. తెనుగుమార్గము కానిది, సంస్కృతమునకు విలక్షణమ్మైన ఏఅప్రయోగమును చేయ రాదనినాడు. అనవాక్షణికరచనపై తగినంత గౌరవ మున్న దన్నమాట. దక్షిణాంధ్రరచయితలకు పలుపుర కీ దృష్టి కలదుగాని నిజమునకు వీరి చేతిలో వ్యాకరణ మొక త్రోవ పట్టినది. ఎన్నియో వ్యావహారికరూపములు నెక్కొనినవి కాని అవి 'తెనుఁగుతెలుంగు' నకు గిట్టినవే. సందర్భమును వాస్తవికచిత్రణకొరకు అట్టి రచన రఘునాథుడును అటనట చేసినాడు.

''చెప్పవలెఁ గప్పురంబులు
గుప్పలుగాఁ బోసినట్లు కుంకుమ పైపై
గుప్పినక్రియ విరిపొట్లము,
విప్పినగతి ఘుమ్మనన్ గవిత్వము సభలన్.''

అంత సౌరభముతో విరిసిననే అదే కవిత్వము. ఆ పదార్థముల సౌరభము నంతయు ఇముడ్చుకొని అవి యెంత హృదయ్యాహ్లాదులో, తన్మయీభూతచేతనకు కారణములో ఆ కవిత్వము అంత చల్లదనమును కలిగింపవలెను. కవిత్వ మెట్లుండవలెనని చెప్పు ఆ ఒడుపు, భావన—కల ఆ పద్యములోనే రఘునాథుని కవిత్వము వికస్వరమ్మైనది.

రామాయణము అనువాదకావ్యమే అయినను ఈ కవిత్వ తత్త్వము చాలవరకు అందు చూప ప్రయత్నించినాడు. రామాయణము తెనుగులో రచింపవలెనను ఉద్దేశమేకాని అంధ్రీకరింపవలెనను ఉద్దేశము అతని కున్నట్లు కన్పట్టదు. కథ ఉపలక్షణమాత్రము. కవిత్వప్రదర్శన కనువైన సందర్భము దొరికిన చాలును ఎన్నియో భావచిత్రణముల దోపుచుండును. ఇది స్వేచ్ఛానువాదమే కాదు స్వేచ్ఛాతి స్వేచ్ఛానువాద మనవలయును. ఒకరకముగ ప్రబంధమార్గ మనవచ్చును. రఘునాథుడు రామాయణము నంతయు రచియించినాడుగాని మనకు అత్యల్పమ్మైన భాగము మాత్రము లభించినది. రామావతారమన్న కాలేదు రామాయణము ముగిసినది. దేవతలు రావణ సంహారమునకు విష్ణుదేవుని ప్రార్థించుటకు శ్వేతద్వీపమున కరిగినంతవరకే లభించినది—దేవతలు శ్వేతద్వీపమున కరుగుట మూలమున నున్నదికాదు. దేవత లందరు రావణుడు పెట్టు బాధలను బ్రహ్మదేవునకు విన్నవించుకొనిరి. మానవుడుతప్ప ఎవ్వడును అతని చంపలేరని బ్రహ్మ చెప్పగా వారు సంతోషించు సమయమున విష్ణుదేవుడే అట కరుదెంచినాడు మూలమున.

'ఏతస్మిన్నంతరే విష్ణురుపయాతో మహాద్యుతిః
శంఖచక్ర గదా పాణిః పీతవాసా జగత్పతిః
బ్రహ్మణాచ సమాగమ్య తత్రతస్థౌ సమాహితః'

అట్లు వచ్చిన విష్ణుని చూచి దేవతలందరు నమస్కరించి తమ బాధలను చెప్పి అతనిని దశరథునకు మానవుడుగా జన్మించి రావణ సంహారముచేయ ప్రేరేపించినట్లు కలదు. ఇక రఘునాథుడో—బ్రహ్మ తనకడకు వచ్చిన దేవతలను శ్వేతద్వీపములోనున్న విష్ణువుకడకు పోయి అతని ప్రార్థింపుడని పంపినాడు.

శ్వేతద్వీపమునకుఁ జని,
శ్రీతరుణీపతికి నెఱుకసేయుడు వేగం
బీ తెఱఁగంతయు నప్పుడ,
యాతంకములెల్లఁ బాయు నా హరి కరుణన్.

వారు శ్వేతద్వీపమున కరిగి ఒకటి రెండు పద్యములలో పాలసముద్రమును చూచి దాని మధ్యమున ఉన్న శ్వేతద్వీపమును వర్ణింప ప్రారంభించిరి. వారెన్ని పద్యములలో చెప్పిరో గాని మనకు 21 పద్యములు లభించినవి. తెల్లని పాలసముద్రము, ఆ మధ్యలో తెల్ల దీవి—వీనిని వర్ణించుటలో నెంతేని కవిత్వము ప్రదర్శింపవచ్చును. అదియుకాక అప్రార్థితుడై విష్ణువు దేవతలకడకు వచ్చెననుటకంటె దేవతలందరు విష్ణువుకడకే అరిగి అతనిని ప్రార్థించిరనుటలో విష్ణువున కుత్కర్ష అని రఘునాథుడు భావించి ఉండవచ్చును. రామభక్తుడు రఘునాథు డట్లు భావించుటలో అనమంజస మేమియు లేదు. అటు రమ్యకవిత్వప్రదర్శనకు, ఇటు రామభక్తికి రెంటికి అనువై ఉంట ఈ మార్పు చేసి ఉండవచ్చును.

# రఘునాథ రామాయణము

క్రౌంచమును బోయవాడు చంపు ఘట్టమున మూలమున లేని బోయవాని వర్ణనము స్వరూపసాక్షాత్కృతితో స్వభావోక్తియుతముగ వర్ణించినాడు. ఆ ఘట్టమంతయు ఒక ప్రత్యేకమైన ఒడుపుతో సాగిపోయినది. కోసలదేశవర్ణనలో అనేక రమ్యభావములను మూలభిన్నముగ రచించినాడు. అందు ద్రవిడదేశప్రకృతి మూర్తికట్టినది.

గజవర్ణన ఒకటి రఘునాథరామాయణములో ప్రత్యేకముగ కన్పట్టినది. మూలమునను ఇది కొంత విపులముగ నున్నను ఆ వర్ణించు పద్ధతి తద్భిన్నము. రచన ప్రబంధ మార్గమున సాగించుచు అశ్వాదివర్ణన క్లుప్తముగ చేసి గజవర్ణన విపులముగ ఆరు పద్యములలో వర్ణించుటలో ఆతనికి దానిపైగల మక్కువ తెలియును. రఘునాథుని సైన్యములో ఆతనికి విశేష ముపకరించినవి గజములట. గజాధిష్ఠితుడై ఆతడు తరచు రణరంగమున కరుగునట. కావేరీ సాగరసంగమమునగల దేవికోటలో ఉన్న చోళగుని శిక్షించుటలో ఆతనికి గజయూథమే ఎంతయో సాయము చేసినదట. ఆతడు తన ఏనుగుమీదనే సముద్రము నీది ఆ ద్వీపము చేరినాడట. అందుచే రఘునాథునకు వానిపై మక్కువ ఉండుటలో వింతలేదు. ఇంత విపులముగ గ్రంథములో వర్ణించుటకు ఆ మక్కువ కారణమై ఉండునని అభిప్రాయపడుటలో అసమంజసము లేదు. పుత్రులు లేరని బాధపడుచున్న దశరథుని మనస్తత్త్వచిత్రణలో మూలమునకు మెరుగు పెట్టుచు రచన సాగిన దనవచ్చును.

ఋష్యశృంగ ఘట్టము మూలమున కెంతో దూరముగ సాగినది. రోమపాదుని కొలువులో వేశ్యల సంరంభము అమూలకము. 'గణికా స్తత్ర గచ్ఛంతు రూపవత్యస్స్వలంకృతాః' అని రోమపాదాదు లనుకొని వేశ్యలను పిలిపించి కార్యమున నియోగించుటయు అప్పుడు 'వారముఖ్యాశ్చ తచ్ఛ్రుత్వావనం ప్రవివిశుర్మహత్' అనుటలో వా రడవి కరిగినట్లున్నది వాల్మీకమున. పేరుపేరున వేశ్యల పిలుచుకొని అందరు రోమపాదుని కొలువునకు గొల్లన నాలుగు పద్యములలో వచ్చుటయు అక్కడ రాజు వారి ప్రజ్ఞను విపులముగ పొగడుటయు మూలమున లేదు. వారట,

నేలకు మింటికిం దొడరి నేర్పున
    నూత్రము వన్న, మంచుఁ గుం
చాలను గొల్వఁ ద్రాళ్లిసుకచాలునఁ
    బేనఁగఁ జుక్కలెన్నఁ జ
ట్రాలను నారలొల్చి నెగడ న్వడగండ్లను
    గుళ్ల గట్టఁగాఁ
జాలిన మీకు నిచ్చటికి సంయమిఁ
    దెచ్చుట యేమిచోద్యమో.''

అంతటి ప్రజ్ఞకలవారు వారు. అసాధ్యవిషయముల చేసినా రనుటలో అతిశయోక్తి ఉన్నను అది ప్రకృత కష్టసాధ్య విషయమును సాధింపగల రనుట కుత్కర్షాపాదకము. వారు

పుట్టు బ్రహ్మచారి పొలఁతుల కూటమి
    యెట్టిదో యెఱుంగఁ డట్టి మౌని.'' ఋష్యశృంగుడు—వాని నెట్లు తెత్తు మనుటయు దానికి రోమపాదుడు మునుపు దేవేంద్రుడు అప్సరస్త్రీలను మునులకడకు పంపుట కలదు—ముఖ్యముగ నిట్టి సందర్భములు సరసములుగా సాగవలెగాన దానికి స్త్రీ లెంతో ఉపయోగపడుదురని వారిని పంపినాడట. వారు అడవి కరుగుటలో ఇంకొక సన్నివేశము దక్షిణాంధ్రయుగ తత్త్వమును ఆకట్టుకొని రూపు గొన్నది కలదు. ఆ వేశ్యలు ఋశ్యశృంగుని తెచ్చుట కరుగుచుండగా వారికి ప్రాతకాపులైన నిలయవిటులు తగిన సరంజామాతో వెంటబడిరట. వా రందరు కలసి ఊరిబైట ఒక తోటలో తమ ప్రేమను ఒలకబోసికొనుచు కొంతసే పుండిరి, వారు

'ఇటునటు మోముఁ ద్రిప్పి వెడ
    యేడ్పులు దెచ్చుచుఁ గన్నుఁగోనలం
బొటపొట రాలు నశ్రుకణము
    లొక్కనగోళ్లను మాటిమాటికిం
జిటుకు చిటుక్కనం జెదరఁ
    జిమ్ముచు గద్గదికంఠాలంకు ము
చ్చటపలుకుల్చెలంగ బిగిచన్గవ
    సోకఁగఁ గౌఁగిలించుచున్'

కూర్మి నటించిరట. రాజు పంపుచున్నాడుగాన పోక తీరదనియు, పోయిన నేమి గొబ్బున వచ్చెదము, మిమ్ము మాత్రము ఒకపూట చూడక ఉండగలమా అనినారు. తాము పోయిన కార్యము సఫలమగుటకు ఆ విటులను దేవతలకు మొక్కుచు ఊరనే ఉండుడని కోరిరి.

ఏము పోయినకార్య మీడేఱ దేవళ్ల
    కును మ్రొక్కుఁకొనుడు మా కొఱకు మీరు.

ఇట్టి రచన కేవల శృంగారప్రబంధములందు ఔచిత్యాన్వితమే అగును. వేశ్యల కుహనాప్రవర్తనను వర్ణించుటకు రామాయణమువంటి కావ్యములలో అవకాశ మల్పము. అట్టి వర్ణన చేయవలయునను దృష్టి ఉన్న కవి అయిన వేశ్య అనుమాట దొరికిన చాలును. తన చాపలప్రకృతిని ప్రద

ర్శించును. ఉదాత్త కావ్యరచనకు సంయమన ముండవల యును. అది మహాకవుల కుండును. ఇట్టి సన్నివేశమునే తరచు తన గ్రంథములలో దూర్చుచుండును రఘునాథుడు. వాల్మీకి చరిత్రలో రంభోర్వశులు ఇంద్రప్రేరితలై వాల్మీకి కడకు వచ్చు సందర్భమున వారి ముంగిటి బంటులైన సోమ పీథులు వెంటబడగా ఆ ఛాందసులు తమవెంట వచ్చిన రసా భాసమగునని వారిని మాయమాటలు చెప్పి మరలించినట్లు కలదు. శృంగారసావిత్రి యందును మేనక అశ్వపతికడకు వచ్చునపుడు కుండలాలాగ బొజ్జ నాడించుకొనుచు రాచ వీథులలోపడి విశ్వామిత్రుడు ఆమెవెంట బడినాడట. ఏవో మాటలు చెప్పి మరలించి పోయినదట. ఇది చమత్కారా వహమేకాని సందర్భమును మరచి గ్రుడ్డిగా ఔచిత్యరహిత ముగా రసికత నొలకబోయుట. రామాయణములో వేశ్యల వెంటపడిన విటులు కొంత మేలు. ఇచ్చట హాస్యాస్పదులు విటులే. అట మహర్షులు, సగమాశ్వాసమునకు పైగా ఋష్య శృంగ ఘట్టమును ప్రపంచించినాడు. పాడయిన ఘట్ట మది అనువాదమున.

దశరథుడు అశ్వమేధయాగము చేసిన సందర్భమున 'యాగశాలాంతరభాగముల' వేశ్యలు నాట్యము చేసిరని రఘు నాథ రామాయణము. దశరథుడును యజ్ఞసందర్భమున ఈ మేజువాణీ పెట్టించుట ఏమి. చాపల్య మౌచిత్యానౌచిత్య ముల గమనింపదనుటకు పరమోదాహరణము. అస లా యజ్ఞ వాటికలో వాల్మీకమున నున్న వాతావరణము పోయి క్రొత్త వాతావరణ మలముకొన్నది. అందును ఆతని పరిశీలనాదృష్టిని వ్యక్తముచేయు పట్టులును కలవు. తననాడు జరుగుచుండిన యజ్ఞముల నెన్నియో చూచియుండును.

> అప్పుడు వప చిటచిట్లమను
> చప్పుడుఁ బ్రజకీలు చఱచు చప్పుడు నొగి సొం
> పొప్పఁగ నేకమగుచుఁగ
> కుప్పటలము నెల్లఁ జాల ఘూర్ణిలఁ జేసెన్.

ఇది అమూలకము. అశ్వముమెదడును శాస్త్రయుక్త ముగ పక్వముచేయవలయును. ఆ మెదడు ఉడుకు నప్పుడు పుట్టు చిటచిటశబ్దము, ఆ యజ్ఞము చూడవచ్చిన వారి హడావిడిలో వారి చప్పట్లతో కలసి దిక్కులు క్రమ్మె నట. ఇది అతిసామాన్యమే కాని ఇట్టి భావము లట్టి సందర్భ వర్ణనలో రచింపవలెనన్న ప్రత్యక్షముగ యజ్ఞవాటికను చూచి యుండు ననవచ్చును. గోవిందదీక్షితులవారు యజ్ఞము చేయునప్పుడు రఘునాథుడు ఛత్రము పట్టెనట.

మొత్తముమీద చెప్పవలెనని కథ ప్రాతదేగాని రచనామార్గము క్రొత్తది. ఒక శృంగారపు తొడుగును తొడిగినాడు. అటనట అనౌచిత్యము లున్నను పుష్కలభావ చిత్రణములు కావ్యత్వశోభను సమకూర్చినవి. దానితో ఎన్నియో సందర్భములలో మూలతత్త్వము పరదాలో దాగినది.

దక్షిణాంధ్రకవులలో రసికతపేరిట శృంగారవర్ణన విపరీతముగ జరిగినది. రఘునాథుడును కావ్యము నవరసనిష్యంది కావలెనని ఆశించినాడుకాని శృంగారపు గొడవ ఎక్కువగ తెచ్చిపెట్టినాడు. దానికి హాస్యము తోడయినది. శృంగారో ద్భూతమైన హాస్యము ఆహ్లాదకారియే కాని ఔచిత్యమును వదలిన అసహ్యమగును. అయోధ్యవర్ణనలో అచ్చటి ప్రజలు,

> 'ఎవ్వారిఁ జూచిన హీరహారి కిరీట
> హార కుండలముల నలరువారె
> యెవ్వారిఁ జూచిన జవ్వాది బుగబుగల్
> గలుగు కుంకుమగంధ మలఁదువారె
> యెవ్వారిఁజూచిన దవ్వుల వాసనల్ వి
> నరు పూసరులచేఁ బొసఁగువారె
> యెవ్వారిఁ జూచిన నిందు కుందచ్ఛాయఁ
> గనుపట్టు వెలిపట్టు గట్టువారె
> యెవ్వరిని జూచిన మహామహేంద్ర
> నీలజాల జాలకయుత హేమసౌధ
> సీమ సీమంతినులఁ గూడి కామకేళి
> వేడుకలఁ జెందువారె యప్పీటియందు.'

అయోధ్యలో ఏమోగాని తంజావూరులో అందరు అట్టివారై ఉందురు. 'ఎవ్వారిఁ జూచిన' అను ఎత్తుగడలతో ప్రారంభించుటతో కవికి సర్వము శృంగారమయముగా సాక్షాత్కరించిన దనవచ్చును. ఇక వాల్మీకికి అయోధ్యలో కాపి గాని, నృశంసుడుగాని ఇంద్రియనిగ్రహము లేనివాడుగాని లేరట. అందరు మహర్షులవలె సాక్షాత్కరించినారు.

> 'కామీవా నకదర్యోవా నృశంసః పురుషః క్వచిత్
> ద్రష్టుం శక్య మయోధ్యాయా న్నావిద్వా న్నచ నాస్తికః
> సర్వేనరాశ్చ నార్యశ్చ ధర్మశీలాస్సుసంయుతాః
> ఉదితాశ్శీల వృత్తాభ్యాం మహర్షయ ఇవామలాః.''

అట్లని వారు అరసికులు కారు.

> నా కుండలీ నామకుటీ నాస్రగ్వీ నాల్పభోగవాన్
> నామృష్టో నానులిప్తాంగో నా సుగంధశ్చ విద్యతే.

ఈ శ్లోకమునే మంచి ఒడుపులో పై పద్యమున రఘు నాథుడు చెప్పినాడుగాని ఆ కామకేళి వ్యవహారమును దోపు

టతో వచ్చిగా తేలినది. అది రసికతకాని ఇదేమి. శృంగార హాస్యము లనిన మక్కువేకాని తదితర రసపోషణమందును నేర్పు చూపకపోలేదు.

ఒక ప్రకృతిని అది కన్పడు బాహిరపరిస్థితిని వర్ణించుట కంటె దాని హృదయావర్తములను తదనుగుణముగ వర్ణించుటలో ఆకర్షణ పఠితమనస్సును పిండగల శక్తి ఉన్నవి. ఆ ప్రకృతి వర్ణనను రక్తికట్టింపవలయుననిన కవికి సహృదయత, భావితాంతఃకరణత్వము అత్యంత మవసరము—ఆ ప్రకృతి మానవేతరమయిన మానవప్రకృతి వర్ణనకంటె ఎక్కుడు నిశిత పరిశీలనాదృష్టి అవసరము. అట్టి దృష్టి రఘునాథుని అందును బోయవాడు క్రౌంచమును చంపుసందర్భమున స్పష్టపడినది. ఆ క్రౌంచములు రెండు కూడిమాడి,

''ఒక్క మహీజశాఖపయి నొక్కట
వేడుకఁ గూడియుండి యొం
డొక్కటి ఱెక్క విప్పుకొని
యొప్పుగఁ గప్పుచు నొయ్యబల్కుచు
న్మిక్కిలి మేను గీఱుచును
మోమును మోమును జేర్చి మిక్కిలి
న్మక్కువనుండ గ్రౌంచ
మిథునంబు గనుంగొని సంభ్రమంబునన్.''

ఉండినవి. వాని మక్కువను వర్ణించుట సహజసుందరము. బోయచే దెబ్బతిన్న క్రౌంచము క్రిందపడి,

'పడి రోజుకొనుచు నెత్తురు
బుడబుడ గ్రక్కుచును బోరపాడవై యెగయూ
ర్పుడరఁగఁ బొరలం దొడఁగె
న్నెడ ఱెప్పం గన్ను గప్పి వేదన బలియన్.''

దాని అప్పటి ఆ అవస్థ చూచిన సహృదయ మానవ ప్రకృతి అట్లే విలవిల తన్నుకొనును.

''కులకులఁ గూయుచు నిలపై
జలజలఁ జట్టుపలు రాల సారెఁ బొరలుచు
న్విలవిలఁ దన్నికొనెడు నల
పులుగుంగని మౌనికరుణఁ బొగులుచుఁ బలికెన్.''

ఆ పరిస్థితిని చూచిన మౌనిమానస ముద్విగ్నమై గిలగిల తన్నుకొని ఆ సంచలనముతో రసభరితమై ఉద్రేకపూరితమైన వాక్కు వెలువడినది. అట్టి భారతీసాక్షాత్కృతికి మూలమునకంటెను రమ్యముగ పూర్వరంగమును, నిర్మించినాడు రఘునాథుడు. ఆతని ఆ ఒడుపు చూచిన వాల్మీకికే కాదు భావితాంతఃకరణుడైన ప్రతివానికి అట్లే అనుభూతి కలుగును. అదీ రసపరమార్థము.

దశరథుడు పుత్రవ్యామోహముతో బొగులుచున్న ఘట్ట మొకటి మధుర భరితమైనది. ఆంధ్రములో అనువాదకులు ఈ ప్రకృతిని వివిధగతుల వర్ణించుట కవకాశ మేర్పడినది. కారణము వాల్మీకి దాని నంతగా ప్రపంచించి వర్ణింపకుండుటయే. 'సుతార్థం తప్యమానస్య నాసీద్వంశకరస్సుతః' అన్న దానిని ఎంతగనో ప్రపంచించినారు—ఈ విషయములో రఘునాథుడును విలక్షణతను, అభినివేశమును చూపినాడు.

బాలకు ఫాలకుటీ లలం
బాలకుఁ బాలకును మణిమయంబగు గిన్నెం
గేలఁ గొని దాది వెంటనె
బాళిం దిరుగంగఁజూచు ఫల మబ్బునొకో'

రంగు మెఱుంగుల బంగరు
ముంగిట నుంగుటము లూఁది ముద్దుగులుకు లీ
లం గలకల నవ్వుచు మెలఁ
గం గొమరునిఁజూచు కౌతుకము గలుగునొకో.

వర్ణ్యము రాజప్రకృతి. వర్ణించునది రాజప్రకృతి. కనుకనే దశరథున కత్యంత ముచితమైన కోరిక పుట్టినది. ముంగురులు ప్రేలాడుచుండ దాది అన్నముపెట్టు దృశ్యము సాక్షాత్కరించినది. ఏ సామాన్యుడో ఈ ఘట్టము రచింపబూనుకొనిన ఆతనికి ఏ శైలో పోవునపుడు కన్పడు ఉయ్యాల తొట్లు అందు బాలకు డూగుట, ఆటబొమ్మలు, మైనపు పట్టలే తోచునుగాని ఆ హుందా రాదు. ఆ ఘట్టములో మరియొక మధుర భావము చూడుడు.

'కలుగునొకో చకోరహితుఁ
గన్గొని తెమ్మని పోరువెట్ట దా
దులు గికురించి యద్దమునఁ
దోఁచిన చందురుఁ జూప రెండు చే
తులఁ గొని పట్టి సంతసముతోఁ
దన చేతికిఁ జిక్కెనంచు న
గ్గలికఁ జెలంగ బాలకుని
గన్నుఁగొఁ జూడఁగఁగల్గ భాగ్యముల్.''

ఈ భావము జనవాక్యములో ఒక కథగా రూపుగొని ఉన్నది. చిన్ననాడు రాముడు చంద్రుని చూచి అది కావలయునని ఏడ్చుచుండుట. దాదులు ఎన్ని చెప్పినను వినకుండుటయు తుదకు అద్దము తెచ్చి చేతి కిచ్చుటతో అందు ప్రతిబింబితమైన చంద్రుని చూచి వాడు దొరికెనని సంతోషించి

నట్లు కథ బహుళప్రచారములో నున్నది. రఘునాథుని గ్రంథము పూర్తిగ లభ్యమై ఉండిన అందు రాముని బాల్య వర్ణనలో ఈ సందర్భమును విపులముగ చమత్కారయుత ముగ నెంతో సహజముగ వరి ంచియుండును. ఇంతగా ప్రపం చించి రచించిన ఈ వ్యామోహము రక్తికట్టినది.

దశరథుని పుత్రవ్యామోహమువలెనే ఋష్యశృంగుని మౌగ్ధ్యమును అనువాదకులు స్వీయ భావపరంపరను ప్రవేశ పెట్టుట కవకాశ మిచ్చినది. ఋష్యశృంగుని రానురాను ఒక మృగముగ ఈ కవులు చిత్రించిరి. వాల్మీకములో ఆతని కింతటి ఘోరపరిస్థితి సంభవింపలేదు. ఆతనికి నాగరక మెప్పుడును కనీస మాలోచనాగమ్యమైనను కాదు. వనప్రదేశమంతయు ఆతనికి కొట్టినపిండి. ఆతడును ఋషియేకదా. ఎంత అమా యికజీవి అయినను వానిని మృగతుల్యునిగా వర్ణించుట ఘోరము. అతడు,

'అనభిజ్ఞస్స నారీణాం విషయాణాం సుఖస్యచ'

అని చెప్పబడినాడు. అట్లు పెరిగినవా డగుటచే ఆ వేశ్య లను చూచి,

'అదృష్టరూపాస్తేన కామ్యరూపావనే స్త్రియః.'

అని అనుకొనినాడు. దాని నాధారముగ కొంత హాస్య మును ప్రపంచించుట కవకాశమున్నది. అంతియేగాని అందు చాపల్యమును చూపిన ఆ పాత్రప్రకృతి దెబ్బతినును. అస లాతడు స్త్రీ నెరుగకపోయినను పురుషునిగా చిత్రింపవలసిన అవసర మెంతైనను గలదు.

ఇంద్రియార్థై రభిమతై ర్నరచిత్తే ప్రమాథిభిః
పురమానాయ యిష్యామః.''

ఆతనిలో ఇంద్రియములు, అప్పటివరకు గుర్తింపబడ నట్లును ఆ వేశ్యలమూలమున సంచలనము కలిగినదనియు వర్ణింపవలయును మూలతత్త్వమును ప్రపంచింపవలయు నని ఆతని కొక వనప్రపంచము వినా మరియొక ప్రపం చము తెలియదు. వేరొక ప్రపంచము వస్తువు కన్పించి నపుడు ఆశ్చర్యపడుటలో వింతలేదు. ఆ ఆశ్చర్యమును ముగ్ధత్వ మునకు ముడిపెట్టి ఔచిత్యయుతముగ వర్ణింపవలసి యుండును అనువాదకుడు. అంతటి ఋషిని మూలభిన్నముగ మృగ ముగ వర్ణించుటలో ఔచిత్య మేమనవలె. మనకు తెలియని, చూడని ఒక వస్తువును ఎవడైన చూపిన ఆశ్చర్యపడినపుడు, మృగమువలె చూతువేమని వా డనిన ఎంత సమంజసమో అంత సమంజసము రఘునాథుని ఋష్యశృంగ ఘట్టము. అస లాతని మృగముగ చిత్రించుట ఆంధ్రములో భాస్కర రామాయణము తోనే ప్రారంభమైనది. (నేర్పుతోఁ దెచ్చిరి దీమముల్ వ్రుగము దెచ్చిన కైవడి ముగ్ధసంయమిన్) ఇక రఘునాథుని కాలమునకు మొదటినుండి చివరవరకు మృగముగనే చిత్రింప బడుట అసహ్యము. వేశ్యలు బయలుదేరుచు ఋష్యశృంగుని విషయము పూర్తిగ నెరుగకయే మృగముక్రింద లెక్కగట్టి,

మెకములను గూడి వేడుక మెలగుచుండు
ఋష్యశృంగునిఁ బట్టఁ బోయెదము కడఁగి'

అని మృగములలో నొకనిగా లెక్కకట్టినారు. వానిని చూచి,

ఇమ్మానిసి మెకము న్మది
నమ్మఁదగదు చేర గొబ్బునం జనకుడు పైఁ
గ్రమ్మి తలవంచికొని వడిఁ
గొమ్మున నటు చిమ్మెనేని కొదవగుఁ జుడీ !

అచ్చముగా అడవిదున్న వర్ణన. అందు ఒక వేశ్య ఆతని తన 'మొలనూలు దిగిచి కొమ్మున నుచ్చు దగిలించి చేపట్టికొని తెత్తుఁ జిగురుఁ బోడి'' అని ప్రజ్ఞలు పలికినది. ఇక ఋష్య శృంగుని వర్ణన కూడ.

'కొమ్మరో నడునెత్తిఁ గొమ్మేంది ......
బు సిగప్పుకొన్న చొప్పున మేన నిండంగ
మేదించినట్టి ఈబూది యేంది.
కసవు ముప్పిరి త్రాటఁ బొసఁగంగఁ గట్టిన
పొడచింకతోలు కచ్చడ మదేంది
నొసల మసిబొట్టిదేంది యెద్దెసల నిట్టి
బూచిఁ గనుఁగొన మమ్మక్క !

అని వర్ణించినాడు. 'పుసి కప్పుకొన్నట్లు' అన్నవి ఉపమానానికి వచ్చినవే అయినను జుగుప్సావహములు. మృగము పైపెచ్చు 'బూచి' అతడు. ఇది దక్షిణాంధ్రకవుల కాలమునాటికి ఆ ఋషి పరిస్థితి. రాయలఅంత రాజుకు ఋషిమీద ఇంత తేలికభావ ముండుట ఏహ్యము. ఏ సామాన్యపు ఊరజోగినో, మలినదేహుడనో వర్ణింపవలసిన తీరిది. ఈ ఘట్టము ఋష్యశృంగఘట్టము కాదనుకొనిన అనేక చమ త్కారభావములను ఆహ్లాదకరముగ రఘునాథుడు వెలువ రించినాడు. అసహజమైనదే అయినను అతి రమ్యమైన ఒక భావము చూడుడు.

కులుకు గుబ్బేతల చూపులు గల్వవిరులంచు
దేవతార్చనకుఁగాఁ దివియఁ బూను
మగువ లందుకు నవ్వ నగవు వెన్నెలలోన
వినువాక జలమంచే మునుఁగఁబోవు''

# రఘునాథ రామాయణము

ఆతని మౌగ్ధ్యము నెంతదూరము తీసికొనిపోయినాడో. తనకంటె వచ్చినవారు గొప్పవా రగుటకు ఆత డనుకొనుట.

'అబ్బురంబుగ నెద గుబ్బకొమ్మలు మొల్చె
ఘనులు వీరౌర నాకన్న ననుచు."

వట్టి కొమ్ము లనుటమేలు. వానికి 'గుబ్బ'శబ్దము వాడుట కాతనికి పూర్వపరిచితములు కావలె. ఆ మౌగ్ధ్యముతో ఆతనిలో కొంత రసికతనుగూడ పోసి చక్కని ఉపమానము లచే వారిని వర్ణింపజేసినాడు కవి.

ఘనముల వెనువెంటఁ గదియుచున్నవి జల
దాకర్షణము వీరి కబ్బె ననుచుఁ
బలుకుల నమృతంబు దొలఁకెడు బళివీర
లమృతాంధసులకన్న నధికు లనుచు."

అనుకొనినాడట. ఋష్యశృంగున కేమి రసికత్వము? వారి శుభరూపము గన్గొన నెమ్మనంబున నిక్కిలి వేడ్కయయ్యె నని వారలఁ జేరి 'హేమకుండిక లెట్టు లెద మోచికొన్నారలని కుచంబుల కేల నంటి యంటి .... ' మొదలగునవి చేసినాడట. ఆ మక్కువ ఎట్టిదో! అంతటితో వేశ్యలు వానిని మరింతగా కలవరపెట్టిన మరునాడు తమకడకు రాడేమోనని భయపడి ఆనాటికి కార్యక్రమమును ముగించిరట. మూలములో విభాండకుడు వచ్చునేమో అని అరిగిరి. ఆతని ధోరణిలో అట్లు మార్చి రచించుట రమ్యమే. మూలమున కీ ఘట్టము ప్రపంచీకరణముగనే, భావపూర్ణముగనే సాగినదిగాని ఔచిత్య విషయమందే శంక.

రఘునాథరామాయణమునకు రమ్య కావ్యత్వపు విలువను సంపాదించినవి అందలి వర్ణనలు. అవకాశము లభించిన చాలును ఆతని భావనాసుషమ బహుముఖముల ప్రసరించును. కృష్ణరాయల వర్ణనలవలె ఇవి ఎంతయో స్వభావోక్తి సుందరముగ సాగినవనవచ్చును. వానివెనుక ఎంతయో ప్రకృతి పరిశీలన కన్పించును. అత డెన్నియో వర్ణనామార్గముల చూపించినాడు.

అందు స్వభావోక్తి ఒకటి సుందరతరము. అనవస్తు వర్ణనలోని రమ్యత్వమును ఉన్న దున్నట్లుగా రచించి రక్తి కట్టింపవలయును. అనావృష్టి వర్ణనలో

"కొండలవలె గోదమొగ్గు,
ళ్ళొండొండఁ బ్రభాతవేళ నుదయించి క్షణం
బుండి యడంగెడు మఱి వెలి,
యెండలు గాయంగఁదొడఁగె నేమన నింకన్."

"చెలమదోడిన నింత చెమ్మ గ్రమ్మక వేఁడి,
యిసుకఁ పాలంబయ్యె నేఱులెల్లఁ
గమఠ కర్కటక మీనములు పైఁ బొరలంగఁ,
జెఱువులు పంకంబు చిక్క నింకె
వనరుహంబులు వాడి వత్తులై తూలంగఁ
గలఁక నీరును లేక కొలఁకు లిగిరెఁ
జలపట్టి వేయి నిల్వులు ద్రవ్విననుఁ నెందుఁ,
గూపంబులు జలంబు జూపవయ్యెఁ.
బైరు లిల వ్రాలి సురగాలిఁ బఱవసాగె
నల జలప్రాయ దేశంబులందు నుండు
తరువు లెల్లను జొరువులై దళము లెడలి
నిలువులకు నెండె నొక్కింత నీడలేక."

ఇదియే జాతి. అన యథావస్తువర్ణన. రఘునాథుని కవితలో ప్రత్యేకముగ కన్పించు లక్షణము. కనుకనే చేమకూర,

తా రసపుష్టిమై ప్రతి పదంబున జాతియువార్తయుం జమ
త్కారము నర్థగౌరవము గల్గ ననేక కృతుల్ ప్రసన్న గం
భీరగతిన్ రచించి మహి మించినచో నిఁక నన్యు లెవ్వర
య్యా రఘునాథభూప రసికాగ్రణికిం జెవిసోకఁజెప్పఁగన్!"
అని ప్రశంసించినాడు.

జాతి వార్తాచమత్కారములు, ప్రసన్నమే, గంభీరమునైన రచనకు రాయలు పేరట, జాతివార్తలలో ఒకటి సాలంకృతము మరియొకటి నిరలంకృతము. ఎంతయో భావమును ఇమిడ్చి వ్యవహార దక్షత కలిగియుండవలయును వార్తానిపుణుడు కావలయు ననిన అట్టివాడు రఘునాథుడు.

యథావస్తువర్ణనము బీజభూతముగనుండి స్థానిక విశేషాంశముల వర్ణించుటయే స్థానిక ప్రకృతిచిత్రణము. ఆ అంశములు ఆ స్థానికప్రకృతికి గిట్టినవియై దానినే వ్యక్తీకరించున ట్లుండవలయును. రఘునాథుని గ్రంథములలో ద్రావిడదేశప్రకృతి మూర్తీభవించి సాక్షాత్కరించును. ఆముక్తమాల్యదయందువలెనే అది విశిష్టతను గలది. రాయలె ద్రావిడ దేశమున గల ఒక తోటలో ప్రవేశింపగా—'ఇక్షుయంత్ర క్రేంకారంబులు సవిధ కాసార సారస క్రీంకారంబులం గర్గోత్సవంబులు నెఱప నెఱపసిండి మిసిమిజిగినీను మేనుల వసంబొసంగు పసిగావుగుబ్బెత లుబ్బుచెలంగ సలిలపూర్ణకలశంబులు బింకంపు జన్నుల నొఱయం జంకల నిడికొని నడయాడు తీవుల నీలాటిరేవుల"

లో కన్పించిరట." ఆ చెఱకుగానుగలను అట తిరుగు కాపు గుబ్బెతలను చూచి ముందుకుపోగా

"క్రీరము లుమ్మకుక్కల గీఱ నిల్వక జాఱు,
చెలువంపు రసదాళి చెఱకుఁబాలు
జెంత నంతట బండి చిదిసిన ముంతమామిడి
పండ్లరసములోఁ బడి పొరలుచు
నుడుతలు గొఱుకంగ నొండొండదొరఁగెడు
నారికెడంపు బొండ్లముల నీటఁ

గలసి చేరువ యేటి కాలువలను గూడి
ములు రాజనపుఁ జేల వలదిరుగుచుఁ
దరులఁ బొదరుల బరువంపు విరుల వడియు
కమ్మఁ దేనెలు పైఁ గ్రమ్మి గమ్మనంగ
ననుదినంబును బ్రవహించు నన్ని యెడల
నేమి చెప్పంగవచ్చు నా భూమి మహిమ.'

అన్ని మకరందముల మాధుర్యముతో సారవంతమైన దా భూమి. అట్లే ఆ పద్యమునను మరందము గూడుకట్టి నది. అటు శయ్యలో ఒయ్యారము, భావములో కమనీయత, బంధములో బిగువు, రచనలో చణత, అలంకారముల కలంకారీలో స్వభావసుభగత, ప్రకృతి రంజనములో రమ్యత, రసవ్యక్తిలో మాకరంద నిష్యందము, ఒక్క పద్యములో రక్తి కట్టినవి.

'సరయూతీర మహాగ్రహారముల న
ప్రాంతంబు సంతుష్ట భూ
సురయూథ శ్రుతిఘోష పోషితములై
శోభిల్లుఁ దత్ప్రాంత భూ
సరసీజాకర మాకరంద రసని
ష్యంద ప్రవృష్యత్తరం
గ రిరంసా పరహంస సంస దతి
సంఘ క్రేంక్రియా ఝంకృతుల్.''

కేవల భావనామూలకములై వెలసిన వర్ణనలనేకము కలవు. అందు తరచు అతిశయోక్తి కన్పించును. తెల్లదీవి వర్ణనలో స్పష్టము. తెల్లని పాలసముద్రము అమధ్య తెల్ల దీవి, వీనిని గొని ఉపమాసామ్యములో వర్ణించుట కెంతయిన అవకాశ మున్నది. ఇట్టి వర్ణనలలో అన్నిటికంటె ఉపమ ఒకటి అసలు వస్తువును సాక్షాత్కరింపజేయుటకు ఎంత యిన ఉపయోగపడును. యథావస్తువర్ణనలో ఒక రమ్య విషయము మాత్రమే నెక్కొనిన ఇందు రెండు రమ్య విషయ ములకు భావనామూలక సంధానముతో సుందరత అధికము. తెల్లదీవి వర్ణనలో కొల్లలు కొల్లలు ఉపమానములు. ప్రతి పాదము ఉదాహరణీయమే.

నీరు పాపలు గుమిగూడి నింగి కెగయు
వీచికా రజ్జువుల గట్టి విడిచినట్టి
కాగితపు గాలిపటము నిష్కంపలీల
నున్నదోయనఁ దెలిదీవి చెన్నుమీఱు'

ఆ పాలమధ్యలో,

'వారినిధి యల్లునికి నొక వంక వైచె
దిన్నెగా వెన్నలనఁ దెల్లదీవి మెఱయు.

సమయబద్ధములై సాగిన వర్ణనలును కలవుగాని రఘు నాథుని భావన నవనవోన్మేషమ్మగుట ఆ వర్ణనలయందును నూత్నభావనల నిబంధించుచుండును. పురవర్ణన పేరేగాని అది ద్రావిడదేశ వర్ణన. అందలి అశ్వములు. గజములు, చాతుర్వర్ణ ములు—ఇవి అన్నియు ప్రాతవస్తువులే కాని తీర్చిన తీర్పు కొత్తది.

పూర్వు లెందరో ఆశ్రమవర్ణన చేసినారు కాని రఘు నాథు డందును ప్రత్యేకత చూపినాడు. అచట మహర్షులలో కొందరు,

'ఘన జటావల్కికల గిజిగాండ్లు గూండ్లు
లిడఁ గలయ యోగనిష్ఠులై యొసఁగువారు.' అట. అచటి జంతువులో,

ముదితాపసులచేతి యుదకుండికలు తొండ
ములఁ దెచ్చు గజపోతములను గంటె
పల చుట్టికొనుచు నివ్వరి యెండుగలకుఁ గా
వలియుండు జింకపిల్లలను గంటె

అంతయు అమూలకముగ చారుసుందరముగ సాగినది. అసలు మొత్తము గ్రంథమునకు జీవాతువు ఈ వర్ణనలే. వీని అన్నిట ఆతని భావనాశక్తి నలువుగ, కన్నెబిగువుతో వ్యాపించి ఉన్నది.

రాయలరచనలో కన్పించు మరియొక సాధారణ లక్షణము చమత్కారము. నిశాలార్థమున ఇది కావ్యమున సర్వాంత ర్యామియే అయినను ఇట ఉక్తి చమత్కృతి మాత్రమే ఉద్ది ష్టము. సందర్భ చమత్కారము వేశ్యలవెంటఁ దగిలిన విటులు వారితో ఆ వేశ్యల కుహనాప్రవర్తనాదులలో సరసముగనే కలదు. ఋష్యశృంగుని నెత్తిపైని గల కొమ్ము నాధారముగ తెనుగు నుడికారపు హొయలుతో,

''ఘనుఁడె యితఁడేమి యుండఱకన్న వేఱె
కొమ్ము మొలచెనె యని యాడికొందు రెందుఁ
గొమ్ము మొలచిన దితనికిఁ గొమ్మలార
ముని శిరోమణి యితడెపో ముజ్జగముల.

అని చమత్కరించినాడు. దక్షిణాంధ్రకవులకు శ్లేష చమత్కారముపై మక్కువ లేదు. కాని అటనట తమ నేర్పు చూపుటకై శ్లేషను—అదీ సరస శ్లేషను రచింతురు. రోమపాదుడు వేశ్యల ప్రశంసించుటలో—మృగవిలోచనలార మీ నిడువాల్జడల్ వాతాశి మహిమ నివారకములు—అన్న సీసములో ఇట్టి రచన కన్పట్టును.

అసలు తెనుగురచయితలలో చాలమంది పద్య రచ నలో ప్రవీణులనియే చెప్పవలెను. నన్నయ అక్షరరమ్యతను ఎరువుతెచ్చుకొనినవారు పలువురున్నారు కాని రాయల వంటివారు తమ ప్రత్యేకతను నిలువుకొనిరి. అసలే తెనుగుకవి, ఆ తెనుఁగు తెలుంగును, సంస్కృతమ్ము తీరును బాగుగ నెరిగినవా డగుటతో ఆతని పద్యము హృద్యమై అలవోకగా సాగినది.

# రఘునాథ రామాయణము

అట్లే వచనరచన కూడ. వాని అన్నిట బలమైన తెనుఁగు నుడికారమును గుప్పించినాడు. సంగీతతరంగముల ఒడుపుతో సాగిన ఒక పద్యమును చూడుడు—అది ఆతని సంస్కృతపద సంయోజనాశక్తిని స్పష్టపరచును.

"యాయజూకనికాయ హూయమాన నవీన
సాన్నాయ్య సౌరభ్య సంభృతంబు
పర్ణశాలాభ్యర్ణభాగ సౌఖ్య నిషణ్ణ
రోమంథ చలదోష్ఠ రోహితంబు
శాఖాగ్ర లగ్నకాషాయ వల్కల కాంతి
నిత్య పల్లవితావనీరుహంబు
హోమధూమస్తోమ జీమూతమాలికాలోక
నోత్సవ నటత్కేకిగణము."

ఇట్టి రచనకు తోడు కావ్యమునకు పుష్టినిచ్చినవి తెలుగు పలుకుబడి, సామెతలు. పుట్టుగ్రుడ్డి, పుట్టు మూంగుల వలె తా నొక 'పుట్టు బ్రహ్మచారి' ని సృజించినాడు—బ్రహ్మచర్యము ఆధిక్య స్ఫూర్తికి. ప్రతి పదమున ఆ నడకగలవి రెండు.

ముద్దు నగుమోము నందపు
బొద్దు మెఱుఁగు మేనుఁ జిన్ని బొజ్జయు నెంతే
బ్రొద్దులు జరపెడి జిలిబిలి
సుద్దులుగల బాలకులను జూడన్వలదా."

'మినుకు మినుకున నొకనాఁడు మెఱపుఁ గనము
గగనమున నెందుఁ జేటంత మొగులు లేదు
చినుకు బంగారమయ్యె నేమనఁగఁ దూర్పు
గాడ్పు నొక్కింత మెదల దే కారణంబొ.'

ఇట్టి రచనకు భాషకు వెన్నెముక అయిన నుడికారము బాగుగ జీర్ణముకావలెను.

ఇంత భావనాశక్తి, స్వాతంత్ర్య ఫక్కి కల రాయలు కూడ తననాటి కాలమునకు లోగిపోయినాడు. ఇందలి అనౌచిత్యము లన్నిటికి కారణము ఆ కాలమే. తననాటి సంఘస్థితిని కావ్యమున ప్రతిబింబింపజేసినాడు. అందు కొన్ని సందర్భ సంవాదులు కాదు. తనకాలపు రెడ్లను కృష్ణరాయలు చేసిన రెడ్ల వర్ణనను దృష్టిలో నుంచుకొని ఏమో,

"కప్పురభోగి వంటకముఁ
గమ్మగ నే వడియన్బుజించి మే
ల్దప్పటులట్లు మూరగల
తోరపుఁ బచ్చడము ల్వెలంగఁగా
గొప్పకడాని పైడి జిగి
గుత్తపు టుంగరము ల్కరంబులం
ద్రిప్పుచు రచ్చసేయుదురు
రెడ్డిదొర ల్తమి హెచ్చ నచ్చటన్."

అని వర్ణించినాడు. రామాయణకాల మేమి రెడ్డిదొరల రచ్చ ఏమి! ఆముక్తమాల్యదలో కథాకాలము దీనంత ప్రాచీనము కాదు. కాని నాటికాలపు రెడ్లపద్ధతి సువ్యక్తమైనది పై పద్యములో. అట్లే తన కాలపు ధాన్య విశేషముల నొక సీసపద్యములో నేకరువుపెట్టినాడు. ఆ రకముల వడ్లు నాడు పండినవట. 'రాయలనాటి రసికత' గ్రంథమున అతిగా కలదనుట స్పష్టము. అవకాశము దొరకుటయే తడవు ఆ సుఖజీవనము తదనుగుణమైన రసికత సాక్షాత్కరించును.

రామాయణము అతి ప్రాచీనము—నలుగురినోట నానినదే అయినను దానిని ఒక రమ్యకావ్యముగ మలచినాడు రఘునాథుడు. ఆతనికి కవిగా, ఒకరకమైన గొప్పకవిగా స్థానము సంపాదించినది ఆతని భావనాశక్తి. ఆ ప్రతిభ ఒక్కటి గ్రంథములో అనేకములైన అనౌచిత్యములున్నను ఆకర్షణీయకముగా నున్నది. దానికితోడు స్థానిక ప్రకృతి వర్ణన పట్టునిచ్చినది. ఆతని గ్రంథమంతయు దొరకిన భావపూర్ణమైన రామాయణ మొకటి ఆంధ్రుల కుండెడిది.

---

# నందికంతపోతరాజు

## శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

ఇది శ్రీనాథునిగూర్చిన నాటకము. శ్రీనాథుడు శరీర సౌకుమార్యముగలవాడు. సుఖపరాయణుడు. ఆ లక్షణమే యతనికవిత్వమునందు నున్నది. అట్టివానికి శరీరబాధ కలుగుటయే సృష్టిలో నున్న విషాద సంఘటనము. దేనిని జీవుడు భయముచే పరిహరింప నెంచునో భగవంతుడు వానికి దానిని సంఘటించును. అది యొక వ్యాఖ్యానము. నందికంతపోతరాజు రెడ్డి రాజ్యముయొక్క చిహ్నమైన యొక కత్తిపేరు. దాని పోకడలు రాకడలు కొండవీటిరాజ్యముయొక్క యెగుడు దిగుళ్లను సూచించును. రెడ్డి రాజ్యము యొక్క వైభవమునకు శ్రీనాథుని కవితా వైభవమునకు అవినాభావము. అందుచేత నీ నాటకమున కా పేరే పెట్టఁబడినది.

### (భరతనాట్యము - ఒక కీర్తన ఒక స్త్రీ పాడి యభినయించినట్లు)

అవచితిప్పయ్య :—శ్రీనాథ మహాకవీ. ఈమె యెంత చక్కగా నాట్యము చేసినది ? లకుమాదేవి చేసినట్లు చేసినది.

శ్రీనాథ :—తిప్పయసెట్టీ. లకుమాదేవి నాట్య మంత గొప్పగా నుండెడిదా ?

తిప్ప :—అది యేమయ్యా, అట్లనెదవు ?

జయతి మహిమా లోకాతీతః కుమారగిరి ప్రభో
సదసి లకుమాదేవీ యస్య ప్రియా సదృశప్రియా
నవ మభినయం నాట్యార్థానాంతనోతి సహస్రథా
వితరతి బహూనర్థా నర్థిప్రజాయ సహస్రశః.

శ్రీనాథ :—నా కామె నాట్యము బాగుండెడిది గాదు.

తిప్ప :—అందుచేతనే నీకు కుమారగిరి సభలో ప్రవేశము గలుగలేదు.

శ్రీనా :—ఆ కుమారగిరియు నాయన బావమరది వేమారెడ్డియు సంస్కృత కవిత్వమునందే యిష్టము గలవారు. వారికిఁ గాళిదా సొక్కడే కవి.

తిప్ప :—మీరు కూడ సంస్కృతమునందు వ్రాయరాదా ? మీరేమి తక్కువ పండితులా ?

శ్రీనాథ :—తిప్పయ్యా, నీ కోక రహస్యము చెప్పమందువా ? మనము సంస్కృతములో వ్రాసి యెవరిని మెప్పించగలము ? కాళిదాస భవభూతి మురారిభట్టు బాణులవలె వ్రాయగల్గినచో వ్రాయవలయును. లేనిచో నూరకుండవలయును.

తిప్ప :—నీవు వారివలెనే వ్రాయుదువు.

శ్రీనాథ :—నీవు నా తెలుగు కవిత్వమును చూచి యట్లనుకొనుచున్నావు. వారి సమాసము లన్నియు నేను నా పద్యములలోని కెక్కింతును. నేనే సంస్కృతములో వ్రాసినచో నట్లుచేయుటకు వీలులేదు గదా ?

తిప్ప :—మఱి మీరే స్వతంత్రముగ వ్రాయరాదా ?

శ్రీనా :—ఎందుకు వ్రాయవలయును ? సుఖముగా నాంధ్ర కవిత్వము సాగుచున్నప్పుడు ధారాశుద్ధిగా పద్యములు వానియంతట నవి వచ్చుచున్నవి. కష్టము లేకుండ వచ్చుచున్నవి. నేను నోరు తెరచిన చాలును. తెలుగు పద్యము పరమ మధురముగా ధారాశుద్ధితో వెలువడుచున్నది. నే నన్నమాట పద్యమై పోవుచున్నది. ఆంధ్రభాషయందొక నూత్నశైలికి నేను నిర్మాత నగుచున్నాను. నాకా శ్రమ యెందులకు ?

తిప్ప :—నీకు సుఖవాంఛ మెండు. నీవు భోగపరాయణుడవు. నీకుఁ గస్తూరి కావలయును. హేమపాత్రాన్నములు గావలయును. రత్నాంబరములు గావలయును. నీవు నిలువ చేయవు. దినవెచ్చము దొరికినచోఁ జాలును.

శ్రీనాథ :—మన మీ దారివెంట పోవలదు.

తిప్ప :—ఎందుచేత ?

శ్రీనాథ :—ఆ దారిలో రాజునకు కరము చెల్లించలేని శిక్షితులుందురు. ఒకని మెడకు బొగడదండ యుండును. ఒకని పాదములకు నిగళయుగము దగిలించి యుండును. మరియొకని చేతికి వెదురుగొడి వేయబడి యుండును. మరియొకని బుజముమీద నల్లగుం డెక్కించి యుందురు. నేను వారివంకఁ జూడలేను.

తిప్ప :—నీ వట్టి దుఃఖమును జూడలేవు. ఓర్వలేవు. అందుచేత నీ కవిత్వ మింత మధురముగా నుండును.

శ్రీనాథ :—ఇంక నేదియో యనవచ్చి యూరకున్నావు. అది గూడ ననుము.

తిప్ప :—నే నేమి యనవచ్చినాను.

శ్రీనాథ :—నాకుఁ దెలియునులే. అందుకనియే నీ కవిత్వములో లోతు లేదని చెప్పవచ్చితివి. నీవు కొమరగిరికి నగురు కస్తూరి జవాది మొదలైన పరిమళ ద్రవ్యములను సమకూర్చెడివాడవు. కొండవీటిరాజ్యమున కప్పుడు నిప్పుడును పెట్టుబడిదారుడవు. నీవు చెప్పినచో కొమరగిరి నన్ను తన యాస్థానమునకు దీసికొనెడివాడే. ఆ బావమరదు లిద్దరికి నా కవిత్వమునం దెట్టి భావమో నీకు నట్టి భావమే. మన మిద్దరమును గలిసి చదువుకొంటిమి గదా. నీ కెట్లును తప్పదు. నే నడిగినప్పుడెల్ల ధన మిచ్చి తీరవలయును. నీకొక కావ్యము నంకితమిచ్చి తీరవలయును.

తిప్ప :—నైషధము నాంధ్రీకరించితివి. సింగనామాత్యున కంకిత మిచ్చితివి. ఆయన నీకు కోమటివేముని యాస్థానమున ప్రవేశము గలిగించి పరీక్షాధికారిని చేసినాడు. ఇంక నీకు రాజకార్యములతో సరిపోవును. ఇంక గ్రంథము లెక్కడ వ్రాయుదువు ? ఇదివరకు వ్రాసిన వానితోడనే సరి.

శ్రీనాథ :—బాగుగా చెప్పితివి. కాని యీ యాంధ్ర సరస్వతి నా జిహ్వాగ్రమునఁ దాండవించుచున్నదోయీ. ఇపుడు రెండు రాజకార్యపు టొత్తిడులు నా నెత్తినఁ గూర్చున్నవి. కోమటి వేమారెడ్డి కాటయవేముని సంహరించినాడు. నందికంత పోతరాజు రాజమహేంద్రవరమున నున్నది. ఆ కటారి కొండవీటి రాజ్యచిహ్నము. దానిని దీసికొని రావలయును.

తిప్ప :—రెండవ కార్యమేమి ?

శ్రీనాథ :—దానిని దెచ్చిన తరువాత చెప్పెదను.

(వీణాధ్వని—గోదావరీ ప్రవాహధ్వని)

శ్రీనాథ :—ఓ రాజమహేంద్రనగర పండితులారా. మీరేలనయ్యా న న్నంత తిరస్కరింతురు ? నాతో వాదించుడు.

దండి :—నీతో వాదించ నక్కరలేదు. నీ పాండిత్యము మహా ప్రభువులైన కొమరగిరి రెడ్డికిని వేమారెడ్డికిని తెలియును. వారిచేత నంగీకరింపఁబడని పండితుని మే మంగీకరింపము.

శ్రీనాథ :—ఇప్పుడు మీ ప్రభు వల్లాడ వేమారెడ్డి. ఆయన న న్నంగీకరించుచున్నాడు గదా.

పండితులు :—ఓయి శ్రీనాథా. తెలుగు కవిత్వము వ్రాసికొనుము. పాండిత్యపు జోలి నీ కెందులకు ?

శ్రీనాథ :—(కోపముతో) విద్వాంసుల్ రాజమహేంద్ర పట్టణమునన్ ధర్మాసనంబుండి ప్రధ్వంసా భావము ప్రాగభావమనుచున్ తర్కింతు రిచ్ఛాగతిన్ .....

పండితులు :—ఆ నీ నోటి కళ్లే వచ్చును. నీ ప్రతిష్ఠ నగవు దీనిమీదనే యాధారపడి యుండును.

(స న్నా యి)

శ్రీనాథ :—మహారాజా అల్లాడ వేమారెడ్డి ప్రభూ. కోమటి వేమారెడ్డి నన్ను తమ వద్దకుఁ బంపినాడు.

అల్లాడ :—మహాకవీ. మీరు వచ్చినదే చాలును. మీరు ద్రాక్షారామ భీమేశ్వర స్వరూపులు. మీ రేది యడిగిన నది యిత్తును.

శ్రీనాథ :—నే నడుగరాని దడుగబోవుచున్నాను.

అల్లాడ :—మహాకవీ. ఏది యడిగిన నది యిత్తును.

శ్రీనాథ :—తమరు మహాప్రభువులై మీ తమ్ములైన వీరభద్రా రెడ్డిచేత రాజ్యము చేయించుచున్నారు. కాశీఖండమను మహాకావ్యమును మీ వీరభద్రా రెడ్డిగారి కంకితము చేసినాను.

అల్లా :—మహాకవీ. దానికి పీఠిక యక్కరలేదు. అడుగవచ్చును.

శ్రీనాథ :—కుమారగిరిరెడ్డి నందికంత పోతరాజును తన బావమరిది వద్ద నుంచెను. అది లేనిచో కొండవీటి రాజ్యము కొండవీటి రాజ్యము గాదు.

అల్లా :—మహాకవీ. ఎట్టి దడిగితిరి. రెడ్లు మాట తిరిగిపోరు. దీనిని భద్రముగా గొనిపోవలయును. ఈ కటారి యున్నన్ని దినములు రెడ్డిరాజ్యమునకు భంగములేదు. ఇది మల్లగూరమ్మ వరము. ఈ కటారిమీద రాచకొండ వెలమవారికి చూపు. విజయనగర రాజులవారి దృష్టి. దారిలో మిమ్మేమైన జేసి యీ కటారి దీసికొని పోదు రేమో.

శ్రీనాథ :—మహారాజా. అట్టి దెన్నడును జరుగనేరదు. నన్ను మానవులు చెనకలేరు.

(బాకాలు, మద్దెళ్లు, వీణానాదము)

శ్రీనాథ :—ఓహో. పెదకోమటి వేమభూపాలా. ఇదిగో. నందికంత పోతరాజును దెచ్చితిని. మరల దీనిని నేను తీసికొని రావలసిన యవసరము లేకుండఁ జేయవలయును.

పెదకోమటి :—శ్రీనాథ మహాకవికి జయమగుగాక, మహామంత్రీ. మామిడి సింగనార్యా. మహాకవి చేయఁజాలని పని యేముండును ?

శ్రీనా :—మహారాజులు మఱల నాచేత నేదో పని చేయింపనెంచుచున్నారు సింగనామాత్యా. నైషధ కావ్యమును నాచేత కృతి పొందినవాడవు. నీవు మరల నా వద్దనుండి యేది తీసుకొనలేవు ?

మా. సింగన్న :—మహాకవీ. మీరు రాజమహేంద్ర నగరమున నుండగా నరపతులు మోటుపల్లిని ముట్టడించిరి. ఆ యుద్ధమునకు సోమదేవ చోడుడు పోయెను. విజయ నగర రాజు లతనిని బందిగా బట్టుకొనిరి.

శ్రీనాథ :—కాబోవు నల్లుడా ? వేమాంబ యొక్క భర్తయా ?

కోమటివేమా :—మహాకవీ. ఇది తమ కవితాశక్తికి సాధ్యమగునది గాని మా పరాక్రమమునకు సాధ్యమగునది గాదు.

మా. సిం :—అచట నరుణగిరినాథుడు డిండిమభట్టు గలడు.

శ్రీనా :—రాజమహేంద్రనగర పండితులవలె వాదించనిచో నేనేమి చేయుగలను ? వాదించినచో జేయుగలను.

మా. సిం :—డిండిముడు వాదించును. వాదించుటకే కూర్చున్నాడు.

కో. వే :—అచ్చట ముమ్మకవి యున్నాడు. అతడు కర్కోటకుడని వినికిరి.

శ్రీనాథు :—నేను నైషధమును వ్రాసిన కవిని.

మా. సి :—దారిలో వల్లభామాత్యుని గలిసికొని పోవలయును. వల్లభామాత్యుని వంశమువారు నరపతుల కాశ్రితులు. అతని తాత వారి రత్నభాండార రక్షకుడు. అతని తాత తాత బుక్కరాయలవద్ద మంత్రి. ఆయన పెద తండ్రి హరిహరరాయల మంత్రి.

శ్రీనా :—చిత్తము. (మద్దెల మ్రోత).

దుగ్గన్నా. నే నొక్కడను రాకుండ శిష్యుడవు గదా యని నిన్ను నావెంట దెచ్చితిని. వల్లభామాత్యునితో మనకు బనియున్నది. నీవు పుల్ల విరుపుమాటలు మాటాడకుము. ఇదిగో వినుకొండ. వీరు గోవల్లభామాత్యులు.

వల్లభ :—శ్రీనాథకవీ. సార్వభౌమా. నీ కీర్తి విన్నాను. రావిపాటి త్రిపురాంతకుడు వ్రాసిన ప్రేమాభిరామ మన్న వీథీ నాటకమును నే నాంధ్రీకరించితిని. మీరు దానిని వినవలయును.

శ్రీనా :—త్రిపురాంతకు డంతటి గొప్పవాడా?

వల్లభ:—నన్నయభట్టు తిక్కకవినాయకులన్న హుళక్కి భాస్కరుం డన్నను జిమ్మపూడి యమరాధిపు డన్నను సత్కవీశ్వరుల్ నెన్నుదుటంగరాంజలులు నింతురు జేయని రావిపాటి తిప్పన్నయు నంతవాడ, తగునా యిటు దోసపు మాటలాడగన్.

### (వీ ణా గా న ము)

శ్రీనాథ :—అమాత్యశిఖామణీ.

హో. కుమారస్వామి యౌవహ్వాయములార. (అని శ్రీనాథుడు ప్రారంభించును. తరువాత నిరువురు కలిసి పాడుదురు.)

హో మంత్రదేవతా స్వాములార
హో. కాల విజ్ఞాన పాకకోవిదులార
హో భూత భుక్తి కుంటార్వులార
హో. యహల్యాజాతయతన హేతువులార
హో. బలాత్కార కామాంధులార
హో నిరంకుశ మహా హంకార నిధులార
హో. కామ విజయ కాహళములార
హో. ఖగేంద్రంబులార. కయ్యమున నీల్గి
పోవుచున్నారె దేవతా భువనమునకు
మీరు రంభా తిలోత్తమా మేనకాది
భోగ కార్యార్థమై కోడిపుంజులారా.

వల్ల :—శ్రీనాథ కవిసార్వభౌమా. ఏమయ్యా యిట్లు దిగులుపడి కూర్చుంటివి ?

శ్రీనాథ :—వల్లభామాత్యా. ఆంధ్రసారస్వతము నిట్టి శైలీ నిర్మాణమున నేనే బ్రహ్మ ననుకొన్నాను. ఈ శైలికి నేను బ్రహ్మ నన్న యహంకారముచేత సంస్కృత భాషను గూడ వదిరితిని. ఆ ప్రతిష్ఠ కూడ నాకు లేకుండ బోయినది. మీరు నాకంటె ముందే యీ శైలిని నిర్మించి కూర్చుంటిరి.

వల్ల :—ఓయి పిచ్చివాడా. నే నీ గ్రంథము వ్రాసితినని యెవరికి దెలియును ? నీ వీ శైలిని బహు గ్రంథములందు, జెరిగి పోసితివి. నీ నైషధము, నీ భీమేశ్వర పురాణము నీ కాశీ ఖండము, నీ మహాగ్రంథములు నిన్నాంధ్ర సారస్వతమునందు స్థాపించినవి. భవిష్యల్లోకము నీవే యీ క్రీడాభిరామమును వ్రాసి నాపేర పెట్టితి వన్నను ననవచ్చును.

శ్రీనా :—పాపము శాంతించుగాక. మహాకవీ. వల్లభామాత్యా. నేను తమరి నొకటి యభ్యరించు చున్నాను. నా ప్రభువైన కోమటి వేమారెడ్డి నన్నొక కార్యమున నియమించినాడు. నేను ప్రౌఢదేవరాయల యాస్థానమునకు బోవుచున్నాను. అచట ముమ్మకవి యున్నాడు. అతడు సత్కరుని వంటివ్వాడు. అతని ప్రసక్తి లేకుండ ప్రౌఢ దేవరాయల దర్శన మగునట్లు తమరు సాయముచేసి పెట్టవలెను.

వల్ల :—ఇది యేమాత్రపు బని. నేనే నీవు. నీవే నేను. నావద్ద విజయనగర రాజుల పతాకాచిహ్నా మున్నది. అది చూపించినవారికి రాజదర్శనము సులభము. దానిని నీ కిచ్చెదను.

నీవు నా పని సాధించుకొని తిరిగి వచ్చునపుడు ముత్తెల నా కిచ్చి పొమ్ము. అది మా వంశపు సొత్తు.

శ్రీనా :—చిత్తము. చిత్తము—(మద్దెళ్ల నగారాలు వీణాగానము నృత్యము.) విజయనగర సామ్రాజ్య ధురంధరా. ప్రౌఢ దేవరాయ మహాప్రభూ. పది దినములనుండి తమ దర్శనమునకు వేచియుంటిని. ముమ్మకవి దయ రాలేదు. నే నిచట నగచాట్ల పడుచుంటిని. నా గో డెవరితో చెప్పికొందును? ఇట్లు కన్నడ రాజ్యలక్ష్మితోఁ జెప్పికొంటిని.

కొల్లాయుంచితి కోకచుట్టితి మహా
కూర్పాసమున్ దొడ్గితిన్
వెల్లుల్లిన్ దిలపిష్టమున్ మెసవితిన్
విశ్వస్త వడ్డింపగా
చల్లా సంబలి త్రావితిన్
రుచులు దోసంబంచు పోనాడితిన్
తల్లీ కన్నడ రాజ్యలక్ష్మి
దయరేదా. యేను శ్రీనాథుడన్

ముమ్మకవిని మిపులఁ బ్రార్థించితిని. ఆయనకు దయ రాలేదు.

సంపా విరూపాక్ష బహుజటా జూటికా
రగ్వథ ప్రసవ సౌరభ్యములకు
తుంగభద్రా సముత్తుంగ వీచీ ఘటా
గంభీర ఘుమఘుమారంభములకు
కళసాపుర ప్రాంత కదళీవనాంతర
ద్రాక్షాలతా ఫలస్తబకములకు
కర్ణాట కామినీ కర్ణహాటక రత్న
తాటంకయుత ధాళధళ్యములకు
నిర్నిబంధ నిబంధమై నెనయు గవిత
తెలుగునను సంస్కృతంబునఁ బలుకనేర్తు
ప్రౌఢ దేవేంద్రరాయ భూపాలవరుని
సమ్ముఖమ్మున దయచూడు ముమ్మ సుకవి.

ముమ్మ :—ఇట్లు పలువుంది యాచకులు వత్తురు. మహారాజా. అరుణగిరినాథుని గెలువదగినవాడు తమ యాస్థానమున సన్మానయోగ్యుడు. తక్కినవారు గారు.

శ్రీనా :—మహారాజా. మీ డిండిమభట్టును నాతో వాదించనిండు. ఏమగునో చెప్పెదను.

ఢంబు నూపి ధరాతలంబుపైఁ దిరుగాడు
కవిమీదగాని నా కవచ మేయ
దుష్ప్రయోగమ్ముల దొరకొని చెప్పెడు
కవి శిరస్సున గాని కాలు చాప
సంగీత సాహిత్య సరస విద్యలు నేర్చు
కవుల రొమ్ములుగాని కాల్చి విడువ
చదువుసంధ్యలు లేక సభలందుఁ దిరిగెడి
కవి నోరుగాని వ్రక్కలుగఁ దన్న
దంట కవులకు బలువైన యింటి మగడ
కవుల వాదంబు విన వేడ్క గలిగెనేని
యరుణగిరితోడ గలిగింపు మాహవంబు
లక్షణోపేంద్ర ప్రౌఢరాయ క్షితీంద్ర.

ప్రౌఢ :—మా చంద్రశేఖర క్రియా శక్తిరాయలు మీ యిద్దరి వాదమును బరిష్కరించును గాక. ఆయన మహా పండితుడు. పాండిత్యమునం దెవరు మొగ్గో నిర్ణయింపగలడు.

**(సన్నాయిమీద నొక రాగము మంద్ర మధ్యమములయందు విడిచి విడిచి పాడబడును)**

**(కంచుఢక్క పగిలిన ధ్వని)**

ముమ్మ :—మహారాజా. శ్రీనాథు డేతెంచెను. అతని కెంత యహంకారము.

శ్రీనా :—శ్రీ ప్రౌఢ దేవరాయ నృపతీ.

జననాథోత్తమ దేవరాయ నృపతీ చక్రేశ శ్రీవత్సలాం
ఛనసంకాశ మహాప్రభావ హరిరక్షాదక్ష నాబోటికిన్
కుస్వనస్తోత్ర సముద్భవంబయిన వాగ్దోషంబు శాంతంబుగా
కనకస్నానము చేసిగాక పొగడంగా శక్యమే దేవరన్.

ప్రౌ. రా :—మహాకవీ! విద్వచ్ఛిరోమణీ! నీ వేది యడిగిన నది యిత్తును. నీకు కనకాభిషేకము కావింతును.

శ్రీనా :—మహారాజా. నే నడుగునది రహస్యముగా నడుగవలయును.

ప్రౌ. రా :—రమ్ము రహస్య మందిరమునకు బోదము. (నడచిన ధ్వని.)

శ్రీనా :—మహారాజా! నేను కోమటి వేమారెడ్డి యాస్థాన కవిని. సోమదేవ చోడుడు నా ప్రభువు యొక్క కుమార్తె వేమాంబకు భర్తగా నిర్ణయింపఁబడినవాడు. మోటుపల్లి యుద్ధమున వానిని మీరు బందిగా దెచ్చితిరి. ఆయనను వదిలిపెట్టించవలయును.

ప్రౌ. రా :—కాటయవేముడు మా హరిహరాంబకు భర్త .... ఆయనను నీ రాజు వధించినాడు.

శ్రీనా :—ప్రభువులు మాట తిరిగి పోరాదు.

ప్రౌ. రా :—శ్రీనాథా. సోమదేవుని దీసికొని పొమ్ము. నీమీద మాత్రము నాకుఁ గోపము పోదు.

శ్రీనా :—నేను ప్రభుకార్యము చేయుచున్నాను. (నగరా మ్రోతలు. మద్దెళ్ల మ్రోతలు.)

(ఢోళ్లు రణభేరీలు.)

ఓహో లింగమనాయడు కొండవీటి మీదికి దండెత్తి వచ్చుచున్నాడు. రాచకొండ రాజులలో సింగము నాయకునికి అనపోతనాయడు, మాదానాయడు నను నిరువురు కుమారు లున్నారు. వారిలో మాదా నాయనికి ముగ్వురు కుమారులు. వానిలో రెండవవానిపేరు పిన వేదగిరి. ఈ పినవేదగిరిని పూర్వము యుద్ధములో పెద కోమటివేముడు వధించినాడు. అప్పటికి లింగమ నాయడు పన్నెండేండ్లవాడు. లింగమనాయడు పెద్ద వాడై మహావీరుడై కొండవీటిమీదికి దండెత్తి వచ్చెను. పెదకోమటి భూపాలుడు నందికంత పోతరాజును చేబూని యుద్ధమునకుఁ బోయినాడు. లింగమనాయడు పెద కోమటి భూపాలుని వధించి నందికంత పోతరాజు నపహరించినాడు. ఆయన కుమారుడు రాచవేమ భూపాలుడు రాజ్యమునకు వచ్చినాడు.

(వీణాగానము)

రాచవే. భూ :—శ్రీనాథ మహాకవీ. నీ యాశీర్వచనము వలన నేను రాజ్యముచేయ నెంచుచున్నాను.

శ్రీనా :—మహారాజా. నేను నీ తండ్రిని సేవించినాను. నిన్ను గూడ సేవింతును.

రా. వే :—లింగమనాయడు నందికంత పోతరాజు నపహరించినాడు. అది లేని రెడ్డిరాజ్య మేమి రాజ్యము.

శ్రీనా :—మహారాజా. నేను దానిని తెచ్చి నీ కప్పగింతును. కాని ...

రా :—కాని—యేమి ?

శ్రీనా :—మహారాజా. జీవిత మనగా స్వప్నవృత్తాంతముగదా. నేనేమి చేయగలను ? నీవేమి చేయగలవు ? ప్రౌఢ దేవ రాయలు కాలమును కబళించుచున్నాడు.

ప్రౌఢదేవరాయలు, కొండవీటిరాజ్యము నపహరించినాడు. రాజమహేంద్రవర రాజ్యము నపహరించినాడు. శ్రీనాథ మహాకవికి రాజాశ్రయము పోయినది. ఆయన వట్టి కృషికుడైనాడు. కృష్ణ యొడ్డున నున్న బొడ్డుపల్లెయందు వ్యవసాయ మారంభింపగా వరదలు వచ్చి పైరు కొట్టుకొని పోయినది. ఏడు వందల టంకములు చెల్లించలేకపోయినాడు. ఆ మహా కవి ప్రౌఢ దేవరాయల కోపాగ్ని కింధన మగుచున్నాడు.

శ్రీనా :—ఆహా. ఇప్పటికి నామీద ప్రౌఢదేవరాయలు తన కసి తీర్చుకొన్నాడు. నేను వేనిని గాంచి భయపడితినో ఆ బొగడదండ, ఆ నిగళయుగము, ఆ వెదురు గొడియ, ఆ నల్లగుండు నా కంఠమును నాయంఘ్రియుగ్మమును నా భుజా యుగ్మమును కౌగలించుకొన్నది.

సీ. కాశికా విశ్వేశుఁ గలిసె వీరారెడ్డి.
రత్నాంబరంబు లే రాయడిచ్చు
రంభ గూడెఁ దెనుంగు రాయరాహుత్తుండు
కస్తూరి కే రాజు ప్రస్తుతింతు
స్వర్గస్థుడయ్యె విస్సన మంత్రి మఱి హేమ
పాత్రాన్న మెవ్వని పంక్తిఁగలదు
కైలాసగిరిఁ బండె మైలారు విభుఁడేగి
దినవెచ్చ మేరాజు తీర్పగలడు.

గీ. భాస్కరుడు మున్నె దేవుని పాలి కరిగె.
కలియుగంబున నికనుండ గష్టమనుచు
దివిజ కవివరు గుండియల్ దిగ్గు రనగ
నరుగుచున్నాడు శ్రీనాథు డమరపురికి.

బృహస్పతి :—ఓయి శ్రీనాథ మహాకవీ! నేను బృహస్పతిని. దివిజ కవివరుడను. నా గుండియలు నిజముగనే దిగ్గురను చున్నవి. రావయ్యా. రా. నీకు స్వాగతము నొసఁగుటకు నప్సరస్త్రీలు నాట్యము నొసఁగుచున్నారు. భూలోకమున నీవు లకుమాదేవి నాట్యమును మెచ్చలేదు. ఇప్పు డామె నిన్ను మెప్పించుటకు నాట్యము చేయు చున్నది.

(నాటకముయొక్క మొదటి కీర్తనయు నాట్యమును).

# బసవేశ్వరుని చరిత్ర

శ్రీ కొడాలి లక్ష్మీనారాయణ

బసవేశ్వరుడు 'లింగాయత' మత స్థాపకుడు, బోధకుడై ఖ్యాతిగాంచెను. ఈయన మతవిప్లవమును గల్గించిన మహనీయుడని ఆర్. జి. భండార్కరు, తన దక్కను చరిత్రలో ప్రశంసించెను. ఈనాటి జనాభా లెక్కల ప్రకారము భారతదేశంలో 40 లక్షలమంది లింగాయతులు గలరు. ప్రధానముగా నీ మతము దక్షిణ బొంబాయి, బెల్గాము, బీజపూరు, ధనవర్ ప్రాంతభూములందు గాన్పించునని ఆంగ్లేయభాషలో రచించబడిన మతవిజ్ఞానసర్వస్వము తెల్పుచున్నది. ఈ సంస్కర్త జీవితచరిత్ర కట్టుకథలలో,[1] నభూతకల్పనలలో నిండియున్నది. ఈ విషయమును ఆంగ్ల విద్వాంసులు సైతము బేర్కొని యుండిరి. ఈ కల్పనా గాథలను విడగొట్టి సత్యమైన చారిత్రాం[2]శములతో నీయన జీవితచరిత్ర నీ కాలపు సంఘసంస్కర్తలలో బోల్చుచు వ్రాయుటమే మా యుద్దేశ్యమై యున్నది. ఈయన భావ విప్లవకారుడు. సాహితీవేత్త, సంస్కర్తయై విలసిల్లెను. ఈయన జీవిత చరిత్ర కాధారములు (1) బసవ పురాణము —ద్విపద కావ్యము, (2) దీని ననుసరించి వ్రాసిన బసవ పురాణము—పద్యకావ్యము, (3) భీమకవి రచిత—కన్నడ బసవ పురాణము, (4) బిజ్జలరాయ చరిత్రలు, (5) బసవేశ్వరుని కృతులు, (6) చెన్న బసవపురాణము. బసవన, పండిత త్రయము, అనువారు శైవమతమునకు ముఖ్యులు.. కాని 'బసవన, చెన్నబసవయ్య, ఏకాంతరామయ్య, పద్మరసు' అను వారు వీర శైవ మతప్రచారకులు. పై గ్రంథములు కన్నడములో గూడ గలవు.

భీమకవి కృత 'బసవపురాణము', 'విరూపాక్ష పండిత రచిత చెన్న బసవపురాణము' కన్నడమున గలవు.

## జన్మస్థలము-తలిదండ్రులు - బాల్యము-విద్యాభ్యాసము

ఈయన బ్రాహ్మణకుటుంబములో జన్మించెను. శ్రీశైలమునకు బడమరగా నున్న కర్ణాటకములోని 'హింగుళేశ్వర భాగవాటి' యను అగ్రహారమున ఈయన జననమని;[3] పాల్కురికి సోమనాథకవి తన 'బసవపురాణము' న నిట్లు వ్రాయుచున్నారు.

ద్విపద :

"యట్టి శ్రీగిరి పడమట నమరుచుండు
మేటిసంపదఁ బొదలి కర్ణాటకంబు
శ్రీ హింగుళేశ్వర భాగవాటి."

కన్నడ బసవపురాణమును బట్టి ఈయన జన్మస్థలము 'కాలడి జిల్లా' లోని 'బాగివాడి' యని తెలియుచున్నదని 'భండార్కరు' వ్రాయుచున్నారు. పిడపర్తి సోమనాథకవి తన బసవపురాణములో 8 నిట్లు వ్రాయుచున్నారు.

తే. "అట్టి కన్నడ దేశమధ్యంబునందు
నవని యుపతి గురుకుచాగ్ర హారమగుట
నగ్రహారాఖ్య దనకు నన్వర్థమగుచుఁ
బరఁగు శ్రీ హింగుళేశ్వర భాగవాటి."

కనుక 'భాగవాటి' నే 'బాగివాడి' యని వ్రాసియుండవచ్చును. వీరేశలింగముగారు కవిచరిత్రలో 'హింగుళేశ్వరాగ్రహారమని పేర్కొనిరి.

"ఈ గ్రామములోని 'మండెంగ మాదిరాజు, మాదమాంబ' యను పుణ్య దంపతులకు బసవేశ్వరుడు గల్గెను. ఈ మాదిరాజు 'గుణ పండిత వందితుడు' సద్బ్రాహ్మణుడని

---

1. Hastings — Encyclopaedia of religions Vol. II.

2. W. Crookes — Imperial Gazetteer Vol. I. P. 422. The story of his career is overlaid with a mass of legend."

3. R. G. Bhandarkar — History of the Deccan-p. 161— "Basava was the son of a Brahmin named 'Madi-raja who lived at Bagivadi' in the Kaladi District.

బసవ పురాణాదులు దెల్పుచున్నవి. కాని కొన్ని శాసనములబట్టి 'మాదిరాజు', 'మనిగవల్లి' గ్రామమునకు మహాప్రభువని, చాళుక్యరాజు రెండవ తైలపుని వంశములో మాధవుడు పుట్టెనని, ఈ మాధవుడే 'మాదిరాజని', బసవన ఈ గ్రామములో దేవాలయము గట్టించెనని క్రీ. శ. 1161 నాటి శాసనము తెల్పుచున్నది.4

ఈ విషయమును శ్రీ చిలుకూరి నారాయణరావు, శ్రీ చాగంటి శేషయ్యగార్లు మన దృష్టికి తోవైనవే తీసికొని వచ్చిరి. మనిగవల్లి గ్రామమునకు మాదిరాజు ప్రభువైన వృత్తాంతము బసవన దేవాలయమును గట్టించిన వృత్తాంతము శాసనాధారమున ధ్రువపడుటచేత, నీ విషయములో గొన్ని వెలుగులు లభ్యమగునేమో యని ఆశ గల్గుచున్నది. కనుక కన్నడభాషా పాండిత్యముగల ఆంధ్ర విద్వాంసులు ఈ విషయమును బరిశోధించి ప్రకటించెదరని నమ్ముచున్నాను. 'శ్రీనివాసాచారిగారు' ఈయన జననము 'బెల్గాము.' అని వ్రాసిరి. కాని యిది సందేహాస్పదము.

కొంతకాలముదాక సంతానము గల్గమి, మాదమాంబ అనేక నోములు నోచెను. చివరకు నందినోమువలన నంద నాప్తి గలుగునని విని, ఆ నోము నోచెనట. త్వరలో గర్భవతి యాయెను. కాని మూడు వర్షములు గడిచిన బిడ్డ బయల్పడ కుండెను. 'మాదమాంబ' చింతాక్రాంతస్వాంతురాలై యిట్లనెను :

తే. "పుణ్యవతులైన సతులెల్ల భూతలమున
నెన్నఁ దొమ్మిది మాసికంబ్రడన్న సుతుల
నల్ల నల్లన మూఁడేడు లయ్యెనకట
కన్న మెుగ మేరుపడదు నా గర్భమునకు."

చివరకు 'బసవన' లింగధారిగా జన్మించెను. చిన్నతనమునుండి శివభక్తిగలిగి, ఆటప్రాయ మపుడె 'సతత లింగార్చకుండై' విలసిల్లసాగెను. అందరు ద్వితీయ శంభు మూర్తి యని కొనియాడసాగిరి. కొంది కాలములోనే సర్వ విద్యావిలాసంబులు గల్గెను. సంపూర్ణముగా శైవమత జ్ఞానము గల్గెను. ఇందలి చారిత్రకాంశములను చదువరులు గ్రహించెదరు గాత !

## బసవన ఉపనయనమును నిరాకరించుట

హిందువులలో ద్విజులకు షోడశ సంస్కారములు గలవు. అందు ఉపనయనసంస్కారము ముఖ్యమైనది. ఎనిమిదవ ఏట ఉపనయనము చేయవలెనని, తండ్రి శుభలగ్నము నేర్పాటు చేసి బంధుమిత్రుల రప్పించెను. మేనమామయైన 'బలదేవుడు' కూడ ఈ మహోత్సవమునకు హాజరాయెను. కాని 'బసవన' తాను కులరహితుండనని, జాతి గోత్రంబుల కతీతుండనని, బ్రహ్మజాతుడ గానని, శైవ భక్తుండనని, కర్మ కాండయందు నమ్మకము లేదని ఈ క్రింది విధముగా బల్కెను.

సీ. "గత పూర్వజన్మ దుష్కర్మని ద్విజుఁ జేఁత
యూహా ఘ పాదిత్వ మగియ కాదె
కర్మల గురుకృపా నిర్మితునకుఁ గర్మ
జన్మత్వము జఘన్య సరణిగాదె
గురుహర వినయార్చకుండయ్యు హావిసగ్ని
దగ్ధంబు సేయుట దప్పుగాదె
పంచాక్షరీమంత్ర పరుఁడయ్యు నన్యమం
త్రావళుల్ దొడఁగుట యఘముగాదె

తే. శంభుభక్తుల కెత్తు హస్తములు భక్తి
హీనులగు త్రాటిమాలల కెత్తఁ బోఁగ
మాల లెటుగాక శివభక్తి మార్గమగునె
మఱియుఁ జెప్పెద విను ధరామరవరేణ్య."

ఇంకను తండ్రి కులమునకు గుద్దలివంటి వాడవు జన్మించితివని నిందించగా, బసవన యిట్లనెను :

తే. "గాన శివభక్తికిని బ్రాహ్మ్యగతికి సకల
కర్మములు వేఱువేఱ యౌఁగాదొ దైవ
మనఁగ లేదెందు నదియు సాంఖ్యాయనోక్తి
దానిసాంఖ్యాయనుఁడు జెప్పెఁ దగ్గురుండు.

తే. తాను సాంఖ్యాయనమత ప్రధాన కర్మ
జడుడు తత్ప్రోచ్యమాన విశ్వస్వరూప
సహిత బహుదేవతోపాస్తి సరణిమైన
యట్టి గాయత్రి శివభక్తి కనుమతంబె."

ఈ ప్రకారము గాయత్రి శివభక్తి కనుమతంబు కాదని వాదించెను. చివరకు తలిదండ్రులను చూచి ధర్మహీనులని

---

4. Epigraphica Indica-Vol 5.(1898-99)

నిందించి, వారితో నుండుట కిష్టపడక, సహోదరియగు నాగాంబతో గూడి మఱియొకచోటి కరిగెను. ఎన్మిదవ యేటనే యింత జ్ఞానము, ఇంత సాహసమా !

## బసవన్న వివాహము

ఆ కాలమున జైన మతస్థుడైన 'బిజ్జలుడు' కల్యాణి నగరమును బాలించుచుండెను. ఆయనకు బలదేవు మంత్రి, భండారి. ఈయన మేనల్లుడగు బసవన్నను గాంచి, తన కుమార్తె నిచ్చెదనని చెప్పి, ఆయన నంగీకరింపజేసి, జంగమ స్వాములు మున్నగువారిని బిలిపించి, వివాహ ప్రయత్నములు గావించెను. ఈ పెండ్లికి బ్రాహ్మణమంత్రాలు, కర్మకాండ లేకుండా బలదేవుడు తన కుమార్తె యగు 'గంగమాంబ' నిచ్చి వివాహము చేసెను. వివాహ వేదికకు 'బసవన' శివుని వేషములో నిట్లు వచ్చెను.

చ. "నుదుటఁ ద్రిపుండ్ర రేఖలు మ
నోహరలీల ధరించి యాదట౯
మది ముదముం బ్రసాదకుసుమం
బులు పూసి శరీర యష్టిఁ జె
న్నొందవఁగ నక్షమాలికల నూ
నముగా వహియించి మీఁదఁ గే
లిదలుకు మెత్తకంకటిఁ గటి
లింగప సాయతమన్మలారముగ౯."

ఈ విధముగా 'సిత భసిత దిగ్ధతనుడై' బసవనవచ్చెను. అచటి కర్మకాండలగూర్చి 'పిడపర్తి సోమన' యిట్లు వ్రాసెను.

తే. "శంభు భక్తార్చన వివాహసత్క్రియలఁట
తదనుమతిమె దలఁప ముహూర్తంబు నట్టె
భక్తగణముల సత్కృపాబలమునఁట వి
చిత్ర మది యన జనులు వచించిరపుడు."

బసవన్న చంద్ర తారాబల, గ్రహబలంబుల కేమి ప్రాధాన్యత యొసంగినవారు కాదు. సమాజము అంతర్వర్ణ భోజనాలను నిషేధించే రోజులలో బసవన్న శైవమతస్థులతో గలసి భుజించెను. "రామానుజుని వలెనే బ్రాహ్మణ మతమును నిరాకరించి నూతన మతసిద్ధాంతమును బోధించుటచేత బ్రాహ్మణులు బసవేశ్వరుని వేధింప మొదలుపెట్టగా, నీతడు స్వగ్రామమును విడిచి మరియొక గ్రామమునకు బోవలసి వచ్చెనని" ఆంధ్రచరిత్ర చతురాననుడు వ్రాసెను. రాజా రామమోహనరాయలు, దయానందుడు, వీరేశలింగము, కాశీనాథుని నాగేశ్వరరావు [5] మున్నగు మహనీయులు ఏదో రూపములో సంఘమును సంస్కరించ యత్నించిరి. కాని వారు మతాచార్యుల తీవ్రవిమర్శనా పరంపరలకు గురియగుట చూడగా, ఈ దేశమున బుద్ధి స్వాతంత్ర్యము (Intellectual liberty) అణచబడినదని చెప్పవచ్చును.

## కప్పడి సంగమేశ్వరంబున కరుగుట— మతప్రచారము

వివాహానంతరము సతీ సమేతంబుగ 'బసవన్న' సంగమేశ్వరస్వామి ఆలయంబున కరిగి పూజించగా, నాయన యిట్లు బోధించెను. బహుశః యిది గాంధి మహాత్మునికి గల అంతర్వాణి ప్రబోధమేమో ! "శివభక్త గణమును భక్తితో జూడుము. భస్మరుద్రాక్షములు దాల్చిన వారిని శివుని వలె జూడుము. శత్రువు లైనను లింగసంగతులైనచో మిత్రులుగా జూడుము. భక్తుల ఎడ, జాతి భేదమును బాటింపకుము. పరనారుల మోముల గాంచి, మోహములో బడకుండుము. పరద్రవ్యమును గోరకుము. సత్య వ్రతంబులో నుండుము. సత్కార్యాచరణలో నిమగ్నుడ వగుము." ఇందలి ధర్మములు ఉపనిషత్తులలోని 'సత్యంవద, ధర్మంచర' అను వానిని బోలియున్నవి. ఇవి త్రికాల సత్యములు. ఈ దర్మములను 'బసవన' లోకమునకు జాటి చెప్పెను. కాని ఈ వీరశైవము చరిత్రకారుల దృష్టిలో వ్యాప్తికి యుద్ధమును సాధనముగా ఉపయోగించు మతముగా (Militant faith) గాన్పించు చున్నది. ఈ పద్యము దానిని బలపరచు చున్నది.

క. "ఆది శివభక్తి పథమును,
గాదను దుర్జనుల మృత్యుగతిఁ బొరి
గొను మీ
వేదోక్త భక్తిగతి యి,
మ్మేదినిపై వెలయఁ జేయు మీ బసవన్నా!"

అల్లూరి శాసనములో గూడ వీరశైవ మత ప్రశంస గలదు. ఆంగ్లేయ విద్వాంసులు వీర శైవమతములో ముఖ్య సిద్ధాంతముల నిట్లు వ్రాసిరి. (1) శివు డొక్కడే దేవుడు. (2) ఆయనను లింగరూపములో బూజించవలెను. (3) ఆయన వాహనమైన నందిని గూడ బూజింపవలెను. (4) పునర్జన్మ లేదు. (5) బాల్య వివాహములు పనికిరావు. (6)

5. శ్రీ చిలుకూరి వీరభద్రరావు—కాకతీయాంధ్రరాజ 'యుగ చరిత్ర. పుట. 293.

వితంతువులకు పునర్వివాహముల జేయవచ్చును. (7) కుల భేదములు లేవు. (8) శివలింగమే అన్నియని తలంచవలెను. తాను నమ్మిన ఈ సిద్ధాంతముల బోధించసాగెను. 'అష్టవర్గ' యనఁ ఈ సిద్ధాంతములననుసరించిన వారిని పంచమ సాలీలు' అందురు' అని '(క్రుక్స్' (వ్రాసెను. కాని 'క్షితి మోహనసేన్ శాస్త్రి' రచించిన 'భారత వర్షమేం జాతిభేద్' అను గ్రంథము 226 వ పుటలో కర్ణాటకములో లింగాయతులు 2612300 అని. పంచమశాలీలు 431100 అని వేరు వేరుగా నుల్లేఖించెను. కనుక వీరి భేదమును గుర్తించవలెను.

చెన్న బసవపురాణములో నిట్లున్నది :

క. "కావున తన లింగంబే
దైవంబు గురుండు తల్లిదండ్రియుఁ బతియుం
జీవంబు గతియు మఱియును
భావింపగ వేఱెకలదె భక్తాధీశా !"

'వి. ఏ. స్మిత్' శ్రీనివాసాచారి అను చరిత్రకారులు ఈ మతస్థులు 'వేద ప్రామాణ్యములు నిరాకరింతురు' అని వ్రాసిరి.[6] కాని బసవపురాణములో 'వేదోక్త భక్తి గతి యిమ్మేది విప్పి వెలయు జేయుము' అని కలదు. ఈ విషయములో 'స్మిత్' పొరపడెనేమో యని తోచుచున్నది. అయినను పరిశోధనయందు అభిలాష గల ఆంధ్రవిద్వాంసులు ఈ విషయమును దేల్చవచ్చును. బసవని బోధ 'భక్తిమార్గమని, తద్వారా భగవంతునిలో నైక్యానుసంధానమని ఇది వేదోక్త మని ("Personal devotion and ultimate unity with the deity") విద్వాంసులు వ్రాసినది సత్యముగానే యున్నది. ఇంకను బసవన మున్నగువారు ఆదిలో కుల భేదమును వర్జించిరని, శ్రద్ధ మున్నగు కర్మకాండను నిరసించిరని కాని ఆధునిక లింగాయతు లీ బ్రాహ్మణమత సంబంధమగు కర్మకాండకు గడంగిరని "ఈశ్వరీ ప్రసాదు" అను విద్వాంసుడు విచారముతో నుల్లేఖించెను. 'శ్రీనివాసాచారిగారు' కూడ ఈ లింగాయుతి మతములో (Lingayatism) బ్రాహ్మణ మత విరుద్ధాంశములు గాన్పించుచున్నవని ఉల్లేఖించెను. ఈ విషయములు సత్యముగానే యున్నవి.. కాని వీరశైవ మతమును బోధించిన కవి 'పాల్కురికి సోమనాథకవి' బసవన శిష్యుని కుమారుడు, "నడరగ వేద భరాక్రాంతు లనగఁ

బడిన బ్రాహ్మణ గార్దభంబులతోడ" అని బ్రాహ్మణ దూషణ చేసెను. బ్రాహ్మణ మత సంబంధమగు కర్మకాండను గాక, బ్రాహ్మణులనే దూషించడము విచారకరము. భక్తి ప్రభావ మైనట్టిది, వర్ణభేదమును వర్జించినది, పునర్జన్మ సిద్ధాంతమును ఖండించినది, అగు నీ మతము క్రీ. శ. 1150 ప్రాంతమున గర్ణాటకదేశమున నారంభమైనదని చెప్పవచ్చును. 'ఏకాంతరామయ్య' ఈ మత స్థాపకుడని కొందరు వ్రాసిరి. కాని దీనికి తగు ఆధారములు లభ్యము కాలేదు. 'నిడుగల్లు' శాసనమువలన పై విషయము తేలుచున్నదని Dr. Fleet వ్రాసెనని వీరభద్రరావుగారు వ్రాసిరి.

ఈ లింగాయతు మతమునకు వీరశైవ మనిపేరు. ఈ మతము ననుసరించిన బ్రాహ్మణుల నారాధ్యులని, ద్విజేతరుల జంగములని పిల్చుట ఈ కాలముననే ఆరంభ మైనట్లు కాన్పించుచున్నది.[7] నన్నెచోడుడు తన కుమార సంభవములో దన గురువును 'జంగమ మల్లికార్జునుడు' అని ప్రయోగించెను. 'నన్నెచోడుడు' క్రీ. శ. 1100—1135 మధ్యవా డగుటచేత ఆయన కాలమునాటికి బ్రాహ్మణులను గూడ 'జంగమ' అని పిల్చుచున్నట్లు కాన్పించుచున్నది. ఫ్రెంచి విప్లవకాలమునాటి నినాదములు సమత్వము, సౌభ్రాతృత్వము, స్వతంత్రత—అనునవి 'బసవన' కాలములో ననగా 12 వ శతాబ్దములో 'సమత్వము' తో నారంభమైనవి. జాతీయ భావమునకు గొడ్డలిపెట్టె కులభేదమని చరిత్రకారులు నిందించిరి. అట్టి కుల నిర్మూలనకు, అంతర్వర్ణ భోజనములకు [7] ఎగడంగిన 'బసవన' చరిత్ర కెక్కదగిన మహావ్యక్తి. బాల్య

---

6. V. A. Smith—Ancient History of India. P. 391. "The numbers of the sect ...reject the authority of the Vadas — and Cherish an intense aversion to Brahmins, notwithstanding the fact that the founder of their religion was himself a Brahman', c. s. Sreenivasachary—History of India- P. 215.

7. R. G. Bhandarkar—History of Deccan. P- 162. "In concert with him (Chenna Basava) Basava began to propound a new doctrine and a new mode of worsbipping 'Siva' in which the Linga and the Nandin or bull were prominent. He speedily got a large number of followers and ordained a great many priests who were called 'Jangamas'

7. A C. S. Srinivasachary-A history of India P. 35 "It has destroyed the political and national unity in the country. It has disintegrated society."

వివాహముల నిరసించి వితంతు వివాహముల ప్రోత్సహించిన సంఘసంస్కర్త. కాని క్షితి మోహనసేన్ శాస్త్రి యిట్లు వ్రాసెను. "బసవనజాతి భేదముపై దండెత్తెను. శిష్య ప్రశిష్యులు జంగములైరి. వారిలో 'ఆరాధ్య నామములో ప్రసిద్ధ బ్రాహ్మణుల ఒక శ్రేణిగలదు. మెల్ల మెల్లగా దీనిలో గూడ సంకర మేర్పడి చాతుర్వర్ణ్యము లేర్పడును. ఈ ప్రకారము సంఘ సంస్కర్తలు జాతి భేదమును దొలగించు టకు యత్నించు చుండిరి. కాని తర్వాత అసంఖ్యాక జాతి భేదములు ఏర్పడుచుండెను." అని Ghurye మున్నగు వారు వ్రాసినది సత్యమే.

కొంతకాలమునకు 'బలదేవామాత్యుడు' కల్యాణి నగరములో మరణించెను. బిజ్జలు డంతట మంత్రులు, బంధువులతో గలసి, ప్రధాని పదవిని గూర్చి చర్చించగా, నా పదవికి 'బసవన' యర్హుడని యందరును జెప్పిన మీదట నాయనను బిలువబంచిరి. వారు 'కప్పడి' గ్రామమున కేగి బసవన్నను గోరగా నాయన మొదట అంగీకరించక పోయిన తర్వాత అంగీకరించి మతసేవ, పరోపకారము జేయు సంకల్పమున 'కల్యాణికి' బయలుదేరెను. బసవన్నను ఏనుగుపైన నూరేగించి, నగరములోనికి దీసికొనిపోయి రాజ్యము నప్పగించెను. 'ఆ సచివాగ్రణి బహు రాజ్యాసక్తుండయ్యు' ఈ క్రింది బాసల ననుసరించుట చేత ఆయన నీతి, ఆధ్యాత్మిక భావములు బయల్పడుచున్నవి.

తే. "బాస పరసతిపై దృష్టి పఱపకుండు
బాస పరధనముల కాస పడకయుండు
బాస పరనింద వొరయని బాసమఱియు,
బాస భర్గుని గొలిచెద బాసమఱియు."

తే. "ఇంద్రియ విషయములకు వెస్నినిబాస
యమిత శివభక్తిc జరియించు నట్టిబాస
వేదచోదిత భక్తి సంపాదనంబు
నాది శైవంబు నలరించు నట్టిబాస."

అట్టి బసవన్నను జూచుటకు జనులు తండోప తండములుగా వచ్చుచుండిరి. బసవన్నకు ప్రధానిపదవి, భండారి పదవి, సైన్యాధికారి పదవులు లభ్యమాయెను. ఈయన మేనల్లుడైన 'చెన్న బసవన' కూడ ఈయనకు సర్వవిధంబున సాయ మొనర్చు చుండెను. వీరి సాయంబున బిజ్జలుడు రాజ్య పాలన చేయుచుండెను. కాని బసవనకు ప్రజాసేవ కంటె మతాచార్యులగు జంగములసేవ అధికమాయెను. ఉద్యోగులగు జైనుల దొలగించి ఆ పదవులలో లింగాయతుల నేర్పరచెను.

అత్తలూరి పాపకవి రచిత చెన్న బసవపురాణ మిట్లు తెల్పును :

ఉ. "జైనకుల ప్రవర్తనుడు శాశ్వత కీ
ర్తి యుతుండు నిర్మలా
నూన గుణాభిరాముడు ధ
నుర్గుణ టాంకరణారి మండలీ
మానస సాధ్వస ప్రదుడు మ
న్మథ మాధవ రూపశాలి నా
నా నరనాథ సన్నుత సనాథు
డు తత్క్షితి నేత వర్ధిలెన్."

ఇంకను 'బసవన' లక్ష తొంబదియారువేల జంగముల కన్న మిడుచుండెనని, వేశ్యాలోలురైన 12000 మిండ జంగములకు కూడ నట్లే జరుపుచుండెనని బసవపురాణము, చెన్న బసవపురాణము తెల్పుచున్నవి. బసవపురాణములో నిట్లున్నది :

మ. "రసవంతంబులు గాcగ నోదన ప
దార్థంబుల్ త్రికాలంబులన్
బసవాధీశుcడు బోనగా వె
ళుల నంపన్ భక్త్యముల్ గొంచు వా
రసతి గేహము లందె యుండు వి
టమార ధ్వంసి భక్తాళి సం
ఖ్య సహస్రంబులు నాల్గు
మూcడులకుc దానన్నంబిడుం
దృప్తిగన్."

చెన్న బసవపురాణ మిట్లు తెల్పుచున్నది :

తే. "అనుదినము లక్ష తొంబది యాఱువేల
జంగమంబుల కిష్టాన్న నమితి యొసcగి
మిండజంగమములకుc బండ్రెండువేల
కనుచు వేశ్యా గృహంబున కట్టి పగిది."

కప్పడి సంగమేశ్వరస్వామి, పరదారల, పరధనంబును గోరవలదని చెప్పెను కదా! మిండ జంగము లిట్లు చేయుట విరుద్ధము కాదా? ప్రతి మతంబులోను ఇంద్రియ నిగ్రహ సంపన్నులైన మహాత్ములు బోధించు ధర్మములు వేరు, ఆచరణలో శిష్యులు చేయు పనులు వేరుగా నున్నవి. అందు చేతనే, కాబోలు, 'చేసేది శివపూజలు, దూరేది దొమ్మరి

కొంపలు' అను సామెత బయలుదేరినది. ఇంకను 'చెన్న బసవ పురాణము' లోని చెన్నబసవని వృత్తాంతమును గూర్చి ఆలోచించుడు :

సీ. ద్వాదశాబ్దంబులు తల్లి గర్భములోన నుండుటే యాశ్చర్యము విదలార!

మఱియొకచోట,

సీ. ప్రజలెల్ల నిందింపఁ బండ్రెండు వర్షముల్ భరియించి పుట్టెడి పట్టి వలన.

మఱియొకచోట—

సీ॥ జనని దక్షిణ కర్ణమునఁ బు
త్రు డుదయించు ద్వాదశ
వత్సర బాలుడగుచు
పదియు రెండేండ్ల బాలుడై యెదురునిలిచి.

చెన్నబసవన మఱియొకచోట 'దివ్యప్రసాద మణిమంబున జనియించితిని' అని చెప్పెను.

చరిత్రకారుడైన 'మెకాలే' ఛాందస భావములు గల్గిన కుళ్లిపోయిన సంఘము అని భారతీయ సమాజమును ఆక్షేపించెను. మనకున్న చరిత్రలో 30 అడుగుల ఎత్తు గల రాజులు, 30 వేల యేండ్లు పాలించు రాజులు' గలరని యిట్టి చరిత్రనా మేము చెప్పవలసినది' అని 'మెకాలే' ఆక్షేపించెను.

బసవపురాణములలో 700 వర్షములు బ్రతికిన జంగములు గూడ కాన్పింతురు.

తే. "వసుధలోపల నేడు నూర్వత్సరములు
వేద మితి మీఱి వర్తించు మాదిరాజు
మొదలుగాగల జంగమంబులు మనోజ్ఞ
భరిత సంతోషులై వచ్చి రురుతరముగ."

ఇంకను 'మదన వికార మెంత హీనమైనదో ఈ పద్యము తెల్పుచున్నది.

తే. "అధిప! బిజ్జలు తోఁబుట్టువైన చిత్ర
కన్యయనునది మదనవికార మొదవ
గుట్టముల కాపరినిగూడె గులమునీతి
శీలమును మానమెంచక సిగ్గుమాలి."

ఇంకను 'సోమనాధకవి' బసవ పురాణములో గూడ మాదిరాజు ప్రశంస గలదు.

"యనుచున్న మాదిరాజయ్యగారలను
గనుగొని మల్లయ్య కౌగిట జేర్చి
ఎనయంగ నాకన్నారు ఏబదియేండ్లు
ననియె నీ విటవచ్చి సంయమితిలక."

ప్రాచీన కవులు సత్యమైన చరిత్రాంశముల వ్రాసినచో, మన కెంతయో మేలు చేసి యుండెడివారు.

## బసవన్న మరణము

బసవన్న సోదరి 'పద్మావతిని' 'బిజ్జలుడు' పెండ్లాడెనని, రాజు సోదరీమణి 'నీలలోచనను' బసవన్న కిచ్చెనని జైన రచయితలు వ్రాసిరి. వీనివలన బసవన్న పలుకుబడి దినదినాభివృద్ధి గాంచెను.[8] ఖజానాలోని డబ్బు పెత్తన మంత బసవన్నదే. జంగముల పోషణకు, అపారముగా ధనరాసులు వెదజల్లబడుచుండెను. ప్రజాద్రవ్యమును 12000 మంది మిండ జంగములు వ్యభిచారగృహంబులనుండి హాయిగా దినుచుండిరి. చివర కొక జంగము బసవని భార్య పట్టుచీర నూడదీయించి వేశ్యాంగనకు సమర్పించెను. బిజ్జలుని మరియొక మంత్రి 'మంచన' వీనినెల్ల గాంచి చింతాక్రాంతస్వాంతుడాయెను. రాజుతో నీయన బసవన్న చేయు దుర్వ్యయ మంతను జెప్పెను. ఒకనాడు కల్యాణిలోని ఇద్దరు లింగాయతులను హలియాగ, మాధువయ్య అను బసవన శిష్యులను రాజు పిలిపించి, వారి కండ్లు పీకించెను. బసవపురాణ కర్త యిట్లు వ్రాసెను...

తే. "మఱియు నంతట నెల్లయ మధువయలనఁ
బరగుచుందురు కఱకంఠ భక్తవర్యు
లతుల లింగైక నిష్ఠానియతులు జంగ
మార్చనాసక్త చేతస్కు లఘురహితులు."

8. R. G. Bhandarkar-History of the Deccan P. 161. "The Jains, however state that Basava had a beautiful sister named 'Padmavathi' of whom the king became enamoured and whom he either married or made his mistress and it was on that account that he was raised to that office and became a man of influence.—The king gave his younger sister 'Neelalochana' in marriage to Basava. Basava had another sister named 'Nagalambika' who had a son named Chenna Basava or Basava the younger"

శంభు భక్తుల కోపాటోపంబున కంతులేదు. ఇక కల్యాణినగరములో నుండుట శ్రేయస్కరము గాదని తలంచి, బసవని గృహంబున శివభక్తు లొక సభ జరిపిరి. కల్యాణి నగరమును బాడగునట్లు శపించిరి. రాజును జంపుడని 'జగద్దేవుని' కాజ్ఞయిచ్చి, బసవన, మున్నగు భక్తులు 'కప్పడి సంగమేశ్వరుని' చెంతకు జనిరి. జగద్దేవు డింటికి జనిన వెంటనే, యొక్కింత సంకోచించెను కాని తల్లి కూడ ప్రేరేపించెను. 'మల్లయ, బ్రహ్మయ్య' అను భక్తు లిరువురు జగద్దేవుని గలసి, అతనితో గలసి భుజించి, బిజ్జలుని చెంత కారేయియే చనిరి.

చ. "అలుగులు చీకినంతటనె యాస
భ తల్లడమంద మువ్వురుం
గలఁగక డాసి ద్రోహిఁగ సికండలు సే
సి ఘోరాలుమంచు నా
తులువ శిరంబు తున్మి ఘన
తుండమునందిడి మేము శంభు భ
క్తుల విహితాజ్ఞ నీ ఖలునిఁ గొ
ట్టిన దిట్టల మంచు వెండియున్."

తిరిగి వచ్చి తల్లుల పాదాబ్జంబులకు మ్రొక్కినారు. రాజు మరణవార్త వినుటతోడనే, నగరవాసులు భయభ్రాంతులైరి. నగరములో నంతర్యుద్ధము ప్రారంభమాయెను. జైనులకు, వీరశైవులకు బ్రహ్మాండమైన యుద్ధము జరిగెను. కొన్ని దినములవరకు ఆ నగరమున శాంతిభద్రతలు లేవు. కల్యాణినగరము శిథిలముగ కుప్పగా మారిపోయెను. 'మాలప్రభ కృష్ణల సంగమేశ్వర స్థలంబున' నున్న సంగమేశ్వరాలయంబున నుండి కొన్నాళ్లకు 'బసవన్న' మరణించెను. బిజ్జలుని కుమారు డీయనను వధించెనని 'రైస్' వ్రాసెను.

జైనులు దీనిని మరియొక విధముగా వ్రాసిరి. బిజ్జలుడు 'భీమానది' యొద్దన నుండగా జైన వేషము వేసి విషపు పండు నిచ్చెనని, దానిని రాజు వాసన చూచెనని, వెంటనే స్మారకములేక పడిపోయెనని ఆయన కుమారుడు "ఇమ్మడి బిజ్జన' మున్నగువారు వచ్చిరని, కొంతసేపటికి దెలిసెనని, బసవని జంపుమని రాజు ఆజ్ఞ నిచ్చెనని, వెంటనే రాజు సైనికులు బసవని వెంటాడిరని, బసవ 'మలబారు' లోని 'ఉలవి' అను ప్రదేశమునకు బోయి యచట దాగెనని 'ఇమ్మడి బిజ్జలుడు' దానిని ముట్టడించెనని తప్పించుకొను మార్గములేక యొక బావిలో పడి యసువుల వాసెనని భార్య 'నీలాంబ' విషము త్రాగి మరణించెనని జైనులు వ్రాసిరి. తరువాత చెన్నబసవేశ్వరుడు' లింగాయతులకు నాయకు డాయెనని, ఈయనలో నుండి 'ఓం' అను ప్రణవ మంత్ర మావిర్భవించెనని, తెలియుచున్నది. చెన్న[9] బసవడే శివుడని బసవన వృషభమని (నంది) బిజ్జలుడు ద్వారపాలకుడని, కల్యాణమే కైలాసమని చెన్న బసవపురాణము తెల్పుచున్నది. బిజ్జలుని మరణము శక 1089 (రు ఎ. డి. 1167) లో జరిగెనని భండార్కరు విద్వాంసుడు వ్రాయుచున్నాడు. ఈ వ్రాత సత్యముగా నున్నది. బసవేశ్వరుని మరణము దీనినిబట్టి క్రీ. శ. 1168 లో జరిగెనని చరిత్రకారులు తలంచుచున్నారు. బసవని మరణానంతరము, బిజ్జలుని కుమారుడు శాంతచిత్తుడాయెనని, చెన్నబసవయ్య తన మేనమామ ఆస్తిని స్వాధీనపరచుకొనెనని, ఈయన రాజుకు లోబడి అతని అభిమానమునకు బాత్రుడాయెనని, వీరశైవ మతమును ప్రచారము చేసుకొనెనని పాశ్చాత్యవిద్వాంసులు, జైనుల గ్రంథాధారమున వ్రాసిరి.

## బసవన కృతులు

బసవన మరణవార్తను పండితారాధ్యులు విని దుఃఖించిరి. 'ఇరుగుడుమల గ్రామము' లో 'వీరచాకి దేవయ్య' పండితుని పూజచేసెను. అచటికే బసవన, పండితునికి విభూతి పంపెను. కన్నడములో బసవన 'షట్స్థల వచన' కాలజ్ఞానదీ వచన, మంత్రగోప్య వచన అను 3 వచన గ్రంథములు రచించెనని మా ప్రియమిత్రులు నిడదవోలు వేంకటరావుగారు వ్రాసిరి. ఈ గ్రంథములను నేను జూడలేదు. వీనివలన ఈయన భావంబుల[10] గ్రహించవలెను.

బసవని సమత్వమున కిది నిదర్శనము. ఒకసారి బసవన పండితారాధ్యుని జందెము తొలగించి తనతో వచ్చి కలియుమని చెప్పగా పండితారాధ్యు లిట్లు చెప్పిరి.

---

9. R. G. Bhandarkar — History of Deccan P. 165-

10. శ్రీ ని. వేంకటరావు—ఆంధ్ర వచన వాఙ్మయము. పుట. 13.

షట్స్థల వచనము :—

నర కెన్నెగె, తెరగల్లకె శరీర గూడ వగదమున్న
హల్లు హోగి బెన్ను బాగి అన్యరిగెహం గాదమున్న
కాలు మేలె కయ్యె నూరి కోల హిడియదమున్న
ముప్పిం దొప్ప వళియదమున్న మృత్యు ముట్టదమున్న
పూజిసు నమ్మ సంగమ కూడలి దేవరా !

"భక్తి మీఁదివలపు బ్రాహ్మ్యంబు లోఁబొత్తు
బాయలేను నేను బసవలింగ."

దీనినిబట్టి బసవనికి గల సమత్వము పండితారాధ్యులకు లేదని స్పష్టపడుచున్నది. ఈ పండితారాధ్యులే 'నన్నెచోడుని' గురువని శ్రీ వేంకటరావుగా రభిప్రాయ పడిరి. సరికాదని నేను నిరూపించుచు, త్వరలో ముద్రించనున్న 'నన్నెచోడ చరిత్ర' లో వ్రాసినాను.

పై విషయములను బట్టి బసవని మరణము ఒక విధముగా జరిగినట్లు తోచదు. సంగమ తీర్థములో మునిగి చనిపోయినది. బావిలో పడి మరణించినది. శత్రువుల చేతు లలో బడి మరణించినది తెలియకున్నది. బావిలో బడి మర ణించడము గౌరవప్రదము గాదని, మాలప్రభ కృష్ణాసంగమ స్థలములో సంగమేశ్వరలింగములో గలసిపోయేనని బసవ పురాణాదుల బట్టి లింగాయతులు మహత్తు కొరకు చెప్పు కొను చుందురు. బిజ్జలుని హత్య జరిగిన తర్వాత ఆయన కుమారుడు 'బసవని' వెదకికొనుచు అనేక స్థలముల కేగిరని, చివర కాయన మార్గాంతరము లేక యొక బావిలో బడి మరణించెనని 'రైసు' అను విద్వాంసుని వ్రాత సత్యముగా గాన్పించుచున్నది. 11 కాని బిజ్జలుని కుమారుడు వధించెనని కూడ వదంతి కలదు. మొత్తముమీద బసవని మరణము విషా దాంతముగా బరిణమించినది. ఆయన భార్య మరణ మంత కంటెను హీనమై పోయినది.

బసవని చరిత్రమును ద్విపదకావ్యముగా పాల్కురికి సోమనాథ కవి రచించగా, 'పిడపర్తి సోమనాథ కవి' పద్య కావ్యముగా రచించెను. అత్తలూరి పాపకవి రచించిన చెన్న బసవపురాణము మరియొకటి గలదు. ద్విపదకావ్యమును ప్రథమముగా నాంధ్రభాషలో ముద్రించిన గౌరవము 'కాశీ నాథుని నాగేశ్వరరావుగారికి' దక్కినది. శైవపండితులలో ముఖ్యుడైన "శ్రీపతి" బెజవాడ వాస్తవ్యుడు. అనంతపాల దండనాయకుని చెంత నున్న ఆధారములు గాన్పించును. ఈయన వంశీయుడే 'కాశీనాథుని వీరనారాధ్యుడు' ఈయన 'ధర్మ గుప్తాభ్యుదయము' లో నిట్లు వ్రాసెను.

గీ. "అరయఁ దత్పండి తేంద్ర నిజాంశ భూతి
భవులు శ్రీపతి మంచెన పండితులును
మల్లికార్జున పండితు డెల్ల జనులు
వినుతు లొనరింప వెలసి రుర్వీతలమున."

జనప పురాణములో గూడ నిట్లున్నది.

తే. పెండికవిరాజు శ్రీపతి పండితయ్య
పండితుడు మల్లికార్జున పండితయ్య.

కవిరాజగు శ్రీపతి వంశముననే 'కాశీనాథుని నాగేశ్వర రావుగారు' జన్మించిరి. సాహితీవేత్త సంఘసంస్కర్తలగు వీరి చరిత్రను గూడ ముందు వ్రాసెదను శ్రీపతి వంశీయుడగు ఈ పండితునికి కూడ వంశానుగతమును (Heredity) బట్టి కొన్ని శుభాంశలు గల్గినవి. వానిని ముందు వ్రాసెదను.

---

11. L. Rice—Mysore-Vol I — P. 332 "The murderer did not live long to enjoy his power in the state, for vijjala's son Rayamurari Sovi, hunted down Basava from place to place till the latter committed suicide by throwing himself into a well. The Lingayats themselves say that hunted and pursued, Basava disappeared into the Linga at Sangameswara at the junction of the Malaprabha and the Krishna."

# గగన కుసుమము

## శ్రీ గులాబ్‌దాస్ బ్రోకర్

నా వెనుక భుజమ్మీద ఎవరిచేతిస్పర్శో తగలగానే పరధ్యానంగానున్న నేను ఉలిక్కిపడి వెనుదిరిగిచూశాను. మాంచి శరీర ధారుఢ్యము, ఆజానుబాహుడుఅయిన ఒక శిక్కు నా వెనుకాల నుంచున్నాడు. అతని ముఖములో కొంచెం సిగ్గు, 'ఏదో చెప్దామా? వద్దా' అన్న మొహమాటము వ్యక్తమవుతూంది. మా కళ్లు కలుసుకోగానే 'క్షమించండి హుజూర్' అన్నాడు.

అతన్ని చూసిన మరుక్షణము నా భయము అదృశ్యమయింది. లేకపోతే, ఆ చిన్ని లోనవ్లా హిల్ స్టేషను నిర్మానుష్యపు వీధుల్లో ఒక అపరిచితవ్యక్తి సంబోధించడం, ఎంతటి గుండె నిబ్బరము గలవాడికైనా ఒళ్లు కొంచెము జలదరింపకమానదు.

'ఫరవాలేదు, భాయ్! నీకేమి సహాయం కావాలి?' నవ్వుతూ ప్రశ్నించాను.

'ఆ......ఏమీలేదండి' ఏదో చెప్పటానికి సంశయించాడు. కొన్ని క్షణాలతర్వాత, సిగ్గుపడ్తూ, ధైర్యంగా అన్నాడు.

''క్షమించండి! అడుగుతున్నందుకు—మీకు ఇంగ్లీషు చదవటం వచ్చా?''

''ఏదో కొద్దిగా తెలుసు.'' నవ్వేను.

''మీ చేతులోనున్న కవరుమీది అక్షరాలను ఈ వీధి దీపపు వెలుగులో చూసి, మీకు ఇంగ్లీషు తెలిసిఉండాలనే ఊహించి, ధైర్యంగా మీ భుజాన్ని తట్టేను.''

''కాని, సర్దార్జీ, ఇంతరాత్రివేళ, నా ఇంగ్లీషు భాషా ప్రవేశాన్ని నీవు తెలుసుకోదలచిన అగత్యమేమి కల్గింది?'' అని ప్రశ్నించాను.

'మీరేమీ అనుకోనివక్షాన, దయచేసి నాకు ఇంగ్లీషులో వచ్చిన ఈ ఉత్తరాన్ని చదివి వినిపిస్తారని.''

''ఎప్పుడు?''

''మీకు తీరిక కలిగినప్పుడు''. కాని, అతని ముఖములో 'ఈ క్షణము చదివి వినిపించండి' అన్న ఆతృత వ్యక్తమవుతూంది.

''దేన్ని గురిం చేమిటి''

''ఆమాత్రం తెలుస్తే, మిమ్మల్ని ప్రాధేయపడటం దేనికి?'' నవ్వేడు.

నాకూ ఆతృత హెచ్చింది. ''దేన్ని గురించి అయిఉంటుంది'' అని.

'అయితే ఇప్పుడే చదవమంటావా?'

'మీకేమీ ఇబ్బంది లేకపోతే' అతని ముఖములో సంతోష రేఖలు కలిగినై.

'ఇదిగో, నేను పోస్టాఫీసుకు అర్జంటు పనిమీద వెళ్తున్నాను. నీవూ అక్కడకువస్తే, నీ ఉత్తరము చదువుతాను'

'చాలా మంచిదండి.' మేమిద్దరము పోస్టాఫీసువైపుకు నడచి వెళ్తున్నాం. ఎవ్వరమూ మాట్లాడలేదు. అతనూ, ఏదో దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు. నేనూ, అది ఏమైఉంటుందా అని ఏమేమిటో ఊహిస్తున్నాను. ఏదైనా ఉద్యోగ విషయమే అయితే ముందే చెప్పేవాడే! లేక ఏదైనా ప్రేమ వ్యవహారమా—అదీ కాదు. ఎంచేతంటే, అతనికి అర్థంకాని భాషలో ప్రేమలేఖ వ్రాసే అవసరమేముంటుంది? మరి దేని కతను అంత సిగ్గు, మొహమాట పడుతున్నాడు. ఇలా ఎన్నో ఆలోచనలు.

పోస్టాఫీసులో నా పని చూసుకున్నతర్వాత, వరండాలోనున్న బల్లను చూపిస్తూ 'ఇక్కడ కూర్చుందామా?' అని అడిగాను.

'ఇక్కడ దీపపు వెలుగు అంతగాలేదు. ఎదురుగానున్న రెస్టారెంటులోకి వెళ్దామా జనాబ్'

రెస్టారెంటుకు వెళ్లి, కొంచెము మూలగానున్న కుర్చీలలో కూర్చున్నాము. చాలా సిగ్గుపడుతూ, ఉత్తరము నా చేతిలో పెట్టాడు. 'మీకు చాలా శ్రమ ఇస్తున్నాను హుజూర్.'

ఉత్తరము చదువుతూ, మధ్యలో అతనివైపు చూశాను. అతను ఎంతో ఆతృతతో నావైపు చూస్తున్నాడు. నేను ఉత్తరము చదవటం పూర్తయినతర్వాత, అతనివైపు చూసి చిరునవ్వు నవ్వాను.

'అందులో ఏముంది జనాబ్?'

'నీపేరు కర్తార్‌సింగ్ అవునా?'

'అవునండి.'

'అయితే నీవు పెళ్లి చేసుకోవాలని అనుకుంటున్నావా?' అన్నాను మెల్లిగా. 'అవునండి. అది పిలుపడుతుందని వ్రాసారా అండీ' అని కుర్చీలోంచి గబుక్కున లేచేడు.

'కూర్చో సర్దార్జీ. వాళ్ళు అలా వ్రాసినప్పటికీ, నీవు ఈ క్షణము బయల్దేరడానికి, రైలు ఏమీలేదు. ఖంగారుపడకు. అంతటి భారీమనిషి సిగ్గుతో కుంచించుకుపోయాడు.

'సర్దార్జీ. ఈ ఉత్తరము, శ్రద్ధానంద్ అనాథస్త్రీ శరణాలయమునుండి, నీకు వచ్చినది. నీవు, నీ ఉత్తరములో కోరిన విధంగా, తగిన అమ్మాయి ప్రస్తుతం లేదని, నీ ఉత్తరము వారి ఆఫీసులో ఉంచుకొన్నారని, తగిన అమ్మాయి కనుగొనిన క్షణాన నీకు తెలియజేస్తామని, ఈలోగా నిన్నొకమారు శరణాలయము మేనేజరుని కల్సుకోమని వ్రాశారు!

'హుమ్' అని నిట్టూర్చి, నిశ్శబ్దంగా ఉండిపోయాడు.

'ఏమిటి ఇదంతా సర్దార్జీ?' నే నడిగాను.

నిస్పృహతోనున్న కంఠస్వరముతో అన్నాడు. అంత చెప్పుకో తగినదేమీలేదు హుజూర్'

'అయినప్పటికి చెప్పు'

'ఇదంతా ఇలా జరిగినదండి......' ఊరుకున్నాడు.

'మీ కాలాన్ని అనవసరంగా వృథాచేయటం దేనికి. ఇప్పటికే మీకు చాలా శ్రమ ఇచ్చేను.' కాని, ఇంతటి ఆరోగ్యవంతుని ముఖమ్మీద విషాదచ్ఛాయలు అలుముకోవటం సహించలేక పోయాను. 'ఫర్వాలేదు చెప్పు సర్దార్జీ! నీకేమైనా సహాయము చేయగలనేమో చూస్తాను.'

నావైపు ఆశగా చూశాడు. తన కథ చెప్పడం మొదలు పెట్టాడు.

''నే నిక్కడ సెయింట్ పీటర్స్ గరల్స్ హైస్కూల్లో బస్ డ్రైవర్‌గా పని చేస్తున్నాండి. ఆంగ్రేజీ మెమ్‌సాబ్ ఈ స్కూలు నడుపుతున్నారండి. ఈ స్కూల్లో ఆంగ్రేజీ, పార్శీ అమ్మాయిలు చదువుకుంటారండి. అమ్మగారు 'సింగ్‌సాబ్, నీ పెళ్ళాన్ని ఎప్పుడు తీసుకొస్తావ్?' అని తరుచు నన్నడుగుతూ ఉంటుందండి''

'అయితే, నీకు పెళ్లాం ఉందన్నమాట. ఆశ్చర్యంగా అడిగాను.

''అక్కడే వచ్చిందండి చిక్కంతా సేఠ్జీ''—నాకు అర్థం కాలేదు. ఈ విషయములో ఏదో కుంభకోణముందనిపించింది.

''అయితే, వారికి, నీకు పెళ్ళికాలేదని తెలియదన్నమాట'' సంశయంతో అడిగేను.

''నాకు పెళ్ళి కాలేదని తెలుస్తే, నన్నీ అమ్మాయిల స్కూల్లో పనిచేయనిస్తారూ?'' గట్టిగా నవ్వాడు. నేనూ శ్రుతి కలిపేను.

''నీవు ఘటికుడివే! పైకి కనబడ్డంత అమాయకుడవు కాదు.''

'ఏం చేయమంటారండీ! ఎలాగో జీవనోపాధి చూసుకోవాలిగా' కొన్ని క్షణాల తర్వాత మళ్లీ తన కథ చెప్పడం ఆరంభించేడు.

'యుద్ధమైపోగానే, నన్ను డిస్చార్జ్ చేశారు. నాకే ఉద్యోగము దొరకలేదు. నేనేమీ చదువుకోలేదు. కాని, డ్రైవర్‌గా మంచి పేరుంది. అప్పుడే స్కూలుకు ఒక బస్సుడ్రైవర్ కావాల్సి వచ్చింది. నామీద అభిమానముగల కెప్టెన్ జాక్సన్‌సాబ్, ఈ మెమ్‌సాబ్‌కు నన్ను రికమెండ్ చేశారు. రెండు షరతులమీద తీసుకుంటానన్నది. ఒకటి నా శీలము స్వచ్ఛమైనదై ఉండాలి. రెండోది నేను పెళ్ళి చేసికొని ఉండాలి. జాక్సన్‌సాబ్ మెమ్‌సాబ్‌ను కల్సుకున్నతర్వాత, మంచి హుషారుగా నా దగ్గరకువచ్చి, 'కర్తార్‌సింగ్, నిన్ను వివాహితుణ్ణి చేశానోయ్' అన్నారు.

'వీరికి మతిపోయిందా' అనుకున్నాను.

'డబ్బులేని నన్నెవరు పెళ్ళిచేసుకొంటారు కెప్టెన్‌సాబ్' అన్నాను వినయంగా.'

'ఇప్పుడే నిన్ను వివాహితుణ్ణి చేశాను' అన్నారు. 'నాకు పెళ్లిఅయిందని, నా నడవడికలో సంశయించవలసినదేమీలేదని మెమ్‌సాబ్‌కుచెప్పి, గర్ల్స్‌స్కూల్లో నాకు డ్రైవర్‌పని సంపాదించానని, మరునాడే డ్యూటీలో ప్రవేశించాలనీ, జరిగిందంతా చెప్పారు. ఉద్యోగంలో చేరాను. ఒక సంవత్సరము గడచిపోయిందిలా. మెమ్‌సాబ్ ప్రతీమారు అడుగుతూంది 'నీ పెళ్ళాన్ని ఎప్పుడు తీసుకొస్తావని. నేను ప్రతీమారు ఏదో సాకు చెప్పేవాడిని. కాని, ఎంతకాలమని అబద్ధమాడగలను. లేని పెళ్లాన్ని ఎక్కడినుండి తేగలను? ఈ సమయంలో ఎక్కడైనా నాకు తగిన స్త్రీ దొరుకుతుందేమోనని ప్రయత్నించాను. కానీ, నాకీ దేశమంతా క్రొత్త. ఎవ్వరూ తెలియదు. నా ఉద్యోగం ఉండాలంటే, నేను పెళ్లాన్ని ఎక్కడినుండైనా తీసుకురావాలి.

అదృష్టవశాత్తు, కొన్ని దినాలక్రితము కర్‌సందాస్‌జీ అన్న వ్యక్తి నాకు తటస్థపడ్డాడు. బొంబాయిలో రెండు మూడు స్త్రీల శరణాలయాలున్నాయని, అక్కడ బహుశా నాకు తగిన భార్య దొరకవచ్చునని సలహా ఇచ్చాడు. నాతరఫున, అక్కడికి ఉత్తరాలు రాశేడు. అతను నిన్ననే వెళ్ళిపోయాడు. వాటి జవాబే ఈరోజు వచ్చిన ఉత్తరము. దానిలోకూడ నిరుత్సాహమైన వార్తే—నిరాశాజనకమైన వార్తే' నిట్టూర్చాడు కర్తార్‌సింగ్.

''కాని, కర్తార్‌సింగ్! నీవు ఇక్కడ క్రొత్తవాడివేకాని, పంజాబ్‌లో కాదుకదా. అంత నిరుత్సాహపడుతూ వెందుకు? పంజాబెళ్లి ప్రయత్నించకూడదా?'' అన్నాను.

''ఆపని అంత సుళువే అయితే, నేనిలా పెళ్ళికాకుండా ఇంతవరకూ ఉండిపోదునా, జనాబ్. నా కిప్పుడు ముప్ఫై ఐదు నిండాయి.'

'మీ కులంనుండి అమ్మాయిలు దొరకటమంత కష్టమా?' నేను ప్రశ్నించాను.

'డబ్బులేనివాళ్లకు, ఏదైనా కష్టసాధ్యమేనండి.'

'అయితే నీ వన్నట్లు, డబ్బులేనివాళ్లంతా పెళ్ళి చేసుకోకుండా ఉండాలని నీ అభిమతమా సర్దార్జీ?'' అతనూ నవ్వాడు నాతో.

'నేను చెప్పినదాంట్లో కొంచెము అతిశయోక్తి ఉందనుకోండి. కాని, నా విషయములోమట్టుకి అంతా నిజము. చిన్నప్పుడే ఇల్లు వదిలేశాను. అక్కడా, ఇక్కడా తిరిగి, యుద్ధములోకి వెళ్ళిపోయాను. సైన్యంతో ఇండియాఅంతా తిరిగాను. కాని, నే నిప్పుడేమిటి! ఒక అమ్మాయిల బడిలో ఊరూ పేరూ లేని, బస్సు డ్రైవర్ని. నాలాంటివాడికి పిల్లనిచ్చే తండ్రి ఎవరు?' అతని స్వరము గాద్గదికమయింది.

'నాలాంటి పేదవాళ్లిలాగే పెళ్లికాకుండా, నిస్సారముగా జీవితము గడపాలి. హుజూర్. మీలాంటి భాగ్యవంతులకు మా కథ ఏమి అర్థమవుతుంది?'

'నీకు ఎవ్వడూ పిల్లనివ్వటానికి ఇచ్ఛగించకపోతే, గంగలో దూకనీ. కాని, నీలాంటి ధైర్యవంతుణ్ణి, ఆరోగ్యవంతుణ్ణి పెళ్ళి చేసుకోవటానికి ఏ అమ్మాయి తనంతటతాను నిన్ను అభ్యర్థించ లేదా?' అని అడిగాను.

''అలాంటి సంఘటనలు కొన్నిమార్లు తటస్థించాయి సర్దార్'' అతనిలో పూర్వస్మృతులు జ్ఞప్తికిరాగా, పెదవులమీద దరహాసము మెదిలింది.

'మరి నీవింకా బ్రహ్మచారిగానే ఉండటంలో అంతరార్థం?'

'నుదుటిమీద రాసిన రాత, హుజూర్ నా రాత!'—

—'నేను సైన్యములో ఉన్నప్పుడు, కొన్ని నెలలు మా రెజిమెంటు సికిందరాబాదులోఉన్నది. మేము రోజూసాయంకాలము మైదానంలో ఫుట్‌బాలు ఆడేవాళ్లం. నేను అందమయినవాణ్ణో కాదో తెలియదుకాని, ఆ మైదానానికి దగ్గరగాఉండే ఒక క్రైస్తవుల అమ్మాయి నేనంటే ఆసక్తి చూపేది. ఎలాగో మా ఇద్దరికీ పరిచయమైంది.'

'ఆ అమ్మాయి అందమైనదా?' అని అడిగాను.

'దేవలోక సుందరేనండి' చాలా ఉత్సాహంగా చెప్పుకోబోయాడు. కాని, ఆ క్షణము, నా కళ్లలోని చిలిపి నవ్వుని చూసి కొంచెము సంబాళించుకొన్నాడు.

'అందంమాట అలా ఉంచండి హుజూర్. చాలా నాజూకైనది. సంస్కారము గలదీను. మా ఇద్దరిమధ్య పెంపొందిన సాన్నిహిత్యాన్ని పురస్కరించుకొని, పెళ్ళి విషయమూ కదిపేను.'

'చక్కని పని చేశావు,' అని మెచ్చుకొన్నాను నేను.

'పెళ్ళికి ఒప్పుకొంది. ఆ అమ్మాయీ పేదకుటుంబానికి చెందినదే! మా సంసారం ఆనందమయంగా ఉంటుందని ఆశించా.'

'మరి హంసపాదు ఎక్కడ?' అన్నాను.

'నేను క్రైస్తవమతము స్వీకరిస్తేనే పెళ్ళి చేసుకుంటానంది. ఏమైనాసరే, తనమతము మార్చుకోనంది.'

'నిజం?' ఆశ్చర్యంగా అడిగాను.

అక్షరాలా నిజం. అదెప్పుడూ అంతే జనాబ్. క్రొత్త మతము పుచ్చుకొన్నవాళ్లకు, ఆ కొత్తమతముమీద వల్లమాలిన నమ్మకముంటుంది. కాని, మతము మార్చుకోవటం నా కెలా సాధ్యం? తనకే తన మతముమీద అంత నమ్మకముంటే, నాకూ శిక్కుమతముమీద అంత నమ్మకముంది. అనాదిగా వస్తున్న మా ధర్మ సంప్రదాయాల్ని ఈ అమ్మాయిమీది మోహము కోసము ఎలా పరిత్యజింపగలను? అంతే! అంతటితో ఆ కథ అంతమయింది.

'అచ్ఛా తర్వాత?' మళ్లీ అందుకొన్నాడు.

'ఇంకో సంఘటన కూడా ఉన్నదండి'

'చెప్పు. వింటాను' అన్నాను ఆసక్తితో. కొంచెము అయిష్టంగా తలూపేడు. ''జనాబ్! ఇలాంటివి చెప్పగూడదు. నాకే అసహ్యం.......అయినా చెబ్తాను. నేను ఇక్కడనుండి పూనాకు లోకల్ ట్రైనులో వెళ్తున్నాను ఒకమారు. తాలేగావ్ రైల్వే స్టేషనులో ఒక ముస్లిం యువతి, ఆమె వెంట ఒక మగాడు నేను కూర్చున్న పెట్టెలోకి ఎక్కారు. జనం రద్దీగా ఉన్నప్పటికీ, ఎలాగో చోటు చేసుకొని, నాకు ఎదురుగాఉన్న బల్లమీద కూర్చున్నారు. రైలు కదిలిన తర్వాత, ఆ ముస్లిం యువతి ఘడియ ఘడియకు నావైపు చూట్టం గమనించాను. ముస్లింయువతి అయినా పర్దాలేదు. నేనూ, ఆమెవైపు చూశాను. నన్ను చూడగానే ఆమె పెదాలమీద, చిన్నని చిరునవ్వు మెరిసింది. నా ఖీసం మీదికి నా చేయి అప్రయత్నంగా పోయింది.''

ఓ! హీరోగారు!' అంటూ నేను నవ్వాను. అతను పాపం చికాకు పడ్డాడు.

'నే చేసినదానికి నేనూ పశ్చాత్తాపబడ్డాను తర్వాత. కాని, నేను మగాణ్ణి......ఆమె తలొంచుకొని, మెల్లిగా నవ్వింది. ఆ తీయని చిరునవ్వు, సాధారణ అందముగానున్న ఆమె ముఖానికి సౌందర్యాన్ని అప్పిచ్చింది.'

'అయితే మీ ఇద్దరిమధ్యా ఈ నాటకము జరుగుచున్నప్పుడు, ఆమెతో వచ్చిన పురుషుడేం చేస్తున్నాడు?' అన్నాను.

'కిటికీలోంచి బయటకు చూస్తూ, మధురప్రేమగీతము ఆలాపిస్తున్నాడు.' కర్తార్‌సింగ్ నవ్వేడు.

'రైలు పూనాను సమీపిస్తూండగా, ఆ యువతి చేతిలోని చిన్ని రుమాలుని (హేంకీ) అరచేతిమీద పరచింది. నే నటుచూశాను. హలీమా అన్న పేరు ఒక మూలగా, ఆ హేంకీమీద ఎంబ్రాయిడరీ చేసి ఉన్నది. ఆ యువతి తెలివితేటల్ని మెచ్చుకొన్నాను. ముఖం ప్రక్కకు త్రిప్పుకొని, రుమాలుని మడతపెట్టింది.

'పూనాలో దిగగానే, ఎవ్వరూ చూడకుండా నా వైపు చెయ్యి ఊపింది. కాని, మరుక్షణమే నా మత్తులోంచి మేల్కొన్నాను. నేను చేస్తున్న పనేమిటి. నా ఆనందముకోసం, ఒక వివాహితుని జీవితంలో చిచ్చుపెట్టుతున్నాను. నన్ను నేను నిందించుకున్నాను. 'హలీమా' నా మనస్సులోనుండి దూరంగా వెళ్ళిపోయింది!

కర్తార్‌సింగ్ కథ చెప్పటం ఆపాడు. ఇంతవరకు తమాషా కథని వింటున్న నాలో, కర్తార్‌సింగ్‌మీద గౌరవము, అభిమానము కలిగింది. మళ్లీ మామూలు ప్రస్తావనకు వస్తూ, నేను, 'ఇటుచూడు సర్దార్జీ! నీవేమీ విచారించవద్దు. నేను రేపు బొంబాయి వెళ్తున్నాను. మళ్లీ వారం రోజులలో వచ్చేస్తాను. నీ తరఫున అక్కడ విచారిస్తాను. కర్‌సందాస్‌భాయ్ రాసిన ఉత్తరాలు ఇంకేమైనా ఉన్నాయా?' అన్నాను.

కర్తార్‌సింగ్ కళ్ళు కృతజ్ఞతతో ప్రకాశించాయి.

'మీకు ఇక అట్టే శ్రమ ఇవ్వటం ఇష్టములేదు జనాబ్' అంటూనే, కోటుజేబులోంచి కొన్ని ఉత్తరాలు తీసి, నా చేతిలో పెట్టాడు.

'ఇవిగోసండి!'

నేను వాటిని చదివాను. అన్నీ అనాథ స్త్రీ శరణాలయాలకు వ్రాసినవే. సర్దార్జీ కోరికలు సామాన్యమైనవే. వధువుకు అందమూ యౌవనము ఉండాలని కోరలేదు. దైవముమీద నమ్మకముండి, గుట్టుగా సంసారము చేయుగల. సాధారణ యువతి మాత్రమే కావాలని కోరుకున్నాడు.

'నాకంతా అర్థమయింది సర్దార్జీ! బొంబాయిలో నీకు తగిన స్త్రీకోసము ప్రయత్నము చేస్తాను' అన్నాను. మళ్ళీ వారం రోజుల తర్వాత లోనవ్లా మార్కెటులో సాయంకాలము కల్సుకోడానికి నిశ్చయించుకొన్నాము. నన్ను ఎంతగానో అభినందనచేసి వెళ్ళిపోయాడు. ఇంత రాత్రయినా రాకపోయేసరికి, ఇంట్లోవాళ్ళు గాభరా పడుతూంటారని నేనూ వడివడిగా ఇంటికొచ్చేశాను.

* * *

లనుకొన్నట్లుగా మర్నాడు బొంబాయి వచ్చేశాను. తలమునకలయే పనుల్లో ఇట్టే రోజులు గడచిపోయాయి. అనుకోనివిధంగా ఇంకా బొంబాయిలో చాలా రోజులు ఉండవలసి వచ్చింది. లోనవ్లా తిరిగివెళ్లటమనేది సాధ్యపడలేదుకదా. మావాళ్లనే బొంబాయికి రప్పించవలసి వచ్చింది. నా పనిలో నేను, కర్తార్‌సింగ్ విషయమే పూర్తిగా మరచిపోయాను. కొన్ని నెలలతర్వాత పని కొంత తేలికయిన పిమ్మట ఆ విషయము జ్ఞాపకము వచ్చింది. మళ్లీ పనిలో దాన్ని మరచిపోయాను. కాలము గడచిపోయింది. గాని, అతని కే సహాయము చేయలేకపోయాను.

కొన్ని నెలలతర్వాత మళ్ళీ లోనవ్లా రాగలిగేను. అక్కడి ప్రశాంత వాతావరణం, స్వచ్ఛమైన కొండమీదగాలి నాకు క్రొత్త శక్తిని ఇచ్చినై. మళ్లీ పూర్వస్మృతులు జ్ఞప్తికి వచ్చినై. కర్తార్‌సింగ్ జ్ఞాపకమురాగానే, ఏదో అపరాధము చేసినవాడిలాగ ఫీలయ్యాను. అతనికేపాటి సహాయము చేయకపోగా, నానిస్సహాయతను, కనీసం అతనికి తెల్పలేకపోయాను. బహుశా కర్తార్‌సింగుకు ఈ కాలంలో వివాహమై ఉండదా? లేక ఉద్యోగంపోయి, లోనవ్లా వదిలేసి వెళ్ళిపోయాడా?— ఏవో ప్రశ్నలు నాలో ఉదయించాయి. నా అనుమానాలకు, ఒక సాయంకాలము మార్కెట్ ప్లేసుకు వెళ్తే జవాబు దొరుకుతుంది. కర్తార్‌సింగును కల్సుకొనే శక్తి నాలో లేదు. ఏదో తప్పుచేసినవాడిలాగ ఫీలయ్యాను. అసలు మార్కెట్ వీధికి, సాయంకాలము తరచు వెళ్లటమే మానేశాను. కాని, ఇంత జాగ్రత్తగా మసలుతూఉన్నా, కర్తార్‌సింగ్ నాకోమారు తటస్థపడ్డాడు. ఒకనాటి సాయంత్రము, వాహ్యాళి నుండి ఇంటికి వస్తున్న మయంలో ఎవ్వరో నన్ను పోస్టాఫీసు నుండి పిలుస్తున్నారు. నేను వెనక్కు తిరిగి అటు చూశాను. కర్తార్‌సింగ్ అదే రెస్టారెంట్ గుమ్మంలో నుంచుని, గొంతెత్తి ఏదో తింటూన్న నోటితోనే పిలుస్తున్నాడు.

'ఓ జనాబ్! ఓ హుజూర్!' అని. నేను గబగబా వెళ్ళి, అతని చేతులు నా చేతుల్లోకి ఆప్యాయంగా తీసుకొని, ''ఎలా ఉన్నావ్ కర్తార్‌సింగ్, క్షేమమా!'' అన్నాను.

'కూర్చోండి సేఠ్ సాహెబ్. ఎప్పుడొచ్చారు.' టీ ఆర్డర్ చేశాడు. నేను ఏ సహాయము చేయనిదానికి క్షమించమన్నాను.

''ఏం ఫరవాలేదు. మీరేమీ విచారించకండి!' కొన్ని క్షణాల తర్వాత సర్దార్జీ! పెళ్ళి చేసుకొన్నావా?'' అని అడిగాను. విషాదం అతని ముఖాన్ని ఆవహించింది.

'నన్నెవరు పెళ్ళిచేసుకొంటారండి! అందరికి డబ్బు కావాలి. డబ్బు! వేడిగా నిట్టూర్చేడు.

'ఏమయిందేమిటి. అంత నిరుత్సాహపడతావెందుకు?'

# గ గ న కు సు మ ము

'మీ రెళ్ళిపోగానే, రోజూ మీ దగ్గరనుండి ఉత్తరంకోసం చూసేవాణ్ణి. నెలరోజులయినా ఏ ఉత్తరమూలేదు. మెమ్‌సాబ్ పెళ్ళాన్ని చూపించమని మరీ ఒత్తిడి చేయసాగింది. నేను నిజం చెప్పనా సేట్‌సాబ్! మొదట వివాహమంటే అంతగా పట్టించుకొనేవాణ్ణికాదు. కాని, నే నీ ప్రయత్నము చేయుటం మొదలు పెట్టినప్పటినుండి భార్య, పిల్లలు, ఇంటికోసం మరీ ఇదిగా అనుకోవటం మొదలుపెట్టాను. భార్యకోసం తహతహలాడిపోయాను. భార్యా, పిల్లలు, సంసారం లేకుండా నేనెందుకు నా ఈ అమూల్యమైన యౌవనాన్ని నిస్సారంగా గడపాలి! నేను చేసిన పాపమేమిటి! స్త్రీయొక్క శరీర లాలిత్యము, మధురమైన కంఠస్వరము, ఆమె నడకలోని వయ్యారము, ఆమె అనురాగపుటానందము—ఇవన్నీ నా కన్నుముందు నాట్యము చేసినై. మెమ్‌సాబ్‌కు చూపించడానికి కాకపోయినా, నా ఉద్యోగం పోయినాసరే, నేను వివాహితుణ్ణి అవాలి అని నిశ్చయించుకొన్నాను. కాని, కనుచూపు మేరలో వివాహమయ్యేయోగము నాకు కన్పట్టలేదు. రోజులు గడిచినకొద్దీ, నా ఆశ మరింత గాఢతరమయింది. చివరకు నేనే బొంబాయి వెళ్లాను. అంత పెద్ద నగరంలో ఆ శరణాలయాల్ని కనుక్కోవటంలో మొదటిసారిగ వెళ్ళిన నాకు తలప్రాణము తోకకు వచ్చింది. చివరకు ఆ మేనేజర్లను కల్సుకొన్నాను. ఒక్క సత్యాన్ని గ్రహించాను. నాలాంటివాడు పెళ్ళి చేసుకోవాలంటే మర్యాద, గుణము, నడవడిక—ఇవి చాలవు. డబ్బే ముఖ్యము' అతను చేదుగా నవ్వేడు. నేను నిశ్శబ్దంగా వింటున్నాను. మళ్ళీ చెప్పడం ప్రారంభించాడు.

'కొన్ని సందర్భాల్లో హిందూ స్త్రీలు శిక్కు మతస్థుని పెళ్ళి చేసుకోవటానికి ఒప్పుకోలేదు. కొన్ని సందర్భాల్లో హిందూ స్త్రీలు ఒప్పుకొన్నా, ఆ మేనేజర్లు పడనివ్వలేదు. నేను కొంత డబ్బు ఆ స్త్రీ పేరిట బ్యాంకులోగాని, ఆ శరణాలయములోగాని ఉంచాలట. డబ్బెక్కడనుండి తేను! అక్కడితో ఆ సంగతి వదిలేశాను. అయితే మరో రెండు మూడు సందర్భాల్లో డబ్బు ప్రసక్తి రాలేదు. కాని, ఆ స్త్రీలు అంత పెళ్లాడతగినవాళ్లుకాదు.

'కర్తార్‌సింగ్!' మధ్యలో ఆపాను నేను. "మరి నీకు అందము, వయస్సు అంత ప్రధానమైన సమస్యలు కాదుగా."

"అవునవును. ఇప్పటికీ అదే అంటాను. కాని, నాకు మర్యాద, నీతి, నియమముగల భార్య కావాలి. ఆ స్త్రీల నడవడిక అంత మంచిదికాదు. శీలము చెడి, భర్తలచే పరిత్యజింపబడ్డవారు. అలాంటి స్త్రీలను పెళ్లాడి నే నే ఆనందాన్ని అనుభవించగలను?'

'అయితే పెళ్లి విషయము పూర్తిగా వదిలేశావా?' ప్రశ్నించాను నేను.

'అదేమిటో తెలియదుగాని, ఒక్క విషయముమట్టుకి నిశ్చయం.'

'ఏమిటది?'

'నే నీ ఉద్యోగం వదిలేయటం మంచిది'

'ఎందువల్ల'

'ఎన్నాళ్ళ మెమ్‌సాబ్‌ను బుకాయించగలను? ఎన్ని అబద్ధాలు సృష్టించగలను. నా భార్య పంజాబ్‌లో పుట్టింటికి వెళ్లిందని చెప్పాను. కాని, ఎల్లకాలము నా భార్య అక్కడే ఉంటుందంటే మెమ్‌సాబ్ నమ్ముతుందా?'

అది నిజమే మరి! నాలో ఏదో సలహా తళుక్కున మెరసింది.

'ఇలా చూడు. కర్తార్‌సింగ్! నాకో అయిడియా తట్టింది. నీవు చెప్పింది నిజమే. ఇలా ఎంతకాలము, అబద్ధాలు సృష్టించగలవు? నేను చెప్పినట్లు చెయ్యి. నీవు పెళ్లాన్ని పంజాబ్‌నుండి తీసుకు రావటానికి రెండు నెలలు సెలవు ఇవ్వమని మీ మెమ్‌సాబ్‌ను అడుగు.'

'తర్వాత?' ఆతృతగా అడిగాడు.

'తర్వాత పంజాబుకెళ్ళి, నీకు తగిన స్త్రీకోసం ప్రయత్నించు.'

'ప్రయత్నము విఫలమయితే'

'అప్పటికి సులభమే' ఉత్సాహంగా చెప్పుకుపోయాను.

'నీవు బయల్దేరేటప్పుడు నీ పెళ్లానికి జబ్బు చేసిందని, జబ్బు మనిషిని పంపటానికి ఆమె తల్లిదండ్రులు ఒప్పుకోలేదని చెప్పు. ఇలా కొన్ని నెలలు గడచిపోతాయి. ఈలోగా నీ వివాహప్రయత్నంలో నీకు విజయము చేకూరకుండ ఉంటుందా!'

'నిజం! మీరు చెప్పినది సబబుగాఉంది' అతనిలో ఉత్సాహము పెరిగింది! ఈ సంవత్సరంలో, ఈ భూప్రపంచంమీద నాకు తగిన భార్య తటస్థపడదా?- ఆమె లేనిదే ఒక్క క్షణం ఉండలేను. నన్ను దూరంచేసి, నా కాబోయే భార్య ఎక్కడ ఉండగలదు? ఎంతకాలం ఉండగలదు? పంజాబ్‌లో అమ్మాయిలకు కొదవేమీలేదూ! చిరునవ్వు ముఖమ్మీద ప్రకాశించింది.

నాల్గురోజుల తర్వాత కర్తార్‌సింగ్, పంజాబ్‌కు బయల్దేరాడు. నేను స్టేషనుకు వచ్చాను. కర్తార్‌సింగ్! నీ యత్నంలో నీకు పూర్తి విజయము చేకూరుతుందని ఆశిస్తాను' అన్నాను. గంభీరంగా అన్నాడు: 'ఈమారు నా ప్రయత్నము విఫలమయితే, నే నిక జీవించలేను. ఒంటరితనమిక గడపలేను.'

'ఏమీ విచారించకు సర్దార్జీ! పరాజయమేమిటి. అదృష్టం నిన్ను వరిస్తుంది తప్పక''. బండి కదిలింది.

*    *    *

కొన్ని నెలలు గడచిపోయాయి. అప్పుడప్పుడు కర్తార్ సింగ్ జ్ఞాపకము వచ్చేవాడు. నాకు అతన్ని కల్సుకోవాలని ఆత్రుత హెచ్చింది. మళ్లీ కొన్నాళ్ళకు లోనావ్లా వచ్చి రాగానే కర్తార్‌సింగ్ కోసం వెదికాను. ఆరోజు సాయంత్రము మార్కెట్‌వీధిలో కల్సుకొన్నాను. మనిషి అంత ఉత్సాహంగా కనబడలేదు. ఇద్దరం కలిసి రెస్టారెంట్‌వైపుకు బయల్దేరాము. కొన్ని నిముషాలతర్వాత విచారంగా అన్నాడు :

''ఫలితమేమీ కన్పించలేదు, జనాబ్'' నేను ఏ సమాధానం చెప్పటానికీ తోచలేదు. అతనిలోని విచారమే నన్నూ అవహించింది. ఇద్దరం రెస్టారెంటులోకి వెళ్ళి కూర్చున్నాము.

'నేను పంజాబుకు వెళ్ళి చేసిన ప్రయత్నాలన్నీ విఫలమయినాయి. తిరిగి లోనావ్లా వచ్చేశాను. మీరు చెప్పినట్లే మెమ్‌సాబ్‌కు చెప్పాను. ఆమె చాలా బాధపడింది. భార్య జబ్బును కుదుర్చుకోడానికి డబ్బు ఇవ్వబోయింది. ఇప్పటికే చేసిన ద్రోహాలు చాలవా! డబ్బు తీసుకోవడానికి మనస్కరించలేదు. ఇంకో రెండు నెలలకు నా భార్య తిరిగీ వచ్చేస్తుందన్నాను.

మరో మూణ్నెల్లకు మళ్లీ అబద్ధమాడాల్సి వచ్చింది. నా భార్య కడుపుతోఉందని, అలాంటిస్థితిలో వారు పంపరని మెమ్‌సాబ్‌కు చెప్పాను. మెమ్‌సాబ్ చాలా సంతోషించింది. ఆమె బహు దొడ్డమనిషి. మానవుల్లో ఇంత మంచివారుంటారా అని ఆశ్చర్యపోయాను. ''కర్తార్‌సింగ్! నీ భార్య అక్కడ ఉండటమే మంచిది. నీ భార్య అక్కడే ప్రసవించడం మంచిది. నీ బిడ్డకు మంచి చదువు చెప్పిస్తాం'', అన్నది.

మెమ్‌సాబ్, నేను నా పెళ్లానికి రాసే ఉత్తరంలో నా భార్య ఫలానా పనులు చేయాలని, ఫలానివి చేయకూడదని రాయమని సలహాలిచ్చేది. ఇలా ఉంది ప్రస్తుతం నా పరిస్థితి. నా ఉద్యోగాని కిక ఢోకా లేదు.''

'సరే బాగుందిప్పుడు. తర్వాత ఏం చేస్తావ్?' అనడిగేను. సర్దార్జీ మళ్లీ విచారగ్రస్తుడయ్యాడు. ఇంకేం చెయ్యను. కొన్ని క్షణాల తర్వాత బాధతో అన్నాడు 'నిజం చెప్పనా హుజూర్. నా కోరికలు, నేను పెళ్ళిచేసుకోవాలన్న కాంక్ష అన్నీ అంతరించిపోయాయి.'

సర్దార్జీ 'అంతము' అన్నమాట వినగానే నాకో ఊహ తట్టింది.

ఓపని చెయ్యి కర్తార్‌సింగ్. నీ భార్య ప్రసవిస్తూ, చనిపోయిందని మెమ్‌సాబుకు చెప్పు'

కొన్ని నిముషాలు కర్తార్‌సింగ్ తలవంచుకొని ఏదో ఆలోచనలతో నిశ్శబ్దంగా ఉండిపోయాడు. నేను చెప్పింది విన్నట్లు అగుపించలేదు. అతన్ని ఆ స్థితిలో పలకరించటానికి మనసొప్పలేదు.

అతని పెదాలు కొద్దిగా కదిలి మళ్లీ మూసుకొన్నాయి. ఏదో నిర్ణయానికి వస్తున్నట్లనిపించింది. చివరకు నా ముఖంలోకి చూశాడు. విపరీతమైన బాధతో, భయంకరముగాఉన్న అతన్ని ముఖాముఖి చూడలేక నా ముఖము ప్రక్కకు తిప్పుకొన్నాను. బాధతో నిండిన కంఠస్వరంతో అన్నాడు:

'జనాబ్! మీరు నిజం చెప్పారు. నా భార్య నిజంగా ఇప్పుడు చనిపోయింది' అతని కంఠంలోని నిస్పృహ, విరక్తి నన్ను ఎంతగానో బాధపెట్టాయి. నేను తిరిగి అతనివైపు చూడగానే అతను కుర్చీలోంచి లేచి, 'నిజంగా నా భార్య మరణించింది,' మళ్లీ అని మెల్లిగా బయటకు వెళ్లిపోయాడు. నా అంతరంగము అనంతమయిన శూన్యముతో నిండిపోయింది. నేనూ, అతని వెనకాలే బయటకు వచ్చేను. బయట నానుండి దూరమయ్యాడు. అతని అడుగులసవ్వడులు, అతను చివరన అన్న ముక్కలు—'నిజంగా నా భార్య మరణించింది'— పలుమార్లు నాలో ప్రతిధ్వనించాయి.

**[గుజరాతీ కథకు అనువాదం : సి. వి. ఎన్. రావు]**

# గురజాడ : షేక్స్పియరు

శ్రీ ఆర్. ఎస్. సుదర్శనం

లోకంలో ఒక అసాధారణ వ్యక్తినిగూర్చి అతన్నెరిగిన వాళ్లల్లో ఏర్పడే ఊహలూ, అభిప్రాయాలూ పరస్పరం విరుద్ధంగాను, భిన్నంగాను ఉండటం సాధ్యమే. దాని క్కారణం ఆ అభిప్రాయాలు ఎవరికివారే తను స్వభావాన్నిబట్టి ఏర్పరచుకునేవీ వాళ్ళకు ఆ వ్యక్తితో కలిగిన మనోగతమైన సంబంధాన్ని వ్యక్తం చేసేవీ కావటం ఒకటి. ఆ వ్యక్తిలో మనస్సును ఆకర్షిస్తూ, ఎప్పటికప్పుడు ఆలోచనను కల్పించే అసాధారణమైన చైతన్యం ఉండటం రెండవది. సాహిత్యలోకంలో షేక్స్పియరు సృష్టించిన ఫాల్‌స్టాఫ్, హేమ్లెట్, ఇయాగో, క్లియోపాత్రా ఇలా అసాధారణులై, అజరామరులైన చైతన్యమూర్తులు. గురజాడ మహాకవి 'కన్యాశుల్కం'లోని గిరీశం, మధురవాణి ఆ కోవకు చెందినవాళ్లే. క్రొత్త విషయాలు నేర్చుకుంటూ, మనలో జీవితానుభవం జ్ఞానం, వృద్ధి పొందినకొద్దీ సాహిత్యలోకంలోని పై చెప్పిన పాత్రలు క్రొత్తగా మళ్లీ మళ్లీ అర్థం అవుతూఉంటారు. ఎంత తరచినా, తరగని వ్యక్తిత్వసంపద వీళ్ల సొమ్ము. ఒక సూత్రానికీ, సిద్ధాంతానికీ కట్టుబడని వైవిధ్యం, ఆలోచనయొక్క గుప్పిట్లో ఇముడని చైతన్యంఉంది వీళ్లలో.

జీవితాన్ని పరిపూర్ణంగా అనుభవించేందుకు తన్మయీభావం ఎంత ముఖ్యమో, హాస్యదృష్టి అంతేముఖ్యం అని గుర్తించినవారు గురజాడ. వస్తువుతో ఐక్యం అయితేగాని జీవితంలో 'లోతు' తెలీదు. వస్తువుకు కాస్త దూరంగాఉండి చిరునవ్వుతో అవలోకిస్తేగాని జీవితంలో 'విజయం' చేకూరదు. ఒకదాని స్వరూపం, కార్యకారణ సంబంధాల్లో దాని స్థానం, ప్రయోజనం, ఎడంగావుండిచూస్తేగాని అవగతంకాదు. "మానవుడు స్తబ్ధుడుకాడు, చైతన్యవంతుడు. ఆలోచనాశూన్యుడుకాడు, హేతువాది. అతని స్వభావంలో ఈ రెండు లక్షణాలు సమ్మిశ్రితమై ఉన్నాయి......ఇంద్రియాలూ, అనుభవమూ మనకు సంపాదించిపెట్టిన విషయాలను మేధ వివేచిస్తుంది. సిగ్గు తెలుస్తుంది, ఇంకొకదానితో అనుసంధానింపచేస్తుంది, అన్వయిస్తుంది పెంపొందింపచేస్తుంది......" అంటూ అనుభవమూ, ఆలోచనా, అనే రెండింటిలో ఏ ఒక్కదానివైపూ మొగ్గు చూపకుండా సత్యాన్వేషణ చేయాలని గురజాడ 'తాత్త్విక చింతన' అనే వ్యాసంలో సూచించారు. శృంగారరసానికి తన్మయీభావం ఎలా ముఖ్యమో, హాస్యరసానికి నిర్లిప్తత అలా ముఖ్యం. జీవితంపట్ల ఆసక్తీ, నిర్లిప్తతా, రెండూ సమీకరణ చెందిన దృష్టిని ఏర్పరచుకోవటమే స్థితప్రజ్ఞుని లక్షణం. ఈ దృష్టిగల కవే ఋషియైన మహాకవి. నానృషిః కురుతే కావ్యమ్.

తెలుగు కావ్యాల్లో శృంగార రసానుభూతికే ప్రధానస్థానం ఇవ్వబడినట్లూ, హాస్యానికి జీవితానుభవం దృష్ట్యా ఏ ఉన్నతస్థానం చెందవలెనో ఆ స్థానం లేకపోయినట్లూ గురజాడకు తోచింది. తెలుగులో హాస్యమంటే: విదూషకుని భోజన ప్రియత్వమో, అశ్లీల శృంగారమో, కేవలం 'బఫూనరీ'యో తప్ప ఇంకేమీ కనిపించదు అన్నారు. గురజాడ ఒక లేఖలో 1 హాస్యానికీ, జీవితంపట్ల సాత్త్విక దృష్టికీ ఎంత సన్నిహిత సంబంధంఉందో సాహిత్యంలో మనం గుర్తింపలేకపోయామనే ఆయన అభిప్రాయం. కాని, హాస్యరసానికి ప్రాధాన్యతఇస్తూ, నాటకం వ్రాయడం అంటే జీవితాన్ని హేళన చెయ్యటం మాత్రం కాదని స్పష్టం చేశారు ఒక చోట. (2): "మానవ జీవితంతో నేను చెలగాటం ఆడడంలేనేలేదు......ఎట్టి తృణీకారభావమూ లేకుండా మానవ జీవితాన్ని గంభీరమైన దానినిగా భావించి, ఈ నాటకంలో దానిని ఇతివృత్తంగా స్వీకరించాను. ఆద్యంతం నవ్వు తొణికిసలాడేటట్లు ఇంత గంభీర ఇతివృత్తాన్ని నిర్వహించడం అంత తేలికైనపని కాదు"......(3) "కన్యాశుల్కం నాటకం పిలవని పేరంటానికి 'మా అప్పసట్టు చీరె కట్టుకొస్తా'నని బయలుదేరి ఏదో నైతికోద్దేశాన్ని ప్రత్యక్షంగా, బలవంతంగా నెత్తిన రుద్దదు. కాని, దానికి ఒక మహత్తరమైన నైతిక ప్రయోజనంఉంది" కావ్యంలో నైతికప్రయోజనం కంటిలో నలుసులా కాకుండా, కంటికి కాటుకలా ఉండాలని గురజాడ అభిప్రాయం.

గురజాడకు షేక్స్పియరు నాటకాల్లోని ఉత్తమ హాస్యం వరవడి. (4) "నాలుగవ హెన్రీ, అయిదవ హెన్రీ, మెర్రీవైవ్స్ అనే నాటకాల్లో తటస్థపడే డాల్ టేర్ షీట్, డేమ్‌క్విక్లీ మొదలైన పాత్రలు సర్ జాన్ ఫాల్‌స్టాఫ్‌తో ఒకకూటమిగా ఏర్పడి,

1. 2 జూన్ 1909—శ్రీ ముని సుబ్రహ్మణ్యం గారికి వ్రాసిన లేఖలో శ్రీ వేదంవారి 'ఉషా' నాటకాన్నిగూర్చి ప్రసంగిస్తూ.

2. 3., 4.

ఎంతో ఆసక్తిని కలిగిస్తాయి. ఈ పాత్రలలో ఏదీ ఉజ్జ్వల నైతికశక్తి కలదికాదు. వీరిలో ఎవరికీ మర్యాదా మప్పితమూ ఉన్నట్లు కనిపించదు. కాని, అవినీతిపరుడూ, కుటిలుడూఅయిన ఫాల్‌స్టాఫ్, షేక్స్‌పియరు పద్ధతి హాస్యానికి శిఖరాగ్రంవలె ప్రాతినిధ్యం వహిస్తున్నాడు......" అని గురజాడవారే సూచించారు. పరిక్షించిచూస్తే ఫాల్‌స్టాఫ్—గిరీశం, డాల్ టేర్ షీట్—మధురవాణి. డేవ్‌క్విళక్లీ—పూటకూళ్లమ్మ జంటలు గురజాడమీద షేక్స్‌పియరు ప్రభావం ఏవిధంగా పని చేసిందో స్పష్టం చేస్తాయి. 'కన్యాశుల్కం' మొదటి కూర్పులో మధురవాణీపాత్రకు డాల్ టేర్ షీట్‌తో ఒక ఛాయామాత్రపు సంబంధం ఉండేది. రెండవ కూర్పులో మధురవాణి పాత్రను గురజాడ క్రొత్తగా, అపూర్వంగా తీర్చిదిద్దటంతో ఆ సంబంధం పూర్తిగా పోయింది. (5) "కన్యాశుల్కం మొదటికూర్పులో మధురవాణి వర్ణింపరాని హేయమైన నడవడిక గలది. ఆ పాత్రకు ఎట్టి వన్నెచిన్నెలూ లేవు. నాటకం రచిస్తున్నకొద్దీ మధురవాణిపాత్రమీద నాకున్న దృక్పథం మారుతూ వచ్చింది." మధురవాణి సృష్టి గురజాడవారి మనీషకు (Genius) తార్కాణ. ఆమెకు షేక్స్‌పియరు నాటకాల్లో ఏ వ్యక్తితోనూ ఎలాటి సంబంధమూలేదు.

పోతే, గిరీశం ఫాల్‌స్టాఫ్‌లమధ్య తెలుగు దేశానికీ, ఇంగ్లండుకూ ఉన్నంతదూరం ఎలాగూ ఉండనేఉంది. అంతేకాదు. కేవలం వ్యక్తులుగా కూడా—రూపు రేఖల్లో, వయస్సులో అభిరుచుల్లో, వాగ్ధోరణిలో—వాళ్ళకు సామ్యమే కనిపించదు. గిరీశం నాగరకవేషమూ (బెంగాలీబాబులా) ఆకర్షణీయంగా, అవయవ సౌష్ఠవమూ కలిగిన పాతికేళ్ళలోపు యువకుడు. ఫాల్‌స్టాఫ్ చూడగానే నవ్వు పుట్టించే లావుపాటి మనిషి, వయసు మీరినవాడు. గిరీశానికి స్త్రీ సౌందర్యంమీద ప్రత్యేకమైన అభిరుచి ఉంది. ఫాల్‌స్టాఫ్‌కు సౌందర్యంమీద పట్టింపుఉండే వయస్సు ఎన్నడో దాటిపోయింది. మిగిలింది స్త్రీవాంఛ మాత్రమే. గిరీశం వూహాల్లో మాటల్లో కవిత్వపు వాసనలు, తియ్యని కల్పనలు తొంగిచూస్తాయి. ఫాల్‌స్టాఫ్ మాటల్లో మంచి చమత్కారం ఉంటుందికాని, అతని కల్పన కేవలం సమయస్ఫూర్తి. ఫాల్‌స్టాఫ్ వాగ్ధోరణిలోని చమత్కారం బాగా పరిణతిచెందింది, ప్రజ్ఞావంతమైనది. గిరీశానికి అంత మెలకువ, ప్రజ్ఞ ఇంకా రాలేదు. ఫాల్‌స్టాఫ్ త్రాగుడులేకపోతే ఒక్క క్షణం ఉండలేడు. గిరీశానికి చుట్టతప్ప త్రాగుడు అలవాటైనట్లులేదు—ఇలా ఉన్నవళంగా పైకి ఎంత సామ్యం లేకపోయినా, పాతికేళ్ల గిరీశానికి కూడా యాభై, యాభైయియిదేళ్ల వయస్సు వచ్చేటప్పటికి బహుశా ఫాల్‌స్టాఫ్‌లా తయారవుతాడనే వూహ మాత్రం తప్పనిసరిగా వస్తుంది. ఇద్దరినీ పోల్చిచూస్తే, ఇద్దరిలోనూ మూలపదార్థం, ఆత్మ, జీవితంపట్ల తాత్త్వికదృష్టి (హాస్యదృష్టి) ఒక్కటే. మహాకవి గురజాడ ఫాల్‌స్టాఫ్‌కు ఒక ఛాయనో, ఒక కంచు విగ్రహాన్నో కల్పించలేదు. ఫాల్‌స్టాఫ్‌యొక్క ఆత్మకే పునర్జన్మ ప్రసాదించి, ఒక నూత్న వ్యక్తిగా తెలుగు సాహిత్యంలో సృష్టించారు. గురజాడవారి మనీష, షేక్స్‌పియరు మనీషతో ఐక్యమైంది అనటాని కిదే ఋజువు.

ఫాల్‌స్టాఫ్ వ్యక్తిత్వానికి 18, 19 శతాబ్దాల్లో కూడా షేక్స్‌పియరు విమర్శనములో సరియైన వ్యాఖ్య ఏర్పడనేలేదు. ఫాల్‌స్టాఫ్ మొదటినుంచీ అందరిదృష్టినీ ఆకర్షించినా సమస్యగానే ఉండేవాడు. అతనిప్రవర్తనలో ఉదాత్తత, నైతికాదర్శం శూన్యం. అటువంటి వ్యక్తిని, మన మధ్య సమాజంలోఉంటే, గౌరవించలేము సరికదా దగ్గరకు కూడా రానివ్వము. ఏమంటే అతని చమత్కారమూ, హాస్యమూ మనల్ని మోసగించి బాధించవచ్చు. ఇలా నిత్య జీవితంలో మనం ఏవిధంగానూ హర్షించలేని ప్రవర్తన కలిగిన వ్యక్తి, నాటకరంగంమీద, సాహిత్యలోకంలో అధికంగా రంజిస్తూ, ప్రీతిపాత్రుడు కావటానికి కారణమేమిటి? అతని దోషాల్ని మనం లెక్కించకపోవటం ఎందుచేత? అంటూ మీమాంసచేసి, సాహిత్యలోకంలోనివాడై ఆ వ్యక్తి మనకు కాస్త దూరంగా ఉండటమే అందుకు కారణమనీ, యథార్థలోకంలో మనం చూచే విలువలు వేరు, సాహిత్యలోకంలో మనం చూచే విలువలువేరు అనీ నిర్ణయించారు కొందరు విమర్శకులు. ఈ తీర్పుని ఖండిస్తూ, మారిస్ మార్గన్ అనే రచయిత, ఫాల్‌స్టావ్‌లో మానవత్వం మంచితనం ఉన్నాయనీ, అతనిలో కనిపించే లోపాలు తర్కిస్తే, ఘోరమైన లోపాలు కావనీ సహేతుకంగా ఋజువులు చూపిస్తూ, ఒక దీర్ఘమైన వ్యాసం వ్రాశాడు. కాని, దీని నెవరూ పట్టించుకోలేదు. 1909 లో మారిస్‌మార్గన్ వ్యాసాన్ని చాలవరకు బలపరుస్తూ, ఫాల్‌స్టాఫ్ మూలతత్త్వ మెటువంటిదో తృప్తికరంగా వివరించాడు ప్రొఫెసర్ బ్రాడ్లే. 6 ఇంగ్లీషు సాహిత్య విమర్శనంలో ఇంతటి దీర్ఘ చరిత్రగల ఫాల్‌స్టావ్‌ని, అతని అసాధారణ వ్యక్తిత్వాన్ని 'అనుసరించి' కల్పన చెయ్యటం ఎవరికి సాధ్యం? 7 అది సాధ్యంకానిపని అన్నాడు డాక్టర్ జాన్‌సన్. మరి అతని ఆత్మకు పునర్జన్మ ప్రసాదిస్తూ,

---

5, 21 మే 1909 శ్రీ ముని సుబ్రహ్మణ్యంగారికి వ్రాసిన లేఖనుంచి.

6. The Rejection of Falstaff: Oxford Lectures on Poetry by A. C. Bradley గురజాడవారు 'కన్యాశుల్కం వ్రాసే కాలానికి ఈ పుస్తకం రాలేదు.

7. "Unimitated, inimitable Falstaff, how shall 1 deseribc thee?"

Dr. Johnson.

మరొక జాతి సాహిత్యంలో శాశ్వతస్థానం కల్పించటం సామాన్య విషయమా? ఆ కీర్తి గురజాడవారికే దక్కింది. ఇటువంటి అపూర్వమైన సంగతి విశ్వసాహిత్యంలో ఇంకొకచోట ఉందని కూడా నేను నమ్మను.

## 2

గురజాడ 'కన్యాశుల్కం' నాటకాన్ని ప్రారంభించి మొదటి రంగం వ్రాస్తున్నప్పుడు వారి మనస్సులో లీలగా 'హెన్రీ IV–2 వ భాగము' నాటకంలో ఫాల్స్టాఫ్ ప్రవేశించే అంకం 1, రంగం 2, జ్ఞాపకం ఉందని మాత్రమే క్రింది పరిశీలనవలన తెలుస్తుంది. తర్వాత నాటకంలో ఎక్కడా ఈ మాత్రపు స్మృతిచ్ఛాయ కూడా లేదు. గిరీశం స్వగతాలు, సంభాషణలు, పాత్రోన్మీలనము షేక్స్పియరు సంప్రదాయాన్ని అనుసరించినవికాని, షేక్స్పియరు రచనలో ఏ భాగానికీ దూరంగా కూడా అనుసరణ అని చెప్పటానికి వీల్లేదు.

ఫాల్స్టాఫ్ తన పేజ్ (సేవకుడైన పిల్లవాడు)తో మాట్లాడుతూఉంటాడు. ఇంతలో లార్డ్ చీఫ్ జస్టిస్ (ప్రధాన న్యాయాధికారి) తన బంట్రోతుతో ఆ దారిన వస్తాడు. ఫాల్స్టాఫ్ ముఖం తప్పిస్తాడు. కారణం, పూర్వం బాటసారులని దోచుకొన్న నేరమొకటి ఫాల్స్టాఫ్మీద ఉంది. కాని, మధ్యకాలంలో యుద్ధంలో రాజుకు తోడ్పడినందువల్ల ఆ నేరాన్ని ప్రభుత్వం క్షమించినట్లే— ఆ సంగతి ఫాల్స్టాఫ్కు తెలీకపోవటంతో చీఫ్ జస్టిస్నుంచి గౌరవంగా తప్పించుకోవాలని ప్రయత్నం—చీఫ్ జస్టిస్ తన బంట్రోతుతో ఫాల్స్టాఫ్ని రమ్మని కబురుపెట్టుతాడు. ఫాల్స్టాఫ్ పేజుతో తనకు చెవుడని బంట్రోతుకు చెప్పిస్తాడు. చీఫ్జస్టిస్ మళ్లీ బంట్రోతుతో, "అలాకాదు, వెళ్లి చెయ్యి పట్టుకుని తీసుకురా, నేను మాట్లాడాలి అతనితో" అంటాడు. బంట్రోతు ఫాల్స్టాఫ్ని సమీపించి, అతన్ని చేత్తో స్పృశిస్తూ, "సర్ జాన్" అంటాడు. ప్రాధేయ పూర్వకంగా రమ్మని సంజ్ఞచేస్తూ. ఫాల్స్టాఫ్: "ఏమిటోయ్, ప్రాయంలోఉన్నవాడివి నువ్వు అడుక్కు తినడమేమిటి? యుద్ధాలులేవా? ఉద్యోగాలకు కొరవా? రాజుకి సేవకులు కావద్దూ! లేకపోతే తిరుగుబాటుదార్లకి సైనికులు అక్కర్లేదా? రాజువైపు చేరకుండా అటువైపు చేరటం సిగ్గుచేటే లనుకో, కానీ, అడుక్కుతినటం మరింత సిగ్గుచేటుకదూ!......" అంటూ వాణ్ణి బిచ్చగాణ్ణిచేసి, దబాయిస్తూ, ఉపన్యాసం ప్రారంభిస్తాడు. ఇక వాడేం చెప్పినా ఫాల్స్టాఫ్తో గెలవలేడు. చివరకు చీఫ్ జస్టిస్ స్వయంగానే వస్తాడు. ఆయన్ని చూడగానే ఫాల్స్టాఫ్: "ఓహో తమరా! మారేళ్ళాయుస్సు! తమరిలా లేచి తిరుగుతున్నందుకు నాకెంతో సంతోషంగాఉంది. తమరు జబ్బు పడ్డారని విన్నాను. ఇప్పుడు డాక్టర్ల సలహా తీసుకునే ఇలా తిరుగుతున్నారుకద! తమరింకా యౌవనంలోనే ఉన్నారు. వయస్సు మళ్లలేదు. కానీ, ఇప్పుడిప్పుడే వయోభారం, దాని ప్రభావం కొంత సోకుతోంది! అదీ ఒక రకమైన ఆకర్షణీయలెండి! ఏమైనా ఆరోగ్యం విషయమై తమరు తప్పకుండా బహు జాగ్రత్తగా ఉండవలెనని ఈ సేవకుని విన్నపం!" అంటూ ప్రారంభిస్తాడు. కాస్తలో ఫాల్స్టాఫ్ ఎలా రంగులు మార్చాడో చూడండి—చెవుడు అనటం, బంట్రోతుని బిచ్చగాణ్ణిచేసి, దబాయించటం, చీఫ్జస్టిస్కి కోపం రాకుండా యోగక్షేమాలు వినయంగా, ఆప్యాయంగా (అందులో హాస్యం కొంత) విచారించటం.

'కన్యాశుల్కం' ప్రథమాంకం, ప్రథమరంగంలో గిరీశాన్ని డబ్బడగటానికి 'పూటీగరాప్పంతులు' బంట్రోతు వస్తాడు.

బంట్రోతు:—"ఎంతమందిని పంపినా ఇచ్చారు కారటండి నే వాళ్లలాగూరుకుండేవాణ్ణి కానండి.

గిరీ:—"అయ్య కోనేటికి తోవ ఇదే!"

బం:—"ఎక్కడి శెవిీటి మాలోకం వచ్చిందయ్యా."

గిరీ:—"కోవంటీ దుకాణవాఁ? కస్పాబజార్లోగాని, ఇటువేపు లేదు"......కాని బంట్రోతు అందరూ ఏనేటట్లు గట్టిగా "మీరూ సాన్ది కలిసి ఏసుకున్న పాటిగరాపుల కరీదు మా పంతులు నిలబెట్టి పుచ్చుకొమ్మన్నారు" అంటూ అరిచేటప్పటికి గిరీశం 'ప్లేటు' మార్చేస్తాడు.

గిరీశం:—"ఓహో! నీవటోయ్, ఎవరో అనుకున్నాను. నింపాదిగా మాట్లాడు, నింపాదిగా మాట్లాడు. రేపు ఉదయం ఎనిమిది గంటలకి పూటకూళ్లమ్మ ఇంటికివస్తే అణా పయిసల్తో సామ్మిచ్చేస్తాను. మీ పంతులికి స్నేహం, మంచీ, చెడ్డా అక్కర్లేదూ?"

బంట్రోతు:—మాటల్తో కార్యంలేదు. మొల్లో శెయ్యెట్టి నిల్చున్నపాట్నే పుచ్చుకొమ్మన్నారండి. గిరీశం మళ్లీ రంగు మారుస్తూ, "పెద్దమనిషివిగదా, నువ్వా తొందరపడ్డం మంచిదేనా? నీ తండ్రి ఎంత పెద్దమనిషి! ఈ చుట్ట చూడు ఎంత మజాగా కాల్తుందో. హవానా అంటారు దొర్లు దీన్ని. రేప్పొద్దున్నరా రెండు కట్టలిస్తాను."

బంట్రోతు:—"శిత్తం, సామ్ముమాటేం శలవండి."

గిరీ:—"చెప్పానుకానా? రేప్పొద్దున్న ఇవ్వకపోతే మాలవాడి కొడుకు చండాలుడు."

బం:—"మాలాడికొడుకు శండాలుడు కాకుంటే మరేటండి."

గిరీ:—"నీకు నమ్మకం చాలకపోతే ఇదిగో గాయత్రి పట్టుకు ప్రమాణం చేస్తాను."

అంతటితో బంట్రోతు నమ్మి వదిలిపెట్టుతాడు. ఇక్కడ గిరీశం—చెవుడని నటించటం, కొంతదబాయించటం తర్వాత పొగడటం, లంచం, ఆశపెట్టడం, చివరకు ఒట్టుగాని ఒట్టు వేసుకోవటం, గాయత్రిమీద ప్రమాణం చెయ్యటం—ఫాల్‌స్టాఫ్‌తో సామ్యం చూడవచ్చు.

ఒట్టుగాని ఒట్టు వేసుకుంటూ ఫాల్‌స్టాఫ్ కూడా అదే రంగంలో ఏమంటాడో చూడండి. "నా సర్ బిరుదమూ, నా యోధత్వమూ, ఆవలపెట్టి చెబుతున్నాను—నువ్వు పెద్దమనిషి అని నేనంటే, నేను పచ్చి అబద్ధాలకోరునే!" ఎవరైనా తన సర్ బిరుదు మీదనో, తన యోధత్వంమీదనో ఒట్టుపెట్టుకోవటం ఆనవాయితీ అయితే, అవి రెండూ తీసి ఆవలపెట్టి ఒట్టు పెట్టుకోవడమేమిటి? ఇది ఫాల్‌స్టాఫ్ చమత్కారపు హాస్యం. గిరీశంలో పోలిక చూడవచ్చు.

## 3

గిరీశం పాత్రలో హాస్యరసానుభూతి పొందాలంటే పాఠకుడు నీతి అనే కొలబద్దను తాత్కాలికంగానైనా అవతల పెట్టాలి. అప్పుడే గిరీశం మాటలు, సమయస్ఫూర్తి, అతను పొందే విజయాలు మనకు ఆహ్లాదకరంగా ఉంటాయి. **"The bliss of freedom gained in humour is the essence of Falstaff"** అని ప్రొ. బ్రాడ్లే ఫాల్‌స్టాఫ్‌ను గురించి చెప్పిన సూత్రమే గిరీశానికి వర్తిస్తుంది. హాస్యం ప్రసాదించే మానసికమైన స్వేచ్ఛ దానికి తాలూకు ఆహ్లాదమే ఫాల్‌స్టాఫ్ పాత్రలోని సారాంశం.

గిరీశం వ్యక్తిత్వంలో ప్రధానమైనది అతని హాస్యదృష్టి. దాని మూలాన్నే నిర్లిప్తంగా సమయస్ఫూర్తితో అతను వ్యవహరిస్తాడు. అతని ప్రవర్తనలో వ్యక్తమయ్యే స్వేచ్ఛా ప్రవృత్తిని గమనిస్తూ, మనం కూడా మానసికంగా ఆ స్వేచ్ఛను అనుభవిస్తాము. జీవితాన్ని ఎప్పటికప్పుడు ఎదుర్కొంటూ పైచేయిగా వ్యవహరించటం, ఓటమిని అంగీకరించకపోవటం గిరీశంయొక్క ప్రతిభ. అదే మనల్ని ముగ్ధుల్ని చేస్తుంది.

గిరీశానికి జీవితం అనుభోగ్యవస్తువు. భోగవస్తువులైన ఆడవాళ్లు, చుట్టలు, తిండివంటివి గిరీశం ప్రత్యేకమైన అభిరుచులతో ఎన్నిక చేస్తాడు. వేశ్యల్లో మధురవాణి, చుట్టల్లో హవానా, తినుబండారాల్లో కాశీ మిటాయి అతని కిష్టం. సాధ్యమైనంతలో అతని అభిరుచులు ఉత్తమశ్రేణికి చెందినవిగా ఉంటాయనటాని కిది నిదర్శనం. కాని, గిరీశం ఈ పట్టణవాసపు రుచులకు ఏమాత్రం దాసుడుకాడు. దాసుడై వాటికోసం పట్టణాన్ని వదులుకోలేక చిక్కుల్లోపడే గుణం గిరీశంలోలేదు. ఎప్పుడు పరిస్థితి చెయ్యిదాటిపోతూవుందో చప్పున గుర్తించగల నైశిత్యం ఉంది. అతని మేధాశక్తికి. అందుకే పట్టణంవిడిచి శిష్యునితో అగ్రహారం చేరుకుంటాడు. అక్కడ నాటురకం చుట్టలు, యంగ్ విడో బుచ్చమ్మ, ఆవునెయ్యి, గేదె పెరుగులు లభించగానే తృప్తిగా వాటివైపు మనసు మళ్లించుకుంటాడుకాని, పట్టణవాసపు అభిరుచుల్ని స్మరిస్తూ బాధపడడు.

గిరీశానికి జీవితంమీదతప్ప మరిదేనిమీదా విశ్వాసంలేదు. విడోమారేజి, ఆంటీ—నాచ్‌వంటి సంఘ సంస్కరణలనుగూర్చి పరిస్థితులకు అనుకూలంగా మారుతూ ఉంటాయి అతని అభిప్రాయాలు. సమకాలీనమైన ఈ రెండు సాంఘిక సమస్యలూ సాంఘికమైనవిగాకాక, కేవలం వ్యక్తిగతమైన స్త్రీ సమస్యగానే కనిపిస్తుంది గిరీశానికి. మధురవాణివంటి వేశ్య, బుచ్చమ్మవంటి విడో కనిపించినప్పుడు 'వేశ్య', 'విడో' అన్న విషయాలకు గిరీశం ప్రాధాన్యం ఇవ్వడు. మధురవాణి ప్రౌఢత్వం, బుచ్చమ్మ ముగ్ధత్వమే అతన్ని ఆకర్షిస్తుంది. గిరీశం పట్టణంలో ఉపన్యాస ధోరణికి అలవాటుపడ్డాడు. అగ్రహారానికి రాగానే "పల్లెటూరి పీపిల్ లెక్చర్లకి అన్‌ఫిట్" అన్న సత్యాన్ని క్షణాలమీద గ్రహించి ధోరణి మార్చుకుంటాడు. అగ్నిహోత్రావధాన్లుమీద ఉపన్యాసాలు, ఆదర్శాలా పని చెయ్యవని' తెలుసుకోగానే పనిచేసే సమ్మోహనాస్త్రమేదో దాన్ని ప్రయోగిస్తాడు. మొదట కరటకశాస్త్రులు తనకు అనుకూలుడేనని భ్రమించినా, సమయం మించిపోకముందే పొరపాటు దిద్దుకొని అగ్నిహోత్రావధాన్లుతో ఎలా మెలగాలో స్వయంగా నిర్ణయించుకుంటాడు. ఈ పరిస్థితులన్నింటిలోనూ గిరీశానికి ఎంతగా 'పట్టూ విడుపూ' చేత నవుతుందో బాగా తెలుస్తుంది మనకు. అభిరుచులకు దాసుడు కానట్లే అభిప్రాయాలకూ, ఆశయాలకూ, ఒక తరహా అనుభవాలకూ దాసుడుకాడు గిరీశం.

గిరీశానికి మంచి నిగ్రహశక్తి ఉంది .... "ఇవాళ ఉదయం పూటకూళ్లమ్మకీ నాకూ యుద్ధమై పోయింది. బుఱ్ఱ బద్దలు కొడదామా అన్నంత కోపం వొచ్చింది గాని, ప్రీచర్సు చెప్పినట్లు పేషన్సు ఉంటేగాని లోకంలో నెగ్గలేము" .... అలా అని గిరీశం ఆత్మాభిమానం లేని చవట మాత్రం కాదు. కోపాన్ని నిగ్రహించుకొని, ఎలా 'పేషన్సు' తో ప్రవర్తించి నెగ్గాలో జీవితాన్ని అనుభవించాలో అతనికి తెలుసు. అగ్నిహోత్రావధాన్లు మాటలకూ చేతలకూ ఎంత కోపం వచ్చినా పొంకం చెడకుండా అతన్ని క్రమంగా లొంగదీసుకోవటంలో ఎంతో నిగ్రహం, చాకచక్యం, మెలకువ చూపిస్తాడు గిరీశం. కోపాన్ని నిగ్రహించుకోవటమే కాదు, స్త్రీ వ్యామోహాన్ని అగ్గలమైన కోరికనీ కూడా అలానే నిగ్రహించుకో గలడు గిరీశం. నాట

కంలో మొదటినుంచీ చివరిదాకా మధురవాణితో మాట్లాడిన ప్రతిపురుషుడూ ఆమె ప్రభావానికి లొంగుతాడు, ఆమె చెప్పినట్లు వింటాడు—చివరకు సౌజన్యారావు పంతులు కూడ! గిరీశం ఒక్కడే మధురవాణి ప్రభావానికి అతీతుడుగా ఉంటూ మధురవాణిని అనుభవించినవాడు. పట్టణం వదలగానే మధుర వాణిని పూర్తిగా మరచిపో గలిగాడు. కూడా. బుచ్చమ్మ విష యంలో ఆకర్షణ ఎంత తీవ్రంగా ఉన్నా, ఏదో కామో ద్రేకంలో తెలివితక్కువగా . తొందర పడటానికి నిత్యమూ అవకాశాలు ఉన్నా, నిగ్రహంతో ప్రవర్తిస్తాడు గిరీశం. ఆమె శరీరంకంటె ముందు మనస్సునే వశం చేసుకోవాలని యత్ని స్తాడు.

తనలోని వాంఛను గుర్తిస్తూ ఒకవైపు బాధపడు తూనే ఒకవైపు నవ్వగలిగిన శక్తి ఉంది గిరీశంలో: "... వీడి తస్సాగొయ్యా, వీడి బాణాలు పువ్వులటోయి ? .... అనుభ వేద్యమైన దీని నిజం యేమిటంటే: మంచి పదును బట్టిన లోహం మొనకి, డయమండ్ పాయింట్ వేసి, పాయిజన్‌లో ముంచి, కంటికి కనపడకుండా మంత్రించి విసురుతాడు. అంచేతనే, పైకి గాయం కనపడదు గాని ' పోలీసువాళ్ల దెబ్బల్లాగ లోపల తహతహ పుట్టిస్తాయి. ఈవిడో బ్యూటీ చూస్తే ఏమీ తోచకుండా ఉంది ...." గిరీశం వాంఛ పశు వాంఛ కాదు. బుచ్చమ్మ శరీర సౌష్ఠవమే కాదు, ముఖ్యంగా గిరీశం మనస్సును చూరగొన్నది, ఆమె ముగ్ధత్వం .... "చమ త్కారంగా మాటలు ఆడితే ఏమిన్నీ అర్థం చేసుకోలేక ఆ లేడికళ్లతో తెల్లబోయి చూస్తుంది. అయాప్స్ డ్రెడ్ ఫుల్లీయిన్ లవ్ నిత్‌హర్ .... దీనిని చెడగొట్టడానికి ప్రయత్నం చెయ్యకూడదు. చేసినా సాగేది కాదు. గనక కొత్తదారీ, కొంత న్యాయమైన దారీ తొక్కాలి. ఏమిటయా అదీ ? మాయో పాయం చేసి దీన్ని లేవదీసుకుపోయి విడో మారియేజి చేసు కుంటే న ట్టాయనా కీర్తి సుఖం కూడా దక్కుతాయి .... ఈ మాటలు గిరీశం ఎవరితోనో అనేవి కావు, సమయోచి తంగా, స్వప్రయోజన సిద్ధికోసం ఏవో కబుర్లు చెబు తున్నాడని ప్రేక్షకులు అనుకొని భ్రమపడకుండా ఉండటానికి. తనలో తనే అనుకునే మాటలు. నాటకంలో ఈ 'స్వగతమే' (తృతీయాంకము, రంగము 3) గిరీశం ఆంతర్యాన్ని అర్థం చేసుకోవటానికీ, గిరీశం పాత్రకు కావ్యంలో విలువేమిటో గ్రహించటానికీ, కీలకమైన స్వగతం. ఈ పద్ధతి 'స్వగతాలు' షేక్స్పియరు నాటక సంప్రదాయం.

పై నుదాహరించిన స్వగతంలోని వాక్యాలు గిరీశం మనోవైఖరియొక్క విజతత్వాన్ని వ్యక్తం చేస్తాయి. తన లోతు తనకు బాగా తెలుసు గిరీశానికి. అతనికి సామా న్యంగా సందేహాలు రావు, తడుముకోడు. అన్ని విషయాల్లోను అతీతుడుగా వ్యవహరించే గిరీశం ఒక్క బుచ్చమ్మ విషయం లోనే కాస్త 'డైలెమ్మా' లో పడ్డాడు. ".... టు మారీ యె విడో, ఆర్ నాట్ టు మారీ, దటీజ్ ది క్వశ్చన్! షేక్స్పియరు పడ్డ అవస్థలో పడ్డాం! తొందరపడి హాజీ సాహెబు తురకల్లో కలిసిపోయినా డన్నట్టు నావంటి బుద్ధిమంతుడు తొందర పడి ఏపనీ చెయ్యగూడదు. దాని లాభ నష్టాలు బేరీజు వేసి, జమాఖర్చు చేసుకుని మరీ డిసైడ్ చెయ్యాలి. లెటస్ సీ ...." అంటూ క్షుణ్ణంగా పరిశీలిస్తాడు—తనూ బుచ్చమ్మని పెళ్లి చేసుకోవడమేనా ? చేసుకుంటే ఫలితాలు ఎలా ఉంటాయి ? అన్న విషయాన్ని. దైహిక సుఖాలకూ, అభిప్రాయాలకూ, ఆదర్శాలకూ, వ్యక్తులకూ, కోపతాపాలకూ ఎక్కడా దాసోహ మంటూ శాశ్వతంగా లొంగికోపోక వాటిని అనుభవిస్తూ అతీత డుగా మెలిగే స్వేచ్ఛా ప్రవృత్తిగల గిరీశం, బుచ్చమ్మ ముగ్ధత్వం ఎదుట, మంచితనంముందు, వలలో పడ్డ పక్షిలా పెద్ద సందిగ్ధంలో పడతాడు. ఇలా కర్తవ్య విచా రణ చెయ్యవలసిన పరిస్థితి అంతవర కెప్పుడూ ఈ స్వేచ్ఛా జీవికి రాలేదనే చెప్పాలి. బుచ్చమ్మ విషయంలో మాత్రం, తను పూర్వంలాగే నిర్లిప్తంగా, స్వేచ్ఛగా తప్పించుకు తిరగగలనా ? లేనా ? అన్న సందేహం కలుగుతోంది గిరీశానికి. ఇందుల సమస్య రెండు రకాలుగా ఉంది. మొదటిది సాంఘికమైన ఫలితాలకు సంబంధించినది. గిరీశానికి వివాహం, సంసారం అంటే భయంలేదు, అతడు వేసిన బేరీజు ప్రకారం ప్రతమూ, సుఖమూ రెండూ దక్కుతాయి. విడో మేరేజి ఎసోసియేషన్ వాళ్లు డబ్బిస్తారు. బుచ్చమ్మ కూడా కొంత డబ్బుంది. డబ్బుకోసం తడుముకోకుండా బ్రతకటానికి అందువల్ల అవ కాశం ఉంటుందనే ఆలోచిస్తాడు గిరీశం. కాబట్టి వివాహం చేసుకోవటమే కర్తవ్యమని నిశ్చయిస్తాడు. పోతే సమస్యలోని రెండవ భాగం, అది గిరీశం వ్యక్తిత్వం మీద కలిగే ఫలితా లకు సంబంధించినది. దాని విషయమై చూచాయగా తప్ప ఆలోచించడు గిరీశం. అయితే అదీ అతని మనస్సుకు గోచర మైందనే నాటకకర్త చూపిస్తాడు. గిరీశానికి, బుచ్చమ్మ మూలంగా తనలో వస్తున్న క్రొత్త పరిణామం, తను మంచి పనులవైపు మొగ్గు చూపుతూ ఉండటం, సంఘానికి మంచి వాడుగా ప్రవర్తించబోతూ ఉండటం, యిలా తనలో పొడ సూపుతున్న 'మంచితనం', కించి దాశ్చర్యాన్ని కలిగిస్తుంది. అందువల్ల పై 'స్వగతం' లో వివాహపు లాభనష్టాల్ని బేరీజు వేసుకున్న తర్వాత 'పైకి ముఖం ఎత్తి ఆలోచించి' ఇలా అంటాడు—"వెంకమ్మ మొగుడితో దెబ్బలాడి నాతిలో

పడ్డప్పుడు నేను సాహసించి వురికి పైకి తీసిం దగ్గర్నుంచీ వూరంతా నేను సాక్షాత్తూ సత్యహరిశ్చంద్రుణ్ణిగా భావిస్తున్నారు. అడుగడుక్కీ బుద్ధి దొళ్లేస్తూంటుంది గాని, నేనంతవాణ్ణి కానా యేవిఁటి ? స్నేహం పట్ల పీకిచ్చేస్తారే గిరీశంగారు ! సాధారణులా ?'' .... ఈ సట్టున గిరీశం తనని తనే హాస్యం చేసుకుంటున్నాడు. ఏమంటే తన స్వేచ్ఛా ప్రవృత్తిని నిలబెట్టుకోవడానికి అతనికి ఈ హాస్యదృష్టి అవసరం. మంచితనమనే ఆదర్శానికి తన్మయీభావంలో దాస్యం చెయ్యటం గిరీశం మూల తత్వానికే విరుద్ధం. కాని తనలో బుచ్చమ్మ ప్రభావంవల్ల వ్యక్తమవుతున్న ఈ మంచితనాన్ని ఏ దృష్టితో చూడాలి ? అదీ కేవలం ఒక వేషధారణగానే, సమయోచితంగా ఉపయోగించుకోవటానికి, హాస్యదృష్టితో నిర్లిప్తుడుగా ఆలోచిస్తున్నాడు గిరీశం.

గిరీశానికి జీవితంమీద తప్ప మరి దేనిమీదా విశ్వాసం లేదు. బుచ్చమ్మ ప్రభావంవల్ల తనలో మార్పు వస్తుందేమోనని చూచాయగా ఒక సందేహం కలిగినా, సందేహాలకు భయపడి బుచ్చమ్మను కాదనుకోవటం గిరీశం ప్రకృతికే విరుద్ధమైన సంగతి. అందువల్ల .... ''రామవరం చలో, నిడో మూరియేజి కరో ! లెట్ మీ బిగిన్ ది కాంపైన్ ఎట్ వన్స్'' అంటూ నిశ్చయానికి వచ్చి వెంటనే కార్యరంగంలో ప్రవేశిస్తాడు. అప్పటినుంచి బుచ్చమ్మతో చెప్పే మాటలు కేవలం సమయోచితమైన కల్పన, కబుర్లే అనటానికి వీల్లేదు. అవి గిరీశం హృదయస్పందనం కూడ మనకు వ్యక్తం చేస్తాయి:

''అందరాని పండుకు ఆశించడ మెందుకని మనసు మళ్లించుకోడానికి విశ్వప్రయత్నం చేస్తున్నాను గాని మనస్సు లొంగకుండా ఉంది. భగవంతుడేం జేస్తాడో ! మనస్సుతో యేవంటున్నానంటే 'ఓ వెర్రి మనసా ! నువ్వు వలచిన చిన్నది ఆణిముత్యమేగాని యిన్నాళ్లూ పెళ్లి మానేసి యిప్పుడు 'పెళ్లాడదాం, పెళ్లాడదాం' అని ఎందుకు సందడి పడతావు ? 'సంసారసాగరం దుఃఖం, తస్మా జ్జాగ్రత, జాగ్రత' అన్నాడు, సంసారంలో పడిపోతే మళ్లీ నీకు లోకోపకారం చేయడానికి అవకాశం ఉంటుందా ?'' ఇవి కేవలం బుచ్చమ్మను మెప్పించటానికి చెప్పే వాక్యాలు కావు. స్పష్టంగా గిరీశంలోని సందేహం సంఘర్షణా అలా వ్యక్తమవుతోంది.

ఇక అతని కల్పనలకు అవధి లేదు. భవిష్యత్తును గూర్చి, బుచ్చెమ్మతో తన వైవాహిక జీవితాన్ని గూర్చీ చిలవలు పలవలుగా అల్లుతూ చెబుతాడు. అందులో బుకాయింపు కన్న గిరీశం తన మధురోహలూ, తియ్యని కలలూ, తన వలపే సగానికి సగం ఒలకబోస్తున్నాడని తోస్తుంది. ఇందులో ఒక తమాషా ఉంది. గిరీశం వ్యర్థంగా పగటి కలలు కంటూ కూర్చునే వ్యక్తి కాదు, కార్యవాది. కాని అతనికి బుచ్చమ్మను చూస్తుంటే నిజంగానే పగటికలలు వస్తున్నాయి. వాటిని వ్యర్థం కానివ్వకుండా హాస్యదృష్టితో సమయోచితంగా ఉపయోగించుకోవటమే అతని వ్యక్తిత్వంలోని విశిష్టత. పగటి కలలతో బుచ్చమ్మ మనస్సును మళ్లిస్తా ననుకుంటాడు గిరీశం. కాని పరీక్షించి చూస్తే బుచ్చమ్మ మనస్సు ఆమె కతనిలో కనిపిస్తున్న మంచితనం వల్లే ఆకర్షితమౌతూంది కాని యీ తియ్యని కబుర్లవల్లకాదు. తన తల్లిని మృత్యువు నుంచి రక్షించటం, తన చెల్లెలి పెళ్లి తప్పించటానికి ప్రయత్నం చెయ్యటం, తనతమ్ముడికి చదువు చెప్పటం, తనని దుఃఖంలో ఓదార్చటం అనేవి బుచ్చమ్మ హృదయాన్ని కదిలిస్తాయి గాని గిరీశం కట్టే గాలిమేడలు కావు. ఈవిధంగా బుచ్చమ్మను మంచితనానికి ప్రతినిధి చెయ్యటంలోనే ఉంది గురజాడవారి ప్రతిభ.

చతుర్థాంకము, రంగం 5 లో గిరీశం ప్రయత్నమంతా ఒక కొలిక్కి వస్తుంది. అతడు బుచ్చమ్మకు వర్ణించే చివరి 'కల' చూడండి. ఇందులో కల్పనా, హాస్యమూ ఎలా సమపాళంగా కలిశాయో ! కన్నీళ్లతో ఉన్న బుచ్చమ్మ కూడా ఫక్కున నవ్వేస్తుంది. బుచ్చమ్మ మీది విరహంతో గిరీశం ఆత్మహత్య చేసుకొని స్వర్గానికి వెళ్తాడట. రంభ 'నవాభరణ భూషితురాలై తక్కుతూ తారుతూ' గిరీశం దగ్గరకు వరించమని వస్తే గిరీశం ఆమెని మిగతా అప్సర స్త్రీలతో సహా 'తన్ని తగిలేసి' బుచ్చమ్మ కోసం 'జపం'చేస్తూ ఉంటాడట. అప్పుడు బుచ్చమ్మ 'సందనవనంలోకి చంద్రోదయం' లాగా వస్తే గిరీశం కౌగలించుకోబోతాడట, అంతలో బుచ్చమ్మ మొదటి భర్త ముసలివాడు అడ్డంరాగా వా డిచ్చిన కన్యాశుల్కం వాడి మొహాన పారేసి గిరీశం బుచ్చమ్మను తనదాన్ని చేసుకుంటాడట ..... కానీ ఈ కల్పనలేవీ బుచ్చమ్మను వివాహానికి అంగీకరించేట్టు చెయ్యవు. అప్పుడు గిరీశం ''ఈ భూప్రపంచంమీద వుండుకున్న యావన్మంది స్త్రీలలోనూ, నిన్నొక్కర్తెనూ వలచి, నేను నీకు సుతరామూ లొంగిపోబట్టే కదా, నా బతుకు హాస్యాల కింద ఐపోయింది !'' అంటూ దీనంగా ప్రాధేయపడతాడు. ఈ వాక్యాల్లో గిరీశం హృదయమే వ్యక్తమైందనుకోవాలి. కాని బుచ్చమ్మ ఆసక్తి అంతా తన చెల్లెలి పెళ్లి తప్పించటంమీదే ఉందని తెలుతుంది. అందువల్ల ఆమెతో ప్రయాణం చేయించుకుని తనతో ఎలా వచ్చెయ్యాలో దాని ఫలితంగా పెళ్లి ఎలా తప్పిపోతుందో, వివరంగా చెబుతాడు. కాని బుచ్చమ్మ వెనక్కి తగ్గినట్టు కనిపిస్తుంది. గిరీశం, నిస్పృహగా, ''చావు తప్పేదుంది గనకనా ? నిన్ను

వాదిలి బతకలేను. అది వక చావు. నువ్వు నామీద ఒట్టు వేసుకుని ఆమాట తప్పితే, నన్ను దేవుడే చంపేస్తాడు, అది రెండో చావు. మరి నాకు చావు ఎలా తప్పుతుంది ?'' అంటాడు. ఎంత నిస్పృహావస్థలో ఉన్నా గిరీశం హాస్యదృష్టి ఒకవైపు పనిచేస్తూనే ఉంటుంది ! కాని తను చేసిన ఇంత ప్రయత్నమూ ఫలించదేమో నన్న ఆతురత క్షణ క్షణానికీ ఎక్కువైపోతుంది. ఇక మళ్లీ మళ్లీ నచ్చచెప్పటానికా వ్యవధి లేదు, వెంకటేశం వచ్చేస్తున్నాడు. బుచ్చమ్మ ఈ క్షణంలో అంగీకరించకపోతే రోజులకొద్దీ పడిన తపనా, చేసిన విశ్వ ప్రయత్నమూ వృధానే !'' ''ఒక్కమాట చెప్పు, బతక మన్నావా ? చావమన్నావా ?'' అంటాడు. చిట్టచివర. ''వెయ్యేళ్ళా బతకండి'' అంటుంది బుచ్చమ్మ. మళ్లీ ఆమాట సందిగ్ధమే ! ''అలాగైతే నాతో రావడం ఖాయమేనా ?'' అంటాడు. ''ఏం జేయమంటే అది చాస్తాను.'' అనేస్తుంది బుచ్చమ్మ .... గిరీశం ఆనందం అంతటితో గట్లు తెగుతుంది. కాని వెంకటేశం వచ్చేశాడు. నూటిగా తగిలే నర్మోక్తి విసురు తాడు గిరీశం. ''నీ తమ్ముడు చిన్న గుంటడయీా, అప్పుడే గొల్లభావాల్ని పట్టుకుంటున్నాడు.''

బుచ్చమ్మ : (ముసిముసి నవ్వు నవ్వుతూ). ''మిడత!''

గిరీశం : (బుచ్చెమ్మతో) ''ఇన్నాళ్లకు మిడతంభొట్లు చేతులో చిక్కాడు.''

గిరీశం ఉత్కంఠనూ, పాఠకుల ఉత్కంఠనూ తార స్థాయికి తీసుకువెళ్లి చివర ఒక తారలాంటి వాక్యాన్ని పాద గటం మహాకవి ప్రతిభకు తార్కాణ. ''ఇన్నాళ్లకు మిడతం భొట్లు చేతులో చిక్కాడు'' అంటే ఎవరు ఎవరి చేతిలో చిక్కినట్లు ? బుచ్చమ్మ గిరీశం చేతిలో చిక్కటం కనిపి స్తూనే ఉంది. కాని బుచ్చమ్మ చేతిలో గిరీశం కూడా చివ రకు చిక్కాడు కదా ! అని గిరీశం అంతర్యంలో అది ఒక హెచ్చరిక !—గిరీశంలోని సందేహాన్ని సంఘర్షణని మొదటి నుంచీ గుర్తించినట్లయితే ఈ స్వారస్యం గోచరిస్తుంది. ఇదే షేక్స్పియరు లోనూ కనిపిస్తుంది కొన్నిచోట్ల.

గిరీశం దుష్టుడంటే ఎలా దుష్టుడో తెలీదు ! మారిస్ మార్గన్ ఫాల్‌స్టాఫ్ ప్రవర్తనను విశ్లేషించినట్లు, ప్రతిగుణాన్నీ తర్కించినట్లు తర్కిస్తే గిరీశంలోని దుష్ట త్వము అతని స్వేచ్ఛా ప్రవృత్తి మాత్రమేనా ! అనిపిస్తుంది. గిరీశంలో కోపం, లోభం, మదం, మాత్సర్యం దుర్గుణాలై కనిపించవే ! రామప్పంతులుకున్న దుర్విదగ్ధతా, ఒకళ్ల కొంప తీయాలన్న తత్త్వం, పగ, పట్టుదల గిరీశానికి లేవు. గిరీ శంలో మానవత్వం చావలేదు. అగ్నిహోత్రావధాన్లు బుచ్చమ్మ నెత్తిమీద పెరుగూ అన్నం విస్తరి రుద్ది కోపంతో విలయ తాండవం చేసిన పరిస్థితిలో గిరీశం ప్రవర్తన కేవలం అతని స్వార్థ ప్రయోజనాన్నే వ్యక్తం చెయ్యదు. '' .... నేనే దాని హజ్బెండ్నై వుంటే, నిలబడ్డపాటున నీ తండ్రిని రివాల్వర్తో షూట్‌చేసి ఉందును. మీ అమ్మ ఏడుస్తూ ఒకమూల కూచుంది. అప్పుణ్ణే వెళ్లి, నీళ్ల పొయ్యిలో నిప్పేసి, నీళ్ళు తోడి, నీ సిస్టర్ని స్నానం చెయ్యమన్నాను .... '' ఒక పట్టణ వాసపు నవనాగరకుడు, సుఖలాలసుడు, పల్లెటూరి అమ్మాయి మీద ఎంతగా కన్ను వేసినా, పై చెప్పిన సేవ చెయ్యటానికి పూనుకుంటాడా, మానవత్వం లేకపోతే ? గిరీశంలోని హాస్య దృష్టి ఈ మానవత్వపు చెలియలికట్టను ఎప్పుడూ దాటదు. లేకపోతే పై దృశ్యంలో బుచ్చమ్మ ముఖం పెరుగన్నంతో ఎలా విరాజిల్లిందో గిరీశం హాస్యదృష్టి ఎందుకు గుర్తించలేదు ? గిరీ శానికి కోపమూ, దుఃఖమూ, జాలీ మాత్రమే కలిగాయే ! అలానే బుచ్చమ్మ తల్లి వెంకమ్మ బావిలో దూకిన తరుణంలో పల్లెటూరి యిరుగు పొరుగు ఎవ రెలా వ్యవహరించి ఉంటారో సులువుగా వూహించుకోవచ్చు. ఎవరిప్రాణం వారికి తీపి ! ముందు వెనుకలు ఆలోచించకుండా గిరీశం బావిలో దూకి ఆమెను పైకి లాగాడు. ''ఏమిటబ్బా యీ నా మంచితనం ?'' అని గిరీశానికే సందేహం వేసింది !

ఏతావతా తేలేదేమంటే గిరీశం పరిస్థితుల్ని, మను ష్యుల్ని బట్టి ప్రవర్తించే వ్యక్తి. అతని ధ్యేయం జీవితాన్ని పూర్తిగా అనుభవిస్తూ జీవితానికి లొంగిపోకుండా పైచే యిగా ఉండటం. అందుకు అతని హాస్యదృష్టీ, నిర్లిప్తతా తోడ్పడుతాయని. హాస్యదృష్టి అంటే హేళనకాదనీ, నిర్లి ప్తత అంటే హృదయంలేనితనమో అనుభవించలేని అశక్తతో కాదనీ, గిరీశంలో నిభృతమైన మానవత్వం, మంచితనము ఉన్నాయనీ కూడా అవగత మౌతుంది. ఇటువంటి గిరీశం కథ, చివర ఎందుకు 'అడ్డం తిరిగింది' ?

## 4

నాటకం చివరి అంకం చివరిరంగంలో గిరీశం బుచ్చ మ్మల వివాహం నిశ్చయ మైనట్లే వింటాము, కాని అది జరగడానికి ముందే లుబ్ధావధాన్లు కేసులో సహాయమ్మిచ్చి నెపంతో అతని ఆస్తికి వారసత్వం సంపాదించటం కోసం గిరీశం సౌజన్యారావు పంతులు దగ్గరకు వస్తాడు. మధుర వాణి కూడా అప్పుడే పురుషవేషంలో లుబ్ధావధాన్లకి సాయం చెయ్యటానికి అక్కడికి వస్తుంది. ఇది గిరీశాని కొక విషమ పరీక్ష. మధురవాణిని చూడగానే గుర్తిస్తాడు. ఒకవైపు సౌజన్యారావుతో మాట్లాడుతూనే చమత్కారంగా తన గుట్టు కాపాడమని మధురవాణిని ప్రాధేయపడతాడు.

"పరోపకార: పుణ్యాయ పాపాయ పరపీడనం" అన్న న్యాయ ప్రకారం, ఒకర్ని కాపాడి ఉపకారం చెయ్యడం ఉత్కృష్ట మైన పుణ్యం. నిష్కారణంగా వాడి మా నాన్న వాడు బతుకు న్నవాడికి అపకారం చెయ్యడం పాపానికి కారణం. గనుక గా అన్నయ్యని ఎంత కష్టపడి అయినా నేను కాపాడడం ధి అని యెరుగుదునండి"

మొదటి వాక్యాలు మధురవాణికీ, చివరివాక్యం ంతులుగారికీ ఉద్దేశించినవి. ఈ ధోరణిలో సాగుతుంది సంభా ణ. అందుకు మధురవాణి ప్రత్యుత్తర మిస్తుంది.

"ఒకానొకరు లేని మంచిని కూడా ఉన్నట్లు ప్రచుర రచి లోకాన్ని భ్రమింపజేస్తారు ...... నటనవల్ల కొద్దికాలంపే ోకానికి కళ్లు కప్పవచ్చును గాని, నిడివి మీద బంగారాన్నీ, త్తడినీ లోకం ఏర్పేస్తుందండి. (గిరీశంతో) ఏమంటారు ?"

ఇంక లాభంలేదని మధురవాణిని అవతలికి తీసుకు వడానికి ప్రయత్నించి విఫలుడౌతాడు గిరీశం. చివరి ప్రయ ్నంగా మధురవాణితో : "అయితే దాసోహం !—టు ది న్నోన్ !" అంటూ అభినయంతో బతిమాలుతూ నిష్క్ర ్తాడు.

ఇక్కడ పరిస్థితి తన చెయ్యిదాటి పోయిందనీ, కేవలం ధురవాణి మంచితనంమీదా, తన అదృష్టంమీదా విజయం ధారపడి ఉందే కాని స్వప్రయత్న మేమీ లేదనీ గ్రహి ్తాడు గిరీశం. "దాసోహం—టు ది అన్నోన్" అని చివరి క్యంగా గిరీశంచేత మహాకవి పలికించటంలో ఈ ధ్వని ్వారస్యం ఉంది. అజ్ఞాతవ్యక్తిని 'అన్నోన్ పర్సన్' అని ఎందుకు ంబోధించడు గిరీశం ? "అన్నోన్" అని అలా వదిలివెయ్య మే పై చెప్పిన ధ్వనికి ప్రాణం. లేకపోతే ఆ ధ్వని లేదు. రీశం 'దాసోహం' అన్న ఈ అజ్ఞాతశక్తి ఏమిటో ఈ చివరి ంగాన్ని పూర్తిగా అర్థం చేసుకుంటే కాని చక్కగా తెలీదు. వరి రంగంలో గిరీశం ఏ స్థితికి వచ్చాడంటే—తెలివితేటలు, మయస్ఫూర్తి, చాకచక్యం, నిగ్రహం ఎన్ని ఉన్నా వాని కొక రిధి ఉందనీ, పురుష యత్నానికి మించిన పరిస్థితుల్లో ర్ణయం కేవలం అజ్ఞాతశక్తికే చెందుతుందనీ తెలుసుకునే ్థితికి వచ్చాడు. ఇది మహాకవి సూచన. కాని నిజంగా గిరీశానికి లిసిందల్లా పరిస్థితి తన చేతిలో లేదనీ, తన విజయం వలం అదృష్టం (అజ్ఞాతం) మీదే ఆధారపడిందనీ. ఇక్కడ రీశం యొక్క 'స్వగతాన్ని' (అంకం 3, రంగం 3) ఒక్కసారి ర్తుకు తెచ్చుకోవాలి. మంచితనాన్ని ఒక ధోరణిగా, నటనగా ంచి స్వాధీనంలో ఉంచుకొని ఉపయోగించుకోవాలి గాని ానికి దాసోహం అనగూడదని గిరీశం అందులో చేసుకున్న నిర్ణయం. ఆ నిర్ణయం మేరకు ప్రస్తుత పరిస్థితుల్లోనూ "దాసోహం—టు ది అన్నోన్" అన్నాడే కాని గిరీశం "దాసోహం టు ది గుడ్‌నెస్" అనడు. ప్రస్తుతం తను ఆధారపడుతున్న అజ్ఞాతశక్తీ, మంచితనమూ, రెండూ ఒకటేననీ, మంచి తనానికి పూర్తిగా లొంగిపోగలిగితే తనకు విజయం చేకూరు తుందనీ అతను గ్రహించడు. గిరీశం తనలోని మంచితనానికి మొదట దాసోహం అని, సౌజన్యారావుకి తనలోని ప్రవర్తన నిజమైనదిగా బుజువుపరిస్తేగాని, బుచ్చమ్మ—మంచితనానికి ఒక ప్రతినిధియైన బుచ్చమ్మ—అతని జీవితంలో యిక ప్రవేశించదు ! సౌజన్యారావుకి తన పూర్వ చరిత్ర తెలిసిం దనగానే గిరీశం తనలో పరివర్తన వచ్చిందని చెబుతాడు. కాని మధురవాణిని గూర్చి 'డెవిల్' గా చెప్పటంలోనే అతనిలో పరి వర్తన నిజంగా రాలేదని గ్రహిస్తాడు సౌజన్యారావు.

సౌజ :—'ఎన్నాళ్లయింది చీకట్లోంచి వెలుతురులోకి ఉరికి ?

గిరీ :—(వూరుకుండును.)

సౌజ :—(మధురవాణితో) నువు చెప్పగలవు.

గిరీ :—ఎన్నాళ్లయితే నేమండి ? ట్రూ రిపెంటెన్సు ట్వంటీఫోర్ అవర్సు చాలదా అండీ ?

గిరీశం ఒక్క క్షణం వూరకుండటంలో, అతనిలో ఏ సంఘర్షణ జరుగుతూందో మనం గ్రహించవచ్చు. మరు క్షణం ఏ నిర్ణయానికి వచ్చాడో అతని మాటల్లో స్ఫురించే హాస్యమే చెబుతోంది. ఈ క్షణంలోనూ 'అహం' వదల కుండా, మంచితన మనేది కేవలం ఒక పద్ధతి, 'పాలసీ' అన్న ట్లుగా, దానిలో సంపూర్ణ విశ్వాసం చూపకపోవటంతో గిరీశం కథ అడ్డంగా తిరుగుతుంది.

జీవితంమీద తప్ప మరి దేనిమీదా విశ్వాసం లేనివాడు గిరీశం. అట్టి గిరీశానికి మంచితనం ఎదురవుతుంది—బుచ్చమ్మగా, సౌజన్యరావుగా. మంచితనాన్ని ఒక వేషంగా, పద్ధతిగా మాత్రమే గుర్తిస్తాడు కాని, మంచితన మంటే జీవితానికంటే గొప్పదనీ, మంచితనమే జీవితాన్ని నడిపే అజ్ఞాతశక్తి అనీ గుర్తించలేకపోతాడు. ఈ విషయం నాటకం చివరి రంగంలో ధ్వనిపూర్వకంగా ఎంత గొప్పగా, ప్రతిభా వంతంగా సూచించాడో మహాకవి ! చివరి రంగంలోని ప్రసంగం యావత్తూ మంచితనాన్ని గుర్తించే కద ! "మంచివాళ్లకు మంచిగా ఉండటం కాదు, చెడ్డవాళ్లకు మంచిగా ఉండటమే ముఖ్యం" అని గిరీశమే అంటాడు స్వప్రయోజనం దృష్ట్యా. దాన్నే సౌజన్యారావు త్రికరణశుద్ధిగా ఆమోదిస్తాడు. ఇద్దరు ఒకే విషయాన్ని ఆమోదించినా చెప్పినా ఎంత భేదం ఉండ

టానికి సాధ్యం ! అందుకే మధురవాణి "నిడివిమీద బంగారాన్నీ, ఇత్తడినీ లోకం ఏర్చేస్తుంది." అంటుంది. కాని యీ రంగంలో మధురవాణీ, పాలనీ, నీళ్లనీ వేరుపరచే హంసలా గిరీశం బంగారమో ఇత్తడో తేల్చేస్తుంది.

ఈ చివరి రంగంలో ఇంకొక అందం కూడా ఉంది. సౌజన్యారావు "సౌజన్యం' అనే ఉన్నతాదర్శానికి ప్రతీక. మధురవాణి లోకంలో చెడ్డతో కలిసి కలగాపులగమై క్రమంగా నిగ్గుదేరి కదలివచ్చిన మంచితనానికి ప్రతీక. ఈ ఇద్దరి కలయిక ఒక విచిత్రమైన అపూర్వమైన సన్నివేశం. ఆదర్శం గాలిగోపురాలమీదా వ్రతాలమీదా నిలబడితే లాభంలేదు. దానికి నిత్యజీవితంలో ఉండే మంచితనంతో సంబంధం ఉండాలి అంటే 'ఆంటి—నాచ్' వంటి నినాదాలవల్ల వ్యక్తులతో సంబంధం త్రెంచుకోకుండా, ఒక్కొక్క వ్యక్తిలోని గుణాగుణాల్ని విలువకట్టి లోకంలో మంచిని పెంచే ధైర్యం, సామర్థ్యం ఉండాలి అనేదే మధురవాణి సౌజన్యారావుకు నేర్పే పాఠం. సౌజన్యారావు శ్రీకృష్ణుని విగ్రహాన్ని చూపిస్తూ భగవద్గీతను బహూకరిస్తూ, జీవితం సాధించగలిగిన మంచితనమే భగవంతుడని వ్యక్తం చేస్తాడు. ఇలా ఆచరణకూ ఆదర్శానికీ లంకె చూపిస్తూ 'మంచితనానికి' పార్వతీ పరమేశ్వరుల్లా ప్రతీకలైన మధురవాణీ సౌజన్యారావుల ముందు 'జీవితాని' కి ప్రతీకయైన గిరీశాన్ని పరీక్షకు నిలవబెట్టారు మహాకవి చివరి రంగంలో.

కాని గిరీశం లొంగడే ! గిరీశం ఓటమినే స్వీకరిస్తాడా ? అంటే బుచ్చమ్మను కాదనుకుంటాడా ? లేక మళ్లీ తిరిగి వచ్చి లొంగిపోతాడా ? అంటే సౌజన్యారావు చెప్పినట్లు కాలేజిలో చేరి చదువుకుని సత్ప్రవర్తనను బుజువు చేసుకుని బుచ్చమ్మను పెళ్లాడటానికే నిశ్చయించుకుంటాడా ? ఈ సమస్య తేల్చలేదు మహాకవి. ఏమంటే భగవత్స్వరూపమైన 'మంచితనా' నికి దాసోహ మనటానికి మానవ 'జీవితా' నికి అవకాశం ఎప్పుడూ ఉండనే ఉంటుంది. ద్వారాలు తెరిచే ఉంటాయి. కాని అది ఎప్పటికైనా ఆ నిర్ణయానికి వస్తుందో లేదో ఎవరు చెప్పగలరు ? ఇంతవరకు మానవజీవితం మంచితనానికి పూర్తిగా దాసోహ మనలేదని తెలుస్తూనే ఉంది కద! అందుకే ఆ ముగింపు !

గిరీశం చిట్టచివర 'మంచితనం' ముందు పరీక్షకు నిల్చినట్లే, ఫాల్‌స్టాఫ్ చిట్టచివర 'ప్రేమ' ముందు పరీక్షకు నిలుస్తాడు. ఫాల్‌స్టాఫ్ జీవితాన్నీ, ఆ జీవితంలో తనకు ముఖ్యంగా ప్రీతిపాత్రుడైన హెన్రీ రాజకుమారుణ్ణీ ప్రేమించాడు. అతని తుదివిశ్వాసం జీవితంమీదనా ప్రేమలోనా అన్న విషయం చివరి పరీక్షలో తేలుతుంది. హెన్రీ పట్టాభిషిక్తుడైనాడని విని పరుగెత్తుకుని పోయి, అతను నిండు కొలువుకు వస్తూన్నప్పుడు ఉత్సాహంతో, సంతోషంతో పూర్వం వలెనే పలకరిస్తాడు. కాని రాజపదవిలో నున్న హెన్రీ అతన్ని గుర్తించీ గుర్తించనట్లు కఠినంగా తిరస్కరిస్తాడు. ఇది ఫాల్‌స్టాఫ్ జీవితానికి చరమఘట్టం. తర్వాత కొన్ని రోజులకే ఫాల్‌స్టాఫ్ చనిపోయినట్టు తెలుస్తుంది 5-వ హెన్రీ నాటకంలో. ఫాల్‌స్టాఫ్‌లో 'జీవితం' 'ప్రేమ' కు లొంగిపోవటంతో ఫాల్‌స్టాఫ్ తుది విశ్వాసం 'జీవితం' కాదు 'ప్రేమ' అనే సూచించాడు షేక్‌స్పియర్. మతమూ, సంస్కృతీ భిన్నమైనా బుషులైన మహాకవులు సూచించే సత్యం ఒకటే !

'కన్యాశుల్కం' మొదటి ఆరు అంకాల్లోనూ జీవితాన్ని తేలికగా గంభీరంగా, మంచి చెడ్డల కలయికగా, నిత్యమూ రీతులు మారే దృశ్యంగా, ఈర్ష్యాసూయల, లోభ, మోహాల సంఘర్షణగా చిత్రించి సప్తమాంకంలో జీవిత ధర్మాన్ని భగవంతుని స్వరూపమైన మంచితనం ముందు పరీక్షకు నిలవబెట్టారు. గురజాడ. "మంచి అన్నది పెంచుమన్నా" అన్నారు. ఇంతకంటె ఉదాత్తమైన నైతికప్రయోజనం, ధ్వనిపూర్వకమైన సందేశం ఏం కావాలి కావ్యానికి ?

---

# మాలపల్లి

## (నాల్గవభాగం)

### శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ

### నాటకీకరణం : శ్రీ గోపీచంద్

[పట్టణంలో ప్లాటుఫారం]

రా. నా : మీటింగు తీర్మానాలు చాలా బాగా వ్రాసావు సంగదాసూ. కూలీలకు సక్రమమైన కూలీ ఇవ్వక వారి శ్రమ వలన వచ్చే ఆదాయంలో విశేషభాగం భూస్వాములే అనుభవిస్తున్నందువల్ల వేతల కోతల కాలాలలో కూలీలు సమ్మెపెట్టి సహాయ నిరాకరణ అవలంబించాలి అనే తీర్మానం అద్భుతంగా ఉంది.

సంగ : కాగితంమీద ఏ తీర్మానమైనా బాగానే ఉంటుంది. ఆచరణలో పెట్టేటప్పుడే సాధక బాధకాలు తెలుస్తాయి.

రా. నా : ఏమిటది, నీ బుద్ధిచాకచక్యమంతా వదిలిపెట్టి, ఇట్లా నీరసంగా మాట్లాడుతున్నావు?

సంగ : మన బుద్ధులు కణిపెడేసే కోలబుర్రలు. వీటినిపెట్టి అనంతుణ్ణే కొలవాలెనని ప్రయత్నం చేస్తాం. ఎట్లా తేలుతుంది?

[రైలు ధ్వని]

అదుగో రైలు వస్తూవుంది. ఆగగానే మీ రెక్కండి. నేను సామాను సర్దుతాను.

[రైలువచ్చి ఆగుతుంది.]

తొందరగా ఎక్కండి—లేకపోతే కూచోటానికి కూడా స్థలం ఉండదు.

(రామానాయుడు ఎక్కి కూచుంటాడు. సంగదాసు సామాను సర్దుతాడు.)

సామానంతా ఒకసారి చూసుకో.

రా. నా : ఉండక ఎక్కడికి పోతాయి?

సంగదాసు : వచ్చేటప్పుడు కమలమ్మగారిని, సాహువును తీసుకు రావటం మర్చిపోకు.

రా. నా : వెళ్లేది అత్తవారింటికైనా మనసు నీమీదే వుంది సంగా. నీవు లేనిరోజులు ఎట్లా గడుపుతానో—నీవు కృష్ణుడివి, నేను అర్జునుడుగా రోజులు గడుపుతుంటివి.

[రైలు గంట... కూత.]

సంగ : నాయుడూ, నే వెళుతున్నాను, నన్ను మర్చిపోబోకు.

రా. నా : నిన్ను మరువగలనా సంగా.

(రైలు సాగిపోతుంది.)

## 2

[చౌదరయ్యా ఇల్లు]

చౌదరి : వెంకన్నా, వెంకన్నా.

వెంకన్న : (ప్రవేశించి) ఏం దొరా?

చౌదరి : నే నింట్లోనేవుంటా, సంగడు రాగానే నాకు చెప్పు.

వెంకన్న : అట్లాగే దొరా.

## 3

ఆదంసాహెబ్ : ఎప్పుడొచ్చావు సంగదాసూ?

సంగ : ఇప్పుడే వచ్చా ఆదంసాహెబూ, ఊళ్లో సంగతులేమిటి?

ఆదం : కథలేమిటి సంగదాసూ. ఊరంతా అట్టుడికినట్టుడికి పోతున్నది. మీ మీటింగు కథంతా పెద్దయ్యకు తెలిసింది. ఇక్కడ కూలివాళ్లకోసం పెద్దయ్యా వెళ్లిఆడిగినా, ఎవరూ రాలేదు. పంతులు వచ్చి, జాడీలు తీసే నీవే బంద్లో బస్తు చేసి పొయ్యినావని తెలిసింది. పెద్దయ్య పండ్లు పటపట కొరుకుతూ, నీకోసం కాచుకుకూచున్నాడు. ఎందుకైనా మంచిది జాగర్తగా మసలుకో.

సంగ : మీ రధైర్యపడవద్దు—మనమే గెలుస్తాము.

## 4

చౌద : వెంకన్నా.

వెంకన్న : ఏందొరా?

చౌద : మాలవాడిగదితాళం తీసుంది, వచ్చాడేమిటి?
వెంక : అవునుదొరా.
చౌద : వాడు రాగానే చెప్పమంటె, చెప్పలేదేం?
వెంకన్న : ఆపనిమీదే ఉన్నా. ఆవులదొడ్లో జీతగాండ్లకు, పనిపెట్టి బోధ చేస్తున్నాడు.
చౌదరి : ఆ రాగోల ఇట్లా ఇయ్యి.

[వెంకన్న రాగోల అందించగా, చౌదరి అడుగులు వేసుకుంటూ దొడ్లోకి వెళ్లు తుంటాడు.]

[దొడ్లో...]

ఒకనౌకరు : (చౌదరయ్యను చూచి) సంగదాసూ, చౌదరయ్య రాగోల పట్టుకొస్తున్నాడు. కోపంవస్తే ఆయనకు మంచీ, చెడూ తెల్వదు, వెళ్లిపోదాం రా.
సంగ : నేనేం తప్పుచేశానని.
నౌకరు : అదుగో, రానే వస్తున్నాడు తలుసన్నా మూసేస్తా.

[తలుపుమూసిన ధ్వని]

చౌద : (తలుపు గుద్దుతూ) తలుపు తియ్యండి.
నౌకరు : తియొద్దు సంగదాసూ, తీస్తే నిన్ను బతకనివ్వడు.
సంగ : దాక్కోవలసిన అవసరం నాకేం వచ్చింది.
నౌకరు : వద్దు సంగదాసూ తలుపు తీయవద్దు.
సంగ : ఒకరికి జడిసి ఎన్నాళ్లు బ్రతుకుతాము. జరగవలసింది జరక్కమానదు.

[గొళ్లెంతీసి తలుపు తెరుస్తాడు]

చౌదరి : ఏంరా. నా ఉప్పు తింటూ, నాకే ఎసరు పెడుతున్నావా? మా పిల్లవాణ్ణి అవూయకుణ్ణి చేసి, ఇంట్లో ముసలం పెడదామనుకున్నావా? ఏమీ ఎరగట్టు వాడిని పక్కన తీసికెళ్లి ఇక్కడ కూలివాళ్లను నామీదకు ఎగదోస్తావా?
సంగ : నేనింతవరకూ ఏ ఒక్క తప్పూ చేయలేదు. వాళ్లకు ముట్టవలసిన కూలీ ముడితే కూలీలు తప్పకుండా పని లోకి వస్తారు.
చౌదరి : లేకపోతే?
సంగ : రారు.
చౌద : రారూ?
సంగ : రారు.
చౌద:—నన్నే ఎదిరిస్తున్నావట్రా—మాలవెధవా.

[రాగోల పైకెత్తును]

(రాగోల పైకెత్తి నెత్తిమీద కొడతాడు.)

సంగ : అమ్మా......అని కేకవేసి కింద పడిపోతాడు. అమ్మా అనే అతడి కేక తరంగ తరంగాలుగా గాలిలో ప్రయాణంచేసి మహాలక్ష్మికి వినిపిస్తుంది. మహాలక్ష్మి నాయనా సంగా.. ఎక్కడున్నావురా......అని ఆక్రోశిస్తుంది.

[చౌదరయ్య ఇల్లు]

లక్ష్మి : ఏమిటండీ, ఏమి జరిగిందేమి. ఇంత ఖంగారు పడు తున్నారు.
చౌద : మాలవాడిని ఆవుందొడ్లో కర్రతో కొడితే చచ్చాడు. దబ్బునపోయి దిబ్బలో పాతివేయించు.
లక్ష్మి : ఆఁ కొట్టటమేమిటి? చావటమేమిటి? ఇదేదో ముంచుకు పోయేందు కొచ్చింది?

5

[పొలంలో]

నౌకరు : (పరిగెత్తుకుంటూవచ్చి) చౌదరయ్యా, సంగదాసును చంపాడురా.
జీతగాడు : ఆఁ......ఏడీ......వాడేడీ ?
ఆదంసాహెబ్ : ఏడీవాడు?......రక్తం కండ్లజూస్తా.
సత్తి :—ఏడీ......పేగులుపీకి జందెం వేసుకుంటా.....
నాగడు:—కండ్లకు కనపడితే ముక్కలుగా నరికి గద్దలకు పారేస్తా.
జీతగాడు:—పదండి. వాడంతు కనుక్కుందాం.

6

[చౌదరయ్య ఇల్లు]

దాసీది : అమ్మా! పంతులు దొడ్లోకి వచ్చాడు. రమ్మనేదా.
లక్ష్మమ్మ : రమ్మను.

[అక్కాలక్ష్మి, పంతులు ప్రవేశం.]

లక్ష్మమ్మ : తమ్ముడూ, నా పసుపు కుంకానికి తెరువులు వచ్చి నాయి, తరువాత ఏమైనా అవమానం జరిగేటట్టుగా వుంది. ఏ బావో చూసుకోవాల్సిందేగాని, ప్రజలముఖం చూసుకోవటానికి వీల్లేదు. చిన్నపిల్లవాడు గూడా లేడు. ఊళ్లో అల్లరికే ఇదవుతుంటే, అసలుకే మోసం వచ్చింది.
పంతులు : అక్కా! నీవింతగా చెప్పాలా? నీది ఎముకలేని చెయ్యి. నీ ధర్మగుణమే నిన్ను రక్షించాలి. మునసబు దగ్గరినుండి డిప్టీసూపరింటుదాకా అన్ని నోళ్లూ కట్టాలి. నాలు గయుదు సంచులు వదలక తప్పవు, బావెక్కడ?
లక్ష్మి : భయపడి, ఆ మండెక్కి కూర్చున్నాడు. (మండె దగ్గరికి వెళ్లి) ఏమంటావు? పంతులొచ్చాడు.
చౌదరి : పంతులూ, నాలుగింటితో సరిపుచ్చలేవా?
పంతులు : బావా, నీవు నాకు చెప్పాలా? నా శాయశక్తులా చూస్తా.... అవసరమైతే ఒకటో, అరో పైన అంటా. ఒకవేళ తండ్రిని లోబరుచుకోవలసివస్తుందేమో.

చౌదరి : తండ్రిమాట తలపెట్టొద్దు. మాల మాదిగలకు దండగలిచ్చి, ఈ ఊళ్లో ఇంక నిభాయించనా? ఆఖరకు అయిదయినా సర్కారుకు కట్టు......అది మొగసిరిపని..... సందుమాత్రం ఎక్కడా ఉంచొద్దు.

**7**

[కూలీలు:—వాడి శిరస్సు ఇవ్వాళ నేలపడాలి, ఆడదాని లాగా ఇంట్లో పడున్నావా, బయటికి రా.........అని తలుపులు గుద్దుతుంటారు?]

[ధోడ్లో]

రంగడు : ఇంకా ప్రాణముందిరా. పెదవులు కదిలిస్తున్నాడు.

మహాలక్ష్మి : (దూరంగా) మా నాయనేడీ, మా బంగారుకొండ ఏడీ—మా సంగన్న ఏడీ......

[అని పరిగెత్తుకుంటూవచ్చి మీదపడి ఏడుస్తుంది.]

రంగడు : మహాలక్ష్మి, నీవు మాట్లాడిచ్చి చూడు.

మాలక్ష్మి : సంగడూ, అమ్మను—మీ అమ్మను, పలకవేం.

వీర : ఏదో అంటున్నాడు, నిశ్శబ్దంగావుండు.

సంగ : మనం గెలుస్తాం.

వీర : ఆదేదో తురుపు మరుపుమాట—సంధి ప్రారంభించింది.

ఆదంసాహెబు : దెబ్బ తగలబోయేముందు, నాతో ఈమాటే అన్నాడు.

వీర : సంధి సమయంలో వెనకటి మాటలే మళ్లీ అంటూ వుంటారు, అదుగో రామదాసు వస్తున్నాడు.

రామదాసు : (పరిగెత్తుకుంటూవచ్చి, చూచి) సద్గురూ, చివరికి నీ దయ ఇట్లా వచ్చిందా?

[ఐదు నిముషాలు గుటగుటలాడి సంగడి నోరు మూతబడ్డది.]

రంగడు : పోతున్నది......పోతున్నది.

ఆదంసాహెబ్ : పోనేపోయింది.

మాలక్ష్మి : సంగడూ. నా ముద్దులసంగడూ......నీ కాలిన ముల్లు గుచ్చుకుంటే నా ప్రాణాలు విలవిలలాడేవి. నీతల పది చెక్కలయితే, చూచి నా గుండె వక్కలు కాలేదు. నేను నిర్భాగ్యురాలిని. ఏ అదృష్టవంతురాలి కడుపునైనా పుడితే, నీ అచ్చటా, ముచ్చటా జరిగే వేమో.......నీవు పుట్టటవల్ల మేము ధన్యులమైనా మనుకున్నాం. మాలపల్లే పవిత్రమయిపోయింది. ఇంట్లో చుట్టతాగటానికి భయపడ్డారు. మాలపల్లంతా సారాయి మానుకున్నది. ఇంట్లో ఏ మూల చూచినా పున్నకాలే. మాలగూడంలోకి రామాయణ, భారతాలు జొరపడ్డవి నాయనా.....బావులు త్రవ్విస్తానంటివి.....దేవాలయాలు కట్టిస్తానంటివి......బళ్లు పెట్టిస్తానంటివి......మాల పల్లెను మునిపల్లెను చేయవలెనంటివి......ఏవీ......నీ రోజులు లెక్క చూచుకోకుండా కోరికలు కోరాగద నాయనా.......సంగడూ.......

[అని శవంమీదవాలి పెద్దపెట్టున శోకి స్తుంది.]

వెంకమ్మ : అది మాలకులస్థురాలైనా, దానినోట ఒక్క పరుష వాక్కయినా వస్తుందేమో చూడండి, వాళ్లందరు మంచి వేత్తలు.

సూత్రధారి : సంగదాసు మరణం నాదెళ్లలో అత్తవారింట వున్న రామానాయుడికి తెలుస్తుంది. ఈ వార్త తెలియ గానే అతని గుండెలు బద్దలైనై. నా సంగడూ నన్ను విడిచిపెట్టిపోయావా, నీకు అన్నీ తెలుసు. అందుకే స్టేషను దగ్గర నన్ను మరిచిపోబోకు అన్నావు, అని కుప్ప కూరగా కూలబడ్డాడు రామానాయుడు. వెంటనే భార్యనీ, పిల్లవాణ్ణీ తీసుకొని బయలుదేరాడు ఇంటికి.

**8**

[జట్కాబండి వేగంగా వెళ్తున్నధ్వని]

రా. నా : రైలు అందుతుందో లేదో త్వరగా పోనియ్యి.

బండివాడు : చల్ చల్.

[జట్కావేగం హెచ్చింది]

కమల : బుష్షే వాడూ, సమస్తం తీర్చి దిద్దేవాడే, ఆయన కొట్టటం ఏమిటి? వీడు చావటమేమిటి?

సాహు : ఎవరే అమ్మా కొట్టింది?

రా. నా. : భగవంతుడు.

సాహు : ఎవర్నీ?

రా. నా. : నన్ను.

[జట్కాధ్వని ఫేడౌట్-ఫేడిన్]

సూత్రధారి : రెండు గడియల ప్రొద్దుకి అంతా ఇంటికి జేరారా, రామానాయుడు, సంగదాసు గదివంకకు చూడలేక పోయాడు. ఇల్లు ఇల్లుగాలేదు. గుయ్యారంలోకి పోయి నట్టుగా తోచింది. అతని మానసపథంనుంచి సంగదాసు భౌతికమూర్తి అంతర్ధానమైంది. అతని సౌశీల్యం, పవిత్ర భావాలూ, ఉన్నత ఆదర్శాలూ, మూర్తీభవించినై. ఆ మూర్తియందు రామానాయుడు మనసు లీనమైంది. తాదాత్మ్యభావం పొందింది. రామానాయుడు రామానాయు డుగా లేడు. నెమ్మదిగా మేడమీదకు వెళ్లాడు. కమలమ్మా, పిల్లవాడూ భవంతిలోకి పోయారు. లక్ష్మమ్మ వలవల ఏడుస్తూ, ఎదురుగా వొచ్చింది.

ల : వచ్చారా అమ్మా—(ఏడుపు.)

కమ : ఊరుకో అత్తా, చెడురోజులు వస్తే అన్నీ ఇట్లాగే తటస్థపడతవి. ఇప్పటికింకా అదృష్టవంతులమే. అంతా పరిసిపోయినట్టేనా?

ల:—పోయినట్టే అనుకుంటాను. ఆవేళ వున్న వునికి ప్రపంచాన్ని మళ్లా కళ్ళజూస్తాం అనుకోలేదు.

కమ:—అసలు దీనికి కారణం ఏమిటి అత్తా.

ల : ఏమిటంటే ఏమి చెప్పను. గ్రహచారం. ఆ చచ్చినవాడూ, మన పిల్లవాడూ ఎక్కడో కలిసి తిన్నారని మునసబు అల్లరి పెట్టాడు. ఆ తాగుబోతు వెంకన్నకు చచ్చిన వాడిమీద గుర్రు. తేపా వచ్చి ఈయనతో గుడుగుల్లాడి పోయేవాడు. ఈయన సంగతి తెలుసుగా అమ్మా, కోపం వస్తే మంచీ, చెడ్డా తెలియవు, కాలం కర్మం ఒనగూడినవి.

కమ్మ : తల్లితండ్రులు మళ్లీ వ్యవహారం తిరగదోడరుగదా?

ల : రామ రామ. వాళ్లననడం పాపం. వాండ్లనోట వొక్క దురుసుమాట రాలేదు. తమ కడుపుసొదతప్ప రెండో జోలి వాళ్ళకు లేదు. వాళ్లు కేటిస్తే వ్యవహారం బెడిసేదే. వాళ్లు మంచివాళ్లు గనకనే, ఈనాటికిల్లా ఉండగలిగాం.

కమ : మామగారెక్కడ?

ల : ఏంచెప్పను. ఎంత చెప్పినా కదలరు. ఆ గదిలోనే ఉన్నారు. వెళ్దాం రా....అబ్బాయీ, కమలమ్మా వచ్చారు....కూరుకు పట్టిందా.

చౌద : వొచ్చారా నాయనా, ఈ స్థితిలోవున్నాం.

[కన్నీళ్లు పెట్టుకుంటాడు.]

కమ : ఇంకా అదృష్టవంతులం. మర్యాదకు భంగం లేకుండా పోయింది.

చౌద : నాయనా నాగతి ఇట్లా అయింది. దిగులుపడి కూర్చున్నా.

రా. నా. : కర్మఫలం అనుభవించక తప్పదు.

తత్వం : గట్టిగా తన పూర్వకర్మ మెప్పటికైన
కట్టి కుడువక పోదు కాశిలోనైనా
శివా—దిగులుపడు టేకాని తీరునా వెతలు.

మీరు దిగులుపడి ప్రయోజనంలేదు. రానున్నది రాక మానదు.

చౌద : ఇట్లా నన్ను అనుకుని కూర్చో (అని కావలించుకొని, పెద్ద పెట్టున ఏడుస్తాడు.) నాయనా, ఎండలోబడి వచ్చావూ? మనకన్నీ కష్టపురోజులు వచ్చినవి. తలనొప్పి వచ్చేను. కాసేపు మేడమీదకిబోయి పడుకో.

## 9

[రామదాసు ఇంటిముంగిట ఒంటరిగా కూర్చొని వుంటాడు]

అప్ప : (ప్రవేశించి) మామా.

రామ : ఏమిటి అప్పదాసూ.

అప్ప : నే నొక మాట అడుగుతాను.

రామ : అడుగూ.

అప్ప : చిన్నబావకోసం మనం చింతించి ఏమి ప్రయోజనం? ఆయన పూనుకొన్న మహత్కార్యాన్ని వోపినంతవరకు నెరవేర్చాలిగాని......

రామ : ఏం చెయ్యమంటావు.

అప్ప : ఈ ఊళ్లో కూలీలు సమాధి కట్టించడానికి సాయంత్రం సభ చేస్తారుట. నిన్ను కూడా రమ్మనమని చెప్పమన్నారు. అక్కడ భజన చేయడానికి ఇల్లు కట్టించి అక్కడ సంగపీఠం పెడతారట.

రామ : సంగపీఠమంటే ఏమి చేస్తారు.

అప్ప : గుచ్చుతో సమాధి గట్టించి, దానిమీద చావడివేసి అక్కడ భజనలూ, మతబోధ పుస్తకాలూ చదవడం, చదువు చెప్పించడం, కూలీల సభలు మొదలైనవి చేస్తారట. అదుగో శిలారు సాహెబు మళ్ళీ వచ్చాడు.

రామ : రండి కూర్చోండి, సభ నిశ్చయమేనా?

శిలారు : అంతా తయారయివున్నది. మీరువచ్చి ఏదైనా చదివి వినిపిస్తే......

అప్ప : తత్వాలు తెచ్చేదా?

రామ : తీసుకురా.....చిరతలూ, గజ్జెలూకూడా వుండనియ్.

# అయిదవ భాగము

మహాసభ .... ఊరి జనం చాలామంది వొచ్చారు. వేదాంతం కోటమ్మగారు ఆంజనేయులు మంటపం దగ్గర కూర్చున్నారు. రామదాసు రాగానే జనంలో కదిలికె పుట్టింది. మనిషి ఒక రోజులోనే సగం తీసిపోయాడని కొందరూ, ముఖంలో కాంతి ఎక్కువైందని కొందరూ అనుకున్నారు. రామదాసు కాళ్లకు గజ్జెలు కట్టుకొని చిరతలు ఎడమచేత పట్టుకొని చితారు కుడి భుజాన పెట్టి తత్వాలు ప్రారంభించాడు.

రామదాసు : యే కులమని న న్నివర మడిగితే
యేమనిచెప్పుదూ లోకులకూ
ఎలుగాకులకూ,
దుర్మార్గులకూ, యీ దుష్టులకూ ॥యే॥
ఫాలభాగమున యేలలు పాడుచు
భావం గన్నది నా కులమూ
ఇంటిలోపలనుయిల్లు గట్టుకొని
మంటిలోపల రాటం పెట్టుక,
కంటిలోపల కమురు బెట్టుకొని
ముక్కు లోపలా యేకు పెట్టుకొని
చెవులో బారా చేతికి దీసుక,

నారాయణ యని నరముదీసుకొని
శివసాక్షరి యనే తడిక వేసుకొని,
పంచాక్షరియనె కందదీసికొని
మధిమిత మధిమిత గుబ్జైజ్ గుబ్జైజ్
యేకిన కులమే మాకులమూ
ఏకిన ఏకులు పీకిన పింజలు,
లోకమంత వొక పాకముజేసుక
ఏకిన కులమే మా కులమూ.
ఒంటరిగాదూ మా కులమూ
గురుజంట దిరుగు మా కులమూ.
అండపిండ బ్రహ్మాండంబెల్ల
నిండివున్నదీ మాకులమూ.

[అంతా చప్పట్లు కొడతారు]

అప్ప : రామానాయుడుగారు వొస్తున్నారు.

(నిశ్శబ్దం)

రా. నా : దాసు .... నా మొహం నీకు చూపించలేకపోతున్నాను.

రా. దా : అవేం మాటలు నాయుడుగారు.

రా. నా : ఏమన్నా చేస్తే మే మిద్దరం కలిసే చేశాం. నా అండ జూచుకునే అతను చేశాడేమో. అతను వెళ్లిపోయాడు. నేను నా స్నేహితుని వెంట వెళ్లక .... (విచారం)

రా. దా : అట్లా అనుకోకూడదు నాయుడుగారూ, ఒకరి వెంట ఒకరు మంచివాళ్లంతా వెళ్తే ప్రపంచం ఏంకాను?

రా. నా : అతని చాటున పనిచేదా మనుకున్నానే. ఇక నేనేం చెయ్యను ?

రా. దా : సంగన్న మిమ్మల్ని పెద్దవాణ్ణిచేసి వెళ్లాడు. ఇకనుంచి తనపని కూడా మీరే చెయ్యాలి. మీరు ఇప్పుడు యిద్దరి పెట్టు.

రా. నా : నా జీవితాన్ని ఈ సంగకేషానికి అంగితం చేస్తా రామదాసూ.

[అందరూ జయ జయ కేకలు]

## ఆరవ సంఘటన-సెటిల్‌మెంటు

సూత్ర : రామదాసు కష్టాలు నానాటికీ హెచ్చిపోతున్నై. చౌదరయ్య సంగదాసు హత్యనుంచి తప్పించుకోటానికి కొంత డబ్బు ఖర్చు పెట్టాడు. ఆ డబ్బు ఎలాగైనా జమ చేసుకోవాలి. పంతులు ప్రోత్సాహంతో రామదాసు పొలం అక్రమంగా స్వాధీనం చేసుకుంటారు. పులిమీద పుట్ర అన్నట్లు, రామదాసు మొదలైనవారు కార్మికోద్యమం నెలకొల్పి చోరులకు సహాయం చేస్తున్నారనే నెపంతో కేసుపెట్టి కొంతమందిని సెంట్రల్ జైలుకీ, కొంతమందిని వుండవల్లి సెటిల్‌మెంటుకీ పంపుతారు వీరికి సహాయం చెయ్యాలని రామానాయుడు శాయశక్తులా ప్రయత్నించాడు గాని, అతని ప్రయత్నం ఫలోన్ముఖం కాలేదు. రామదాసునీ, జ్యోతినీ, మాలక్ష్మినీ సెటిల్మెంటుకి తీసుకువెళ్లటానికి పోలీసులు వస్తారు.

మా : ఎన్ని కష్టా లొచ్చినా కూలికి పోవటం తప్పిపోతుందేమో అనుకున్నా. రక్షకుడు దానిక్కూడా నిన్ను లోబరుస్తున్నాడు. బిడ్డ కూడా కూలి చెయ్యాల్సి ఉంటుంది గావాలె.

రామ : ఓసి పిచ్చిదానా, కూలి చేసుకుంటే తప్పా, దేశంలో చాలామంది కూలిచేసుకునే జీవిస్తున్నారు. మనం ముగ్గురం అయినా కలిసి ఉండడానికి భగవంతుడు అవకాశం ఇచ్చాడు. ఇక్కడికి ఇదే మహా ప్రసాదం.

మా : మన కష్టాలు ఇంతటితోనైనా అంతమైపవనటానికి వీల్లేదు. ఏమొచ్చినా మెడ లొగ్గటమే మన పని.

జ్యోతి : ఏదైనా మన మంచికే వొస్తుంది. మంచి చెడులు మనం అనుకోటంలో ఉన్నవి.

పోలీసు : వేదాంతాలు చాలించి నడవండి.

అప్ప : మామా, మామా.—(అని ఏడుస్తాడు.)

రా. నా : దాసూ, ఏమిటి, నువ్వు కూడా దుఃఖిస్తే ఓదార్చేవారెవ్వరు ?

రామదా : నాయుడుగారూ తమరు దాసుని నిలిపి దుఃఖోపశమనం చెయ్యండి.

అప్ప : నేనా, యీ ఊళ్లో ఉండను.

రామదా : ఎక్కడికి పోతావు నాయనా ? సెటిల్‌మెంటులో నిన్ను ఉండనివ్వరు.

అప్ప : అవసరంలేదు. ఏటిఒడ్డున ఇల్లు కట్టుకుంటా, పూలూ, ఆకులూ, కొమ్మలూ తెచ్చి అలంకరిస్తా, ఎప్పుడూ అనుకుంటూ వుంటా.

రామదా : నాయుడుగారూ, తమరు అతన్ని ఆపి, శాంతపరిస్తే గాని, దారికిరాడు. మనస్సు బొత్తిగా చలించినట్లు కనబడుతుంది. ఈ ఖర్మంలో అది కూడా తటస్థిస్తే—

అప్ప : మామయ్యా, ఎంత క్రూరుడవయ్యా, నన్ను రానియ్యవూ. మీతోటే వస్తా. మీరు లేని ఈ ఊళ్లో నాకేం పని. (ఏడుస్తాడు)

మాల : వూరుకో అప్పడూ, అసలే కృంగిపోతున్న మా ప్రాణాలను మరీ కుంగదియ్యకు.

రా. దా : బాబూ, సంగబావ పూనుకున్న పని నెరవేరవద్దూ, నువ్విక్కడే ఉండు.

అప్ప : వే నెందుకు ? తన పని తానే నెరవేర్చుకుంటాడు. (చప్పట్లుకొడుతూ) నేనుకూడా బావని చూట్టానికి వొస్తా, బావా, బావా.

పోలీసు : ఏమిటట్లా, గుడ్లప్పజెప్పి చూస్తూ మంచున్నారు, కదలండి, నడవండి.

దా. : అయ్యో నాయుడుగారూ, అంతకూ తమరే ఉన్నారు. అప్పుడే విషయం శ్రద్ధ వహించాలి.

ప్ర : (పకపకా నవ్వుతూ) నన్నాపగలవు గాని, నా హృదయాన్ని ఆపగలవా ? ఓ నా హృదయాన్ని కూడా ఎత్తుకుపోతు న్నావు, నన్ను వదిలి పోతావా ?

లీసు : ఇక బయలుదేరండి. ఊఁ .... (ఇద్దరి ముగ్గురు ఏడుపులు)

కరు : ఉంటాం మాలక్ష్మీ.

ుడవ : మీకూ మాకూ ఋణం తీరింది.

. దా : భగవంతుని ఆజ్ఞ ఎలా ఉంటే అట్లా జరుగుతుంది, నాయుడుగారూ, సంగీతం మరవకండి.

ూడవ : ఆ ఇల్లాలి మొహం చూపించుటకే సిగ్గుగా ఉంది. చెరుగుతో మొహం కప్పుకొని ఎట్లా పోతోందో.

. నా : సీతారాములు అయోధ్య విడిచి అరణ్యం వెళ్తున్న ట్లుంది.

## 2

ూత్ర : రామదాసు పెద్దకొడుకు వెంకటదాసు ఈ అన్యాయా లను సహించలేక దౌర్జన్యవాదులలో కలిశాడని చెప్పాం. అతడు ధర్మకన్నాలు వేయుస్తూ సమతాధర్మం బోధిస్తూ తక్కెళ్ల జగ్గడు అని ప్రసిద్ధి కెక్కాడు. అతనికి అనేక మంది శిష్యులు పోగయ్యారు. దేశంలో ఏమూల చూసినా అతనే. అతని సిద్ధాంత ప్రచారమే.

[రైలు వెళ్తున్న శబ్దం]

రామరామ శ్రీరామా రామా—రామా రఘురామా
తక్కెళ్ల జగ్గని ధర్మబోధలు తలపున నిలపండి
ఆదికాలమున అందరు జనులు అన్నదమ్ములండి
నదులు వనంబులు నానామృగములు నాల్గు సంద్రములును
కొండలు వండ్లు జలములు పొలములు
గుంటలు సెలయేళ్లు
కాయలు పండ్లు పాడిపంటలు ఘనమయినా యిండ్లు
అంతరువులా భేదములేక అందరి సొమ్మండి
కుడవా గట్టా ఒకరికి బెట్టా కొదవే లేదండి
నా నీ భేదము లేక లోకము నడుస్తు ఉండేది
మనసులోపలా చీకుచింతలు మందుకైన లేవు
రామరామ శ్రీరామా రామా రామా రఘురామా
తక్కెళ్ల జగ్గని ధర్మపన్నముల్ తలచి బ్రతుకరండి.
ధనికులు బొర్రల నిమురుకొందురు తలప రొకరి బాగు
చేతుల వేళ్ల పనులు ముట్టక చెడి పోదురు ఐయిరి
కాలిమీదనె కాలు వేసుకొని కాలం బుచ్చేరు
భాగ్యవంతులకు బీద లెల్లరు బానిస లయినారు
పొద్దుగూకులు చాకిరి చేస్తురు బొక్కెడు కూటికిగా
యెంత చేసినా తృప్తి లేదయా యజమానులకెల్ల
రోగం రానీ నొప్పీ రానీ, నాగా దప్పదయా.
కూలికి విలువ గలదని మీరు గుట్టు తెలుసుకొండి
కూలికి దగిన విలువ పుచ్చుకునే కులికి మరి పొంది
నీళ్ల కూలికి వొప్పుకుంటిరా, నెనరు చెరుపుకొంద్రు
పనివాండ్లందరు యేకమై తిరా ప్రపంచమే మీది
ఐకమత్యమే అన్ని పనులకు ఆధారము సుండి
శ్రేణులు గట్టి సమ్మె గట్టితే చెల్లను మీమాట
కొట్టావద్దు తిట్టావద్దు కోర్కెలు నిడివేరున్
అసహాయ యోగము తరుణము చూచి అవలంబించండి
దానికి మిగిలిన మంత్ర తంత్రములు ధరలో లేవండి
శంకలు దక్కి మీర లెల్లరు శపథము చేయండి
సమతాధర్మం ప్రపంచమందున స్థాపింతురుగాని
కృతయుగధర్మం లోకమంతా కుదుటబెట్టగలరు
రామరామ శ్రీరామా రామా రామా రఘురామా.

ఒకడు : ఆయన చదివిన తత్వంలో ఒక్కటీ అసత్యం కనబడ లేదు.

రెండు : యదార్థవాదీ లోక విరోధీ అని వున్న సంగతి చెప్పటం లోకకంటకంగా ఉంటుంది.

మూడు : మహా మాట్లాడుతున్నావు, ఈ రోజుల్లో కొందరు పోలీసులు మారువేషాలలో ఉంటారట.

పోలీసు : అతడే తక్కెళ్ల జగ్గడు పట్టుకోండి.

ఒకడు : ఆఁ తక్కెళ్ల జగ్గడా.

రెండు : అమ్మయ్యో.

మూడు : పట్టుకోండి.

పోలీసు : పారిపోతున్నాడు.

[కొంచెంసేపు గోల. రైలు తక్కున ఆగుతుంది. గోల సర్దుకుంటుంది.]

పోలీసు : ఏడీ ?

ఒకడు : కిటికీలోనుంచి దూకి పారిపోయాడు.

పోలీసు : రండి, కంట్లో కారంకొట్టి పోయాడు. ఎక్కడున్నా పట్టుకోవలసిందే.

[పోలీసులు విజిల్సు క్రమక్రమేపీ ఫేడౌట్ అవుతవి]

## 3

వెంకటదాసు : సోదరులారా, దొంగతనాలు చేయటం మన ఆదర్శం కాదు. మనం ఎందుకు దొంగతనాలు చేస్తున్నాం ? బీదలను పీడించి ధనాన్ని పోగుచేసిన ధన వంతుల నుంచి బీదవాళ్లకు పంచిపెట్టడం కోసమే. మన సంఘంలో బీదవాళ్లు తిండికిలేక మలమల మాడి పోతున్నారు. వాళ్లను కాపాడవలసిన బాధ్యత మనమీద ఉంది. ఈ ఆదర్శంతోనే మనం దొంగతనాలు చేస్తున్నాం. అందువల్ల చోరీలు జరిగించేటప్పుడు అనవసరంగా ఎవరినీ గాయపరచకూడదు. ఖూనీలు జరగకూడదు. మన ఆదర్శం సమతాధర్మం. దీనిని నెలకొల్పటానికి

మనం అనువుగా ప్రవర్తించాలి. మీరంతా ఈ ధర్మ స్థాపనకు ప్రాణాల నర్పించడానికి కూడా సిద్ధంగా ఉండాలి.

[చప్పట్లు]

ఒకరు : రాజాధిరాజ శరణాగత రక్షణ సర్వమత స్థాపనాధికార తక్కెళ్ల జగన్నాథం గారికి

అందరు : జయ్.

ఒకరు : సమతాధర్మ స్థాపకులకు

అందరు : జయ్.

## 4

రామదాసు : అప్పుడు ఇంటిదగ్గర ఎంత అలమటిస్తున్నాడో.

మాలక్ష్మి : ఇప్పటికి పది పన్నెండేండ్లనుంచి నా చేతిమీదుగా అన్నం పెట్టాను. ఈ కాలానికి ఎడమైనాడు. అన్నం మకుతున్నడో లేడో, ఎట్లా ఉన్నాడో.

## 5

రామానా : అప్పుడూ నువ్విట్లా కుమిలిపోతే ఎట్లా ? సంగదాసు పూనుకున్న పని నెరవేరవద్దూ.

అప్పడు : నే నెందుకు ? తనపని తానే నెరవేర్చుకుంటాడు. (చప్పట్లు కొడుతూ) నేనుకూడా బావను చూట్టానికి వెడతా.

శేషయ్య : రామానాయుడుగారూ, అంతకు తమరే ఉన్నారు. అప్పడి విషయం తమరు శ్రద్ధ వహించాలి.

అప్పడు : (పకపక నవ్వుతూ) మామా, నన్నైనతే ఆపావుగాని, నా హృదయాన్ని ఆపగలవా ? నా హృదయాన్ని కూడా ఎత్తుకుపోయావు—జ్యోతీ, నన్నొదిలి పోయావా ? ఎట్లా వదిలిపోతావు. నీవు నా హృదయంలో ఉన్నావు. మనిద్దరం కలిసే పోదాం, జ్యోతీ, జ్యోతీ.

[పకపక నవ్వుకుంటూ వెళ్ళిపోతాడు]

## 6

సూత్రధారి : సెటిల్‌మెంట్.

రామదాసు : ఆ పెట్టినవాండ్లు అప్పణ్ణి కూడా కలిపైనా పెట్టకపోయిరి. ఏ కలో తాగుతూ అంతా ఒకచోటే పడి ఉందుము. అమ్మా నిద్రపోతున్నావా ?

మా : వొళ్లు అలసి పడుకొన్నది. జోతీ, నేను లేచి రాలేసు గాని, నా పక్కలో వొచ్చి పడుకో, తమ్ముడేం చేస్తున్నాడు.

జ్యోతి : నిద్రపోతున్నాడు.

రామదా : అయ్యో. అన్నం తినకుండా నిద్రపోతున్నోడా ? పక్కేమన్నా వేశావా ?

జ్యో : అమ్మ కాళ్ళేడుకోక సగం పక్కవేసి, సగం కప్పా!

రామదా : ఇట్లా నా పొట్ట కానుకొని కూర్చో. ఈ పిచ్చితల్లి కెన్ని కష్టా లొచ్చినయ్యమ్మా.

జ్యోతి : (ఏడ్చి) అయ్యా, నా కష్టా లొక లెక్కా. వేళపట్టున ఇంత అన్నం తిని కృష్ణా, రామా అంటూ పడుకోవలసిన రోజుల్లో, నీకీ స్థితి తటస్థించింది. ఎందుకు మేము ఇంతమందిమి పుట్టి ? అంతా పండితులమే. పెద్దతనంలో అక్కరకు రానివాళ్లం.

రామదా : అమ్మా నా గర్భవాసాన పుట్టబట్టి మీకీ తిప్పలు వొచ్చినవి. మీరెంత ప్రయోజకులైనా, నాది ఆఖరు రోజుల్లో నిర్ధన జాతకం.

మా : అందరికీ వొక్క వ్రాత వుండబట్టే, అందరు దరిద్రులమూ వొక్కచోట చేరాం. ఇంతమందిలో ఒక్కరిది మంచి గీత కాకూడదూ ?

రామదా : ఈ భాగ్యాలకూ దరిద్రాలకూ ఏమిగాని, ధర్మం మనం తప్పకుండా వుండవలె.

జ్యోతి : నీ గర్భవాసాన జన్మించినవాళ్లకు ధర్మచ్యుతి ఎప్పుడూ ఉండదు.

రామదా : ఏదమ్మా, పనిచేస్తే ఎట్లా ఉన్నయ్యో నీ చేతులు చూతాం.

జ్యో : ఇప్పుడు నా చేతు లెందుకులే.

రామదా : ఎందుకులే అంటున్నావు? పెద్దబొబ్బలు పోయినవా ఏమి ? ఏదీ దీపం ? ఇట్లా తీసుకురా.

మా : ఇదిగో .... ఓసి నీ కడు పుడకా. ఎంత బొబ్బలు పోయినవే. రేపు నీవు చేతులు కదల్చగలవా ?

జ్యో : ఇంతమాత్రానికేనా ? అంతకీ అయితే తట్టలు మోస్తా.

సూత్రధారి : సెటిల్‌మెంటులో పోలు అనే అతను మొదటినుంచీ జ్యోతిమీద కన్ను వేశాడు. తన ప్రయత్నాలకు రామదాసూ, మహాలక్ష్మి అడ్డనే ఉద్దేశ్యంతో అధికారులను కూడగట్టుకుని రామదాసునూ, మహాలక్ష్మిని సెంట్రల్‌జైలుకు మార్పించాడు. సెటిల్‌మెంటులో జ్యోతి ఒక్కతే ఉంటుంది. ఆరోజు తెల్లవారు ఝామున ........

[కృష్ణానది ధ్వని ఇప్పటినుంచి ప్రారంభమై, క్రమక్రమేణా ఎక్కువవుతూ ఉంటుంది]

ముసల్ది : నువ్విక్కడే ఉండు. కృష్ణ స్నానానికని దాన్ని లేపుకొస్తా.

పోలు : ఇంతకీ ఒప్పుకుంటుందా ?

ముసల్ది : అది ఒప్పుకునేదేంది మనమడా ? నువ్వేం మగాడివి గాదా ?

పోలు : ఏవో పాచికలు వేసి అది ఇక్కడికి వచ్చేటట్లు చెయ్యి. తరువాత చెపుతా.

ముసలి : అట్లాగే, ఆ దుబ్బుచాటున ఉండు.

* * * *

ముసల్ది : జ్యోతీ, జ్యోతీ, లేవే. (జ్యోతి నిద్దరలో మూలుగుతుంది.) తెల్లవారిందే, ఇంక కృష్ణకు పోయే దెప్పుడు, స్నానాలు చేసేదెప్పుడు.

జ్యోతి : కాసేపు ఉండవ్వా, ఇంకా చాలా పొద్దు ఉంది.

ముసల్ది : మీ బావను కలగంటున్నావటే ? లేపినా మునుగు తన్ని పడుకున్నావు ?

జ్యోతి : అబ్బా .... పొద్దున్నే లేపావు. నాకెంత కోప మను కున్నావు ?

ముసల్ది : చిటికెలో స్నానంచేసి వద్దాం, రావే.

జ్యోతి : నీది మొండి పట్టుదల అవ్వా—వద వస్తా.

## 7

పోలు : ఓ చెలియా, ఓ మగువా, ఓ లలనా, ఓ సఖియా, ఎంత కృూరురాలవే. నా ప్రాణాన్ని నిలువునా తీసుకున్నా— ఓ జ్యోతీ, నీ అందం వెలిగిపోతున్నది. ఆహాహో, నాజ్యోతి ఎంత మంచిదయ్యా.

(పాట) : నన్ను పెండ్లాడవే చెంచీత
నీకు బహుపుణ్య ముంటాదె చెంచీత
నేను నరసింహస్వామినే ఓ ముద్దు చెంచీత
నన్నేలుకోవే

(అని సుద్దులరాగం తీస్తాడు.)

అదిగో, అదిగో, వస్తున్నట్లుంది, ఇక్కడ దాగుంట.

సూత్రధారి : జ్యోతి కయ్య దగ్గరికి వచ్చేటప్పటికి మనిషి లేచి నిలబడ్డట్టుగా ఉంది. తెల్లగా దుస్తు లున్నాయి. దారి లోకి వచ్చి అడ్డంగా నిలబడ్డాడు.

పోలు : (పాట) నే తాళలేను ఇకను
తాళలేనే భామా, నేను తాళలేనే భామా.

జ్యోతి : ఆఁ ......

సూత్రధారి : జ్యోతి తొలగిపోబోయింది. ఎటు తిరిగితే అటు వచ్చాడు పోలు. పోలును గుర్తించేటప్పటికి జ్యోతికి అను మానం ధృడపడింది.

జ్యోతి : అడ్డంలే.

పోలు : ఇదిగో .... కాస్త నామాట విను.

సూత్రధారి : పోలు వాటేసి పెట్టుకోబోయాడు. జ్యోతి కృష్ణ అంటూ కృష్ణవైపుకి పరుగెత్తింది. ఇద్దరూ వెంటబడ్డారు. చెరొకవైపునా కమ్మారు. నీళ్లలోకి దిగింది. వాళ్లూ దిగారు. మోకాళ్లలోతు నీళ్లలోకి పోయింది. వాళ్లిద్దరూ ఆగలేదు. వెంటబడ్డారు. ఓ దానూ, ఎక్కడున్నావు ? దబ్బున రా అని కేక వేసింది జ్యోతి. ఆమెకు ఆ క్షణం అంతా దాను మయమైంది. వాడు ఇంకా దగ్గరకు వస్తున్నాడు. పోలు రెండు చేతుల తోనూ వాడిసి పట్టుకోబోయాడు. రాహువు పట్టు తప్పించుకున్న చంద్రబింబం వలే, చేతులమధ్యనుంచి దూసు కొని పరుగెత్తింది జ్యోతి. మళ్లీ కేకవేసింది. ఈసారి కేక ఇతరులకు వినబడలేదు. కృష్ణ వాడిసి వచ్చి, తన లోకి లాక్కున్నది. కనబడకుండా కెరటాల్లో దాచు కుంది జ్యోతిని.

[జలం కోలాహలం]

కూలి : ఇసుకలో కూరుకుపోతే బయటికి లాగాను దొరా.

దొర : ఎవరో గుర్తుపట్టారా ?

కూలి : రామదాసు కూతురు జ్యోతల్లే ఉంది.

అప్పదాసు : (ప్రవేశించి) జ్యోతా, .... ఏదీ నా జ్యోతి .... ఎక్కడుంది ? తొలగండి .... నా జ్యోతి నుంచి నన్నె వరూ వేరు చేయలేరు .... జ్యోతీ. (శవాన్ని చూచి) చివరి కిట్లా కృష్ణకి ప్రాణా న్నర్పించుకున్నావా ? .... ఇదిగో నీకోసం పూలు తెచ్చాను. నన్ను విడిచి వెళ్లిపోదా మనుకున్నావా ? నే నెలా ఒప్పుకుంటాను జ్యోతీ .... నీతోనే వస్తా.

[పకపక నవ్వుతూ]

(పాట) : నీకూ నీవారూ లేరు, నాకూ నా వారు లేరు
ఏటిఒడ్డున ఇల్లు కడదాం పదరా ....

కూలి : ఆఁ .... శవాన్ని బుజంమీద ఎత్తుకొని పరుగెత్తు తున్నాడు.

ఇంకొకరు : నీళ్లలోకి చొరబడ్డాడు.

కూలి : ప్రవాహంలో తేలిపోతున్నాడు.

ఒకరు : ప్రవాహానికి అడ్డం పడ్డారు.

కూలి : అయ్యయ్యో మునిగిపోయారు.

ఒకరు : అదుగదుగో అక్కడ తేలారు.

కూలి : ఇంకా తేలేదేముంది. కొట్టుకుపోతున్నారు.

[కృష్ణానది ధ్వని క్రమక్రమేణా ఎక్కువై యీ స్థితి వచ్చేటప్పటికి ఉధృతమవుతుంది. ఆ ఉధృతంలో కలసి కృష్ణమ్మనల్లే పాడి నట్లుగా చల్ మోహనరంగా పాట వినపడు తుంది]

# అమావాస్య దీపాలు

"దాశరథి"

సైనికుని
శిరస్త్రాణంలో
సాలీ డల్లినగూడు
శుభం చెబుతున్నది.

మర ఫిరంగీలో
మందు దట్టించేచోట
పిచ్చుక వెంటి నీళ్ళాడింది.

బాంబుల కంచెంబుతో
మంచినీళ్ళు తాగుతున్నది అనాథ.

వెన్నెలరాని వెర్రి అమావాస్యనాడు
కన్నులపండువుగా దీపావళి!
నిప్పు పిండితే
వెలువడే నీళ్ళు!
జైళ్లు పిండితే
జాలువారే కన్నీళ్లు!

మాట పట్టింపులూ
మారణాయుధాల రెట్టింపులూ
మానేయాలి మానవుడు.
యుద్ధం చేసి గెలిచేరోజులు
అబద్ధం చెప్పి నిలిచే రోజులు
అంతమైనాయి.

హింస, ఇస్త్రీ చెడిన బట్టలా
ఇంపు నివ్వదు మానవ శరీరం మీద.

దెబ్బకు దెబ్బ అని
బొబ్బలు పెట్టిన
బెబ్బులుల్ని
రబ్బురోట్లో తిప్పేసింది కాలం.
సహనం, హింసను దహనం చేస్తుంది.

క్రౌర్యానికి లొంగనివాడు, సిసలైన
ఆర్యుడు (హిట్లర్ ఆర్యుడా ?)
కమిచీ దెబ్బలకు జంకక
హిమాచలంలా నిలబడి
అమృతం వర్షించేవాడు నాగరకుడు.

కత్తుల్తో పొడిచేవాడు
సత్తువలేని చచ్చుదద్దమ్మ.
నెత్తురు తాగే దేశం
మిత్తికి పెద్దమ్మ.
దురాక్రమించే నాయకుడు
పరాక్రమం అంటే ఏమిటో తెలియని పంద.
కుట్రలు కుహూకాలు చేసేవాడు
కురుపు మీది ఈగలాటివాడు.
నిదానించి ఉదారంగా ప్రవర్తించే జాతి
లోకానికి నేర్పగలదు నీతి.
నిజమైన శక్తితో రావాలి ఖ్యాతి
కులమతాల బలంతో వచ్చేది పూతిగంధం
నూనెసహాయంతో వెలిగేదివత్తి
నూనె సహాయం కోరనిది జ్యోతి
మలిగిపోయేది వత్తి
మలిగిపోనిదే జ్యోతి.

నీలాకాశ హాలాహాలాన్ని

# అమావాస్య దీపాలు

జ్వాలా కాలగళ స్వామికి
చెరకు పానకం అందించి
చల్లార గొట్టకండి చవకబారు భక్తుల్లారా!
జవరాలి చనుకట్టును చప్ప చప్పగావర్ణించి
యువకుల్ని ఉద్రేకపరిచే కవితా హిమపాయసం
కాలపు గ్రీష్మాతపానికి తట్టుకోలేక
కావు కావుమనే వాయసం.
కవిత్వం పాడి చవి చెడగొట్టకండి,
నకిలీ వజ్రాల్ని మార్కెట్లో పెట్టకండి,
ముట్టకండి దొంగ సారాయిని
వాయించకండి బంగారు సన్నాయిని.

ఆశ్రయింపుల కంపుతో
తలవంపులుగొన్న కళాకారుణ్ణి,
బిరుదాల పరదాల్లో బిగించి
గోషా యోషా పరిష్వంగాలు పంచకండి.
కాలం జ్ఞానం నేర్పుతుంది
కాలం గాలంవేసి పడుతుంది దొరకని చేపల్ని
కాలం పాఠం నేర్పుతుంది.
కాలం కులాల కులాయాల కోనల్లో
కూసేదొంగ కోకిలల్ని కొడుతుంది.
కాలం, వర్గాల వర్ణాల పర్ణశాలల్లో పడుకునే
పచ్చిదొంగ సన్యాసుల్ని పడుతుంది.
కాలం, పబ్లిసిటీలవల్ల సిటీలో పేరుగొన్న-
కవిశేఖరుణ్ణి తిడుతుంది
కాలం కల్తీని పసికడుతుంది.
కాలం కల్మషాన్ని కడిగేస్తుంది,
చిత్రికపడుతుంది.
విశ్వాసపాత్రురాలైన ప్రియురాలిలా
వీపు తడుతుంది.

## ఖా ర

కాలాన్ని మోసం చేయాలనుకునే
ఇంద్రజాలికుల్లారా!
బదనిక చేత పెట్టుకున్న
పల్లెపడుచుమీద
కనికట్టువిద్య
పనిచేయదు!

మీ ఇంద్రజాలం మిమ్మల్నే
దగా చేస్తుంది
కాలం ఒకనాటికి మిమ్మల్ని మింగేస్తుంది
వీస్తుంది ఝంఝామరుత్పరంపర
ప్రళయం వస్తుంది.
మదాంధుల్ని తుడిచేస్తుంది
కళ్ళు తెరచి చూడండి.
'కాటరాక్ట్' ఆపరేట్ చేయించుకోండి.
జాతికి 'రెటీనా డిటాచ్ మెంట్' జరిగిందా
జన్మ జన్మాలకీ కళ్లు కనపడవు.
యుద్ధాల అబద్ధాలు గెలవ్వు
శాంతి సమానాల సత్యం గెలుస్తుంది.
పైన పటారాలు నిలవ్వు
నిజమైన కవిత్వం నిలుస్తుంది.

# అమావాస్య దీపాలు

జ్వాలా కాలగళ స్వామికి
చెరకు పానకం అందించి
చల్లార గొట్టకండి చవకబారు భక్తుల్లారా!
జవరాలి చనుకట్టును చప్ప చప్పగావర్ణించి
యువకుల్ని ఉద్రేకపరిచే కవితా హిమపాయసం
కాలపు గ్రీష్మాతపానికి తట్టుకోలేక
కావు కావుమనే వాయసం.
కవిత్వం పాడి చవి చెడగొట్టకండి,
నకిలీ వజ్రాల్ని మార్కెట్లో పెట్టకండి,
ముట్టకండి దొంగ సారాయిని
వాయించకండి బంగారు సన్నాయిని.

ఆశ్రయింపుల కంపుతో
తలవంపులుగొన్న కళాకారుణ్ణి,
బిరుదాల పరదాల్లో బిగించి
గోషా మోషా పరిష్వంగాలు పంచకండి.
కాలం జ్ఞానం నేర్పుతుంది
కాలం గాలంవేసి పడుతుంది దొరకని చేపల్ని
కాలం పాఠం నేర్పుతుంది.
కాలం కులాల కులాయాల కోనల్లో
కూసేదొంగ కోకిలల్ని కొడుతుంది.
కాలం, వర్గాల వర్ణాల పర్ణశాలల్లో పడుకునే
పచ్చిదొంగ సన్న్యాసుల్ని పడుతుంది.
కాలం, పబ్లిసిటీలవల్ల సిటీలో పేరుగొన్న
కవిశేఖరుణ్ణి తిడుతుంది
కాలం కల్తీని పసికడుతుంది.
కాలం కల్మషాన్ని కడిగేస్తుంది,
చిత్రిక పడుతుంది.
విశ్వాసపాత్రురాలైన ప్రియురాలి
వీపు తడుతుంది.

# ఆకర్షణలో అపస్వరాలు

**శ్రీ సింగరాజు లింగమూర్తి**

ఆరోజుకు ఆటవిడుపుగా గుమాస్తాల గడియారం చిన్నముల్లు అయిదు మీదకు నడిచి వచ్చేసింది.

మరో అయిదు నిమిషాల్లో ఆఫీసునుంచి బయట పడి, ఇండ్లకు చేరుకోటానికని తాపత్రయ పడుతున్నారు, బస్‌స్టాండు దగ్గర. కొందరు సైకిళ్లు తొక్కేస్తున్నారు.

అప్పుడే ఆఫీసు ఆవరణంలోంచి బయటకు వచ్చిన దాసుకు ఎటుపోవడానికీ తోచలేదు. గేటు ముందర నిలబడి పోయాడు. ఎవరికోసమో వెతుకుతున్నట్లున్నాయి అతని చూపులు.

ఆర్. టి. సి. బస్సులు, కార్లు, రిక్షాలు, సైకిళ్లు గజిబిజిగా రోడ్డుమీద చదరంగం ఆడుకుంటున్నాయి.

ఒళ్లంతా కళ్లు చేసుకొని దాసు సైకిళ్లమీద పోయే వారిని పరిశీలిస్తున్నాడు.

పది నిమిషాలు గడిచాయి. దాసు ఒక నిట్టూర్పు విడిచాడు. "ఏమైనా పనివుండి రాలేదేమో రమణ......తీరా నే నిటు వెళ్ళగానే వస్తాడేమో!" అనుకున్నాడు. "ఇంకేం వస్తాడులే" అని ప్రతిధ్వనిస్తున్న నిరాశతో ఆశను పోరాటానికి వదిలి, ఆ సంఘర్షణమధ్య అక్కడినుంచి కదలలేక పోతున్నాడు.

ఇంతలో "ఏం సార్—ఇంకా నిలబడ్డారేం?" అంటూ ఇంటికి పోబోతున్న ప్యూను పలకరించాడు దాసును.

తలెత్తిచూశాడు. "అబ్బే—ఏంలేదు యాదయ్యా!.... ఒక స్నేహితుడు వస్తానన్నాడు......" అని నీళ్లు నమిలాడు దాసు.

"వస్తాను సార్" అంటూ యాదయ్య బయలుదేరాడు. ఎదురు చూస్తున్న వ్యక్తి ఇంక రాడనుకున్నాడేమో దాసు. ఉసూరుమంటూ యాదయ్య వెనకాలే భారంగా అడుగులు వేశాడు. అతని చూపులన్నీ యాదయ్య వెన్నంటి ఉన్నాయి.

ఆ సమయంలో యాదయ్యను చూచిన వారెవ్వరూ ప్యూను అనుకోరు.

బుష్‌కోటు, పాంటు, చేతికి గడియారం, కాళ్ళకు హవాయి చెప్పులు, చక్కగా తీర్చి దిద్దిన క్రాపు—ఇలాంటి యాదయ్యను గుమాస్తాయేమోనని అనుకోకుండానూ ఉండలేరు.

కాలర్ చిరిగిన బుష్‌కోటు, జేబులూడి, పైకి పీక్కుపోయిన పాంటు, కాళ్లకు ఉంగటాలు వూడిపోయిన చెప్పులు, కొద్దిగా మాసిన గడ్డం—ఇలా ఉన్న దాసునుచూస్తే ప్యూనేమో అనీ అనుకోవచ్చు.

యాదయ్య ఒకసారి వెనక్కు తిరిగి చూశాడు. ఆ క్షణంలోనే దాసు "యాదయ్యా!" అని పిలిచాడు. పిలుస్తూనే అనుకున్నాడు—యాదయ్య చూపుల్లో ఏదో అవహేళన ఉన్నట్టు. "అరరే—ఎందుకు పిలిచానా" అని నాలుక కరచుకున్నాడు. ఇంతలో యాదయ్య దగ్గరకు వచ్చి, "ఏమిటిసార్!" అన్నాడు. ఆ అనడంలో కూడా ఏదో వ్యంగ్యం స్ఫురించినట్లనిపించింది.

దాసు ఏదో చెబుదామనుకున్నాడు. కాని, ఆ అనుకున్నది పెదవులు దాటి రాలేదు. యాదయ్య అది గ్రహించి లోలోపలే నవ్వుకున్నాడు, దాసులోఉన్న పనికిమాలిన అభిమానానికి. అతను అడగబోయేది ఏమిటో కూడా యాదయ్య పసికట్టేశాడు. అదేమిటో దాసు చేతనే చెప్పించి, తాను ఏవిధంగా సమాధానం ఇవ్వాలో కూడా నిర్ణయించుకున్నాడు యాదయ్య.

"చెప్పండిసార్......ఎందుకో పిలిచారు" అని మళ్ళీ యాదయ్యే అడిగాడు.

అభిమానంతో కుంచించుకుపోతున్నాడు దాసు. నాలుక తడి ఆరిపోతున్నట్టు అనిపించింది. వద్దు వద్దనుకుంటూనే "చాలా అవసరంగా పాతిక రూపాయలు కావాలి......ఎవరి దగ్గరైనా ఇప్పిస్తావా?" మాటలు కూడ దీసుకుంటూ అనేశాడు దాసు.

"వడ్డీకితప్ప, చేబదు లెవరిస్తారు సార్!" నవ్వులో సానుభూతిని మిళాయిస్తూ అన్నాడు యాదయ్య.

"వడ్డీకే......ఎక్కడైనా ఇప్పించు"

యాదయ్య ఓ క్షణం చూస్తూ వూరుకున్నాడు. దాసు ఆశగా యాదయ్య ముఖంలోకి చూసేప్పటికి, "ఇవ్వాళ్ల కనుక్కొని రేపు చెప్తాను సార్" పట్టుగా అన్నాడు యాదయ్య.

యాదయ్య తలచుకుంటే క్షణాలమీద ఇప్పించగలడని దాసుకు తెలుసు. అతను రేపటికి వాయిదా వేసేప్పటికి ఇంకేం మాట్లాడ లేకపోయాడు దాసు. ఆ క్షణంలో "రేపటి దాకా గడపడం ఎట్లా?" అనేదే దాసు ఆలోచన.

"ఈయనకు డబ్బు చాలా అవసరంలాగానే ఉంది. తన దగ్గర ప్రస్తుతం పదిరూపాయ లున్నాయిగా......ఇస్తే...ఊ.. ఉహూ......అడగ్గంగానే ఇస్తే దాని విలువే ముంటుంది?" అనుకుంటూ యాదయ్య, "రేపు తప్పకుండా ఇప్పిస్తాలెండి...... వస్తా......" అంటూ ఒక మలుపులో విడిపోయాడు.

ఆకాశంలో మేఘాలు కమ్ముకుంటున్నాయి. చల్లగాలి కొడుతున్నది. వర్షసూచనలుచూసి, రోడ్డుమీదిజనం తొందర పడుతున్నారు. దాసు కూడా అరిగిపోయిన చెప్పుల్ని ఈడ్చుకుంటూనే వడివడిగా నడుస్తున్నాడు.

దాసు నడుస్తున్నాడేకాని, మనస్సు ఏడుస్తున్నది. "ఇంటిదగ్గర తనకోసం అంతా ఎదురు చూస్తుంటారు. ఉత్త చేతుల్తో వెళ్ళి అందరికీ ఆశాభంగం కలిగించాల్సిందేనా?" అని ప్రశ్నించుకున్నాడు. ప్రొద్దున ఆఫీసుకు బయలు దేరిన ఘట్టం జ్ఞాపకం వచ్చింది. అందరూ కళ్ళముందు కదలాడారు. వాళ్ల మాటలు చెవుల్లో గింగురుమంటున్నాయి.

"సాయంత్రం నీవు వచ్చి బియ్యంతెస్తేగాని వంట చేయ డానికి వీల్లేదు నాయనా!"

"ఇవ్వాళన్నా డాక్టర్ వ్రాసిచ్చినమందు తీసుకురా అన్నయ్యా......నట్టింట్లో తిరిగేపిల్ల మూడు రోజులనుంచి మూసిన కన్ను తెరవకుండా పడుంటే నాకెదో భయంగాఉంది."

"మాయ్యా—సాయంత్రం నాకు బిస్కెతు తెత్తి పెత్తవూ!"

"వచ్చేటప్పుడు ఏకంగా కాఫీపొడి కూడా తీసుకురా అన్నయ్యా!"

"చుట్టలు అయిపోయాయిరా అబ్బాయ్!"

ఒకటి తరువాత ఒకటి అన్నీ జ్ఞాపకం వస్తున్నాయి.

"రమణ సాయంత్రం ఆఫీసుకు వచ్చి తప్పకుండా ఇస్తా నని మాటిచ్చాడు......ఎందుకు రాలేదో!......అతనికీ డబ్బెక్కడా ధొరకలేదేమో!" అనుకుంటూ నడుస్తున్నాడు దాసు.

ఇంతలో వర్షం ప్రారంభమైంది. దాసు త్వర త్వరగా నడుస్తున్నాడు. ఒక హొటలుముందుకు వచ్చేప్పటికి వర్షం ఎక్కువైంది. అప్పటికే కొందరు హొటల్లో దూరారు. కొందరు హొటలుబైట అరుగుమీదకుఎక్కి తలదాచుకుంటు న్నారు. దాసు కూడా వాళ్లల్లో చేరాడు. "హలో—దాసూ!" లోపలినుంచి ఎవరో కేకవేశారు. దాసు అటువైపు చూసేప్ప టికి పోయిన ప్రాణం వచ్చినట్లయింది. చరచరా హొటల్లోకివెళ్లి, "ఏం రాజూ—ఎక్కడా కనిపించడంలేదే" అంటూ పక్కకుర్చీలో కూర్చున్నాడు.

"తీరికెక్కడుంది బ్రదర్!" అంటూ సర్వర్‌ను కేక వేశాడు రాజా.

జనంతో క్రిక్కిరిసిపోయింది హొటలు. దారిలో దాపురించిన వర్షాన్ని తిట్టుకుంటూ, తలదాచుకుంటానికి వచ్చినవారుకూడా వూరికే కూర్చుంటే ఏం బాగుంటుందని ఏదో ఒకటి తెప్పించుకొని, యజమానికి సొమ్ముచేసి పెడు తున్నారు. హొటలు రేడియోలో రికార్డులు సంగీతాన్ని కుమ్మరిస్తున్నాయి.

"ఏం సార్—ఎన్నా వేణుం?" అంటూ సర్వర్ రాజా, దాసూ కూర్చున్న టేబిలు దగ్గరకు వచ్చాడు.

"చెప్పు బ్రదర్—ఏం తెప్పిద్దాం?"

"నీవే చెబుదూ—ఏదో ఒకటి"

"ముందు తాజాగావున్న స్వీట్సు రెండు తీసుకురా—తర్వాత రెండు పూత్తప్పం" అన్నాడు రాజా.

"రెండు పూత్తప్పం" అని కేకవేస్తూ సర్వర్ వెళ్లాడు. ఆ గొంతుతో మరికొందరు సర్వర్ల గొంతులు వంతపాడాయి.

"మూడు దోసై"

"పెసరట్!"

"ఎట్టణా!"

"అంజణా!"

కౌంటరుదగ్గర డబ్బులు చప్పుడు చేస్తున్నాయి.

బైట వర్షం ఉధృతంగా పడుతున్నది. చలిగాలి 'బోయ్' మని లోపలకు చొచ్చుకు వస్తున్నది.

సర్వర్ స్వీట్సు, మంచినీళ్ల గ్లాసులు తెచ్చి, బల్లమీద పెట్టి వెళ్లాడు.

"మొన్న మీ నాటకానికి వచ్చాను దాసూ!......నీ యాక్ష న్సు అద్భుతంగా ఉన్నాయి. నాటకం కాగానే వచ్చి కలుద్దా మనుకున్నాగాని, ఫామిలీతో వచ్చానాయె—అందుకని కలవలేక పోయాను" అన్నాడు రాజు.

"ఉహూఁ" ముక్తసరిగా అన్నాడు దాసు.

తన నటనను గురించి దాసు ఎవరినీ అడగడు. ముఖత: ఎవరూ సువిమర్శ చేయరని అతని ఉద్దేశం. ఎవరైనా పొగుడు తుంటే సిగ్గుపడతాడు. లోపాలను ప్రత్యక్షంగా చెప్పడానికి మొగ మోటమి అడ్డుపడుతుంది. మరి కేవలం పొగడ్తల వల్ల తనకు ఒరి గేదేమీ ఉండదు. తనెవరో తెలియనివాళ్ళు, తన నటనను గురించి మాట్లాడుకుంటున్నప్పుడు విని, తనలో లోపాలేమైనా ఉంటే దిద్దుకుంటానికి ప్రయత్నిస్తాడు. ఏమాత్రం ఆసక్తి కనబర చినా, రాజు ఇంకా పొగుడుతా డని తెలుసు దాసుకు. అందుకే 'వూ' కొట్టి వూరుకున్నాడు.

స్వీట్సు తినడం అయిపోయింది. సర్వర్ అప్పుడే ప్లేట్లలో పూత్తప్పాలు, అందులోనికి కావలసిన నంజుళ్లు తెచ్చిపెట్టాడు.

"ఏమిటి ఆలోచిస్తున్నావ్?" అన్నాడు రాజు.

"అబ్బే—ఏంలేదు" సర్దుకుంటూ అన్నాడు దాసు.

నిజంగా ఆ క్షణంలో దాసు ఇంటిదగ్గరి పరిస్థితినిగూర్చి ఆలోచిస్తున్నాడు. "ఇంటిదగ్గర వాళ్లు తనకోసం ఆశతో ఎదురు చూస్తుంటే, తా నిక్కడ దర్జాగా విందారగిస్తున్నాడా!" అను కున్నాడు.

రాజు నాటక కళనుగురించి, ప్రసిద్ధ నటకులను గురించి చెప్పుకుపోతున్నాడు. అతను చెప్పే విషయాలన్నీ దాసుకు తెలిసినవే. అయినా రాజు స్వభావం తెలిసినవాడు కాబట్టి ప్రతి దానికీ 'వూ' కొడుతున్నాడు.

"భాణం ఉంది చ్యూశావు బ్రదర్—మీ జాతివారంతా మోనోయాక్ష నంటారేమో......" అని రాజు మళ్లీ మొదలు పెట్టాడు, సర్వర్ తెచ్చిన కాఫీ కప్పును ముందుకు తీసుకుంటూ.

"తప్పదు" అన్నట్టుగా ఉంది—దాసు వింటున్న ధోరణి. రాజు తాను చెప్పేది ఎదుటివారు వింటున్నారా లేదా అన్నది గమ నించడు. అసలు ఎదుటివాడు కల్పించుకొని మాట్లాడటానికి

కూడా అవకాశం ఇవ్వదు. వన్ వే ట్రాఫిక్ లాంటిది రాజు వాగ్ధోరణి.

బైట వర్షం పడుతూనేవుంది. హోటల్లోవున్న జనానికి విసుగ్గావుంది—వర్షం వెలవకపోయేప్పటికి. కొందరు టిఫిన్లు కాఫీలు సేవిస్తున్నారు. కొందరు పిచ్చాపాటీ మాట్లాడుకుంటున్నారు. సిగరెట్లు ముట్టించి పొగ వదుల్తూ, బైట వర్షాన్ని చూస్తూ, మధ్య మధ్య లోపల కూర్చున్న ఇతరుల ముఖాలను నిరుద్దేశంగా పరిశీలిస్తున్నారు.

హోటలు బోయ్‌చేత తెప్పించిన మీఠాపాన్లలో ఒకటి దాసుకు అందించి, రెండోది తాను నములుతూ రాజు పేంటు జేబులోంచి గోల్డ్‌ఫ్లాక్ సిగరెట్‌పెట్టె తీశాడు. దాసుకు సిగరెట్ ఇవ్వబోతుంటే, "నా బ్రాండ్ ఉందిలే" అంటూ చార్‌మినార్ పాకెట్ తీశాడు దాసు.

"అదెప్పుడూ ఉన్నదేగా—ఇవ్వాళ్టికిది......వూఁ......... ముట్టించు" అంటూ రాజు అగ్గిపుల్ల గీశాడు.

"రాజును డబ్బడిగితే......ఉందో, లేదో?" అనుకున్నాడు దాసు, సిగరెట్ పొగ వదుల్తూ.

"వాతావరణం చాలా బాగుంది బ్రదర్......బారుకు వెడదామా!" అన్నాడు రాజు.

"నాకు అలవాటులేదు"

"అదేమిటి!......ఇది హైదరాబాద్ బ్రదర్! ఇవాళ ప్రారంభోత్సవం చేసెయ్యి—తరువాత నో రెఖ్యూజల్స్"

"ఇహ అదొకటే తక్కువైంది బ్రతుక్కి"

"ఏమైందీ నీ బ్రతుక్కి......దర్జాగా ఉద్యోగం చేస్తున్నావు......అందులో నాటకాల్లో తిరిగేవాడివి— ఆ అమృతం ఈ పాటికే సేవించి ఉండాలి" అన్నాడు రాజు.

త్రాగననిగాని, త్రాగడం తప్పనిగాని అంటే రాజు ఓ పట్టాన వదిలే రకంకాదు. అనవసరమైన వాదన ఎందుకని కాని "ఉహూఁ......ఇప్పుడు కాదులే......తొందరగా ఇంటికి వెళ్ళాలి" అన్నాడు దాసు. ఇంకేమీ మాట్లాడలేదు రాజు.

"నువ్వు ఒక సహాయం చేయాలి రాజూ!"

"ఏమిటది—నీగురించి వ్యాసం వ్రాయమంటావా?"

"ఉహూఁ......అలాంటి ప్రమాదాన్ని కోరన్లే."

"తప్పేముంది......అసలు నేనే వ్రాద్దామనుకుంటున్నాను......నిన్నుగురించి కొన్ని డీటెయిల్సు కావాలి"

"బ్రతికించావు.....ముందుగానే చెప్పినందుకు కృతజ్ఞుణ్ణి. అటువంటి పనిమాత్రం చెయ్యకు—నీ కెంతైనా పుణ్యం ఉంటుంది."

"ఓయి పిచ్చినాన్నా—అయితే నువ్వు ఇలాగే ఉండిపోతావు. ఇది ప్రచారయుగం......పబ్లిసిటీ ఉండాలి బ్రదర్—మెప్పొక్కడానికి."

"ఉన్న పబ్లిసిటీ చాల్లేదూ......దానివల్ల ఏదో ఒరుగుతుందని నాకు నమ్మకంలేదు. నన్నిట్లా బ్రతకనీ చాలు."

సిగరెట్ గట్టిగా పీల్చి ఆష్ట్రేలో పడేస్తూ, "అవకాశమున్నా, వినియోగించుకోలేనివాణ్ణి నిన్నొక్కణ్ణి చూశాను......వ్రాసేవాడున్నాడు. వేసేపత్రిక లున్నాయి......సర్లే......—ఎప్పుడో ఒకప్పుడు వ్రాయలేకపోతానూ నీ గురించి" అన్నాడు రాజు.

దాసేమీ మాట్లాడలేదు కొన్ని క్షణాలు.

బైట వర్షం కాస్త తగ్గినట్టుంది. అరుగులమీద నిలబడిన వాళ్ళు ఒక్కొక్కరే జారుకుంటున్నారు. లోపల కూర్చున్నవారు కూడా ఒక్కొక్కరే కౌంటరు దగ్గిర బిల్లు చెల్లించి బైట పడుతున్నారు.

"ఇంక పోదామా?" అన్నాడు రాజు, ఇంకో సిగరెట్ ముట్టిస్తూ.

"మరి నేను అడిగింది?" అన్నాడు దాసు.

"ఏమీ అడగందే!"

"చాలా అవసరంగా పాతిక రూపాయలు కావాలి రాజూ!... మళ్ళీ జీతాలు వచ్చాక ఇచ్చేస్తాను" ఆశగా రాజువంక చూస్తూ అడిగాడు దాసు.

రాజు ఒకసారి దాసు ముఖంలోకి చూసి వూరుకున్నాడు. మౌనం అర్థాంగీకారం అనుకున్నాడు దాసు. ఇంటికి ఉత్త చేతులతో వెళ్ళక్కరలేదుగదా అని సంబరపడ్డాడు. ఇద్దరూ లేచి కౌంటరు దగ్గరకు వచ్చారు. రాజు బిల్లుతోపాటు పదిరూపాయలనోటు కౌంటరుమీద పడేశాడు. విలాసంగా సిగరెట్ పొగ వదుల్తూ. మిగతా డబ్బులు తీసుకొని, ఇద్దరూ బైటకు వచ్చారు. రాజుతోపాటు, దాసు మోటారుసైకిలు ఉన్నచోటుకు ఆశగా వచ్చాడు. రాజు మోటారు సైకిలు స్టార్టు చేస్తూ, "మన స్నేహం ఇట్లా సాగిపోవాలంటే ఎప్పుడూ క్యాష్ మాత్రం అడక్కు బ్రదర్...... నా సహాయ మేదైనా ఇన్‌కైండ్—నాట్ ఇన్‌క్యాష్......ప్రొద్దుపోయింది......చాలాదూరం పోవాలి—రిక్షాలో వెళ్ళు" అంటూ చిల్లర కొంత ఇవ్వబోతుంటే "ఫర్వాలేదు—వర్షం తగ్గిందిగా, నడచిపోతాను" అన్నాడు దాసు, చిన్నబోయిన మనస్సుతో.

"అంతదూరం ఇప్పుడేం నడుస్తావులేగాని—రిక్షాలో వెళ్ళు" అంటూ చిల్లర దాసు బుష్‌కోటు జేబులో పడేశాడు రాజు. మరుక్షణంలో "బై—బై" అన్నమాటలు మోటారు సైకిలు 'టప్—టప్' శబ్దంలో కరిగిపోయాయి. కొన్ని క్షణాలు దాసు ఆ వైపే చూస్తూ నిలబడిపోయాడు. ముందుకు నడుస్తూ జేబులోని చిల్లరతీసి లెక్కపెట్టాడు.

"ఈ అర్థ రూపాయి రిక్షాకోసం ఖర్చుపెట్టడం దేనికి—మరో అవసరానికి ఉంటుంది" అనుకుంటూ దాసు నడుస్తున్నాడు. అప్పుడే వర్షం వెలవడంవల్ల రోడ్డుమీద రిక్షాలు, సైకిళ్ళు ఒక్కుమ్మడిగా బయలుదేరినట్టున్నాయి. వాటిని తప్పుకుంటూ దాసు చౌరాస్తాదాటి తలవంచుకొని నడుస్తున్నాడు—ఏదో ఆలోచిస్తూ.

అప్పుడే వీధిలైట్లు వెలిగాయి. ఓ బంగళాముందు ఆగిన కారులోంచి దిగిన మాలతి పరధ్యానంగా కారు ప్రక్కనుంచి పోతున్న దాసునుచూసి "నమస్కారం దాసుగారూ!" అని పలకరించింది. సంభ్రమాశ్చర్యాలతో దాసు తలెత్తి ఆమెను చూసి, "నమస్కారమండీ!" అని నిలబడిపోయాడు.

''రండి లోపలికి—ఇదే మా ఇల్లు'' అంది మాలతి.

''థాంక్సు......ఈ సారెప్పుడైనా వస్తాలెండి......తొందరగా ఇంటికి వెళ్లాలి.''

''అంత తొందరైతే మా కార్లో డ్రాప్ చేయిస్తాలెండి.... మా నాన్నగారితో పరిచయం చేస్తాను......రండీ......ప్లీజ్!'' ఆ పిలుపులో ఆప్యాయత, ఆ చూపుల్లో ఆహ్వానం దాసు త్రోసి వేయలేక ఆమెవెంట లోపలకు వెళ్లాడు.

డ్రాయింగ్‌రూంలో ఫైపు పీలుస్తూ, ఏదో పత్రిక చదువుతున్న డాక్టర్ వాసుదేవరావుగారు తలెత్తి చూశారు—మాలతి పిలుపుకు.

''వీరే నాన్నగారూ, దాసుగారంటే......మొన్న మా రేడియో నాటకంలో బాగా చేశారని మెచ్చుకున్నారే......'' అంది మాలతి.

''నమస్కారమండీ!'' వినయంగా చేతులు జోడించి అన్నాడు దాసు.

''నమస్కారం!......కూర్చోండి......మొన్నటి నాటకంలో నిజంగా మీ పాత్రను చక్కగా పోషించారు'' అన్నారు వాసుదేవరావుగారు.

''థాంక్సు'' అంటూ ప్రక్కగాఉన్న సోఫాలో కూర్చున్నాడు దాసు.

''ఇప్పుడే వస్తాను—మీ ఇద్దరూ మాట్లాడుతూ ఉండండి'' అంటూ మాలతి విసురుగా లోపలకు వెళ్లింది.

''మీరు పాడుతారుట కూడాగా?''

''ఏదో—గాలిపాటలెండి......మొన్నటి నాటకంలో మాలతిగారు కూడా బాగా చేశారు. ఆమె చాలా ఫ్రీగా యాక్టు చేయబట్టే నా పాత్ర బాగా పోషించగలిగాను'' అన్నాడు దాసు.

''ఇంకా దానికి అనుభవం చాలదండీ!......ఏదో ఉత్సాహం కొద్దీ ప్రోగ్రామ్స్‌లో పాల్గొంటుంది. నాటకంరోజు రేడియో స్టేషనుకు వద్దామనుకున్నా. కాని హాస్పటల్‌నుంచి వచ్చేప్పటికి టైం చాలక రేడియోమీదనే విన్నాను.''

''ఉహూ!......మీరు రాకపోవడమే మంచిదైందిలెండి. రేడియో వీక్ అని ప్రత్యేకంగా 'స్టేజీ ఏర్పాటు చేశారుగాని, అసలు మూమెంట్సులే చాల్లేదండీ. ఇదే నాటకం మరొక స్టేజీ మీద అయితే ఇంకా బాగా రాణించేది.

''మీ నాన్నగారి పేరేమిటి?......ఏం చేస్తుంటారు.?''

''భూషణంగారు.........వినేఉంటారు, మీరు......... వెనక నాటకాల్లో వేసేవారు.''

''ఏమిటీ—భూషణంగారు మీ నాన్నగారా?......తెలియకపోవడం యేమిటి......ఆంధ్రనాటకరంగంలో వారు మంచి కీర్తి గడించుకున్నారు......కులాసాగా ఉన్నారా?''

ఇంతలో మాలతి దుస్తులు మార్చుకు వచ్చింది. ఆమె వెనకాలే బోయ్ ట్రేలో మూడు ఐస్‌క్రీంలు తెచ్చి, ముగ్గురికీ అందించాడు. వాసుదేవరావుగారు మాలతికి దాసుతండ్రి భూషణంగారి ఖ్యాతినిగూర్చి చెప్పారు.

దాసు ఐస్‌క్రీం తింటూ మాలతి చెబుతున్న కబుర్లు వింటున్నాడేకాని, మనస్సు విల విల కొట్టుకుంటున్నది. తనూ, తన పరిస్థితులకూ మనస్సు లోబడుతున్నది. కాసేపటికి మాలతి తెలుసుకుంది—దాసు ఏదో పరధ్యానంలోవుండి తన మాటలు సరిగ్గా వినడంలేదని. ''మీరేదో ఆలోచిస్తున్నట్టున్నారే?'' అంది.

''ఇక నే వెళ్తానండీ......ఎక్స్‌క్యూజమీ!'' అంటూ దాసు లేచాడు.

''ఏమైనా అర్జంటు పనుందా?......లేకపోతే కాసేపు కూర్చోండి—అమ్మాయి వీణ వాయిస్తుంది'' అన్నారు వాసుదేవరావుగారు.

''మరెప్పుడైనా వింటాలెండి......ఇంటిదగ్గర నాకోసం ఎదురు చూస్తుంటారు......అందులో మా చెల్లెలి కూతురికి చాలా జ్వరంగా ఉంటున్నది.''

''అరరే—చెప్పారుకాదేం.......సారీ......అయితే కార్లో పోదాం పదండి......నేను వచ్చి ఆ అమ్మాయిని చూస్తాను'' అంటూ వాసుదేవరావుగారు లేచి ''మాలతీ—డ్రైవర్ను కేకేసి, మెడికల్ చెస్టు కార్లో పెట్టమను—నేను బట్టలు వేసుకొని వస్తా'' నంటూ ఆయన గదిలోకి వెళ్లారు. మాలతి బాల్కనీలోకి వెళ్ళి డ్రైవర్ని పిలిచి చెప్పింది.

దాసును సంభ్రమాశ్చర్యాలు ముంచెత్తాయి. ''ఒక సమస్య తీరిపోయింది......కాని ఈయన పెద్ద డాక్టరు......ఫీజు ఎంత అంటాడో?'' అని సందిగ్ధంలో పడ్డాడు. ''ఆయనంతటాయనే వస్తానని బయలుదేరుతుంటే తను వద్దని ఎలా అంటాడు?''

''ఏమిటి ఆలోచిస్తున్నారు?'' అంటూ మాలతి అతని దగ్గరకు వచ్చింది.

''క్షమించండి మాలతిగారూ!......మీకూ, మీ నాన్నగారికి చాలా శ్రమ ఇస్తున్నాను......కాని......''

''సందేహిస్తారేం?'' చిరునవ్వుతో కొంటెగా చూస్తూ అంది మాలతి.

''నేను ఫీజు ఇచ్చుకునే పరిస్థితిలో లేను.''

''శేష్......అదా మీ సందేహం?.....మరేం ఫరవాలేదులెండి.''

ఇంతలో వాసుదేవరావుగారు బట్టలు మార్చుకొని వచ్చారు–

''నీవు కూడా వస్తావా అమ్మడూ!''

''వస్తున్నా—నాన్నగారూ!''అంటూ మాలతి చరచరా తన గదిలోకి వెళ్ళి వేనిటీ బ్యాగ్ తీసుకొని వచ్చింది. ముగ్గురూ క్రిందికిదిగి కారు దగ్గరకు వచ్చారు.

## 3

సన సన్నగా తుంపరపడుతున్నది. రివ్వున చలిగాలి వీస్తున్నది. వీధిలైట్లు మిణుకు మిణుకు మంటున్నాయి. ఆ వీధిలో చెదరువాటుగా అక్కడొకరూ, ఇక్కడొకరూ కనిపిస్తున్నారు. దాసుతల్లి రాధమ్మగారు కాలు కాలిన పిల్లిలా ఇంట్లోంచి వీధి గుమ్మంలోకి, వీధిగుమ్మంలోంచి ఇంట్లోకి తిరుగుతున్నది. వీధి గదిలో ఓవారకు భూషణంగారు వాలుకుర్చీలో కూర్చుని ఎప్పటిదో పాత పత్రిక చదువుతున్నారు. మరోవారలోఉన్న వారు తెగిన మంచంమీద పడివున్న మూడేళ్ల పసికందు దగ్గర దాసు చెల్లెలు

సుబ్బలక్ష్మి కూర్చునివుంది. ఆమె కాళ్లదగ్గర ఐదేళ్ళవాడు శ్యాం కూర్చుని, ''అమ్మా—ఇంకా మామయ్య రాలేదేం?'' అంటు న్నాడు.

రాధమ్మగారు మళ్లీ ఒకసారి వీధిలోకివచ్చి, దాసు వస్తు న్నాడేమోనని ఆమె దృష్టి ఆనినంతవరకూ చూచి, ''ఇంకా వీడు రావడంలేదు.......ఏం చేయును?.......ఇంట్లో ఒక్క గింజలేదు... ఓ చెంప చిట్టితల్లి కన్ను తెరవకుండా పడుంది........శ్యాం ఇందాకటినుంచి ఆకలే అమ్మమ్మా అంటున్నాడు'' అంటూ లోపలికి వచ్చి, భూషణంగారి వాలుకుర్చీవద్ద చదికిల పడింది.

''ఎక్కడైనా డబ్బు దొరికించో లేదో పాపం!........ పోనీ పక్కింటివాళ్లను నాల్గు గొట్టాల బియ్యం బదులడగరాదూ— వాడెప్పుడొస్తాడో ఏమో!'' అన్నారు భూషణంగారు.

''ఇంకెవర్నడగనండి!........మూడు రోజులనుంచీ నాలుగు సేర్ల బియ్యం అప్పు చేశాను.—వాళ్లింట్లో—వీళ్లింట్లో!....... ఇంక అడిగి లేదనిపించుకోటమే తరువాయి.'' చేతులు తిప్పుతూ అంది రాధమ్మగారు.

''పోనీ నేను వెళ్ళి ఆ లెక్చరర్‌గారింట్లో అడిగిరానటే అమ్మా!'' అంది సుబ్బలక్ష్మి.

''ఆవిడకు బోలెడు గర్వం—ముఖంమీదే ఎంతమాటపడితే అంతమాట అనే మనిషి........ఆమేమైనా అంటే మళ్ళీ నీవు చిన్నబుచ్చుకుంటావు'' అంది రాధమ్మగారు.

''ఆఁ—ఏమంటుందేమిటి?........ రేపిచ్చేస్తామని అడిగి వస్తా........నీవు చిట్టితల్లిదగ్గర కూర్చో!'' అంటూ సుబ్బలక్ష్మి లేచి, వీధి గుమ్మంలోకి వచ్చింది. ఇంతలో వాసుదేవరావుగారి కారు వచ్చి ఆగింది. అందులోంచి దిగుతున్న దాసును చూసి, ''''అమ్మా—అన్నయ్యొచ్చాడే'' అని లోపలికి గెంతింది.

దాసు, మాలతి, వాసుదేవరావుగారు లోపలకు వచ్చారు. వాళ్ల వెనకాలే డ్రైవరు మెడికల్ చెస్టు తీసుకువచ్చి గుమ్మంలో నిలబడ్డాడు. క్రొత్తవాళ్ళనుచూసేప్పటికి రాధమ్మగారు వెళ్ళి వంటింటిగుమ్మంలో నిలబడింది. భూషణంగారులేచి నిలు చున్నారు.

''సుబ్బులూ— డాక్టరుగారికి చిట్టిని చూపించు'' అన్నాడు దాసు. వాసుదేవరావుగారు మంచం దగ్గరకువెళ్ళి పరీ క్షిస్తున్నారు. దాసు వంటగదిలోంచి ఓ కుర్చీతెచ్చి మంచం దగ్గరగావేసి, ''కూర్చోండి మాలతిగారూ!'' అంటూ తడక కుర్చీ చూపించాడు.

''కూర్చోమ్మా—కూర్చో'' అన్నారు భూషణంగారు.

''ఫరవాలేదండీ.......మీరు కూర్చోండి—పెద్దవారు'' అంది మాలతి.

డ్రైవరు చేతిలోంచి మెడికల్ చెస్టు అందుకొని వాసు దేవరావుగారు కుర్చీమీద పెట్టి తెరిచారు. చిట్టి తల్లి జబ్బుకు సంబంధించిన వివరాలు సుబ్బలక్ష్మిని అడిగి తెలుసుకొని ఇంజ క్షన్ తయారుచేసిచ్చారు.

''చాలా అశ్రద్ధ చేసినట్టున్నారు—మిస్టర్ దాసూ!...... పాపకు డబుల్ న్యుమోనియా!...... అయినా మరేం భయం లేదు......'' అంటూ ఒక సీసాలోంచి గోలీలు తీసియిస్తూ, ''ఇవి రెండు గంటల కొకసారి ఇవ్వండి. మళ్లీ రేపు ఉదయంవచ్చి చూస్తా ను'' అన్నారు వాసుదేవరావుగారు.

''అలాగేనండి'' అంది సుబ్బలక్ష్మి.

''కూర్చోండిసార్'' అన్నాడు దాసు.

''ఫర్వాలేదు......మిమ్మల్ని స్టేజీమీద చాలాసార్లు చూశా నండీ!.......కాని పరిచయం కలిగించుకొనే అవకాశం చిక్కలే దెప్పుడూ! మీరు నాటకం వేస్తున్నారంటే ఎన్ని పనులున్నా మాను కొని వచ్చేవాడిని—'' భూషణంగారిని అభినందిస్తూ అన్నారు వాసు దేవరావుగారు.

''ఏదో మీబోటి పెద్దల అభిమానంతో ఆ రోజుల్లో వెలిగాం.......మాకాలం అయిపోయిందిలెండి'' అంటూ నిరు త్సాహంగా పెదవి విరిచారు భూషణంగారు.

''సరే—వస్తామండీ......పాప విషయంలో ఏం కంగారు పడకండి......'' అంటూ బైటకు నడిచారు వాసుదేవరావుగారు. కళ్లతోనే వెళ్ళొస్తానని చెప్పింది మాలతి. వాళ్లవెంట దాసు, నాగభూషణంగారూ మర్యాదకోసం కారు దగ్గరకు వెళ్లారు.

''ఇంక మీరు ఉండండి'' అన్నారు వాసుదేవరావుగారు.

''నమస్కారమండీ!'' దాసు, భూషణంగారూ ఒకేసారి అన్నారు. మరుక్షణంలో కారు కదిలిపోయింది.

లోపలకు వస్తున్న దాసునుచూచి ''చిట్టితల్లితో ఈ రాత్రి ఎలా గడుస్తుందా అని భయపడుతున్నాం అన్నయ్యా!...... నీ పుణ్యమా అని ఏకంగా డాక్టరుగారిని తీసుకువచ్చావు'' కృత జ్ఞతగా అంది సుబ్బలక్ష్మి.

''దేవుడిలా వచ్చాడు డాక్టరు'' అంది రాధమ్మగారు.

''దేవుడిలా వచ్చినమాట నిజమేగాని, రేపు బిల్లెంత చేస్తాడో అది చూడు'' అన్నారు భూషణంగారు.

దాసు ఏమీ మాట్లాడకుండా కుర్చీలో తోటకూర కాడలా వాలిపోయాడు.

''ఇంకా కూర్చుంటావేం నాయనా! ఇంతవరకు పొయ్యి లో పిల్లి లేవలేదు.......వెళ్ళి బియ్యం తీసుకురా'' అంది రాధమ్మ గారు.

''ఏంచేయనమ్మా—డబ్బెక్కడా దొరకలేదు.''

''అదేమిటన్నయ్యా—జేబులో నోట్లు కనిపిస్తుంటే డబ్బు దొరకలేదంటావేం?'' అంది సుబ్బలక్ష్మి.

దాసు ఆశ్చర్యంతో బుష్‌కోటు జేబువంక చూశాడు. ''అరే ఎక్కడివీ!'' అంటూ జేబులోంచి రెండు పదిరూపాయల నోట్లు తీశాడు.

''అదేమిట్రా—నీకు తెలియకుండా నోట్లు జేబులోకి ఎలా వచ్చాయి?'' భూషణంగారు విస్మయపడుతూ ప్రశ్నించారు.

''మరచిపోయాను నాన్నా.......ఇందాక ఒక స్నేహితుడి నడిగాను.......మొదట్లో పరిహాసమాడి లేదు పొమ్మన్నాడు. తరు వాత అతనే నేను చూడకుండా జేబులోపెట్టి ఉంటాడు'' అన్నాడు దాసు.

''పోనీలే—సమయానికి ఆదుకున్నాడు. సంచీ తీసుకొని వెళ్ళిరా నాయనా!'' అంది రాధమ్మగారు.

"మామయ్యా!......నాకు బిచ్చెత్తు తేవూ" అన్నాడు శ్యాం.

"ఓ— తెస్తాలేరా అల్లుడా!......అమ్మా— భాస్కరం ఇంకా ఇంటికిరాలా?" అని ప్రశ్నించాడు దాసు.

"ప్రొద్దున నీవు వెళ్ళంగానే వాడూ వెళ్ళాడు. ఇంత మటుకు అయిపూ—అజాలేదు.

"ఛీ......ఛీ......వాడికెంత చెప్పినా బుద్ధిలేదు. ఇవ్వాళ్ళన్నా స్కూలుకు వెళ్ళాడో లేదో!" అంటూ దాసు సంచీ తీసుకొని, వీధిలోకి వెళ్ళాడు.

"ఆ అమ్మాయి చాలా బాగుంది కదమ్మా!" అంది సుబ్బలక్ష్మి.

"ఆ పిల్లకేమే—అప్సరసలాగుంది. డాక్టరుగారి కూతురు కాబోలు" అంది రాధమ్మగారు.

"అదిసరే—వీడి వ్యవహార మేమిటో నాకు అర్థం కావడం లేదు. మూడు నాలుగు రోజులనుంచి చిట్టితల్లి జ్వరంతో బాధ పడుతుంటే ఏమీ చేయలేకచూస్తూ వూరుకున్నాడు. ఇవ్వాళ కారులో డాక్టర్ను ఎలా తీసుకు వచ్చాడు......పైగా జేబులో డబ్బుపెట్టికొని డబ్బెక్కడా దొరకలేదని వెర్రిముఖంవేసి కూర్చున్నాడు" అన్నారు భూషణంగారు.

ఇంతలో భాస్కరం లోపలికివచ్చి—"ఆకలేస్తున్నదే అమ్మా అన్నంపెట్టు" అన్నాడు.

"పాపం, నీకోసం వండి వార్చారు!" అంది సుబ్బలక్ష్మి.

"నా కోసమే ఏం ఖర్మ......అందరికోసం" మొండిగా అన్నాడు భాస్కరం.

"ఇవ్వాళ స్కూలుకు వెళ్ళావురా—భాస్కరం?" భూషణంగారు ప్రశ్నించారు.

"వెళ్ళాను నాన్నా!"

"మరి ఇప్పుడొచ్చావేం కొంపకి......స్కూలువదిలి ఏ జామాయె!" అంది రాధమ్మగారు.

"ఓ స్నేహితు డింటికివెళ్ళి చదువుకొని వచ్చాను."

"ఎందుకురా—అబద్ధా లాడుతావు?" భూషణంగారన్నారు.

"నేనేం అబద్ధా లాడటంలేదు" మొరాయిస్తూ అన్నాడు భాస్కరం.

"వాలావు సత్యవంతుడు బయలుదేరాడు.....తమ్మయ్య గారికి ఇవ్వాళ్ల చదువుమీద శ్రద్ధ పుట్టింది కాబోలు" అంది సుబ్బలక్ష్మి.

"నీవేం వ్యాఖ్యానించక్కర్లా......నాకు మొదలు అన్నం పెట్టేయమ్మా!"

"అన్నయ్య బియ్యానికి వెళ్ళాడు.....అందాకా చదువుకో కూర్చోని" అంది రాధమ్మగారు.

"పోనీ ఏమన్నా పెట్టు—తింటానికి"

"ఏముందిక్కడ పెట్టటానికి......అన్నయ్య నానా అవస్థ పడి తెచ్చి పడేస్తుంటే కనిపించడంలా......స్కూలు ఎగ్గొట్టి స్నేహితులతో తిరిగినవాడిని వాళ్లనే పెట్టించమనకపోయావ్" అంది సుబ్బలక్ష్మి.

"నీవు అనవసరంగా నా జోలికిరాకు అక్కాయ్!...... మొగుణ్ణి వదిలిపెట్టొచ్చి తేరగా కూర్చొని తింటున్నావ్ అన్నయ్య తెచ్చిపడేస్తుంటే!"

"వెధవా—ఏం మాటలవి, చిన్నంతరం పెద్దంతరం లేకుండా!" అన్నారు భూషణంగారు.

"మరి నన్నెందు కనాలి అది?"

"చూశావుటే అమ్మా, వాడెలా నోరు పారేసుకుంటున్నాడో?........అవున్లే నే నందరికీ తేలికైపోయాను." అని కన్నీళ్ళు పెట్టుకుంది సుబ్బలక్ష్మి.

ఇంతలో దాసు కూలివాడిచేత బియ్యంబస్తా, చేతి సంచిలో కూరలు పట్టించుకొచ్చాడు. దాసును చూసేప్పటికి భాస్కరం ఎంతో బుద్ధిమంతుడిలా పుస్తకం చేత్తో పట్టుకు కూర్చున్నాడు. దాసు పంట్లాం జేబులోంచి బిస్కట్ పాకెట్తీసి శ్యాం చేతికిచ్చాడు. చుట్టలు భూషణంగారి కిచ్చాడు. రాధమ్మ చేటిలోకి బియ్యం పోసుకొని, "అమ్మాయ్—కాస్త కుంపటి రాజేయమ్మా!" అంది. సుబ్బలక్ష్మి వంటగదిలోకి వెళ్ళింది.

శ్యాం రెండు చేతుల్లోకి రెండు బిస్కట్లు తీసుకొని, "మామయ్యా—ఊఁ!.......దాచు" అంటూ పాకెట్ తిరిగి దాసు చేతికిచ్చి సంబరపడుతూ తింటున్నాడు.

భూషణంగారు చుట ముట్టించి, "శేష్—ఎక్కడ తెచ్చావో గాని బాగున్నాయి" అని సంబరపడ్డారు. నిజంగానే ఆ చుట్ట అంత బాగుందో, లేక ప్రొదుటినుంచి త్రాగకపోయేప్పటికి ఆకలి గొన్నవాడు రుచి ఎరగడన్నట్టు, ఆ చుట్టే రుచి అనిపించిందో మరి.

అన్నగారి ముఖం చూడటం యిష్టంలేనట్టు ముఖానికి పుస్తకం అడ్డు పెట్టుకొని. లోలోపలే ఏదో గొణుగుతున్నాడు భాస్కరం.

సుబ్బలక్ష్మి కుంపటి రాజేసివచ్చి "ఏఁవమ్మా—కూరేమైనా తరగనా?" అంది.

"బియ్యం కడిగిపడేసి నేను అరుక్కుంటాలే.....పిల్ల లేస్తుందేమో దాని దగ్గర కూర్చో" అంది రాధమ్మగారు.

దాసు భాస్కరం కూర్చున్న చాపమీదనే దిండు పెట్టుకొని నడుం వాల్చాడు. అన్నగారు తన నేమీ మందలించకుండా ఉన్నందుకు, పుస్తకంలోంచే ఒకసారి దాసు ముఖంలోకి చూశాడు. దాసు కళ్ళు మూసుకొని ఏదో ఆలోచిస్తున్నాడు.

"ఒరేశ్యాం—నేను కూడా బిస్కట్ తీసుకుంటున్నా" అంటూ లేచి అలమారులో పెట్టిన బిస్కట్ పాకెట్ తీశాడు భాస్కరం.

"చిన్న పిల్లాడికిమల్లే నీ కెందుకురా బిస్కట్లు" అంది సుబ్బలక్ష్మి.

"అమ్మకు నేనూ పిల్లాడినే!"

"పోనీలే, రెండు బిస్కట్లు తీసుకోనీవే—వచ్చినప్పటినుంచీ ఆకలే అని గొడవ చేశాడు. అవి తిని ఇన్ని నీళ్ళు తాగుతాడు" వంట గదిలోంచి అంది రాధమ్మగారు.

"అవున్లే—ముద్దుల కొడుకుగదూ!" అంది సుబ్బలక్ష్మి.

చుట్ట కాలుస్తూ తాదాత్మ్యం అనుభవిస్తూన్న భూషణంగారుకాని, ఏదో ఆలోచనలోవున్న దానుగాని ఎవరూ మాట్లాడలేదు.

దాను ఆలోచనల్లో ఆఫీసుప్యూను యాదయ్య, హొటల్లో కలిసిన మిత్రుడు రాజు, మాలతి, డాక్టర్ వాసుదేవరావుగారు గిర్రున తిరిగారు.

"యాదయ్య అందరికీ అడగ్గానే డబ్బు వడ్డీకి ఇప్పిస్తాడే... తనకు మరునాటికి వాయిదా వేశాడెందుకు?......తనమీద నమ్మకంలేకనా?........ఛీ......ఛీ......అసలు యాదయ్యను అడక్కుండా ఉండాల్సింది......తనకోసం ఒకళ్లిద్దరు అప్పులవాళ్లు ఆఫీసుకు రావడం తెలిసేప్పటికే యాదయ్యకు తనమీద అంతకుముందున్న గౌరవం పోయింది. ఇప్పుడు తనంటే మరింత చులకనైపోతుంది" ఆఫీసులో యాదయ్య తన ద్వారా అప్పులు తీసుకున్నవారిపట్ల ప్రదర్శించే గౌరవంలోగల చులకనభావం జ్ఞాపకం వచ్చింది దానుకు.

"అసలు చెప్పిన ప్రకారం రమణవచ్చి డబ్బిచ్చినట్లయితే యాదయ్యదగ్గర తను బైట పడాల్సిన అవసరమే ఉండేదికాదు. రమణ ఆపదలో ఆదుకోగల స్నేహితుడు. తన దగ్గర లేకపోతే, ఎక్కడోతెచ్చి అయినా ఇచ్చేవాడు. రాజులాంటి స్నేహితులుండేం లాభం! అవసరం వచ్చినప్పుడు ఆదుకోనితర్వాత! పైగా బారుకు రమ్మన్నాడు. దుబారాగా విలాసాలకు ఖర్చుపెట్టడానికైనా తయారవుతారుగాని, అప్పడిగితే ఇవ్వరు రాజులాంటివాళ్లు. కుండబద్దలు కొట్టినట్టు చెప్పేశాడు, స్నేహంగా ఉండాలంటే డబ్బెప్పుడూ అడగవద్దని." క్రమంగా దాను ఆలోచనలు మాలతిమీదకు వెళ్లాయి.

"నిజంగా మాలతీ, ఆమె తండ్రీ ఎంత మంచివాళ్లు! ఆమెకీ, తనకూ రేడియో పరిచయంతప్ప మరేమీలేదు. రిహార్సల్సులో ఆమె అందరిలోనూ చనువుగానే మాట్లాడింది. ఓరోజు రిహార్సల్సు అయిపోయాయి. మళ్లీ ఇంకోగంటతర్వాత ఇంకో రిహార్సలు తీసుకుందాం అన్నాడు రేడియో అధికారి. "ఆకలి వేస్తోంది—ఈలోపల హొటలుకు వెళ్లొద్దాం వస్తారా" అంది మాలతి. తను సందేహించాడు వెళ్ళడానికి. మిగతా వాళ్లెవరూ హొటలు ప్రసక్తి ఎత్తకపోయేటప్పటికి ఆమే మళ్లీ రండి పోదాం!" అంది. అప్పుడిక ఆమెవెంట హొటలుకు వెళ్ళక తప్పలేదు. తను మర్యాదకు బిల్లు చెల్లిస్తానంటే వద్దని తనే ఇచ్చేసింది. ఆమె తండ్రిమటుకు ఎంత మంచివాడు! ఎక్కడా గర్వంలేదు. తను అడగందే ఆయనంతటాయనే వచ్చి, చిట్టితల్లికి ఇంజక్షనులు, మందులు ఇచ్చిపోవాల్సిన అవసరం ఏముంది! మాలతితో తను, "ఫీజు ఇచ్చుకోలేను" అనేప్పటికే ఆమె తన పరిస్థితినంత అర్థంచేసుకొనిఉంటుంది. కార్లో ఆమె తన ప్రక్కనే కూర్చుంది. తను పరాగ్గా ఉన్నప్పుడు ఆమె ఆ రెండు పదిరూపాయల నోట్లు జేబులో పెట్టి ఉంటుంది. ఆమెకీ, వాసుదేవరావుగారికీ తనపట్ల అంత ఆదరం చూపాల్సిన అవసరం ఏముంది?...... గొప్పవాళ్లంటే తనకో దురభిప్రాయం ఉండేది. వాళ్లల్లో కూడా ఇంత మంచి వాళ్లుంటారనుకోలేదు....కాని, ఆమె ఇచ్చిన ఇరవై రూపాయలు రేపు యాదయ్య దగ్గరైనాసరే తీసుకొనివెళ్ళి, ఇచ్చివేయాలి. లేకపోతే ఆమె ఏమనుకుంటుంది?" అని ఆలోచిస్తున్నాడు దాను.

చిట్టితల్లిలేచి ఏడవడంతో దాను ఆలోచనల మబ్బులు చెదరిపోయాయి.

సుబ్బలక్ష్మి చిట్టితల్లిని ఒళ్లోకి తీసుకొని సముదాయిస్తున్నది.

"దానికి కాసిని గ్లూకోజునీళ్లు పట్టు సబ్బులూ!" అన్నాడు దాను.

"ఇవ్వవచ్చునో లేదో?"

"గ్లూకోజు నీళ్లకేం? ఫర్వాలేదులే."

"ఒరేయ్ భాస్కరం......కప్పులో రెండు చెంచాలు గ్లూకోజువేసి కలుపుకురా" అంది సుబ్బలక్ష్మి.

"రేపటినుంచి నేను మళ్ళీ ఇంకో దుకాణంలో పద్దులు రాయడానికి ఒప్పుకున్నానోయ్!" అన్నారు భూషణంగారు.

"ఎక్కడా?"

"గంజిలో.......నలభై ఇస్తామన్నారు."

"అంతదూరం నీవేం పోగలవులే నాన్నా......ఆ నలభైలో రిక్షాలకే సగం పోతుంది" అన్నాడు దాను.

"మరెట్లారా.......చుట్టపీకలకు కూడా నిన్నే అడగాల్సి వస్తుండే......ఎందాకా అని నీవుమటుకు అవస్థ పడతావు?"

"పెద్దవాడివయ్యావు......అందులో నీ ఆరోగ్యం మంచిది కాదు. పదిరోజులు పోతే పదిహేను రోజులు మానేస్తావు..... ఓ రెండు మూడు నెలలుచూసి, వెనకటిలాగానే పీళ్లూ తీసేస్తారు. ఏం ప్రయోజనం—నీవు శ్రమపడటంతప్ప" అన్నాడు దాను.

"జరిగినన్నాళ్లే అయిరి......"

"సరే నీ యిష్టం....."

"ఇంక లేవండర్రా భోజనాలకి" వంట గదిలోంచికేకేసింది రాధమ్మగారు.

## 3

భూషణంగారు ఒకప్పుడు బాగా బ్రతికినవారే. తండ్రి పదెకరాల సుక్షేత్రమైన భూమి, ఒక ఇల్లు అప్పజెప్పిపోయాడు. చిన్నప్పటినుంచీ భూషణంగారికి నాటకాలంటే బహుసరదా. వాళ్లింటికి ఎదురుగుండానే ఒక నాటక సమాజం ఉండేది. అవి ఆయన అయిదవఫారం చదుకునేరోజులు. పరీక్షలింకా రెండునెలలున్నాయి. ఎదురుగ్గావున్న నాటక సమాజంవాళ్లు రాయబారం నాటకం రిహార్సల్సు జరుపుకునే వేళ, భూషణం చదువుకు కూర్చునే వేళ ఒకటే అయ్యేది. "బావా ఎప్పుడు వచ్చితీవు" అని కృష్ణవేషధారి అక్కడ పద్యం ఎత్తుకోగానే భూషణం చదువుతున్న పుస్తకం ప్రక్కకు పెట్టేసేవాడు.

భూషణం తండ్రి మరీ పూర్వకాలం మనిషి. కొడుకు గదిలో కూర్చుని చదువుకుంటున్నాడనుకొనేవాడే గాని, నాటకాల పిచ్చిలో పడుతున్నాడనుకోలేదు. శృతపాండిత్యం అన్నట్టు భూషణం రోజూ రిహార్సల్సు వింటుండడంవల్ల రాయబారంలో

పద్యాలు, కొన్ని సంభాషణలు కంఠస్థమయ్యాయి. రాగాలు కూడా పట్టుబడ్డాయి.

ఒకరోజు భూషణంతండ్రి ప్రక్కవూరికి వెళ్లాడు. ఎదురింట్లో రాయబారం రిహార్సల్సు జరుగుతున్నాయి. భూషణం ఉండబట్టలేక, అక్కడకువెళ్ళి కూర్చున్నాడు. అర్జున పాత్రధారి కృష్ణుణ్ణి సాయానికి అర్థిస్తూ చెప్పే పద్యాలు హార్మోనియం శృతితో పాడుతున్నాడు. ఒక పద్యం పాడురుండగా, మధ్యలో రాగం తప్పింది. వెంటనే భూషణం "మీరు తప్పు పాడుతున్నారండీ!" అన్నాడు. మిగతావాళ్ల ఏవో మాటల్లోపడి అది గమనించలేదు. భూషణంతోపాటు హార్మోనిస్టు కూడా తప్పుపాడుతున్నావనేప్పటికి అర్జున పాత్రధారి నిజమేనని ఒప్పు కున్నాడు.

"ఏమండీ—నేను కూడా పద్యాలు పాడుతా. వాయి స్తారా?" హార్మోనిస్టుతో అన్నాడు భూషణం.

"సరే పాడు......శృతి ఎంత?"

"నాకు తెలియదు......మీరే చూసుకోండి" అన్నాడు భూషణం.

అర్జునుడి పద్యాలే భూషణం రాగం తప్పకుండా వాళ్ళు ఎక్కడెక్కడ సంగతులు వేసేవారో అక్కడక్కడే వేస్తూ పాడాడు. అంతా శేభష్ అని మెచ్చుకున్నారు.

"అబ్బాయ్—మధ్య మధ్య శృతి తప్పుతున్నది......అది కాపాడుకుంటే మంచి పాటగాడివవుతావు" అన్నాడు హార్మో నిస్టు. భూషణానికి ఎంతో సంబరమైంది. అది మొదలు భూషణం తరచు, రిహార్సల్సు దగ్గరకువెళ్ళి కూర్చుంటుండే వాడు. వాళ్ల పోర్షన్ మరచిపోతే తను అందిస్తుండేవాడు. హార్మోనిస్టును మంచి చేసుకొని తను కూడా పద్యాలు పాడు తుండేవాడు.

తీరా రాయబారం నాటకం రోజున నకులుడు పాత్రధారి జ్వరంతో మూలుగుతూ పడుకున్నాడు. ఎట్లాగా అని అంతా మథనపడుతుంటే, హార్మోనిస్టు "ఎదురింటివారబ్బాయిచేత వేయిద్దాం" అని సలహా ఇచ్చాడు. ఆ సలహా అందరికీ నచ్చింది. అందరూ భూషణం తండ్రి దగ్గరకువెళ్ళి అడిగారు.

"వాడిముఖం—వాడికేంవచ్చు వేయడానికి" అన్నా రాయన.

"మీకెందుకు! మీరు ఒప్పుకోండి—మా తిప్పలు మేం పడతాం" అన్నారు వాళ్ళు.

"సరే—మీ రింతమంది వచ్చి అడుగుతుంటే కాదని ఎట్లా అనను—తీసుకు వెళ్లండి" అన్నా రాయన.

భూషణానికి ఏనుగు నెక్కినంత సంబరమైంది.

నాటకరంగంలో భూషణంగారి ప్రవేశం అలా జరిగింది. ఆ వ్యామోహంలో అయిదవఫారంలోనే చదువుకు స్వస్తి కూడా జరిగింది. అది మొదలు అనేక పద్య నాటకాలలో నటించి ఖ్యాతికి వచ్చాడు. సంపాదించిందేమీలేకపోయినా, పదెకరాల సుక్షేత్ర మైన భూమి హరించుకుపోయింది. ఆ ఒక్క ఇల్లుమాత్రం ఎందుకుండాలని సుబ్బలక్ష్మి పెళ్లికి అమ్మేసి, మూడువేలు కట్నంపోసి ఘనంగానే పెళ్ళి చేశాడు. దాసును మాత్రం బి. ఏ. వరకూ చదివించగలిగారు. ఇప్పటికీ ఆయన వేషంకట్టి పద్యాలు ఘూమ్మని పాడగలరు. కాని, కాలంమారుతున్నకొద్దీ ప్రజల అభి రుచులూ మారుతూ వచ్చాయి. సినిమాలువచ్చి, నాటక రంగాన్ని కొంతవరకు నీరసపరిచాయి. రంగస్థలంమీద ఆధారపడలేక పీలు చూసుకొని సినిమాల కెక్కినవారు ఆయన నటించిన సమాజంలోనే చాలామంది ఉన్నారు. భూషణంగారు ఒకేఒక పౌరాణిక చిత్రంలో నటించారు. ఎందుకు మానేశారని ఆయన్ను ఎవరైనా ప్రశ్నిస్తే, తనతోటివారు ఆ రంగంలో నిలవలేరం టారు. "నాటకాల్లో తిరిగేవాళ్ళు చెడిపోతా"రనే ప్రవాదం ఒకటున్నా, భూషణంగారు నైతికంగా చెడిపోయిందేమీలేదు. ఆయన చెడిపోయిందల్లా నాటకరంగంలోని స్నేహితుల్ని నమ్మి, వాళ్లకు డబ్బిచ్చి, వాళ్లను కడుపునిండా మేపి.

ఈనాడు సాంఘిక నాటకాలకున్న ఆదరణ పౌరాణిక నాటకాలకు లేదన్న వాదాన్ని భూషణంగారు ఒప్పుకోరు. ఏనాటి కైనా నిలిచేవి, ప్రజల మన్ననలు పొందేవీ పద్యాల నాటకాలే అంటా రాయన. ఈనాడు పౌరాణిక నాటకాలు ఆడేవాళ్లు కరవైపోవడం, ఉన్న కొద్దిమంది పెద్దవాళ్లైపోవడం, సాంఘిక నాటకాలకంటే పౌరాణిక నాటకాల నిర్వహణ ఖర్చులు ఎక్కు వవడం వాటి సామర్థ్యం తగ్గడానికి కారణాలంటారు.

దాసు బి. ఏ. పూర్తి చేసిన తరువాత ఇంకా చదవాలని ఉన్నా, కుటుంబ పరిస్థితులనుబట్టి ఉద్యోగంలో చేరక తప్పింది కాదు. భూషణంగారికి నాటకకళ మీదగల అభిమానం దాసుకు కూడా అబ్బింది. హైస్కూలు జీవితంనుంచే దాసు సాంస్కృ తిక కార్యక్రమాలలో పాల్గొని బహుమతులు పొందగలిగాడు. కళాశాల జీవితం అతనికిగల కళా ప్రియత్వానికి మెరుగులు చేకూర్చిపెట్టింది. అలాగని దాసుకు చదువులో ప్రాముఖ్యత ఎప్పుడూలేదు. బి. ఏ. ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణుడయ్యాడు.

దాసు బి. ఏ. చదువుతుండగానే పెళ్ళి సంబంధాలు వచ్చాయి. పరీక్షయి, ఉద్యోగంలో చేరితేనేగాని వివాహం చేసుకో నన్నాడు దాసు. అతను ఉద్యోగంలో చేరడం, భూషణంగారికి జబ్బు చేయడం, సుబ్బలక్ష్మి భారం కూడా దాసుమీద పడ డంతో వూపిరి సలుపుకోకుండా అయింది.

సుబ్బలక్ష్మి రాధమ్మగారిలాగానే కొంచెం పొట్టి. గొప్ప అందగత్తెకాకపోయినా, అనాకారిమాత్రంకాదు. చామనఛాయలో కనుముక్కుతీరు బాగానే ఉంటుంది. ఎనిమిదవ తరగతివరకూ చదువుకుంది కూడా. భూషణంగారు ఇచ్చిన మూడువేలు కట్నం తీసుకొనేముందు విశ్వనాథం ఒకటికి రెండు మూడుసార్లు చూసు కొనే సుబ్బలక్ష్మిని పెళ్ళి చేసుకున్నాడు. అతని తల్లి దండ్రులు కూడా ఇష్టపడే సుబ్బలక్ష్మిని కోడలుగా చేసుకున్నారు. "కోడలు వచ్చినవేళ, గొడ్డు వచ్చినవేళ" అనే సామెత ఒకటి మనలో వుంది. సుబ్బలక్ష్మి కాపురానికి వెళ్ళిన తరువాతనే, విశ్వనాథం అభివృద్ధిలోకి వచ్చాడని చెప్పాలి. అంతకుముందు అతను నాన్ మెట్రిక్. రైల్వేలో చిన్న ఉద్యోగం చేస్తుండేవాడు. పెళ్ళి అయిన తరువాతనే మెట్రిక్ ప్యాసు కావడం, 'పర్‌వేస్'లో ఉద్యోగం దొర కడం, అతని తండ్రికి కూడా ఉద్యోగంలో ఆశించని అభివృద్ధి కలగడం, అందరూ సుబ్బలక్ష్మి వచ్చిన వేళా విశేషమే అను

# ఆకర్షణలో అపస్వరాలు

కున్నారు. విశ్వనాథం చేతిలో కొంతదూరంవచ్చి, ఆగిపోయిన విద్యారేఖ ముందుకు చొచ్చుకు వచ్చిందేమో, అతను సాయం కళాశాలలో చేరాడు. అంతకుముందు సుబ్బలక్ష్మిని విశ్వనాథం, అతని తల్లి దండ్రులు ఎలా చూసేవారో ఏమో కాని, శ్యాం పుట్టినప్పటినుంచీ ఆమెమీద అనాదరణ ఉన్నట్టు బైటపడింది. చిట్టితల్లి కలిగినప్పటినుంచీ సుబ్బలక్ష్మిలో పటుత్వం తగ్గిపోయేప్పటికి ఆ అనాదరణ ఎక్కువైంది. కళాశాలలోను, తను పనిచేసే ఆఫీసులోనూ సీతాకోక చిలుకల్లా తిరిగే నాగరిక యువతుల అంద చందాలముందు సుబ్బలక్ష్మి తనకు తగినదికాదనే అభిప్రాయం విశ్వనాథంలో కలిగింది. రాను రాను అతనిలో ఆ అభిప్రాయం బాగా నాటుకుపోయింది. అప్పటినుంచి సుబ్బలక్ష్మిని సూటి పోటి మాటలనడం, హేళన చేయడం, అవమానించి ఏడిపించడం అతనికి అలవాటైంది.

విశ్వనాథం మంచి ఒడ్డూ—పొడుగూ, మంచి అంగ సౌష్ఠవం కలవాడు. ఎర్రగా, నాగరకంగా ఉంటాడు. అతనిప్రక్కన సుబ్బలక్ష్మి తీసికట్టుగానే కనిపించవచ్చు. కాని, లోకంలో పొడుగువాళ్ళకు, పొట్టి భార్యలు, పొడుగువాళ్లకు పొట్టి భర్తలు ఎందరు లేరు? విశ్వనాథానికి కలిగిన అభిప్రాయమే అందరిలోనూ కలిగితే సంసారాలు సుఖంగా, ప్రశాంతంగా జరుగుతాయా?

''మా నాన్నా వాళ్ళ తొందరపడ్డారుగాని, లేకపోతే అసలు నిన్ను చేసుకొనేవాణ్ణేకాదు. నా దురదృష్టంకొద్దీ దాపురించేవు......నీవు నాకు ఏమాత్రం తగవు'' అనేవాడు విశ్వనాథం.

''పెద్దవాళ్ళ చెప్పినట్టు తలూపడానికి మీరేం చిన్న పాపాయేంకాదుగా. పొట్టిది—పొట్టిది అని చెప్పినంతమాత్రాన ఈరోజు నే నెలా పొడుగవుతాను......పెళ్ళికిముందు నాలుగు సార్లు చూసుకున్నారుగా. అప్పుడు నచ్చినదాన్ని ఇప్పుడెందుకు పనికిరాను.....ఇద్దరు పిల్లలు పుట్టాక, ఇప్పుడు తగినదాన్ని కాదని తోచిందా?'' అనేది మొదట్లో చనువు తీసుకొని, సుబ్బలక్ష్మి. దానిమీద విశ్వనాథం పెట్రేగిపోయేవాడు. నోటికి వచ్చినట్టల్లా తిట్టేవాడు. ఒక్కోసారి చేయి కూడా చేసుకునేవాడు.

చిన్నవాళ్ళ తప్పుచేస్తే పెద్దవాళ్ళ మందలించడం రివాజు. ధర్మం కూడా. విశ్వనాథం తండ్రి, కొడుకును మందలించడంపోయి, అతని అభిప్రాయాన్ని బలపరిచేవాడు. అతని తల్లి మందలించేదికాని, ఆమె మాట సాగేదికాదు. తర్వాత తర్వాత నలుగురూ అనుకున్న దేమిటీ అంటే, కట్నానికి ఆశపడే సుబ్బలక్ష్మిని చేసుకున్నాడని.

సుబ్బలక్ష్మికి అత్తింట్లో సుఖం పోయింది. భర్త, మామగారు ఆమెను చీడపురుగుగా చూడటం, అత్తగారి నిస్సహాయస్థితి సుబ్బలక్ష్మికి నరకప్రాయంగా ఉండేది. అయినా అత్తిల్లే స్వర్గమనీ, భర్తే దేముడని, అలాగే పడిఉండేది. తర్వాత అదీ కూడా నోచుకోలేదు సుబ్బలక్ష్మి. ఒకసారి భూషణంగారికి జబ్బుచేసి ఉత్తరంవ్రాస్తే విశ్వనాథం సుబ్బలక్ష్మిని, శ్యామును తీసుకువెళ్ళి దిగబెట్టాడు. తాను తిరిగి వచ్చేప్పుడు సుబ్బలక్ష్మితో ''మీ వాళ్ళను అడిగి, అయిదు వందలు తెస్తేనే నిన్ను ఇంటికి రానిచ్చేది'' అని చెప్పాడు ఖండితంగా.

సుబ్బలక్ష్మి దాసును డబ్బెలా అడుగుతుంది? అందులో అయిదు వందలు. అన్నను డబ్బు అడగలేదు. అడిగినా ఇచ్చే పరిస్థితుల్లోలేడు దాసు. డబ్బు తీసుకువెళ్ళకపోతే గడపలోకి రానివ్వడు విశ్వనాథం. ఈ సందిగ్ధావస్థలో సుబ్బలక్ష్మికి ఎటూ పాలుపోకుండా అయి, అది మనస్తాపంగా తయారైంది. భూషణంగారు జబ్బునుంచి తేరుకున్నారు. విశ్వనాథంవచ్చి, సుబ్బలక్ష్మిని తీసుకుపోవడం సంగతి అటుంచి, నాలుగు నెలలైనా ఉత్తరం ముక్క కూడా వ్రాయకపోయేప్పటికి సుబ్బలక్ష్మి తల్లి తండ్రులకూ, దాసుకీ కారణం ఏమిటో అర్థం కాలేదు. దాసు ఉత్తరాలు వ్రాసినా, సమాధానం కూడా ఇవ్వలేదు విశ్వనాథం. దానితో వాళ్ళు సుబ్బలక్ష్మిని గ్రుచ్చి అడిగేప్పటికి అసలు విషయమంతా చెప్పింది. దానితో వాళ్ళకు ఏమి చేయడానికి తోచలేదు.

''ఎలాగైనా దాని కాపురం నిలబడితే బాగుండు'' అంది రాధమ్మగారు.

''ఇప్పుడు అయిదు వందలుతెస్తే గడపత్రొక్కమన్నవాడు, రేపు మరో అయిదు వందలు తెమ్మంటాడు. ఎక్కడ నుంచి తెస్తాం?'' అన్నారు భూషణంగారు.

''అయినా ఈ బెదరింపు లేమిటి? అసలు డబ్బు ఎందుకివ్వాలి. ఇవ్వాల్సిన కట్నం ఇస్తిమి, జరగవలసిన లాంచనాలన్నీ జరిపితిమి'' అన్నాడు దాసు.

''పోనీలే అన్నయ్యా!—ఆ నరకంలో ఉండేకంటే ఏ పనో పాటో చేసుకుని బ్రతకడం హాయి. నే నాయనకు తగిన దాన్ని కానప్పుడు ఇంకెవ్వరినైనా మళ్ళీ పెళ్ళి చేసుకుంటారు'' అని సుబ్బలక్ష్మి కళ్ళల్లో నీళ్ళ ఆపుకుంది.

''ఇవాళ్ళ అతను ఆ మాటనగానే సరా—లోకం మెచ్చవద్దూ!'' అంది రాధమ్మగారు.

''ఎందుకైనా మంచిది సుబ్బలూ!......థర్డు ఫారంవరకూ చదువుకున్నావుగా, ప్రైవేటుగా ఆంధ్ర మెట్రిక్ పరీక్షకు చదివితే మంచిది......ముందు ముందు పరిస్థితులు ఎలా పరిణమిస్తాయో, నీ కాళ్ళమీద నీవు నిలబడవచ్చు'' అన్నాడు దాసు.

''ఇప్పుడేం చదువు అన్నయ్యా!......అయినా దానికి మటుకు డబ్బు కావద్దూ—నీవే నానా అవస్థలు పడుతుంటివి'' అంది సుబ్బలక్ష్మి.

''దానికి పెద్ద ఖర్చేముంది సుబ్బులూ— చెప్పేవాడిని నే నున్నానుగా........పుస్తకాలు ఎక్కడో అక్కడ సంపాదించుకు వస్తాను'' అన్నాడు దాసు.

ఆ మరునాటినుంచే దాసు సుబ్బలకు చదువు చెప్పడం ప్రారంభించాడు. కాని, సుబ్బలు చదువుమీద ఎక్కువ శ్రద్ధ చూపకపోవడం, ఎప్పుడూ దిగులుగా ఉండడం అస్తమానం తల్లి కూతురు కాపురం నిలబెట్టలేక పోతున్నామని మథనపడడం దాసుకు ఏం చేయాలో పాలుపోలేదు. బ్రహ్మ ప్రయత్నంమీద మూడువందల రూపాయలు వడ్డీకి సంపాదించి చెల్లెల్ని తీసుకునివెళ్ళి విశ్వనాథానికి నచ్చచెప్పి దిగబెట్టి వచ్చాడు. భార్య మూడు వందలు తెచ్చిందికదా అని ఒక నెలరోజులు సుబ్బలక్ష్మిని మురిపెంగానే చూశాడు. విశ్వనాథం. ఆ తర్వాత మళ్ళీ పాత పాట ప్రారంభించాడు.

"పోనీ, నేను మీకు తగినదాన్ని కాకపోతే మళ్ళీ ఎవరినైనా పెళ్ళి చేసుకోండి—నేను దాసీదానిలా పడుంటా" అంది సుబ్బలక్ష్మి.

"నీవుంటే పిల్ల నెవరిస్తారు నాకు—నీవే ఎవరినైనా నాకు తగినదాన్ని తెచ్చి చెయ్యి" అన్నాడు విశ్వనాథం. సుబ్బలక్ష్మి కుళ్ళి కుళ్ళి ఏడ్చింది. సుబ్బలక్ష్మి తెచ్చిన మూడు వందలు పెట్టి రేడియో కొన్నాడు విశ్వనాథం. "మిగతా రెండువందలు అడిగి తీసుకురా—నేను సైకిలు కొనుక్కుంటా" అన్నాడు. "మా అన్నయ్యేం, వందలూ, వేలూ సంపాదించడంలేదు. మీ రడిగినప్పుడల్లా వందలు కుమ్మరించడానికి" అంది సుబ్బలక్ష్మి. ఆ మాటలకు విశ్వనాథం మండిపడి, చేయి చేసుకున్నాడు. ఆ దెబ్బలకు సుబ్బలక్ష్మి రెండు మూడు రోజులదాకా లేవలేకపోయింది. లేవకుండా పడుందిగదా అని వూరుకునేవాడుకాదు విశ్వనాథం.

"ఏం రోగం—బ్రతెలా పడుకున్నావ్......మా అమ్మ ఎంతని చాకిరీ చేస్తుంది.........లేచి పని చెయ్యి" అని కేక లేసేవాడు.

"పోనీలేరా, దానికి ఒంట్లో బాగుండలేదు......నేను చేసుకుంటాలే" అనేది అతని తల్లి.

"నీవు వూరుకోవమ్మా—ఎవరికోసం చేస్తుంది?" అని కేకలేసేవాడు. అతని కేకలకు భయపడి ఒళ్ళరిమేప్పటికి మళ్ళీ ఎక్కడ కొడతాడోనని ఒంట్లో ఓపిక లేకపోయినా, మూల్గుతూనే ఇంటెడు చాకిరీ చేసేది.

రెండురోజులకోసారి భర్తచేత తిట్లు, దెబ్బలు తినడం, పిల్లలమీదకూడా విశ్వనాథం ఆదరణ చూపకపోవడం తను అందగత్తెనుకానని పదే పదే పరిహసించడం భరించలేకపోయింది సుబ్బలక్ష్మి. "నువ్వుంటే నాకు పిల్ల నెవరిస్తారు?" అని విశ్వనాథం చెప్పడంవల్ల సుబ్బలక్ష్మికి జీవితంమీద రోత పుట్టింది "అంటే తనను చచ్చిపొమనేజాగా" అని గుండె పగిలి ఏడ్చింది. "తను చస్తే పిల్లల గతేం కావాలి?" అని బెంబేలుపడింది. "కష్టమో, నిష్ఠూరమో ఇక్కడే పడుండాలి.......పుట్టింటికి వెడితే తిరిగి చూడరు సరికదా, రెండో పెళ్ళికి సిద్ధపడవచ్చు కూడా" అనుకుంది సుబ్బలక్ష్మి. కాని, ఆమె ఓర్పును గుర్తించలేదు విశ్వనాథం. వీలైనప్పుడల్లా ఆమెను సూటిపోటి మాటలతో బాధించడం, ఆమె చెప్పక, చెప్పక సమాధానంచెబితే ఒళ్ళు హూనం అయ్యేట్టు కొట్టడం పరిపాటైపోయింది. ఒకసారి సుబ్బలక్ష్మికి జ్వరం వచ్చింది. మూడు రోజులైనా మందూ, మాకూ లేదు. "డాక్టరు దగ్గరకు తీసుకుపొండి" అని అత్తగారు చెబితే "మరేం చావదులే ఇంత మిరియాల కషాయమో, జీలకర్ర రసమో పొంగించిపొయ్యి" అన్నాడు. ఆవిడ మటుకేంచేస్తుంది. ఆమెకుతెలిసిన చిటకాలు చేసింది. కాని సుబ్బలక్ష్మికి జ్వరం తగ్గలేదు. ఐదురోజులయ్యేప్పటికి మనిషి చాలా నీరసించిపోయింది.

"వీళ్ళు నిన్ను బతకనీయరు. మీ వాళ్లకన్నా ఉత్తరం వ్రాయిస్తా......నీవు కోలుకుంటే తరువాతిసంగతి ఆలోచించవచ్చు" అంది అత్తగారు.

"చస్తే మంచిదేగా—ఆయనకు ఇంకో పెళ్ళాం వస్తుంది" కన్నీళ్ళు నింపుకుంటూ అంది సుబ్బలక్ష్మి.

"అదంత సులభంకాదులేమ్మా!......వాళ్ళు కర్కోటకులు. ఇంతకూ నీ రోజులు మంచివిగావు—ఒళ్ళు బాగైందాకా మీ వాళ్ళ ఇంట్లో ఉండి రావడం మంచిది" అంది అత్తగారు. ఆమే ప్రక్కింటివారబ్బాయితో భూషణంగారికి ఉత్తరం వ్రాయించింది. మూడో నాటికి దాసువచ్చి చెల్లెలి పరిస్థితిచూసి చాలా ఆందోళన పడ్డాడు. అత్తగారివల్ల సంగతులన్నీ తెలుసుకొని ఆమె సలహా ప్రకారం పిల్లల్ని, సుబ్బలక్ష్మిని తీసుకొని వెళ్ళాడు.

ఆనాటినుంచే సుబ్బలక్ష్మి, ఆమె పిల్లల పోషణ బాధ్యత దాసుమీద పడింది.

దాసు సంపాదనతో కుటుంబ నిర్వహణం కష్టంగా ఉండేది. అతనికి పెళ్ళికాకపోయినా, సంసార బాధ్యతలు, బరువు—బాధలు ఎక్కువై ఉక్కిరి బిక్కిరి అయ్యేవాడు. కొడుకు పడుతున్న అవస్థచూచి భూషణంగారు తనూ నాలుగురాళ్ళు సంపాదించాలని ఓ దుకాణంలో పద్దులు వ్రాయడానికి కుదిరి నెలకో నలభై రూపాయలు తెస్తూండేవాడు. కాని, ఆయన ఆరోగ్యం అంత దృఢంగా ఉండడంలేదు. మొదటినుంచీ ఉద్యోగంచేసే అలవాటు లేదు కాబట్టి, నిలకడగాఉండి, ఉద్యోగం చేయలేకపోయేవాడు. ఒంట్లో ఓపిక ఉన్నప్పుడుచేసేవాడు. లేనప్పుడు లేదు.

ఇన్ని బరువు బాధ్యత లున్నప్పటికీ, దాసులోని కళాప్రియత్వం తగ్గలేదు. ఇవన్నీ మరచిపోయి మనశ్శాంతి పొందడానికి దాసు వ్యాపకాలు కలిగించుకునేవాడు. కొందరు మిత్రులతో కలిసి కళాసమితి నొకదానిని స్థాపించాడు. కళాసమితి ప్రదర్శించే నాటకాల్లో పాల్గొంటూ, జంట నగరాలలో మంచి పేరూ—పలుకుబడీ సంపాదించుకున్నాడు. దానివల్ల ఆర్థికంగా అతనికి ఒరిగిందేమీ లేకపోయినా, ఒక తృప్తి, ఉత్సాహం పొందేవాడు.

సుబ్బలక్ష్మికి ధైర్యం చెప్పి, చదువుమీద ధ్యాస కలిగించి మెట్రిక్ పరీక్షకు తయారు చేశాడు. పరీక్ష ప్యాసైతే ఆమె పొట్ట కామె సంపాదించుకోగలదనీ, ఆ వ్యాపకంలో ఆమె మనస్తాపం కూడా కొంత తగ్గుతుందనీ, తనకూ కొంత భారం తగ్గుతుందనీ భావించాడు దాసు.

## 4

ఉదయం ఎనిమిది గంటలైంది. భూషణంగారు గీతా పారాయణం చేస్తున్నారు. రాధమ్మగారు మడిగట్టుకొని పొయ్యిమీద ఎసరుపడేసి వంటింటి గుమ్మంలో కూర్చుని కూర తరుగుతున్నది. ఇవతలిగదిలో పడకకుర్చీలో కూర్చుని దాసు ఏదో పుస్తకం చదువుతున్నాడు. భాస్కరం చాపమీద కూర్చుని ఏవో లెక్కలు చేసుకుంటున్నాడు. సుబ్బలక్ష్మి మంచంమీద కూర్చుని చిట్టితల్లికి పాలు పడుతున్నది. శ్యాం గది గుమ్మంలో కూర్చుని ఆడుకుంటున్నాడు.

"అన్నయ్యా, డాక్టరుగారు వస్తారంటావా?" అని ప్రశ్నించింది సుబ్బలక్ష్మి.

"వస్తానన్నారుగా రాత్రి.....రావచ్చు" అన్నాడు దాసు పుస్తకం మడిచి.

"ఆయనకు జ్ఞాపకం ఉందో, లేదో"

“ఇంకాసేపు చూద్దాం......రాకపోతే సైకిలు తీసుకొని వెళ్ళొస్తాలే” అంటూ దాసు మళ్ళీ పుస్తకం తెరిచాడు.

“నాకో రూపాయిన్నర కావాలన్నయ్యా!” అన్నాడు భాస్కరం.

“ఎందుకు?”

“రెండొందల పేజీలవి రెండు బౌండ్లు కొనుక్కోవాలి.”

“ఇప్పుడెందుకవి.....ఆమధ్య నేవో కొన్నావుగా?”

“ఇంగ్లీషు నోట్సుకోటి, హిస్టరీకోటీ కావాలి.’

“ఎందుకురా అబద్ధా లాడుతావు. అప్పుడు ఇంగ్లీషు నోట్సుకే కావాలని కొంటివే.”

“అది గ్రామర్‌కి.”

“ఏం—ఏమైనా క్రొత్త సినిమా లొచ్చాయా?”

“అదేమిట్రా, వాడు నోట్సు పుస్తకాలు కొనుక్కుంటానంటుంటే సినిమా అంటావేమిటి?” రాధమ్మగారు కల్పించుకొని అంది.

“నీకు తెలియదే అమ్మా......వీడు వేసే వేషాలు. మొన్న ఇట్లాగే కాంపోజిషన్‌కు పుస్తకాలు కొంటానని తీసుకువెళ్ళిన డబ్బులు ఏం చేశాడో కనుక్కో.”

“ఏరా.......ఏంచేశావ్!”

“ఏం చేయలేదమ్మా!” అన్నాడు భాస్కరం.

“ఏమిటా సమాధానం........ఏవీ పుస్తకాలుకొంటే చూపెట్టు.”

“మాట్లాడవేరా!” అంది సుబ్బలక్ష్మి. భాస్కరం మాట్లాడకుండా సుబ్బలక్ష్మి వంక గుడ్లురుముతూ చూశాడు.

“ఎందుకు మాట్లాడుతాడు......వీడూ ఆ సుబ్బిగాడూ హొటల్లో మెక్కారుట” అన్నాడు దాసు.

“అన్నయ్య అలా కష్టపడి తెచ్చిస్తుంటే నీకిదేం దుర్బుద్ధిరా భాస్కరం?” అంది రాధమ్మగారు మందలిస్తూ.

ఇంతలో గుమ్మంముందు డాక్టరు వాసుదేవరావుగారి కారు ఆగింది. ఆయన కారు దిగుతుంటే, దాసు ఎదురువెళ్ళి “నమస్కారమండీ!” అన్నాడు. వాళ్ళు లోపలకు వచ్చేప్పటికి సుబ్బలక్ష్మిలేచి నిలుచుంది.

“ఏమ్మా......ఎలాఉంది పాపకు?” అని ప్రశ్నించారు వాసుదేవరావుగారు.

“రాత్రికంటే చాలా నయమండీ!” అంది సుబ్బలక్ష్మి.

వాసుదేవరావుగారు చిట్టితల్లిని స్టెతస్కోపుతో పరీక్షిస్తున్నారు. ఈలోపల వంటింట్లోంచి భూషణంగారు ధావళితో ఇవతలి గదిలోకి వచ్చారు.

“పాపకు మరేం భయుంలేదమ్మా!......ఇంకో ఇంజక్షన్ ఇవ్వాలి” అన్నారు వాసుదేవరావుగారు—డ్రైవర్ను స్టూలు మీద తెచ్చిపెట్టిన మెడికల్ చెస్టు తెరుస్తూ.

“దేవుడిలావచ్చి రాత్రి బిడ్డను కాపాడారు!బాబు!” కృతజ్ఞతగా అంది రాధమ్మగారు. వాసుదేవరావుగారు ఒకసారి ఆమె ముఖంవంక చిరునవ్వుతోచూసి, సిరంజీలోకి మందు ఎక్కించి చిట్టితల్లికి ఇంజక్షన్ ఇచ్చారు. మందు గోలీలు సుబ్బలక్ష్మి చేతికిచ్చి, భూషణంగారివంక చూస్తూ, “ఏమండీ, మీ వేషంచూసే భాగ్యం మాకు ఇప్పట్లో కలగదా ఏమిటి?” అన్నారు వాసుదేవరావు.

“మీకు తెలియందేముందీ—తలలన్నీ కూడాలిగా....... అంతా తరోమూలా ఉంటిమి” చిరునవ్వుతో అన్నారు భూషణంగారు.

“మీ అబ్బాయి మీపేరు నిలబెట్టేట్టు ఉన్నాడు.”

“ఏదో మీరు అభిమానంకొద్దీ అంటున్నారు.”

“సరే—వస్తా, హాస్పిటలుకు వెళ్ళాలి......పాపకేం ఫరవాలేదు.......మిస్టరు దాసూ—రేపు ఉదయంవచ్చి ఎలా ఉందీ చెప్తే అవసరమైతే వస్తాను” అంటూ బైటికి వచ్చారు వాసుదేవరావుగారు.

“అలాగేనండీ!” అన్నాడు దాసు. డ్రైవరు మెడికల్ చెస్టు తీసుకు వెళ్ళి కార్లో పెట్టాడు.

“ఉంటామండీ!” అంటూ భూషణంగారు చేతులు జోడించారు.

కారు కదిలిపోయింది.

ఆఫీసులో అడుగుపెట్టి అటెండెన్సు రిజిస్టరులో సంతకం పెడదామని వెళ్ళేప్పటికి అప్పటికే ప్యూను దాన్ని తీసుకు వెళ్ళి అధికారి గదిలో పెట్టేశాడు కాబోలు. దాసు బిక్కపోయి చరచర మెట్లెక్కి అధికారి గదిలోకి వెళ్ళాడు. అప్పుడే అధికారి ఎర్రపెన్సిలుతో క్రాసు మార్కులు పెడుతున్నాడు.

“గుడ్‌మార్నింగ్ సర్” వినయంగా అన్నాడు దాసు. అధికారి తలెత్తిచూసి, “వ్వాట్ మిస్టర్ దాస్......యు ఆర్ లేట్” అన్నాడు, కాస్త మందలిస్తున్నట్లు పలుకరిస్తూ.

“అవునుసార్........మా చెల్లెలి కూతురికి జబ్బుగా ఉంది........డాక్టర్ వచ్చేంతవరకు ఉండి రావలసి వచ్చింది.

“అలాగా, ఏం జబ్బు?”

“డబుల్ న్యుమోనియా అన్నారు డాక్టర్”

“మొత్తానికి ఓవర్ బర్డనైనా ఫుల్ చేస్తున్నావు” అన్నాడు అధికారి.

ఇంతలో తెర తొలగించుకొని, “గుడ్‌మార్నింగ్ సర్’ అంటూ ఒక యువతి వచ్చింది. ‘ఎవరీ కొత్తావిడ........’ బహుశః ఈమే కాబోలు క్రొత్తగా అపాయింటు అయినామె’. అనుకున్నాడు దాసు.

“ఆల్‌రైట్ మిస్టర్ దాస్....హావ్ యువర్ ఇన్షల్... రేపటినుంచి మాత్రం, ప్లీజు కీప్ టైం” అధికారస్వరం ధ్వనింపించా డాయన.

దాసు రిజిస్టరులో సంతకంపెట్టి, అధికారి గదిలోంచి బైటకు వచ్చేప్పటికి అక్కడ కొందరు గుమాస్తాలు అటు—ఇటు తారట్లాడుతున్నారు. “ఇదేమిటీ—వీళ్ళిక్కడిక్కడే తారాడుతున్నారు. సెక్షన్‌లోకి పోకుండా” అనుకున్నాడు దాసు.

“హలో దాసూ, భలే తెలివైనవాడివోయ్!” అన్నాడు ఒక గుమాస్తా శేఖరం.

“ఏమిటి విశేషం?” అన్నాడు దాసు ఆశ్చర్యంగా.

"ఆ క్రొత్తసుందరి ఇవ్వాల్టినుంచి ఉద్యోగంలో చేరుతున్నదిగా.......అవున్లే, నీవు లేటు కావడం కూడా అదృష్టమే, అధికారి గదిలో దగ్గరినుంచి చూసి వచ్చావు" అన్నాడు శేఖర్.

అతని కొంచెపు తనానికి నవ్వుకుంటూ చకచకా తన సెక్షన్‌లోకి వెళ్లాడు దాను.

ఆమె అధికారి గదిలోంచి ఎప్పుడు ఇవతలికి వస్తుందా అని కొంతమంది గుమాస్తాలు అటువైపు పనిలేకపోయినా తచ్చాడుతూనే ఉన్నారు.

పది నిమిషాలు పది యుగాలుగా గడిచింది వాళ్లకు.

అధికారి గదిలో గంట మ్రోగింది. అప్పన్న 'సార్' అంటూ లోపలకు వెళ్లాడు. మరి రెండు క్షణాలలో ఆమె బయటకు వచ్చింది. "ఇటువైపు అమ్మా!" అంటూ ఆమె వెనకాలే వచ్చి అప్పన్న దారి చూపుతూ ముందుకు సాగాడు.

ఆమె ఒకసారి అక్కడ తచ్చాడుతున్న నలుగు రైదుగురు గుమాస్తాలను చూచింది. కళ్ల కాటుక నవ్వింది. ముఖం మీద ఎర్ర మబ్బులు తెచ్చిపెట్టుకొని అప్పన్న వెనకే వెళ్ళింది.

మరో పది నిమిషాల్లో ఆమె పేరు మీనాక్షిఅని, 'సి' సెక్షనులో వేశారనీ ఆఫీసంతా గుప్పుమంది.

"పేరుకు తగ్గట్టున్నాయి. మిలమిల్లాడుతూ కళ్లు...."

"ఈరోజు ఈ ఆఫీసు చరిత్రలో సుందరాధ్యాయం....."

"చూడ చక్కని చిన్నదీ, 'సి' సెక్షనులో ఉన్నదీ......"

"ఉన్నవాళ్ళతో విసుగెత్తినందుకు మంచి సరుకే వచ్చింది"

మీనాక్షి రిక్షాలోంచి దిగి కటాక్షాల కటకటాల మధ్యగా అధికారిగదిలోకి వెడుతుంటే ప్యూన్లు సైతం గుటకలు మింగుతూ కళ్లప్పగించి నిలబడ్డారు.

"'సి' సెక్షన్ సూపరింటెండెంటు అనంతం ఆమెను చూడగానే 'షాక్' తగిలినట్లయిపోయాడు. ఏదో మాట్లాడుదామనుకొని మాటలు తడబడ్తాయేమోనని రెండు క్షణాలు ఆగేప్పటికి మీనాక్షివచ్చి ఎదురుగా ఓ కుర్చీలో కూర్చుంది.

కలాలు పట్టుకొని ఏదో వ్రాయబోతున్న ముగ్గురు గుమాస్తాలకూ, టేబుల్‌మీది ఫైళ్లు కనిపించలేదు. ఆ సెక్షనులో పని చేసే కుముదిని కిసుక్కున నవ్వింది.

"ఏమిటా చూపులు—సూదులు గ్రుచ్చినట్టు" అనుకుంది మీనాక్షి.

అనంతం ఆమెకు సెక్షనులో వాళ్లను పరిచయం చేశాడు.

"హలో మిస్టర్ అనంతం......ఆ ఫైలు ఇంకా పంపలేదేమిటి?" అంటూ 'జి' సెక్షన్ సూపరింటెండెంటు కాళిదాను వచ్చాడు.

"ఏ ఫైలు?" అన్నాడు అనంతం.

"అదే—నిన్న పంపింది" అంటూ అక్కడ తిష్ఠ వేశాడు—ఓ చూపు మీనాక్షివైపు విసిరి.

"ఆ కాళిదాసు కవిత్వమైనా అర్థం చేసుకోవచ్చునేమోగాని, నీ ధోరణిమాత్రం అర్థంకాదు. అభినవ కాళిదాసా!" అనంతం వ్యంగ్యంగా అన్నాడు

"అంత అర్థం కాకుండా ఉన్నానుటయ్యా! అసలు ఒక్క చూపైనా పారేస్తేగా అర్థం కావడానికి" అన్నాడు కాళిదాను.

"నిన్న పంపిన ఫైలంటే ఏదనీ—బహుశా ఇవ్వాళ వచ్చిన ఫైలుకోసం వచ్చావేమో!"

"అదేనయ్యా—మీనాక్షి దేవాలయం ఫైలు" అన్నాడు కాళిదాసు, మీనాక్షివంకకు బితుకుగా చూస్తూ.

"చష్—అసలు నీవు పంపందే!"

వాళ్లిద్దరి సంభాషణా మీనాక్షికి సందర్భోచితంగా తోచలేదు.

"పంపకపోవడ మేమిటి? మా యు. డి. ని పంపమన్నానే... సరే—అదేదో వెళ్ళి కనుక్కోవాలి" అంటూ కాళిదాసు లేచిపోతూ మీనాక్షివంక ఓ చురుకుచూపు సారించి మరీ వెళ్లాడు.

"ఈమాత్రం భాగ్యానికి తను రావాలా?" అంటూ అనంతం బెల్ నొక్కాడు.

"క్యా సాబ్!" అంటూ రహీం వచ్చాడు.

"కాంటీనుకువెళ్ళి కాఫీ చెప్పిరా!"

"అచ్ఛాసాబ్........మగర్ కిత్నే కాఫీ బోల్నా"

"నీ కెప్పుడూ కొత్తే.....పో—పో—......జల్దీ చెప్పిరా"

రహీం వెళ్ళిపోయాడు.

"చూడండి మీనాక్షిగారూ!......మేమంతా కలిసి గట్టిగా పని చేస్తాం. నేను పేరుకు సూపర్నెంటునేకాని, మీ అందరితో పాటు వాడినే!.......మీరు కూడా మాలాగే ఉండాలని......" మాటలు మింగేశాడు అనంతం.

"అలాగేనండీ!" అంది మీనాక్షి.

"ఇలా వచ్చి కూర్చోండి—మీరు చేయవలసిన పనేమిటో చెబుతాను."

మీనాక్షివెళ్ళి అనంతం టేబులుకు ఎదురుగ్గా ఉన్న కుర్చీల్లో ఒక దానిమీద కూర్చుంది.

కుముదిని ప్రక్క గుమాస్తావంకచూసి నవ్వింది.

అనంతం మీనాక్షికి పని విషయంలో బోధపరుస్తున్నాడు. ఈలోగా ఇతర సెక్షన్ల గుమాస్తాలు నలుగు రైదుగురు ఏదో పెద్దపని ఉన్నట్టు లోపలకువచ్చి అక్కడి గుమాస్తాలతో ఏదో మాట్లాడి, మీనాక్షిని ఓరగా చూస్తూ వెళ్ళిపోయారు.

రహీం కాంటీను కుర్రవాడిచేత కాఫీలు పట్టించుకు వచ్చాడు. కుర్రవాడు కప్పుల్లో కాఫీ నింపి, అందరికీ ఇస్తున్నాడు.

"అబ్బె—నాకు వద్దండీ!" అంది మీనాక్షి.

"తీస్కోండీ హమ్మా—తీస్కోండి" అంటూ రహీం ఆమెముందు ఫైలు ప్రక్కకు జరిపి కాఫీ కప్పు పెట్టాడు.

"ఏం—మీరు కాఫీ తీసుకోరా? పోనీ టీ తెప్పించమంటారా?"

"అబ్బే—నాకేం వద్దండీ......నాకే కాఫీలు, టీలు అలవాటు లేదు."

"ఈ రోజుల్లో కాఫీ—టీ త్రాగనివారిని ఎవరినీ చూడలేదు."

# ఆకర్షణలో అపస్వరాలు

"ఇప్పటికి నన్ను చూశారుగా!" ఆమె స్వరంలో పెళుసుదనం ధ్వనించింది.

"పోనీ పాలుగాని, ఓవల్టీనుగాని తెప్పించండి సార్!" అన్నాడు ఓ గుమాస్తా.

"మేమంతా త్రాగుతుంటే మీరేం తీసుకోకపోవడం ఏం బాగుండదు" అన్నాడు అనంతం.

"సరే—పాలు తెప్పించండి" అంది మీనాక్షి.

అనంతం చెప్పకముందే కాంటీను కుర్రాడు, "ఇప్పుడే తెస్తాను సార్!" అంటూ పరుగెత్తాడు. అయిదు నిమిషాల్లో కప్పులో పాలుతెచ్చి మీనాక్షికి ఇచ్చాడు. అందరూ కాఫీలు త్రాగడం అయిపోయింది.

"ఇదేం బ్రహ్మవిద్యేంకాదు.....నాలుగు రోజులుపోతే మీకే తెలుస్తుంది. మీకు తెలియంది నన్ను అడుగుతూ ఉండండి"

"అలాగేనండీ!" అంటూ మీనాక్షి వచ్చి తన సీటులో కూర్చుంది.

మధ్యాహ్నం ఒంటిగంటలోగా ఇతర సెక్షన్లవాళ్లు ఏదో నెపంతో 'సి' సెక్షనుకువచ్చి, మీనాక్షిని దర్శించుకుపోయారు. మొదట్లో అర్థం చేసుకోకపోయినా, మీనాక్షి తెలుసుకొని వాళ్ల ఆరాటానికి నవ్వుకుంది.

లంచిటైంలో ఆఫీసులో పనిచేసే ఆడవాళ్లు నలుగురూ మీనాక్షితో సహా ఒకచోట చేరారు. వాళ్లతో మీనాక్షి కలివిడిగానే మాట్లాడింది. కాని, వాళ్లందరిలో నీరజ మీద చనువు ఏర్పడింది. మిగతావాళ్లు మీనాక్షి అందానికి అసూయపడ్డారు. తనేదో కొస్త అందగత్తెననుకుంటున్న కుముదిని మీనాక్షి వచ్చినప్పట్నుంచి, తోటి గుమాస్తాలతో మరింత చనువు పెంచుకుంది.

మగవాళ్లకు కాంటీనులోనూ, ఇటు ఆఫీసు ఆవరణలోని చెట్లక్రింద సమావేశాల్లోనూ మీనాక్షి ప్రసక్తే ప్రధానమైపోయింది.

"కాస్త టెక్కు కూడా ఉన్నట్టుంది."

"అందంతోపాటే వస్తుందిరా—ఆ టెక్కు"

"ఇంతకూ 'సి' సెక్షనువాళ్లు అదృష్టవంతులు."

కొందరు ఆ సెక్షను ప్యూను కాబట్టి రహీం అదృష్టాన్ని కూడా పొగిడారు.

టీ త్రాగుతున్న దాసు వాళ్ల మాటలకు నవ్వుకున్నాడు.

"కొత్తగా వచ్చిన ఆడదాన్నిగురించి మనం ఇలా అనుకోడం ఏం బాగుండలేదు" అన్నాడు దాసు.

"ఓ యబ్బ! ఋష్యశృంగుడు బయలుదేరాడు!" అన్నాడు గుమాస్తా.

"నేను ఋష్యశృంగుణ్ణీకాదు — భీష్ముణ్ణీకాదు ఆడదంటే మీ కెందుకూ అంత చులకన.....మనకూ చెల్లెళ్లున్నారు... మీలో కొందరికి భార్యలు కూడా ఉన్నారు...మీ వాళ్లనుగురించి ఎవరైనా అంటుంటే మీ కెలా ఉంటుంది?" అన్నాడు దాసు.

"అలా చెప్పు—ఆమె మీకు బంధువన్నమాట" అన్నాడు శేఖర్.

"ఆమె నాకు బంధువూకాదు—ఇంతకుముందెప్పుడూ చూడనూలేదు. పాపం ఆమె ఏ కారణాలవల్ల ఉద్యోగానికి రావలసి వచ్చిందో? ఆమె సంపాదించుకొని, ఆమె బ్రతుకు ఆమె బ్రతుకుతున్నందుకు మనం సంతోషించాల్సిందిపోయి అసహ్యంగా మాట్లాడుకుంటున్నాం."

దాసు మాటలు వాళ్లకు కటువుగా తోచాయి. అతని మాటల్లో యథార్థంఉన్నా—వాళ్లు పట్టించుకోలేదు. వాళ్లు ఏమీ మాట్లాడకపోయేప్పటికి దాసు లేచి కౌంటరు దగ్గర డబ్బులిచ్చి, బైటకు వచ్చాడు.

"దాసుకు అంత ఉక్రోషం ఎందుకొచ్చింది—అతనూ మనలాంటి మగాడే. ఆమె తనకు బంధువు కాదనీ, ఎప్పుడూ చూడలేదనీ అన్నాడు కానీ, మీనాక్షి అతనికి బాగా తెలిసేఉంటుంది" అనుకున్నారు వాళ్లు.

దాసు సెక్షనులోకి పోతుంటే మధ్యలో నీరజ, మీనాక్షి ఎదురయ్యారు. అతను వాళ్ల సంగతేమీ పట్టనట్టు ముందుకు పోతుంటే నీరజ "నమస్కారమండీ!" అని పలుకరించింది.

"నమస్కారం!"

"మొన్న మీ నాటకం చాలా బాగుంది."

"థాంక్సు"

"ఈమె మన ఆఫీసులో కొత్తగా చేరింది—మీనాక్షి."

"నమస్కారం!" అంది మీనాక్షి చేతులు జోడించి.

"వీరు దాసుగారు, 'ఏ' సెక్షనులో పని చేస్తారు. రేడియో నాటకాల్లోనూ, స్టేజీ నాటకాల్లోనూ వేస్తుంటారు" అని నీరజ దాసును పరిచయం చేసింది.

"వస్తానండీ!" అంటూ దాసు తన సెక్షన్‌లోకి వెళ్ళిపోయాడు.

"అదేమి—ఆయన మాట్లాడుతుండగానే వెళ్ళిపోయాడు' అంది మీనాక్షి.

"ఈ ఆఫీసులో అందరూ ఒక ఎత్తు—ఈయనొక్కడూ ఒక ఎత్తు. అందరూ మనతో పరిచయం చేసుకోవాలనీ, మాట్లాడాలనీ ప్రయత్నం చేస్తుంటే, మనకై మనం మాట్లాడించినా ఎంతో భిడియపడుతాడు పాపం!" అంది నీరజ.

"ఇటువంటివాడు నాటకాల్లో ఆడవాళ్ల ప్రక్కన వేషాలేం వేస్తాడు?" నవ్వుతూ అంది మీనాక్షి.

"నాటకాల్లో చాలా ఫ్రీగానే యాక్టు చేస్తాడు."

"ఉహూ!" ఏదో ఆలోచిస్తూ అంది మీనాక్షి.

ఇద్దరూ తమ తమ సెక్షన్లలోకి వెళ్ళిపోయారు.

అంతకుముందు కాంటీనులో మీనాక్షినిగురించి మాట్లాడుకున్నవాళ్లు దాసు, నీరజా. మీనాక్షులతో మాట్లాడి వెళ్ళడం చూసి, వాళ్ల వూహల్ని బలపరచుకున్నారు.

"చచ్చాం.....దాసు ఎదుట మనం జాగ్రత్తగా మాట్లాడుకోవాలి" అనుకున్నారు.

దాసు తన సెక్షనులోకి వెళ్ళి సీటులో కూర్చుంటూ ఒక ప్యూనును పిలిచి, "యాదయ్య రాలేదా?" అని ప్రశ్నించాడు.

"ఇప్పుడేవచ్చి కాంటీనుకు పోయాడు సార్!" అన్నాడు.

"సర్లే....." అంటూ ఏదో ఫైలు తీశాడు దాసు.

"ఆఫీసుకు వచ్చినప్పటినుంచి యాదయ్యకు చెప్పగా చెప్పగా ఇంట్రవెల్‌లోవెళ్ళి డబ్బు తెస్తా నన్నాడు—తెచ్చాడో లేదో

....తెస్తే సాయంత్రం వెళ్ళి మాలతికి డబ్బు ఇచ్చేసెయ్యాలి'' అనుకున్నాడు దాసు.

''మిస్టరు దాసూ!'' అని పిలిచాడు సెక్షన్ సూపరింటెండెంటు బలరామయ్య. దాసు ఆయన దగ్గరకువెళ్ళి నిలుచున్నాడు.

''ఈ డ్రాఫ్టు ఆ స్వామి వ్రాశాడు. ఏం బాగుల్లేదు..... ఈ ఫైలు తీసుకువెళ్ళి మీరు వేరే డ్రాఫ్టు వ్రాయండి'' అన్నాడు సూపరింటెండెంటు.

''నామీద ప్రమోట్ అయిన స్వామిగారు వ్రాసింది నేను మార్చి వ్రాయడం ఏం బాగుంటుందండీ!''

''మరేం ఫర్వాలేదు......ఈ డ్రాఫ్టు ఇలాగేపోతే ఆఫీసర్ నన్ను ముక్కచివాట్లు పెడతాడు. అయినా, ఈ ప్రమోషన్లకూ ఎఫిషియన్సీలకూ సంబంధ మేమిటిలే! ఫైలు తీసుకు వెళ్లండి. నిన్న ఈ డ్రాఫ్టు నా మొహాన పారేశాడు, ఇవ్వాళ్ల సెలవు పెట్టాడు. ఏం చెయ్యను,నా చుట్టూ చూడండి—ఎన్ని ఫైళ్లో.''

ఇంకేం మాట్లాడలేక దాసు ఫైలు తీసుకొని సీట్లోకి వెళ్ళి అరగంటలో ఫైలంతా తిరగవేసి డ్రాఫ్టు తయారుచేసి ప్యూనును పిలిచాడు.

''ఏం సార్'' అంటూ యాదయ్య వచ్చాడు.

''ఏం యాదయ్యా!.......ఏమైందీ వెళ్ళిన పని?''

''అతను కలవలేదు సార్!''

''చంపేశావు.......మరెట్లా?''

''కాస్తాగి మళ్లీ వెళ్లొస్తాలెండి.''

''సరే—ఎట్లాగైనా చూడు.......ఇదుగో—ఈ ఫైలు సూపర్నెంటుగారి కియ్యి.''

యాదయ్య ఫైలు తీసుకు వెళ్లాడు.

''ఏమిటి మీరు యాదయ్య దగ్గర డబ్బు తీసుకుంటున్నారా?'' అన్నాడు ప్రక్క గుమాస్తా. దాసు, అతనివంకచూసి పూరుకున్నాడు.

''వాడుత్త దొంగ వెధవ.......అన్నీ అబద్ధాలే!.....డబ్బు తెచ్చేఉంటాడు. మీ దగ్గర రిక్షాలకనీ, టీ కనీ డబ్బులు గుంజటానికి నాటకం ఆడుతున్నాడు. మళ్లీ వెళ్లొస్తానన్నాడా, వెళ్ళినట్టేవెళ్ళి, రిక్షాకు అర్థ రూపాయి అయిందంటాడు'' అన్నాడా గుమాస్తా.

''నిజంగానా?'' ఆశ్చర్యంగా అన్నాడు దాసు.

''స్వానుభవం స్వామీ!'' అన్నా డతను నవ్వుతూ.

ఆ గుమాస్తా మాటలలో దాసు మనస్సు వికలమైంది. ''యాదయ్య ఇవ్వకపోతే ఏమిటి చేయడం?......'' అన్న ఆలోచన బుర్రలో గిర్రున తిరిగింది. మనస్సు పనిమీద లగ్నం కావడం లేదు. పనిచేసేటప్పుడు ఇటువంటి ఆలోచనలు రానీయకుండా దాసు ప్రయత్నిస్తుంటాడు. ఒక్కోసారి సాధ్యపడేదికాదు. ఎలాగో సాయంత్రందాకా పని చేశాడు. మధ్యలో యాదయ్య కోసం ఒకటి రెండుసార్లు చూశాడు. కనిపించలేదు. మరో పదిహేను నిమిషాల్లో ఆఫీసు వదులుతారనగా యాదయ్య దాసు దగ్గరకువచ్చి ''ఒకసారి వరండాలోకి రండి,సార్!'' అన్నాడు.

''సరే—నీవు పద'' అని యాదయ్య వెళ్ళిన తరువాత ఓ రెండ నిమిషాలాగి వరండాలోకి వెళ్లాడు.

''ఎంతో ప్రయత్నంచేస్తే ముప్పయి రూపాయలు దొరికాయి సార్! వడ్డీ పట్టుకొని ఇరవైఏడు రూపాయ లిచ్చాడు. రెండుసార్లు తిరిగొచ్చినందుకు, వాడికి టీ ఇప్పించినందుకూ అంతా రూపాయిన్నర అయింది. మిగతాది ఇదుగో!'' అంటూ డబ్బు దాసు చేతికిచ్చాడు.

''జీతాలు రాగానే ఇచ్చేయాలి సార్!......మళ్ళా మన కెప్పుడు కావాలంటే అప్పుడు తెచ్చుకోవచ్చు'' అని హెచ్చరించి వెళ్ళిపోయాడు యాదయ్య.

''ముప్పయికి మూడు రూపాయలు వడ్డీయా...... పైగా రూపాయిన్నర సాదరు ఖర్చు—ఎంత ఘోరం'' అనుకున్నాడు, దాసు తన సీటులోకివెళ్ళి కూర్చుని ఫైళ్ళు కట్టిపెడుతూ.

## 5

దాసు చరచర మెట్లెక్కి పైకి వెళ్లాడు. ఎవరూ కనిపించలేదు. డ్రాయింగురూంలోకి తొంగిచూశాడు. అక్కడా ఎవరూలేరు. ఒక గదిలో వీణావాద్యం వినిపిస్తున్నది. ''నను పాలింపగ నడచి వచ్చితివా'' అన్న కృతికి ఒక మధురస్వరం సొంపు కూరుస్తూ ప్రారంభమైంది. ఇంతలో ఒక నడి వయస్సులో ఉన్న పనిమనిషి అటువచ్చి దాసును చూసి, ''డ్రాయింగ్‌రూంలో కూసోండి—అమ్మాయిగార్ని పిలుస్త'' అంది.

''నేను కూర్చుంటాలే గాని—నేను వచ్చానని ఇప్పుడే వెళ్ళి చెప్పకు........ఆ పాట పూర్తికానీ'' అన్నాడు దాసు. పనిమనిషి వెళ్లింది. దాసువెళ్ళి డ్రాయింగ్‌రూంలో కూర్చున్నాడు.

''మాలతి ఎంత అదృష్టవంతురాలు...... అందం, చదువు వీటికి రాణింపుగా మధురమైన గాత్రం, సిరిసంపదలు ఎందరికుంటాయి. వీటిల్లో ఒకటుంటే ఒకటుండదు. అన్నీవున్న ఆకు అణిగే ఉంటుందన్నట్టు మాలతిలో వినయవిధేయతలు కూడా ఉన్నాయి.....కొందరికి ఎంత మిడిసిపాటు'' అని ఆలోచిస్తున్నాడు.

అవతలి గదిలోంచి మాలతి వీణమీద వేస్తున్న సంగతులు గంతులువేస్తూ డ్రాయింగ్‌రూంలోకి చొరబడుతున్నాయి. ఆ గాన మాధుర్యాన్ని దాసు అనుభవిస్తున్నాడు. అలా నిమిషాలు దొర్లిపోతున్నాయి.

ఇంతలో అక్కడకు మాలతివచ్చి, ''నమస్కారమండీ!..... మీరువచ్చి చాలాసేపు అయిందటగా'' అంది ఓ సోఫాలో కూర్చుంటూ.

''అబ్బే—ఎంతోసేపు కాలేదండీ......అనవసరంగా ఆనందాన్ని భగ్నం చేయడం దేనికని పనిమనిషితో ఇప్పుడేవెళ్ళి చెప్పకు అన్నాను.''

''ఎవరి ఆనందాన్ని?'' నవ్వుతూ అంది మాలతి. సమాధానం చెప్పడానికి ఇరుకునబడినట్టు ముఖం పెట్టాడు దాసు.

''మీ చిట్టితల్లికి ఎలా ఉన్నది?''

''మీ నాన్నగారి దయవల్ల కాస్త కులాసాగానేవుంది...... ఇదిగో—నిన్న మీరిచ్చిన ఇరవై రూపాయలు'' అంటూ జేబులోంచి రెండు పది రూపాయల నోట్లు తీశాడు.

"నే నెప్పు డిచ్చాను?"

"అమాత్రం తెలుసుకోలేననుకున్నారా? నిన్న మాటల సందర్భంలో మీ నాన్నగారికి ఫీజు ఇచ్చుకోలేని స్థితిలో ఉన్నానని అన్నాను. దానితో మీరు నా స్థితిగతులన్నీ వూహించారు. చేతికిస్తే తీసుకోనేమోనని కార్లో వెళ్తున్నప్పుడు నేను పరధ్యానంగా ఉండటంచూసి రెండు నోట్లు నా బుష్‌కోటు జేబులో పెట్టారు కదూ!"

"బాగానే వూహించారే!......అయితే దాసుగారూ, ఆ నోట్లు రాత్రినుంచి భద్రంగా దాచేవుంచారా నిజంగా?" అతని కళ్ళల్లోకి చూస్తూ ప్రశ్నించింది మాలతి.

"నిజంగా రాత్రి మీ రిచ్చిన డబ్బు ఎంతో ఉపయోగ పడింది. ఇవ్వాళ నాకు డబ్బు చేతికి వచ్చింది. మీది మీ కివ్వడం భావ్యం అనిపించి వచ్చాను" అన్నాడు దాసు.

"ఎక్కడినుంచి వచ్చిందో ఈ డబ్బు?"

"ఎందు కీమెకు ఈ అజలన్నీ" అనుకుంటూ యథార్థం చెప్పడం ఎలాగా అని భిడియపడుతున్నాడు.

"ఇప్పుడు నా కివ్వడానికని ఎక్కడినుంచో అప్పుతెచ్చారు కదూ?.......ఏం నేనామాత్రం సహాయం చేయకూడదా?..... అది మీరు ఎవరిదగ్గరినుంచి తెచ్చారో వారికి ఇచ్చివెయ్యండి.....నా కిప్పుడేం ఇవ్వక్కరలేదు......నిదానంగా సర్దండి అంతగా అయితే" అంది మాలతి.

"ఎక్కడా అప్పుతేలేదు, నాకు రావలసిన డబ్బు వచ్చింది." అని అబద్ధం చెప్పడానికి మనస్కరించలేదు దాసుకు. ఇంతలో పని కుర్రాడు ఏవో ఫలహారాలు మంచినీళ్లు తెచ్చిపెట్టాడు.

"టిఫిన్ తీసుకోండి" అంది మాలతి.

ఇద్దరూ ఏవో కబుర్లు చెప్పుకుంటూ టిఫిన్ తింటున్నారు. అతను 'వూ' కొడుతూ మధ్య మధ్య ఏదో పొడిమాట అనడమే గాని, మాలతియే ఎక్కువగా మాట్లాడుతున్నది. సూటిగా ఆమె ముఖంలోకి చూడటానికి భిడియ పడుతున్నాడు దాసు. "నాటకంలో అంత చొరవగా, చక్కగా యాక్టు చేసిన మనిషికి ఉత్తప్పుడు ఇంత భిడియమేమిటి?" అనుకుంది మాలతి.

ఇద్దరూ టిఫిన్లు పూర్తిచేసి కాఫీ త్రాగారు.

"రండి—మా ఇల్లు చూద్దురుగాని" అంటూ మాలతి లేచింది. 'వద్దంటే ఏమనుకుంటుందో'నని దాసు ఆమెను అనుసరించాడు.

"మా అమ్మగారు" అంటూ తల్లిని పరిచయం చేసింది.

"నమస్కారమండీ!" వినయంగా అన్నాడు దాసు.

"దాసుగారు వీరేనమ్మా......రాత్రి వీరింటికే నేనూ, నాన్నగారూ వెళ్లింది" అని ఆమెకు దాసును పరిచయం చేసింది మాలతి.

"ఇప్పుడు పాపకు ఎలావుంది బాబూ!" అంది మాలతి తల్లి రాజేశ్వరమ్మగారు.

"కొంత కులాసాగా ఉన్నదండీ!"

"రండి—మా లైబ్రరీ చూద్దురుగాని" అంది మాలతి. ఇద్దరూ ఆగదిలోంచి వెళ్లారు. మాలతి అతనికి ఇల్లంతా చూపింది. "ఎంతో చూడ ముచ్చటగావుంది ప్రతి గదీ" అనుకున్నాడు దాసు. మాలతి వేసిన బొమ్మలు అతణ్ణి ఎంతో ఆకర్షించాయి. "బిచ్చగాడు—కోతి" అన్న వర్ణచిత్రం, "నిరీక్షణ" అన్న రేఖాచిత్రంచూసి, మాలతిలో అణగివున్న కళాతృష్ణను, అభినివేశాన్ని పొగడకుండా ఉండలేకపోయాడు. అతను పొగుడుతుంటే ఆమె సిగ్గుతో ఎర్రబడిపోయింది. ఆ గులాబీ లజ్జచూసి పూర్వకవుల వర్ణనను స్ఫురణకు తెచ్చుకున్నాడు దాసు.

"అక్కా—అక్కా" అంటూ అక్కడకు మాలతి చెల్లెలు మైత్రేయి వచ్చి, 'ఎవరా' అన్నట్టు దాసుకేసి చూసింది.

"గుర్తు పట్టలేదటే వీరిని......దాసుగారు......మా నాటకంలో......" అంటూ మాలతి మైత్రేయిని దాసుకు పరిచయం చేసింది.

"మైత్రేయిలో చిలిపితనం పాళ్లు ఎక్కువ. దాసును గుర్తించినా గుర్తించనట్లు ముఖంపెట్టి "ఏ దాసుగారే!...... కబీరుదాసు గారా—రామదాసుగారా—కృష్ణదాసుగారా? అదీ ఇదీ కాకపోతే హరిదాసుగారా?" అని నవ్వింది.

"నాటకాలదాసు" నవ్వుతూ అన్నాడు దాసు.

"మీ పేరు నాకేం నచ్చలేదండీ!.......మార్చేసుకోండి.... ఎవరికి దాసులు మీరు?" కొంటెగాచూస్తూ అంది మైత్రేయి.

"ఏమిటా మాటలు?" కొంచెం మందలిస్తూ స్వరం హెచ్చించింది మాలతి.

"ఆయనకు లేనికోపం మధ్య నీకెందుకే!........పోన్లే—నే పోతాలే!" అంటూ చిలిపి అడుగులువేస్తూ పోబోయింది మైత్రేయి.

"ఏదో తమాషాకు అంటే మీరెందుకు ఆమెను కోప్పడుతారు?.........రండి మైత్రేయిగారూ!" అన్నాడు దాసు.

"నాకు గారెలు, గీరెలు తగిలించకండోయ్!......అలా పిలిస్తే అసలు నేను పలకనే పలకను......మా అక్కయ్య బొమ్మలు చూశారుగా—నావి కూడా చూద్దురుగాని రండి..... మా అక్కయ్య ఉత్త చుప్పనాతి........తన బొమ్మలే చూపెట్టి వూరుకుంది" అంది మైత్రేయి.

"రండి—దాని బొమ్మలు కూడా చూద్దురుగాని. లేకపోతే నా పుతమారుస్తుంది" అంది మాలతి. ముగ్గురూ కలిసి మైత్రేయి గదిలోకి వెళ్లారు.

"మాతృమూర్తి" 'జాలరిపడుచు" చిత్రాలు చాలా బాగున్నాయి" అని దాసు మైత్రేయిని అభినందించాడు.

"అయితే మిగతావి బాగా లేవా?" అని చిలిపిగా చూస్తూ ప్రశ్నించింది మైత్రేయి.

"బాగుండలేదని నే నన్నానా? చిత్రలేఖనం కానివ్వండి, సంగీతం కానివ్వండి, మరోటికానివ్వండి ఎదుటివారు అభినందించడం వారి సంస్కారాన్నిబట్టి, అభిరుచినిబట్టి ఉంటుంది. అందర్నీ అన్నీ ఆకర్షించవు. అంత మాత్రంతో అవి బాగాలేవని ఎవరూ అనలేరు" అన్నాడు దాసు.

"ఓ యబ్బో పెద్ద ఉపన్యాస మిచ్చేట్టున్నారే అని గలగలా నవ్వింది మైత్రేయి. ముగ్గురూ ఆ గదిలోంచి వచ్చి డ్రాయింగ్‌రూంలో కూర్చున్నారు. మైత్రేయి ఏవో కబుర్లు

చెప్పి కవ్విస్తూనే ఉంది. గదిల చీకట్లు ముసురుతుంటే మాలతి స్విచ్ చేసింది.

"ఇంకనే వెడతానండీ!" అంటూ లేచి దాసు గదిలోంచి ఇవతలకు వచ్చాడు. అతని వెనకాలే మాలతీ, మైత్రేయి కూడా వచ్చారు. మెట్లు దిగుతున్న దాసుతో, "ఎప్పుడైనా వస్తుండండి" అంది మాలతి. "అలాగే" అంటూ చరచరా క్రిందికి దిగాడు దాసు. మైత్రేయి అక్కడినుంచి లోపలికి వెళ్ళిపోయింది. మాలతి బాల్కనీలోకి వెళ్ళి నిలుచుంది. వీథిలో దాసు తలవంచుకొని వెడుతూ కనిపిస్తున్నాడు. ఆమె గ్రుడ్డిగా అటువైపే చూస్తూ నిలబడింది.

"ఆర్థికంగా బాగా నలిగిపోతున్నట్టున్నాడు. పాపం! ఇంత స్వాభిమానం గల వ్యక్తికే అన్ని ఇబ్బందులూను" అనుకుంది మాలతి. సందు మలుపు తిరుగుతూ దాసు వెనక్కు తిరిగి చూశాడు. ఇంతలో 'మాలతీ' అన్న తల్లి పిలుపు వినిపించి 'వస్తున్నా' నంటూ బాల్కనీలోంచి లోపలకు వెళ్ళిపోయింది.

* * *

డాక్టరు వాసుదేవరావుగారు నగరంలో పేరుబడసిన సర్జన్లలో ముఖ్యుడు. విదేశాలలో కూడా వైద్య శాస్త్రం చదివి వచ్చాడు. శస్త్ర చికిత్సలో ఆయన అందెవేసిన చేయి అని ప్రతీతి. ఆయన చేతిమీదుగా జరిగిన ఆపరేషన్ ఎప్పుడూ 'ఫెయిల్' కాలేదు. దూర ప్రాంతాలనుండి కూడా ఆయనచేత ఆపరేషన్ చేయించు కుంటానికి వస్తుంటారు.

వాసుదేవరావుగారిది నిండైన విగ్రహం. ఉండటానికి 55 ఏళ్ళున్నా, అలా కనిపించరు. రెండు మూడు ప్రభుత్వ ఆసుపత్రులకు ఆయన విజిటింగ్ సర్జన్. ఆయనా, మరొక సర్జను కలిసి ప్రైవేటుగా ఒక ఆసుపత్రి పెట్టి నిర్వహిస్తున్నారు. ఎక్సరే రూము, ఆపరేషన్ థియేటరుతో అన్ని హంగులూ ఉన్నాయి అందులో. ఆయనకు స్వదేశంమీద, సంప్రదాయాలమీద ఎంతో విశ్వాసముంది. ఆంధ్ర సంస్కృతి, కళలపట్ల ఆయనకు గల గాఢాభిమానం కొందరికి ఆశ్చర్యకరంగా ఉంటుంది. ఆ యా సంస్థలకు, కళాకారులకు లేదనకుండా సహాయం చేస్తుంటారు.

ఆయన కొడుకు శ్రీనివాసం ప్రస్తుతం అమెరికాలో 'ఐ స్పెషలిస్టు'గా తర్ఫీదు పొందుతున్నాడు. ఆయన రెండవ సంతానం మాలతి ఎం. ఏ. మొదటి సంవత్సరం చదువుతున్నది. మైత్రేయి పి. యు. సి. లోకి వచ్చింది.

తండ్రిలాగానే మాలతి పసిమి ఛాయలో నిండుగా ఉంటుంది. సోగలైన కాటుక కళ్ళు, కలకలలాడే ముఖం, ముక్కు కాస్త పొడుగైనా ముచ్చటగావుండి కొన్ని క్షణాలు చూస్తూ, అలాగే నిలబడిపోతారు ఎదుటివారు.

మైత్రేయి తల్లిలా చామనఛాయలో ఉంటుంది. కోల ముఖం, కళ్ళల్లో చిలిపితనం, చిన్న నోరు, అలంకరణలో కాస్త భేషజం కనిపిస్తుంటుంది.

ఇంక ఆ ఇంట్లో ఉండేది వాసుదేవరావుగారి భార్య రాజేశ్వరమ్మగారు. ఆమె కూడా బి. ఏ. వరకూ చదువుకున్న మనిషే. నలభై రెండేళ్ళుంటాయి. కాస్త బిత్తర మనిషి. ఆమెకు కూడా సాంఘిక సేవకురాలిగా నగరంలో మంచిపేరుంది. మహిళా సంస్థాపకులలో ఆమె ప్రముఖురాలు. స్త్రీవిద్య, స్త్రీల హక్కుల విషయంలో ఆమె చాలా కృషి చేసింది. స్త్రీలకు వారసత్వపు హక్కు, బహు భార్యాత్వ నిషేధం మొదలైన విషయాలమీద ఆమె కొన్ని వ్యాసాలను కూడా పత్రికల్లో ప్రచురించింది. అలాగని ఆమె పాత సంప్రదాయాలను, అనూచానంగా వస్తున్న ఆచారాలను వదిలిపెట్టలేదు.

వాసుదేవరావుగారు మెడిసిన్ ఆఖరు సంవత్సరం చదువుతుండగా రాజేశ్వరితో పరిచయం ఏర్పడింది. ఆ పరిచయం ప్రేమగా మారి పరిణయంగా పరిణమించింది.

## 6

బిచ్చగాళ్ళతో, సంచార చిల్లర వ్యాపారస్తులతో నిండిన ఫుట్‌పాత్‌మీద తల వంచుకొని నడుస్తున్నాడు దాసు.

"అభిమానంకొద్దీ మాలతికి డబ్బిద్దామని వెళ్ళాడు తను. ఆమె తీసుకోనంది. పైగా ఎవరిదగ్గర అప్పుతెచ్చారో వారికి యిచ్చెయ్యమంది......ఇచ్చిన డబ్బు తిరిగి తీసుకో ననడంలో ఆమె ఉద్దేశ్యమేమిటి?.......తనెవరు—ఆమెవరు? ఉచితార్థంగా ఆమె దగ్గర డబ్బెందుకు తీసుకోవాలి?......తనకూ ముష్టివాడికీ తేడా ఏమిటి?......మాలతి ఏ ముష్టివాడికో ఇరవై రూపాయలు దానం చేయగలదా?...........ఉహూఁ చేయదు—చేయలేదు" అని ఆలోచిస్తూ నడుస్తున్నాడు దాసు.

"యాదయ్య వడ్డీడబ్బు మినహాయించుకొని మిగిలిందే ఇచ్చాడు. ఇప్పుడే డబ్బు తిరిగి ఇస్తేమటుకు వడ్డీ వదులుకుంటాడా?.........ఉహూఁ.......అయినా తనకూ డబ్బు అవసరంఉంది. మాలతి వద్దందేమో నెత్తిన పాలు పోసినట్లయింది. తనకు బొత్తిగా బట్టలులేవు......చెప్పుల పని అయిపోయింది......కొంటే?.........పాందాని పాత బాకీ అట్లాగే ఉండిపోయింది. పైగా ఈనెల ఇంతవరకూ ఇవ్వనేలేదు. అది రోజూ కస్సుమంటూనేవుంది. ఇంటి యజమాని మూడు నెలలనుంచీ కిరాయి ఇవ్వడం లేదని గునుస్తున్నాడు. ఇంకా ఇతర పెద్ద మొత్తాల అప్పులు సరేసరి......ఇవన్నీ ఇట్లా నెత్తిమీదఉంటే తనేం బట్టలు కొంటాడు?.......ఈ అప్పులన్నీ ఎప్పటికి తీరేను?" ఒకదానివెంట ఒకటి సుడిగుండాల్లాగా ఆలోచనలు దాసు మనస్సును రాట త్రిప్పుతున్నాయి.

"సుబ్బులు పరీక్ష ప్యాసై ఏ స్కూలులోనైనా ఉద్యోగం దొరికితే బాగుండును. ఆమె సంపాదన ఆమెకీ, పిల్లలకీ సరిపోతే తనకు కొంతభారం తగ్గుతుంది. కాని, అందాకా ఎట్లా?......ఈలోగా ఇంకెన్ని ఋణ శిఖరాలు అధిరోహించాలో.......నాన్న దుకాణంలో మళ్ళీ పద్దులు రాయడానికి కుదిరితేమాత్రం ఎంత వస్తుంది?.......అదైనా ఆయన ఎన్నాళ్ళు చేయగలుగుతాడు?... తనే ఇంకా ఎక్కువ సంపాదించాలి."

ఎవరో వెనుకనుంచి చప్పట్లు కొట్టడంవల్ల దాసు వెనక్కి తిరిగాడు. వెనుకనుంచి వస్తున్న రమణ కనిపించాడు. "నిన్న వచ్చి డబ్బిస్తానన్న పెద్దమనిషి ఇప్పుడా కనిపించడం?" అనుకున్నాడు దాసు. ఇంతలో రమణ దగ్గరకు రానే వచ్చాడు.

"నిన్నంతా నన్ను తిట్టుకొని ఉంటావు......ఏం చేయను దాసూ! అర్జెంటుగా మా ఆఫీసరుతో కలిసి టూరు వెళ్ళాల్సి

# ఆ క ర్ష ణ లో అ ప స్వ రా లు

వచ్చింది......నిన్న పన్నెండు గంటలకు కారులో వెళ్ళినవాళ్ళం ఇవ్వాళ మూడు గంటలకు వచ్చాం'' అన్నాడు రమణ.

''అలాగా........ఏమో రాలేదు—ఒకవేళ ఎక్కడా దొరక లేదేమో ననుకున్నాను.''

''రా—అలా హొటల్లోకివెళ్ళి కూర్చుందాం'' అన్నాడు రమణ. ఇద్దరూ ఎదురుగ్గా ఉన్న హొటల్లోకి వెళ్ళారు.

''నాకేం వద్దోయ్ రమణా.......ఇంతకుముందే ఒక చోట టిఫిన్, కాఫీ అయిపోయింది'' అన్నాడు దాసు—సర్వర్ వచ్చేప్పటికి.

''పోనీ ఏదైనా డ్రింకు తీసుకో'' అంటూ రమణ ''రెండు వింటో తీసుకురా'' అన్నాడు సర్వరుతో.

''ఈ తడవ ఏమైనాసరే దాసూ, కళాపరిషత్తుకు మనం నాటకం తీసుకు వెళ్ళాల్సిందే'' అన్నాడు రమణ.

''మంచిదే......ఆ ఉద్దేశముంటే మనం ఇప్పటినుంచే కృషి చేయాలి.''

''ఎల్లుండి మన రూంలో మెంబర్సు నందరినీ కలువ మందాం. నలుగురం కూర్చుని ఏ నాటకం ప్రాక్టీసు చేద్దామో నిర్ణయించుకొని కాస్టింగు వేసుకొని వారం రోజుల్లో రిహార్సల్సు ప్రారంభిద్దాం.''

''ఏమిటోనోయ్ రమణా, ఈ నాటకాలవల్ల మనకు ఒరిగేదేం కనిపించదు.''

''అదేమిటి—అంత నిరుత్సాహపడిపోతున్నావు అప్పుడే'' ఆశ్చర్యంగా ప్రశ్నించాడు రమణ. సర్వర్ డ్రింక్స్ తెచ్చిపెట్టాడు.

''నిజమాలోచిస్తే మనం బావుకొనేదేమిటి చెప్పు...... ఎంతో కష్టపడి, మనం నాటకం ప్రాక్టీసుచేసి, టిక్కెట్లు కాన్వాసు చేసుకొని, నాటకంవేస్తే పాతికో—పరకో మిగలడమో, లేక పోతే చేతినుంచి పడడమో తప్ప మన కళా సమితికి పెద్ద మిగిలిందేముంది?''

''మిగలకపోతే మిగలకపోయింది. నష్టమైతే పడడం లేదుగా........ఈ తడవ ఏవో కొన్ని డొనేషన్లు కూడా వసూలు చేద్దాం. కళా పరిషత్తు పోటీల్లో మన దానికి ప్రైజువస్తే మనకే పేరు ప్రతిష్ఠలుంటాయి.

''అంతదూరం మనం శ్రమపడిపోతే వస్తుందన్న నమ్మకం మాత్రమేమిటి? అందులోనూ తొంభై తొమ్మిది పాలిటిక్సు.... ఐనా ఈ బహుమతులు, ఈ పేరు ప్రతిష్ఠలవల్ల నాటక సమాజాలకు లభించే ఆలంబనం ఏముంది?.......ఇదుగో చూడు—ఈ కళా పరిషత్తులన్నీ మలేరియా ముందు వచ్చే చలిలాగా కళాకారుణ్ణి కాస్సేపు వూపించి, ఆ తర్వాత ఎన్నాళ్ళ నీరసంలోనో కూల ద్రోస్తాయి'' అన్నాడు దాసు.

''మనమే అలా అనుకుంటే ఎట్లా? మనం చేసే కృషి మనం చేద్దాం. నాటకాల పోటీలు చూసేందుకు, జడ్జీలుగా ఉండేందుకు సినిమావాళ్ళు వస్తారు. ఎవరికైనా అదృష్టంవుంటే ఒక ఛాన్సు దొరకవచ్చు.''

''సరే—కానివ్వండి......మీరంతా వెడదామనుకుంటుంటే నేను నిరుత్సాహపరచడం దేనికి?''

''నా పరిస్థితులేం బాగుండలేదు రమణా!......ఎక్కడ చూసినా అప్పులే! తలచుకుంటే గుండె దడదడ లాడుతుంది. నా బాధ్యత లేమిటో నీకు తెలిసినవే. ఈ ఋణ వలయంనుంచి ఎలా బైట పడడమో నాకు అర్థం కావడంలేదు. సాయంత్రం పూట ఎక్కడైనా పార్టుటైం దొరికితే చేద్దామని ఉంది...... లేకపోతే తట్టుకోవడం మహా కష్టమనిపిస్తోంది'' అని తన పరిస్థితిని అంతా చెప్పుకున్నాడు దాసు.

''నిజమే........నాకు మటుకు బాధ్యతలు లేవా, అప్పులు లేవా?........అట్లా బెంబేలు పడితే ఎట్లా?........పోనీ ఓపని చేస్తే?''

''ఏమిటది?''

''మన కళాసమితి తరపున నీకో బెనిఫిట్ షో వేస్తే....''

''అందరూ ఒప్పుకోవద్దూ?''

''నీకెందుకు—నేను ఒప్పిస్తాగా.......నీకు అభ్యంతరం లేకపోతే చెప్పు ప్రయత్నిస్తాను''

''బెనిఫిట్ షో వేస్తే మన కెంత వస్తుందని...... మనం హానమ్మై, కాన్వాసు చేసుకుంటే ఖర్చులుపోను రెండు వందలైనా మిగులుతాయో మిగలవో?''

''ఎంత మిగిలితే అంతే!''

''దానివల్ల సమస్య పరిష్కారమేమౌతుంది రమణా! నాకోసం బెనిఫిట్ షో వేశారన్న పేరు తప్పితే........ఆ రెండు వందలూ తీసుకువెళ్ళి ఒకళ్ళిద్దరికి సర్దుతాననుకో......మిగతా వాళ్ళమాటో'' అన్నాడు దాసు.

డ్రింకులు తీసుకోవడం అయిపోయింది. రమణ సిగరెట్ తీసి ముట్టిస్తూ, దాసుకోటి అందించాడు.

''నీ వన్నది నిజమే దాసూ!.......కాని ఏం చేయాలో తోచడంలేదు.'' అన్నాడు రమణ.

''నా సమస్యకు పరిష్కారంలేదు రమణా!......పోనీ నీ ఎరుకలో ఏ ఫర్మ్‌లోనైనా పార్టుటైం దొరుకుతుందేమో చూడు. టైపింగు కూడా వచ్చు నాకు.''

''సరే—ప్రయత్నిస్తాలే కాని, నీవుమటుకు నాటకంలో వేయక తప్పదు......నీవు లేకపోతే అసలేమీ జరగదు.......నీకేమైనా అదృష్టంఉంటే అందులోనే కలిసి రావాలి'' అన్నాడు రమణ.

దాసేమీ మాట్లాడలేదు. రమణ అడిగాడు.

''ఇంతకూ మరి నిన్న డబ్బెక్కడైనా దొరికిందా?''

''ఏదో—దొరికిందిలే!.......రమణా, నీకు బట్టల దుకాణంలో ఖాతా ఉందేమోగా......ఏమైనా రెండు జతలకు ఇప్పిస్తావా........రెండు మూడుసార్లుగా సర్దుతా'' అని అడిగాడు దాసు నాలుక తడి చేసుకుంటూ.

''దానికేం—ఇప్పిస్తా పద'' అన్నాడు రమణ. బిల్లు చెల్లించి ఇద్దరూ బైటికి వచ్చారు.

''హలో దాసూ!'' అంటూ రాజు మోటారు సైకిలు దిగి, దగ్గరకువచ్చి, ''ఏం రమణ రాయ్యాగణే—ఎక్కడా దర్శనాలు

"అక్కడికి నీ దర్శనమౌతున్నట్టు......నీపని పైలా పచ్చీసుగాఉంది'' అన్నాడు రమణ.

"ఇవ్వాళ్ల క్రొత్తేముంది—మన కెప్పుడూ పైలా పచ్చీసే!'' నవ్వుతూ అన్నాడు రాజు.

"కాదుమరీ—వచ్చే జీతం ఇంట్లో ఇవ్వాల్సిన పనిలేదు....ఏనాడో పెట్టి పుట్టాడు''

"తనకు లేదని ఏడిస్తే ఒక కన్ను పోయిందట—ఇంకోడికి ఉందని ఏడిస్తే రెండో కన్ను కూడా పోయిందట......అట్లా వుంది నీ వ్యవహారం........ఏం బ్రదర్ నీవేం మాట్లాడవేం!'' అన్నాడు దాసుతో.

"ఏముంది మాట్లాడడానికి—వింటున్నాగా!''

"ఏమిటి కథ—ఇందాక డాక్టర్ వాసుదేవరావుగారింట్లో నుంచి వస్తున్నావ్?......వాళ్లమ్మాయేగా మొన్న నీ ప్రక్కన వేషం వేసింది......ప్రేమ వలలో పడ్డావా పసిదాసూ!'' అంటూ నవ్వాడు రాజు.

"చాలా పొరబడుతున్నావు రాజూ!........ఆయన మా చెల్లెలి కూతురికి ట్రీట్ చేస్తున్నాడు.......'' అన్నాడు దాసు.

"కాయ్—నా సామిరంగా!......ఎందాకా ఏమిటి ఇద్దరూ జయ విజయుల్లా బయలుదేరారు?'' అని ప్రశ్నించాడు రాజు.

"అలా బజారుకు పోదామని'' అన్నాడు రమణ.

"అయితే గుడ్‌బై'' అంటూ రాజు హొటల్లోకి దూరాడు. రమణ నవ్వుకుంటూ ముందుకు అడుగు వేశాడు. కాని, దాసుకు చికాకు వేసింది.

"ఇటువంటి స్నేహితులున్నా ఒకటే—లేకపోయినా ఒక్కటే'' అన్నాడు దాసు.

"ఏం—అలా అన్నావు?''

"నిన్న ఓ పాతిక రూపాయలు అప్పు అడిగాను......ఏమన్నాడో తెలుసా?''

"ఏమన్నా డేమిటి?''

"తనతో స్నేహం చెడకుండా ఉండాలంటే అప్పు ఎప్పుడూ అడక్కూడదట.''

"నిజమే—అతనన్నదానిలో తప్పేముంది దాసూ!......డబ్బే స్నేహం తెచ్చినా, శత్రుత్వం తెచ్చినా......నీ పరిస్థితినిబట్టి నీవు అనుకుంటావు—ప్రతివాడూ నీకు అప్పివ్వాలనీ, సహాయం చేయాలనీ'' అన్నాడు రమణ.

దాసేమీ మాట్లాడలేదు.

"నీకు చాలా అప్పులున్నాయని రాజుకు కూడా తెలుసనుకుంటాను.........ఇస్తే మళ్లీ తీర్చలేవని అత డట్లా అనిఉంటాడు'' మళ్లీ రమణ అన్నాడు.

"తీర్చక ఎగ్గొడతా నేమిటి?''

"ఎగ్గొడతావనికాదు దాసూ!.......రేపు నీవు అతనికి చెప్పిన గడువుకు ఇవ్వలేక పోతావు. స్నేహితుడిని అడగాల్సి వచ్చిందే అని బాధ పడతాడు. ఇవ్వలేక పోయానే అని నీవూ బాధపడతావు. పైగా అభిమానంతో, సిగ్గుతో అతన్ని చూడటానికి కూడా మనస్కరించదు నీకు. ఇవన్నీ ఆలోచించే రాజు అలా అని ఉండవచ్చు.''

"నిజమే.......రాజు అన్నదానిలోనూ రమణ అన్నదానిలోనూ తప్పులేదు.......తను పరిస్థితులకు లొంగిపోయి, అలా అనుకుంటున్నాడు'' అనుకున్నాడు దాసు. ఇద్దరూ మౌనంగా నడుస్తున్నాడు. "నా మాటలు దాసుకు బాధ కలిగించాయేమో....ఇంత గట్టిగా అనకుండా ఉండాల్సింది'' అనుకుంటున్నాడు రమణ. చౌరాస్తా వచ్చింది.

"నేనిటు వెళ్ళిపోతాను'' అన్నాడు దాసు.

"అదేమిటి—వెడతానంటావేం, బట్టలు ఇప్పించమన్నావుగా.......ఈ మూడో దుకాణమే........రా........'' అన్నాడు రమణ.

"ఊహూ......ఇప్పుడొద్దులే!''

"ఇలా నా మాటలు నీకు బాధ కలిగిస్తాయని తెలిస్తే—అసలు అనేవాడినేకాదు దాసూ!.......అందుకని తీరా బట్టలు వద్దని వెళ్ళిపోతావా?''

"అబ్బే......అదేంకాదు రమణా!......ఇప్పటికే బోలెడన్ని అప్పులున్నాయి......మళ్ళీ ఇదొకటి ఎందుకు? తీర్చగలుగుతానో లేదో''

"సంతోషించార్లేగాని పద'' అంటూ రమణ దాసు చెయ్యి పట్టుకొని దుకాణంలోకి తీసుకు వెళ్ళాడు.

"నాకు ఒక జత చాల్లే రమణా!'' అన్నాడు దాసు.

రమణ అదేమీ వినిపించుకోకుండా రెండు పాంట్లకు, రెండు బుష్‌కోట్లకు బట్ట చింపించాడు. పార్శిలు తీసుకొని ఇద్దరూ దుకాణంనుంచి బైటికి వచ్చేశారు.

"సరే—నే నిలా వెడతాను దాసూ!.......ఎల్లుండి రూముకురా తప్పకుండా......అందర్నీ రమ్మని చెబుతాను.....నాటకం విషయం డిస్కస్ చేద్దాం.''

"అలాగే'' అన్నాడు దాసు.

రమణ వెళ్ళిపోయాడు. దాసు పార్శిలు చేత్తో పట్టుకొని నడుస్తున్నాడు.

"భాస్కరానికి కూడా అన్నీ చిరిగిపోయాయి.....తనకో జత, వాడికో జత తీసుకుందామనుకున్నాడు—దుకాణంలోకి వచ్చాక.........రమణ తనకే రెండు జతలూ చింపించాడు. వాటికే బోలెడంత అయిందని భాస్కరానికి అడగలేక పోయాను'' అనుకున్నాడు దాసు.

* * * *

దాసు మెట్లెక్కుతూ అరుగుమీద ఇంటి యజమాని మఠం వేసుకు కూర్చుండటంచూసి, గతుక్కుమన్నాడు ఓక్షణం.

"నమస్కారం సేటుగారూ!'' అన్నాడు దాసు.

"చాల్లేవయ్యా ఈ నక్క వినయాలు........మూడు నెలల కిరాయి ముడ్డికిందేసుకు కూర్చుని, అప్పుడురా—ఇప్పుడురా అని తిప్పుతావేం? నేనేం నీ నౌకరు ననుకున్నావా? రేడియో చెక్కు వస్తుంది ఇస్తానంటివే—ఏదీ?'' అన్నాడు ఇంటి యజమాని.

"ఇద్దామనే అనుకున్నాను.........కాని వీలుపడలేదు.''

"ఎప్పుడు వీలుపడుతుందయ్యా నీకు.......జీతం వచ్చినప్పుడూ వీలునడక, ఏదైనా డబ్బు వచ్చినప్పుడూ వీలుకాక

రేపు ఫస్టువస్తే నాల్గు నెలల కిరాయి నూరు రూపాయలవుతుందయ్యో.......ఎవడూరుకుంటాడయ్యా!''

''నిజమే—మీరు కాబట్టే ఆగారు......ఏదో. ఇబ్బందుల్లో ఉన్నాం సేటుగారూ......మీ డబ్బెక్కడికీ పోదు...... నెమ్మదిగా సర్దుతాంలెండి'' అంటూ భూషణంగారు గుమ్మంలోకి వచ్చారు.

''బైటెందుకు......రండి—లోపల కూర్చుని మాట్లాడుకుందాం'' అన్నాడు దాసు, అప్పటికే ఇరుగు పొరుగువారు బైటకు రావడంచూసి.

''అబ్బో! బైట మాట్లాడితే ఈయనకు పరువు నష్టం కాబోలు..అంత పరువుగలవాడివైతే నా కిరాయి నాకు పారేయి.......నీవు ఇచ్చినట్లయితే నేనెందుకడుగుతాను'' చేతులు తిప్పుతూ అన్నాడు యజమాని.

''ఇవిగో—ఈ ఇరవై తీసుకు వెళ్లండి.......మిగతాది జీతాలు వచ్చాక సర్దుతాను'' అని దాసు జేబులోంచి రెండు నోట్లు తీసియిచ్చాడు యజమానికి.

''సరే—రేపు జీతాలు వచ్చాక మిగతాది, ఈ నెలదీ అంతా ఇవ్వాల్సిందే!.....లేకపోతే ఇల్లు కాళీ చేయండి.''

అభిమానంతో కుంచించుకుపోతూ లోపలకువెళ్ళి, చేతిలోని పార్సిలు బల్లమీద పడేసి చాపమీద కూలబడ్డాడు దాసు.

''గంటసేపటినుంచీ సర్ది చెబుతూనే ఉన్నాను...... ఉహూఁ—వింటేగా.......ఎంతరాత్రయినాసరే నీవు వచ్చిందాకా ఉంటానని మొండికెత్తి కూర్చున్నాడు'' అంది రాధమ్మగారు.

''మామయ్యా!'' అంటూ శ్యాం దాసు దగ్గరకు వెళ్లాడు.

''ఛీ—ఫో'' అని విసుకున్నాడు దాసు. అవమానంవల్ల, చేతకానితనంవల్ల పుట్టిన కోపం దహించి వేస్తున్నది దాసును.

''అదేమిట్రా—పసివాడిమీద కసురుకుంటావు'' అంది రాధమ్మగారు.

''చిరాకుపడితే ఏం లాభం......ఇలాంటప్పుడే ఓర్పు ఉండాలి'' అన్నారు భూషణంగారు.

''—వచ్చిందాకా ఒకటే ఓర్పు......ఆ ఇంటాయన్ను బైటెందుకు కూర్చోనిచ్చారు అసలు—లోపల కూర్చోమనక పోయారా?'' చికాగ్గా అన్నాడు దాసు.

''ఆయన చెప్తే వింటేనా?'' అంది సుబ్బలక్ష్మి.

''మొగుడు కొట్టినందుకుకాదుగాని—తోడికోడలు నవ్వినందుకు ఏడ్చిందట. ఆయనంత పరుషంగా మాట్లాడాడని బాధపడటంపోయి, ఇరుగు పొరుగువారు నవ్వుకున్నారని బాధపడతావేం?........లోకంతీరే అంత నాయనా!........ఒకరికష్టం మరొకరి కానందం. ఒకరి ఆనందం మరొకరికి కష్టం'' అన్నారు భూషణంగారు.

దాసేమీ మాట్లాడలేదు.

''అసలే చాలక ఇబ్బంది పడుతుంటే పిల్లలతో నేనొకదాన్ని నెత్తి నెక్కి కూర్చుంటేని?'' అంది సుబ్బలక్ష్మి.

''ఇప్పుడు నిన్నెవరేమన్నారు!''

''అన్నారనికాదు—ఉన్నమాట అంటున్నాను......ఆ రిజల్టెప్పుడొస్తాయో ఏమో.....ప్యాసై.....ఏ స్కూలులోనే చేరితే, వేణ్ణీళ్ళకు చన్నీళ్ళ తోడుగా ఉంటుంది''అంది సుబ్బలక్ష్మి.

దాసు ఒకసారి చెల్లెలి వంక చూసి, ''ఎలాఉంది చిటితల్లికి?'' అంటూ, ''రారా శ్యాం'' అని వాణ్ణి దగ్గరకు తీసుకున్నాడు.

''ఫర్వాలేదన్నయ్యా—చాలామటుకు నయం.''

''అమ్మోయ్—అన్నయ్య పేంటు బట్టలూ, బుష్ కోటు బట్టలూ తెచ్చాడేవ్'' అన్నాడు భాస్కరం పార్సిలు విప్పి చూస్తూ.

''ఏవీ—చూపెట్టు'' అంది రాధమ్మగారు.

''అన్నయ్యా—నా కీ బుష్‌కోటుబట్ట, పాంటుబట్ట బాగున్నాయి—ఇవి నేను కుట్టించుకుంటా, అవి నీవు కుట్టించుకో'' అన్నాడు భాస్కరం.

''అవి నీకోసరమేంకాదు—నా కోసమే రెండూ.''

''చూశావుటే అమ్మా—రెండు రెండు జతలూ అన్నయ్యే కుట్టించుకుంటాట్ట......నావన్నీ చిరిగేపోయాయి.....స్కూల్లో అంతా నవ్వుతున్నారు.''

''చదవకుండా స్కూలు ఎగ్గొడుతుంటే ఎవరూ నవ్వరు కాబోలు!'' అంది సుబ్బలక్ష్మి.

''పోనీ వాడికి కూడా ఒక జత తీసుకురాకపోయావా నాయనా!'' అంది రాధమ్మగారు.

''ఇవే అప్పుచేసి తెచ్చాను—స్నేహితుడి ఖాతాలో.''

''అవి అప్పిచ్చినవాళ్ళు, నా బట్టలకు మటుకు ఇవ్వరేమిటి తేదలిస్తే?'' దెప్పి పొడుపుగా అన్నాడు భాస్కరం.

ఏమని సమాధానం చెబుతాడు దాసు? పరిస్థితి వాళ్లకేం తెలుస్తుంది? ''పోనీ వీటిల్లో ఒక జత కుట్టించుకోమంటే బట్ట వేస్టవుతుందే!'' అనుకున్నాడు దాసు.

''చదువక్కరలేదు కాని—అబ్బాయిగారికి మంచి బట్టలూ, షోకులూ మాత్రం కావాలి'' అంది సుబ్బలక్ష్మి.

''నిన్నెవరేం మాట్లాడ మనలా!''

''చాల్లే—ఇక వాదనకు దిగకండి—వాడసలే చికాగ్గా ఉన్నాడు'' అన్నారు భూషణంగారు.

''నీకీ తడవ తెస్తానులేరా!''

''ఇంకలే నాయనా—కాళ్ళు చేతులు కడుక్కో వడ్డిస్తా'' అంది రాధమ్మగారు.

[సశేషం]

# బుచ్చిబాబు

## శ్రీవాత్సవ

"అక్కథకుడు శౌనకాది మహామునుల కిట్లనియె : సింహాసన మెక్కబోతున్న భోజరాజును చూచి సాలభంజిక "రాజా! ఆగు—ఈ ప్రశ్నకి బదులు చెప్పి మరీ కదులు" అన్నది. "తదనంతర కథ ఏమైనది ?" అని విక్రమార్కుడి మెడ పట్టుకొన్న బేతాళుడు ప్రశ్నించాడు. ఇలాగ కథలో కథ, ప్రశ్నలో ప్రశ్న, రహస్యములు తెలిసికొనే కుతూహలము మన కథలకు, గాథలకు, కావ్యాలకు, కవిత్వాలకు కారణ మైనవి. భారతీయ కథా సాహిత్య విధానములో ప్రధాన కథతోపాటు, ఆఖ్యానములు, ఉపాఖ్యానములు, పిట్ట కథలు, పొట్టి కథలు, గల్పికలు, గాథలు చెప్పడం సంప్రదాయం. ఆ సంప్రదాయం విడువకుండా—భారతీయ రచయితలు ఈనాడు కూడా వ్రాస్తున్నారు. ప్రాచీనసంప్రదాయాలు తెలియాలీ అంటే సంస్కృతము దానితోపాటు పంచకావ్యాలు, వ్యాకరణము ఛందస్సు, అలంకార శాస్త్రము ఇవన్నీ చదువుకొంటే తప్ప సాహిత్యరంగంలో నిష్ణాతులు కాలేరనే భావన మన పెద్దలలో ఉండేది. ఈ ఇరవయ్యో శతాబ్దం వచ్చిన తరువాత ఆ యభిప్రాయం క్రమంగా మార్పు చెందినది. నేటి పాశ్చాత్య విద్య చదివి, తద్వారా విశ్వసాహితిలోని విశేషాలు తెలిసికొన్న విజ్ఞాన నిధులకు కూడ ప్రాచీన సంప్రదాయాలు తెలిసికొనడానికి అవకాశం ఉన్నది. నేటి సంస్కృతీ రంగంలో సంప్రదాయానికీ శాస్త్రప్రయోగాలకీ సంఘర్షణ జరుగుతున్నది. ఈ సంఘర్షణలో శాస్త్రప్రయోగాలతో కూడిన విజ్ఞానాన్ని సమర్థిస్తే ఆత డెంత హేతువాది అయినా, వట్టి విప్లవ కారకుడని త్రోసివేస్తున్నారు. పోనీ సంప్రదాయాన్ని సమర్థిస్తే ఛాందసవాది అని మూతి విరుచుకొంటున్నారు. ఇట్టి స్థితిలో ప్రాచీన సంప్రదాయాలలోని సంస్కృతిని విస్మరించకుండా, నేటి విజ్ఞానలోకంలో దినదిన ప్రవర్ధమాన మగుచున్న నూతన భావాలను వెల్లడిస్తే అది అభ్యుదయమూ అవుతుంది. అభిజ్ఞానమూ అవుతుంది. అలాంటి అభిప్రాయాలు వ్యక్తపరుస్తూ ఉన్న చాల తక్కువమంది తెనుగు రచయితలలో 'బుచ్చిబాబు' ఒకరు. నాలుగు దశాబ్దాల క్రితం—గోదావరి జిల్లాలోని రాజమహేంద్రవరంలో జన్మించిన శివరాజు వెంకటసుబ్బారావుగారి ముద్దు పేరు "బుచ్చిబాబు"—ఆయన ఆంధ్రసాహిత్య రంగంలో ప్రవేశించి పాతిక సంవత్సరాలయింది. ఈయన రచనా వ్యాసంగరుచి రజతోత్సవము చేసికొంటున్న యీ సందర్భములో సాహిత్యవీథిలో ఈతడు సాధించిన విజయాలను సమీక్ష చేయడం అనుచితం కాదేమో ! నవలాకర్తగా, నాటక రచయితగా, కథానికా శిల్పిగా, నవీన విమర్శకుడిగా బుచ్చిబాబు ఆంధ్రసాహిత్యానికి చేసిన సేవ అనల్పము.

పాతికేండ్ల క్రితం మాట ! నమ్మాళ్వార్సు అనే ప్రచురణ సంస్థవారు పెంగ్విన్ పుస్తకాల పద్ధతిలో చౌకరకం పుస్తకాలు తెనుగులో ప్రచురించారు. ఎర్రటి పట్టీల మధ్య 'బుచ్చిబాబు కథలు' అనే ముద్రణ గల ఒక పుస్తకం వెలువడింది. ఆ పుస్తకం చదవగానే అందులో ఒక కథ—ఘాటయిన పరిమళాం వెదజల్లుతూ అలాగే స్మృతిపథంలో మెదలుతూ నిలిచింది. "4711" నంబరు గల సెంటు కథ అది. ఆ పరిమళ ద్రవ్యం లాగే చెదరిపోని సుమనస్సౌరభంతో ఆ కథ మనస్సులో తారాడుతూ ఉంటుంది. ఇదే కాదు, ఆ పుస్తకంలో కథలన్నీ, తెనుగు సాహిత్యంలో అంత క్రితం పరిచితమైన ఒక వ్యక్తి రచనలోని, గాఢ వాంఛల్ని కామోద్రేకాల్ని తలపులోకి తీసికొని వచ్చాయి. 'బుచ్చిబాబు' క్రొత్త రచయిత. అప్పుడే ఆంగ్లసాహిత్యంలో ఎం. ఏ. ప్యాసుచేసి ఒక ప్రభుత్వ కళాశాలలో అధ్యాపకుడుగా ప్రవేశించాడు. ఆంగ్ల సాహిత్యంలో అధునాతన రచనాపద్ధతులు, ముఖ్యంగా నవలా నిర్మాణములోను, కథాసంవిధానములోను ఆంగ్ల రచయితలు పోయిన పోకడలు ఆకళింపు చేసుకొన్నాడు. ఆ యౌవన దశలో రచన ప్రారంభం చేసిన అందరి రచయితలలాగే ఆతడూ స్త్రీ పురుషుల మధ్య కామవాంఛలకు ప్రాధాన్యమిచ్చే కథలు రచించాడు. అతడు కవియై ఉంటే ప్రేయసిని గూర్చి ఆమె పెదవులు పూసిన దానిమ్మ పువ్వులు గురించీ ఆమె కన్నులు కాసిన విరహవేదనా జ్వాలలు గూర్చి, ఆమె మనస్సు వెలార్చిన వియోగ దుఃఖాలగురించీ మనోజ్ఞంగా పద్యాలలోను, భావ కవిత్వంలోను విలపించేవాడు. బుచ్చిబాబు కవి కాదలచుకోలేదు. వట్టి భావనా హర్మ్యాలు కట్టుకొని ఆకాశ సౌధాలలో కాపురముండ దలచుకోలేదు. గాజు మేడల్లోనుండి కరుణ రసఘట్టాలను చూడదలచుకోలేదు. వచనంలో, వట్టి గద్యలో, తన మనస్సులో ఆందోళనపరుస్తూవున్న క్లిష్ట సమస్యల గురించి చర్చించాడు. తర్జనభర్జన చేశాడు. తనకు తోచిన సమాధానాలు తెలిసికొన్నాడు. భావ సంఘర్షణలో పైకి అందరికీ తెలిసిన ప్రశ్నలు వేసి, వాటికి ప్రత్యుత్తర మిచ్చే ప్రయత్నం చేశాడు. అలాంటి ప్రశ్నలలో ఒకటి "జీవితానికి అర్థం ఏమిటి ?" అని, తాను సృష్టిచేసిన "దయానిధి" చేత వేయించినది. ఆ ప్రశ్నకు సమాధానం దొరకలేదు సరికదా, అన్నీ ప్రశ్నలే ఎదురయ్యాయి. "ఎందుకు, ఎక్కడ, ఎప్పుడు, ఎట్లా? అందుకా ? ఎవరు? ఏది ? ఏం ? ఎన్ని?" వీటికి సమాధానం లేదు.

"మానవుడు సంఘాన్ని మార్చలేడు. మానుషుల్ని మార్చలేడు. మారిస్తే బాధ. పగ, యుద్ధం. తనతో తన్ను

సమాధానం ఏడాలి. అది ఈనాటికి సాధించాడు'' .... ''మానవుడి స్వప్నాలు, ఆశలు, వాంఛలు, విషాదగీతాలు, విజయురోదన, అన్నీ, అన్నీ హరించిపోతాయి; సర్వ నాశన మవుతుంది.

''ఈ జీవితాని కర్థం ఎందు కుండాలో! అర్థం లేదనే తలంపులో నిరుత్సాహం, బాధ లేవు. కొత్త బలం, వికాసం, ఆత్మవిశ్వాసం, దృఢనిశ్చయం ఉంటాయి.'' ఇవీ దయానిధి తన జీవితంలో తెలిసికొన్న సత్యాలు. బుచ్చిబాబు జీవితరహస్యానికి కనిపెట్టిన అర్థం ఈ వాక్యాలలో విస్పష్టంగా వెలిబుచ్చినట్లు గ్రహించవచ్చు. మానవుడు తన నిత్య జీవనంలో సంఘంతో సంఘర్షణ పడుతున్నాడు. ఈ సంఘర్షణలో అతను వోడిపోయినా, గెలిచినా ఏకాంతంగానే ఉండిపోతాడు. అందుకే 'బుచ్చిబాబు' వ్రాసిన నవలకు—'ఏకాంతం' అని పేరు పెట్టుకొన్నాడు. 432 పుటలు గల యీ నవల 1943 లో ప్రారంభించి 1946 లో పూర్తిచేశాడు. 1950 లో పుస్తకరూపంలో వెలువడింది. 1957 లో క్లుప్తపరచి వేసిన ముద్రణం—పునరావృత్తం పొంది పదిపదిహేను వేల ప్రతులకు చెల్లిపోయింది. దీనినిబట్టి యీ నవలకున్న బహుప్రచారం అర్థం చేసుకోవచ్చు. బుచ్చిబాబు—తండ్రిగారు వ్యవసాయశాఖలో పనిచేసేవారు. ఆ రీత్యా సర్కారుజిల్లాలోను, రాయలసీమలోనూ చాలాచోట్ల వారు ఉద్యోగ ధర్మంలో తిరగవలసి వచ్చింది. ''చిన్న బుచ్చి'' బాల్యమంతా తండ్రిగారితోబాటు పల్లెపట్టులలో గడిచిపోయింది. సర్కారు జిల్లాలలో పలుతావులలో విద్యాభ్యాసం చేయవలసి వచ్చింది. ఆ తరుణ వయస్సులోనే రాయలసీమలో తాను తొలి ఉద్యోగం చేయవలసి వచ్చినపుడు, యీ సర్కారు జిల్లాలకీ—రాయలసీమకీ మధ్య గల పరస్పర ద్వేషం, అసహనం కనిపించాయి. వాటిని దృష్టిలోపెట్టుకొని ''దయానిధి''ని సృష్టించి ఆతనికీ సర్కారుజిల్లాల వాతావరణం ఇముడ లేనిదిగా కల్పించి రాయలసీమలో ఆతని భాగ్యం పండి నూతన జీవితం ప్రారంభం చేసేటట్టు చిత్రించాడు. ఈ నాయకుడు ధన సంపాదన వల్ల, జీవిత విజయంవల్ల సాధించిందేమీ ఉండదు. కాని సాధించలేక పోయానన్న జిజ్ఞాస అతన్ని జీవితానికి కట్టిపడవేసినా కూడ నిస్పృహుణ్ణి చెయ్యలేదు.''

ప్రేమజీవితంలో, కోమలి, అమృతం, ఇందిర, కాత్యాయని చనిపోయిన అమ్మ వీ రందరూ ''దయానిధి'' ఏకాంతంలో ''ఈ జీవితానికి అర్థం ఏమిటి అని ప్రశ్నిస్తున్నట్లే'' ఉంటుంది. ''జీవితానికి అర్థం ఏమిటి?'' దానికి సమాధానం 'ఏకాంతం'. అది, బుచ్చిబాబు తన నవలకు పెట్టుకొన్న పేరు. . మరొకరు ఎవరో పెట్టిన పేరు, ''చివరికి మిగిలేది ప్రశ్న కంటె ఈ సమాధానమే బాగుంది. జీవితానికి అర్థం ఏమిటి' అనే ప్రశ్నతో ప్రారంభమయిన యీ నవల ఇదే ప్రశ్నతో ముగించడంలో అంతరార్థం కూడ అదే. ఇందలి నాయకుడు ''ధయానిధి'' తల్లి చేసిన ''అపచారాల ఫలితం, నీడలా అతన్ని వెంటాడి, సంఘ విమర్శ ద్వారా జీవితాన్ని కలుషితం చేస్తుంది. ఈ దౌర్జన్యాన్ని ఎదుర్కోవడంలో అతను కొన్ని విలువల్ని సాధిస్తాడు. ఆ విలువలతో యీ నవలకి నిమిత్తం ఉన్నది'' అని రచయిత తాను వ్రాసిన పీఠికలో చెప్పుకొన్నాడు. 'ఇందులో ధ్వని కేవలం మాతృప్రేమ కాదు. అసలు మానవత్వం యొక్క ప్రేమ ప్రకర్ష. ఈ సమస్యను షేక్స్పియరు తన ''హామ్లెట్'' నాటకంలో చిత్రించడానికి ప్రయత్నించి ఎలాగ విఫలమయినదీ టి. ఎస్. ఇలియట్ నిరూపించిన వాక్యాలను బుచ్చిబాబు తన మున్నుడిలో ఉదాహరించాడు.

''కళ ద్వారా ఉద్రేకాన్ని ప్రదర్శించాలంటే, ఆ ఉద్రేకంతో సమంగా తూగే పరిస్థితులను గాని, వస్తువులను గాని సృష్టించాలి. భౌతికానుభవంలో అంతమయ్యే ఆ పరిస్థితులను వస్తువులను చిత్రించగానే ఆ ఉద్రేకం ఉద్భవిస్తుంది. బాహ్య స్థితిగతులకు ఆంతరంగిక ఉద్రేకానికి సమత్వం కుదిరినప్పుడే రసానుభూతి కలుగుతుంది. హామ్లెట్‌లో యిది లేదు. స్థూల జగత్తులో కనపడేవాటికి మించిపోయిన ఉద్రేకానికి తను లొంగిపోయాడు. తల్లి చర్య ఆతనికి రోత పుట్టిస్తుంది. కాని ఆ రోత తీవ్రతకి 'తల్లి ప్రతిమ' సరిపడలేదు. అతని ఏవగింపు ఆమెని కమ్మివేసి, అతీతమైంది. ఆ బాధకి సరిపడ్డ వస్తువులు బాహ్య జగత్తులో లేకపోవడంవల్ల అతను విముఖుడయ్యాడు.''

అలాంటి నాయకుడే దయానిధి. ఆతడు పడిన బాధకీ, ఆ బాధ స్పృశించగల శక్తులకూ సమత్వం కుదర్చడానికీ నవల యత్నించింది. ఆ ప్రయత్నంలో వ్యక్తికీ, సంఘానికీ జరిగిన సంఘర్షణ చిత్రించడంలో కృతకృత్యత పొందినది. ఒక మనిషిలో 'వెడు'—అది భౌతికం కాని, ఆధిభౌతికం కానీ—జీవితమంతా వెంటాడుతుంది. ప్రసిద్ధ నవలారచయిత సోమర్‌సెట్ మాహమ్ సృష్టి చేసిన పాత్ర—క్లబ్బు పుట్ కుంటి కాలువాడు. ఆతన్ని సంఘం గేలిచేస్తుంది. వెక్కిరిస్తుంది, వెటకారం చేస్తుంది. అయినా ఆతడు, తన లోపాన్ని మఱచిపోయే విజయాలు సాధించి, సంఘంమీద కక్ష తీర్చుకొంటాడు. ''ఇన్ఫీరియారిటీ కాంప్లెక్సు'' (అల్పత్వ భావన) ఆతనిని గొప్పవానిగా చేస్తుంది. సంఘంలో ఇముడలేని—దయానిధి వంటి పాత్రలు ఇలాంటి మానసిక తత్వం కలవాళ్లే. వారు సంఘంలో కలిసిపోయి సాధువుగా బ్రతకలేదు. బ్రతకదలచినా సంఘం అట్టివారిని బ్రతకనీయదు. ఈ సమస్యనే స్పష్టంగా 'దయానిధి' పాత్రలో ఆవిష్కరింపజేసి—బుచ్చిబాబు ఆధునికాంధ్ర జీవితానికి అర్థం చెప్పడానికి ప్రయత్నించాడు. తాను సృష్టించిన పాత్రలు దేశ కాలావధుల దాటుటలో పొందిన పరివర్తనం—విశాలాంధ్ర పుష్ట భూమిలో చిత్రించాడు.

'బుచ్చిబాబు' తన ప్రథమ రచనలో అక్కడక్కడ తెలిపిన 'తర్కం' గురించి యిలాగ చెప్పుకొన్నారు:

''ప్రథమ రచనలో, కొంత పాండిత్య ప్రకర్ష ఉంటుంది. తాను తెలుసుకొన్న విజ్ఞానాన్ని పా కుడికి తెలియ

చెయ్యాలని రచయిత ఉబలాట పడతాడు కాబోలు. ఇది లోపమే. ఇట్లాంటిది అక్కడక్కడ యీ నవలలో కనిపించింది. కాని అది కథానంవిధానంలో యిమిడిపోయింది. దాన్ని విడదీసి, సంక్షిప్తం చెయ్యడం నావల్ల కాలేదు. ఆధ్యాత్మిక, సాంఘిక విషయాలను గురించిన తర్కం, జీవిత సమస్యలపై నిర్వచనాలు, కొందరికి విసుగు పుట్టించవచ్చును. మరికొందరికి, కథ పాత్రలకంటె, యీ నిర్వచనాలే ప్రధానంగా తోచవచ్చు.'' నిజమే, బుచ్చిబాబు చేసే యీ నిర్వచనాలు—ఒక్క నవలలోనే కాదు, ఆయన రచన లన్నింటిలోనూ ప్రధానంగా కనిపిస్తాయి. అది చెప్పడం కథా రచనకు గాని నవలా పద్ధతికి కాని విరుద్ధం కాదు. పెద్ద లోపం కాదు.

బుచ్చిబాబు గొప్ప భావుకుడు. బెర్ట్రాండ్ రసెల్, టి. ఎస్. ఇలియట్, సోమర్‌సెట్ మాహమ్ అతని అభిమాన రచయితలు. పాశ్చాత్య తత్త్వశాస్త్రంలో కర్కిగార్డ్, షొపెన్ హొవర్ వంటి వేత్తల చర్చలతో పాటు, భారతీయ వేదాంతాన్ని తరచి యిచ్చిన మహా మేధావి రాధాకృష్ణ పండితుడి రచనలను కూడ సవిమర్శగా చదివి, అధ్యయనం చేసి అవగాహన చేసికొన్న ఆలోచనాపరుడు. అతడు చెప్పవలసిన అంశాలు చాల ఉన్నవి. అది యిదివరకు ఎవ్వరూ ఇలాగ, యీ దృష్టిలో విమర్శచేసి చెప్పలేదు. జీవితంలో అర్థాన్ని తన దృక్పథంలో వ్యాఖ్యానంచేసి ఇతరులకి అందజేయాలని 'బుచ్చిబాబు' జిజ్ఞాస. అందుకే—చీటికీ మాటికీ క్రొత్త నిర్వచనాలు చేస్తాడు. అవి చదువుతూ వింటే కొంతమంది అతి తెలివి కలవారికి ఏదో బోధిస్తున్నట్లు తోచవచ్చు. నిజానికి రచయిత—తాను తెలిసికొన్న రహస్యాలను తాను కల్పించిన పాత్రల ద్వారా, సన్నివేశాల ద్వారా మనకి తెలియజేస్తున్నాడు. 'బుచ్చిబాబు రచించిన పెద్ద నవలలోనే కాదు, పెద్ద కథ లయిన 'నిరంతరత్రయం' లోను, ''మూడు కోతులు'' లోను, త్రినేత్రుడులోను, ఇంకా ఎన్నో చిన్న కథలలోనూ ఇలాంటి నిర్వచనాలు నేర్పుతో చేశాడు.

నేటి రచయిత, తన చుట్టూ ఉన్న సమాజాన్ని విస్మరించి దానికి అతీతుడుగా జీవించలేడు. ఆ వాతావరణంలో ఉన్న నైతిక విలువలకీ, తా నేర్పఱచుకొన్న నైతిక—విలువలకీ, తన ప్రవర్తనా పద్ధతికీ సామరస్యం సాధించాలి. అది సులభంగా సాధ్యమయ్యేది కాదు. అందుకోసం—తన రచనల ద్వారా రచయిత ప్రయత్నిస్తాడు. జీవితంలో సాధించలేనిది సాహిత్యం ద్వారా కథలలో, నవలల్లో రచయిత సాధిస్తాడు. రచయిత దృక్పథానికీ, సంఘ జీవనంలోని సామాజిక దృక్పథానికీ ఎల్లప్పుడు సంఘర్షణ జరుగుతూనే ఉంటుంది. ఈసంఘర్షణలో సాంఘిక ప్రబోధానికి లోబడి, రచయిత ఆ విలువలకు తలయొగ్గినపుడు మంచి సంఘ సంస్కర్త కావచ్చు. ప్రచారక వాఙ్మయాన్ని సృష్టి చేయవచ్చు. లేక—ఈ సమాజానికి ఎదురుతిరిగి విప్లవవాది కావచ్చు. రచయిత ప్రతిభావంతుడైతే తన వ్యక్తిగత సమస్యలు పూర్తిగా గడిచిపోయి, సత్యమూ, శివమూ, సుందరమూ అయిన మహా కావ్యం రచించవచ్చును. కాని రచయిత తన ఆదర్శవాదంలోని భావాలతోపాటు, నిత్యమూ మారిపోతున్న సంఘంలోని విలువలు కూడా గుర్తించలేకపోతే యింక వ్రాయవలసింది ఏమీ ఉండదు. ఈ సంగతి బుచ్చిబాబు గుర్తించాడు. బొంబాయిలో (1961 లో) అఖిలభారత రచయితల మహాసభ జరిగినపుడు రచయిత సమస్యలు అని అతడు చదివిన ఒక ప్రసంగములో ఈ సంగతే చెప్పుకొన్నాడు.

బుచ్చిబాబు చిన్నతనంలో పల్లెటూళ్లలో పర్యటనం చేశాడు. విశాఖ నుండి వేంకటగిరి వరకు అతడు చూడని చోటు లేదు. పచ్చని వరిచేల మీద పైరుగాలిలో తిరుగుతూ గోదావరి జిల్లాలోని డెల్టా భూములలో—కాలువ గట్లమీద తచ్చాడేవాడు. రెండెడ్ల బండిమీద మువ్వలుకట్టిన ముద్దయిన ఎద్దులు పరుగులెత్తుతూ ఉంటే అతని అత్తవారి వూరు విప్పనపాడునుండి రామచంద్రపురం ద్వారంపూడి నుండి రాజమండ్రి పల్లెల మధ్య నుండి ప్రయాణాలు చేసేవాడు. సంతలకు, సంబరాలకు, ఉత్సవాలకు, వూరేగింపులకు, తీర్థాలకు, తిరునాళ్లకు వెళ్లి అక్కడ జరిగిన వేడుకలు, రంగుల రాట్నాలు, వియ్యపురాళ్ల జీళ్లు, ఘమ ఘమ ఘక్కాలు, కాగితపు పువ్వులూ ఇవన్నీ చూసేవాడు. వానిలోని సహజశోభ గ్రహించేవాడు. అందుచేత బుచ్చిబాబు రచనలలో తెనుగు గ్రామసీమ తిన్నగా కన్నుల విందు చేస్తూ దర్శన మిస్తుంది. అది 'అరకులోయ' లో అందమైన త్రోవ కావచ్చు. అనంతపురం వద్ద రత్నాల గనులు కావచ్చు. ఒక అందమైన అమ్మాయి నవ్వితే గుంటలు పడే బుగ్గలమీద చొట్టలు కావచ్చు. ఒక కొంటెపిల్ల కోరగా చూస్తూ నోరు తెరుస్తే, సున్నా చుట్టిన పెదవులు కావచ్చు. ''బుచ్చిబాబు'' చక్కగా చూస్తాడు. చూచినది కన్నులకు కట్టినట్లు చిత్రిస్తాడు. ఈ చిత్రణలో అతడు కవి, గాయకుడు, చిత్రకారుడు, నాట్యాభినేత అయిపోతాడు. ''బుచ్చిబాబు'' కి బొమ్మలు వేయడం చేతనవును. ప్రకృతి దృశ్యాల రామణీయకతను రంగులతో బంధించడానికి అతడు చేసిన ప్రయత్నాలు తైలవర్ణ చిత్రాలుగా అతని యింట గోచరిస్తాయి. అంతకంటె కూడ, అతని కథలలో, నవలల్లో చిత్రించే రంగుల దృశ్యాలు మనోజ్ఞంగా ఉంటాయి. ఈ వర్ణ దృశ్య పరిశీలనా దక్షత ప్రతివర్ణనలోను ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. అతని కథలలో పాత్రలు, ప్రకృతి దృశ్యాలు మనోహరంగా రంగు రంగుల లేఖలతో మన మనో నేత్రాలను లోభపరుస్తూ ఉంటాయి. మరచిపోలేని వర్ణ మాధుర్యం మాటలలో తేగల నేర్పరి.

బుచ్చిబాబు—గాయకుడు, అతనికి మరాటీ బాణీలలో పాడిన మన తెనుగు రంగస్థల సంగీతం అంటే అభిమానం. హార్మోనియమ్ మెట్లమీద సన్నాయి నొక్కులు నొక్కినట్లు 'సక్కుబాయి' గా—'గజ్జె లందియలు ఘల్లు ఘల్లు మన గంతులు వేయరా' అని పాడుతూ వచ్చే తుంగల చలపతి రావు గొంతులోని సంగతులు అతన్ని ముగ్ధుణ్ణి చేశాయి. ఆ జ్ఞాపకాలు ఆ తీయని తలపులు—అతనిలో ఒక లయను, ఒక

సంగీత మాధురిని ఉద్భవింప జేశాయి. అందుచేత ఆతని భాషలో, శైలిలో, పలుకుబడిలో ఎంత పాశ్చాత్య వాసన పసిగట్టినా ఒక స్నిగ్ధ బాంధవ్యం, ఒక ముగ్ధ సంగీతం ప్రతిధ్వనిస్తూంటాయి. బుచ్చిబాబు "చక్కని పాత్రలు సృష్టి చేస్తాడు. ఆ పాత్రలు మనం రోజూ చూచేవి కావు. వాటిలో విశ్వజనీనతతోపాటు విలక్షణత్వం మనల్ని ఆకర్షిస్తుంది. దయానిధి జీవితంలో తటస్థించిన స్త్రీ పాత్రలు, కోమలి, అమృతం, ఇందిర, కాత్యాయని ఎవరికి వారే విలక్షణ వ్యక్తులు, కుముదం కథలో నా కథ వ్రాయవూ అని కోరిన 'కుముదం' 'అరకులోయ' లో ఆడవిపిల్ల, 'ఆద్యంతాలు మధ్య రాధ' లో రాధ 'ఉత్తమ ఇల్లాలు' లో యెంకి, 'ఆత్మవంచన' లో వారాల బ్బాయిని ప్రేమించి ఆత్మవంచన చేసిన అహంభావ పూరిత లయిన అక్క చెల్లెళ్ళు—ఎవరికి వారే విచ్ఛిన్న వ్యక్తులు. విలక్షణాలు కలిగి విచిత్రంగా ప్రవర్తించే విశిష్ట పాత్రలు.

బుచ్చిబాబు రచించిన—కథలలోను నాటికలలోను ఎదురుపడిన పాత్రలు చిరకాలం జ్ఞాపకం పెట్టుకో దగిన వారు నిత్య జీవితంలో యథార్థ వాతావరణంలో తటస్థపడిన వాస్తవ పాత్రలు లాగున పదేపదే మన స్మృతిపథంలో మెరుస్తూ ఉంటారు. సంఘానికి ఎదురు తిరిగి తిరుగుబాటు చేసినా, సంఘ ప్రవాహంలో గడ్డిపోచనంలాగున కొట్టుకొని పోయినా వారికి ప్రత్యేక వ్యక్తిత్వం ఉన్నది. ప్రత్యేక లక్షణా లున్నవి. విశిష్టమైన భావా లున్నవి. ఆ భావాలతో, సంఘంతో ఘర్షణ పడుతుంటారు. ఆ ఘర్షణలో—ఆ భావ యుద్ధంలో పొందిన జయాపజయాలు తమ సంభాషణల ద్వారా తమ స్వానుభవాల ద్వారా వెల్లడి చేస్తారు. తమ ప్రవర్తనకు వారు కించపడరు. ఇతరుల సానుభూతి వారు ఆక్షేపించరు. తెనుగులో కొందరు రచయితలు చేసినట్లు, బుచ్చిబాబు తన పాత్రల తరఫున వకాలత్ పుచ్చుకొన్నట్లు చెప్పడు. ఆ పాత్రల సంభాషణల ద్వారా తమ ప్రవర్తన తామే సమర్థించుకొనేటట్టు చేస్తాడు. తాను నిర్లిప్తంగా వెలుపలి నించి చూచి ఆనందిస్తాడు. పాఠకులు కూడ—తనమీద ఏదో ప్రభావం పడినట్లు భావించరు. ఆయా పరిస్థితుల ప్రభావంలో ఆ పాత్రలు ఎలాగ నడుచుకొన్నదీ—ఆదే 'బిహేవియరిజమ్' లేక తత్కాల భావోద్రేకము (behaviourism) — రచయిత మనకు ప్రదర్శిస్తాడు. ఇక్కడే జీవితానికి అర్థం చెప్పబోయే దయానిధి కన్పిస్తాడు. ఆతడు ప్రకృతి కృపణుడు. మానవజాతి—సంఘముతో తల పెట్టిన సంఘర్షణలో పొందిన దినదిన పరిణామాలను జాగ్రత్తగా పరిశీలించి ఆ సంఘర్షణలో పరాజితులైన వారిపైన సానుభూతి ప్రదర్శిస్తాడు. అదే అతని జాలిగుండె. నిజమైన రచయిత చూపే అనుకంప. ఆతడు విషాద సంఘటనల వలన నిర్వేదం పొందడం, బంగారు భవిష్యత్తుపైన విశ్వాసంతో ఆత్మబలంతో బ్రతికే ఆశాజీవి !

ఈ దృక్పథంతో రచయిత దేనిని గురించి వ్రాస్తాడు? తన చుట్టూ ఎన్నో అనాచారాలు జరుగుతున్నాయి. ఎన్నో కష్టాలు ప్రజలు అనుభవిస్తున్నారు. బాల్య వివాహాలు, వితంతు వివాహాలు, త్రాగుడు దురభ్యాసం, లంచగొండితనం, అధికార దుర్వినియోగం, కుటుంబ నియంత్రణం ఇలాంటి వెన్నో సమస్య లున్నవి. వీటిలో దేనిని గురించి వ్రాసినా రచయితకు అసిధారావ్రతమే. వీటి అన్నింటిని గురించి ఎడాపెడా చెప్పవలసిన అంశాలున్నవి. ఏది సరియైనదో నిశ్చయించుకోవాలి. దీనిలో నీతి—అవినీతి మధ్య చర్చ కూడ వస్తుంది. ఈ సంగతే బెర్ట్రాండ్ రస్సెల్ ఒకానొక సందర్భంలో ఇలాగ నిర్వచించాడట.

"నిజానికి రెండు రకాల నీతి రీతులున్నవి. ఒకటి మనం ఇతరులకి బోధించి మనం ఆచరించనిది; రెండవది: మనం ఆచరిస్తాము కాని ఇతరులకి చెప్పలేనిది. రెండవది మరొక సందర్భంలో—బుద్ధిహీనులు నిశ్చయంగా తెలిసినట్లు వాదిస్తారు కాని బుద్ధిమంతులు మౌనంగానే ఉంటారు." ఈ రెండు సుభాషితాలు చెప్పి "బుచ్చిబాబు", రచయిత అయిన వాడు తెలివిగా తనకు తెలిసిన దానిని ఇతరులు ఆచరించాలని చెప్తున్నాడు, అంటాడు. ఆ యాచరణ తన ప్రవర్తన ద్వారా చూడలేక పోయినా తాను సృష్టించిన పాత్రల ద్వారా, తాను కల్పించిన సన్నివేశాల ద్వారా చూపి తన ఆదర్శాలకు రూపకల్పన చేస్తున్నాడు. అయితే ఈ పాత్రలు ఎలాంటివి ? మన చుట్టూ నివసించే గుమాస్తాలు, చిన్న వర్తకులు, రైతులు, కూలీలు, కార్మికులు, యువతులు, యువకులు మామూలు బ్రతుకుతూ ఎలాగో కాలక్షేపం చేస్తూ ఉంటారు. వారి జీవితాలు కథలలోను, నవలల్లోనూ చిత్రిస్తే పెద్ద విశేషం ఉండదు. విసువు పుట్టించి మొగం మొత్తిస్తాయి. ఇలాంటి సామాన్య స్త్రీ పురుషులు కాక, నీతి రీతులకి ఎదురు తిరిగి హద్దు మీరిన జనం ఉంటారు. హద్దు మీరినవారు సంఘంచేత దండింపబడుతూనే ఉంటారు. అయితే, అట్టివారిని చిత్రించడంలో రచయిత కొంత చమత్కారం తెస్తే ఇది అసహజంగా ఉంది, వాస్తవ విరుద్ధంగా ఉంది అనే విమర్శలను ఎదుర్కోవాలి. అంతేకాక కొన్ని అపూర్వ పాత్రలను తీసికొనేటప్పుడు వారి భాష, వారి వ్యావహారిక శైలి అనుకరించాలి. ఈ ప్రయత్నంలో రచయిత ఎంత వరకు కృతకృత్యుడు కాగలడు ? ఇదే బుచ్చిబాబుని కలవర పెట్టింది. తాను—సంఘానికి ఎదురుతిరిగిన పాత్రలనే తీసికొన్నాడు.

"బుచ్చిబాబు" తన పాత్రలు గురించి బాగా తెలుసుకొని వారిని తన కథలలో ప్రవేశ పెట్టాడు. సజీవ వ్యక్తుల లాగే వారి మాట, వారి నడక, వారి ప్రవర్తన ఇవన్నీ ప్రత్యక్షంగా చూచినట్లు, వారిని తన పాఠకులకు పరిచయం చేస్తాడు. కొన్ని పాత్రలు "జగన్నాథం", "అమృతం" వంటివి పదేపదే తరచు మన కన్నుల ముందు క్రొత్త క్రొత్త పేరులతో ప్రత్యక్ష మవుతూ ఉంటాయి. అతని నవలలో జగన్నాథం తొలుత నెపోలియన్ కథలో చిన్న పాత్ర. ఆత్మవంచ

నలో "గోపాలం" గా ఎదుగుతాడు. అలాగే అమృతం—కముదంగా, చిన్ననాటి పరిచితగా ఎన్నో కథలలో కనిపిస్తుంది.

'బుచ్చిబాబు' పాత్రలలో చూపిన మెలకువే, తన శైలిలోను, వర్ణనలోలను, కథాకథన పద్ధతిలో కూడ చూపిస్తాడు. ఈకాలపు రచయితలు, విజ్ఞానశాస్త్రము, నక్షత్ర శాస్త్రము. మానవ శాస్త్రము, పరిణామ వాదము, భౌతిక రసాయనిక శాస్త్రాలు, మానసిక విశ్లేషణము మొదలయినవన్నీ తెలిసి వాటిని సందర్భోచితంగా తన రచనలలో ప్రవేశ పెడుతున్నాడు. ఫ్రాయిడ్ మొదలుపెట్టిన 'సైకో అనాలిసిస్' ద్వారా తెలిసిన మానసిక విశ్లేషణం ప్రకారం ఎన్నో కథలు వచ్చాయి, పైగా 'చైతన్య స్రవంతి' పేరున ( stream of consciousness) వ్యక్తిలో దాగిన సత్యాలు, అణగియున్న వాంఛలు ఒకదాని నుండి ఒకటి ఆలోచనలు వెలువడిన ధోరణిలో ఉన్న దున్నట్లు వ్రాయడం కూడ పరిపాటి అయింది. అధి వాస్తవికత, అస్తిత్వవాదము (existentialism), హేతువాదము ( rationalism ) అతివాద తత్త్వము ( extremism ) ఇవన్నీ మన రచయితలు తమ కథల్లో, నాటకాలలో చూపడానికి ప్రయత్నం చేస్తున్నారు. జేమ్సు జాయిస్ వంటి రచయిత, 'యులిసిస్' కాని 'ఫినిగన్స్ వేక్' కాని వ్రాసి వాని మూలంగా తనకు తెలిసిన అనేక శాస్త్రాల పరిజ్ఞానము, అనేక భాషల ప్రవేశము, ఖగోళశాస్త్రం, గ్రీకు పురాణ పరిజ్ఞానము, ప్రాచ్య వేదాంత చర్చ ఇవన్నీ ప్రదర్శించి చక్కగా వ్రాశాడు. ఇలాగ కథకు కథచేర్చి మాటకు మాట కలిపి వేలకొలదీ పుటలు వ్రాయవచ్చు. ఆ జ్ఞానము పాఠకులను ఆశ్చర్య చకితున్ని చేయువచ్చునేమో కాని ఆహ్లాద పరచక పోవచ్చును. బుచ్చిబాబు ఈ లోపం గుర్తించి, 'చైతన్య స్రవంతి' అని పేరు పెట్టి ఒక కథ వ్రాశాడు. అయితే కథలో లక్షణాలను దానిలో అధిగమించలేదు. అందుచేత 'పూడిన చక్రం' గాజుమేడ, చైతన్య స్రవంతి, వంటి కథలు వ్రాసి కొన్ని ప్రత్యేక విషయాలు ప్రస్తావించినపుడు వాటికి తగిన 'ఫుట్‌నోట్సు' వ్రాసి పాఠకుంకి తన భావన వెల్లడి చేశాడు. అందుచేత పాఠకులు—'గాజుమేడ' వంటి కథలు చదివి ఆందరి విజ్ఞానాన్ని ఆశ్చర్య చకితులై ఆహ్లాదం కూడ పొందగలిగారు.

కళకళకోసమే అనే నినాదం బుచ్చిబాబుకి నచ్చదు. అందుచేతనే అతడు వ్రాసిన నలభై, యాభై కథలలో కవులు, చిత్రలేఖలకులు, కళాజీవులు పాత్రలుగా కనిపించరు. రచయిత చిత్తశుద్ధి గలిగి తాను చెప్పదలచినది నమ్మి, తగిన విశ్వాసంతో చెప్పమని కోర్తాడు. "ఎల్లోరాలో ఏకాంతం" అనే ఒక కథలో తన భావాలు స్పష్టంగా వెల్లడిచేసి, కళాజీవిని చిత్రించాడు. తాను నమ్మినది నమ్మకంగా చెప్పగలడు. అది చదివి పాఠకుల్ని పొందగల్గినంత ఆనందం పొందుమని అందిస్తాడు. ఈ పద్ధతి రచనలో—బుచ్చిబాబు సర్వ మానవ సమతను, వసుధైక కుటుంబ స్థితికీ నిరూపించవచ్చును. ● వాదాలు, అందరూ చెప్తున్న నినాదాలుగా కాక తాను నమ్మిన నిశ్చితార్థాలుగా ప్రతిపాదిస్తాడు. అందుచేతనే అతని రచనలలో అంత నిజాయితీ, అంత నిర్మలత ప్రతిబింబిస్తూ ఉంటాయి. ఉదాహరణకు బుచ్చిబాబు వ్రాసిన ఒక చిన్న కథ "ఇక్కడ దీపం ఆరితే లోకమంతా చీకటి" తీసికొందాం. ఇందులో ఒక తెనుగు డాక్టరు, ఎక్కడో జరుగుతూన్న యుద్ధంలో క్షతగాత్రులకి సహాయం చెయ్యాలనే డాక్టర్ల జట్టుతో ఇండియా నుండి వెళ్లుతూ తాను ప్రేమించే ఒక స్త్రీవద్ద సెలవు తీసుకోవడానికి ఆమెవద్ద చేర్తాడు. ఆమె ఆతనిని వెళ్లనీయదు. ఆలస్య మవుతుంది. ఆతనికి ట్రెయిన్ అందదు. ఏలాగో మద్రాసు వెళ్లితే, విమానం అందదు. ఆ విమానంలో తనతోడి జట్టువారు వెళ్లిపోతారు. ఈతనివద్ద మందు లుండిపోతాయి. ఆ వెళ్లిన డాక్టర్లు మందులు లేక చచ్చిపోయిన సోల్జర్లని చూస్తూ ఉండిపోతారు కానీ ఏమీ చేయలేరు. మన డాక్టరు ఎలాగో వోడమీద ప్రయాణం చేసి ఆ తావు చేరుకునే టప్పటికి అంతా అయిపోయింది. ఈతడు తిరిగి వచ్చిన తర్వాత స్వంత వూరులో సన్మానం జరుగుతుంది. ఆతడు లపస్మారకంగా ఉండి పడిపోతాడు. ఆసుపత్రిలో చికిత్స పొందుతూ తెలివి వచ్చేటప్పటికి 'నర్సు' కన్పిస్తుంది. ఆమె మందు లేవడంలో ఆలస్య మవుతుంది. "ఇక్కడ జరిగిన ఆలస్యం—ప్రపంచంలో ఎంతమందికి ప్రాణాంతకం అవుతుందో, పద త్వరగా వెళ్ళు." అని ఆ నర్సును త్వర పరుస్తాడు. ఇక్కడ 'దీపం ఆరితే లోకమంతా చీకటి' ఈ కథలో—బుచ్చిబాబు రచయితగా తన విశ్వజనీన దృష్టితో మానవులంతా ఒకటే అనే మానవతా వాదం ప్రతిపాదించాడు. తన కథలలో ఎంతో వైవిధ్యం చూపగలడనడానికి ఇది నిదర్శనం. కొన్ని కథలు పాత్ర చిత్రణకు, మరికొన్ని కథలు, సన్నివేశానికీ, ఇంకొన్ని కథలు మానవ ప్రవర్తనకు ప్రాధాన్య మిచ్చి ఏదో ఒక ప్రత్యేకతను నిలుపుకొంటాయి. ఉదాహరణగా "మేడమెట్లు", "జ్ఞాన నేత్రం", "నిరంతరత్రయం", "ఆశాప్రియ", "మూడు కోతులు", "తడి మంటకు పొడినీళ్లు" ఇలాంటి వెన్నయినా చూడవచ్చును. ఈ కథలలో పాత్రలు చేసినదానికి పాఠకులు వారిపైన సానుభూతి చూపించ నక్కరలేదు. కాని ఆ పరిస్థితులలో, ఆ సందర్భంలో అలాగ తప్ప మరొకలాగు వారు ప్రవర్తించడానికి వీలులేదు. జీవితంలో దగాపడిన తమ్ముళ్లు, చిరునవ్వుతో జీవితాని కర్థం తెలుసుకున్న చిట్టి తల్లులూ, వెకిలి వేషాలు వేసి వెర్రి వేదాంతాలు చెప్పే ఛాందసులు బ్రతుకంతా అబద్ధంగా బ్రతికి, పైకి శీర్షంగనీతులు చెప్పే భావుకులూ

బుచ్చిబాబు కథలలో దర్శనమిస్తూ ఉంటారు. నిజ స్వరూపాలతో నిజవేష భాషలతో వాళ్లపైన ఎవ్వరూ దయచూపనక్కరలేదు. రచయితా చూడడు.

ఒక రచయితకు ఎలాగు పేరు వస్తే అలాగ స్థిరపడిపోతాడు. బుచ్చిబాబు నవలా రచయితగాను మంచి కథకుడుగాను లబ్ధప్రతిష్ఠుడయ్యాడు. నాటక రచయితగా రావలసిన ఖ్యాతి అతనికి రాలేదేమో. నిజానికి రంగస్థలం మీద ప్రదర్శించడానికి దృశ్య రూపకాలుగా గాని, రేడియోలో శ్రవ్య నాటికలుగా గాని అతని నాటక రచనలు అద్భుతమైనవి. అందలి పాత్ర చిత్రణ, సంభాషణల చమత్కారము, కథా నిర్మాణము, అందరి సహృదయాల్ని ఆకర్షిస్తాయి. 'ఆత్మవంచన' 'దారిని పోయే దానయ్య', 'ఉమర్ ఖయామ్', 'రాయల కరుణాకృత్యము'' ''ఆద్యంతాలు మధ్య రాధ', 'ఉత్తమ ఇల్లాలు' మంచి నాటికలు. 'రాయల కరుణా కృత్యము' 'హస్సన్' నాటకంలో ఇతివృత్తాన్ని 'దారిని పోయే దానయ్య' Mr. Pim—passes by అనే A. A. Milne నాటకానికీ పోలియుండవచ్చును. కాని ''బుచ్చిబాబు'' తన చమత్కారం సంభాషణలతోను ప్రత్యేక పాత్ర చిత్రణంతోను తన స్వంతం చేసికొన్నాడు. 'స్వర్గానికి వెళ్లిన శాంతి', ''నీకెంత జీత మిస్తారు ?'' ఇలాంటి వానిలో బుచ్చిబాబు వచన రచనలోని బలమూ, శక్తీ ప్రస్ఫుటంగా గోచరిస్తాయి.

బుచ్చిబాబు శైలిలో—ఒక గొప్ప ప్రయత్నమూ దాని ప్రయోజనమూ కన్పిస్తాయి. అంతేకాదు. ఆ వాక్యాలలో ఒక పట్టు పావడా నేసిన సున్నితపు చికిలీ నేత, అలంకరణ కనిపిస్తాయి. భావ గీతాలలో కనిపించే భావుకత గోచరిస్తుంది. బుచ్చిబాబు కవి, రవి కాంచనిచో కవి గాంచునే కదా లాంటి కవి· ఆతడు వృత్తాలు, పద్యాలు, తేటగీతులు, ఆటవెలదులు, సీసాలు దండకాలు చెప్పలేకపోవచ్చును. పాటలు కూడ కట్టలేక పోవచ్చును. కాని వచనం వ్రాస్తే మంచి రసవంతమైన ఘట్టంలో ఎక్కడా ఏ మాటలు వాడి ఎలాగ పలికించాలో తెలుసు. అతని చేతిలో తెలుగుభాష విలక్షణమైన వింత పలుకుబడి అలవరచుకొంటుంది. అదొక ప్రత్యేక శైలి. ఒక తేనెతేట. దానినే భావ కవిత్వం లేక భావ శబలతతో కూడిన ''లి రి సి జ మ్'' (Lyricism) అనవచ్చును.

ఉదాహరణగా—'చివరకు మిగిలేది' లో ఒక చిన్న పేరా బుచ్చిబాబు శైలికి మచ్చుతునకగా ఇస్తున్నా:

లేచి కూర్చుంది కోమలి. ''ఐనా, ప్రేమంటే నాకేం తెలుసు. చూడండి గుండెలు ఎలాగ కొట్టుకుంటున్నాయ్యో— శరీరం వేడిగా—మీకోసం—అసలదంతా ఎందుకు ?'' అని అతని నోటిని పెదవులతో నాక్కివేసింది.

''ఇదేనా ప్రేమంటే—ఈపాటి ఎంతమందితో ఎన్ని సార్లు చేశావో ?''

''అది వేరు, ఇది వేరు. అసలు మీరు మనిషే వేరుగా. వాళ్లంతా పశువులు—మీరు దేవుడు.''

''దేవుణ్ని పూజించాలి కాని, ముద్దెట్టుకుంటారా ?''

''ముందు ముద్దు, తరువాత పూజ''

మీదికి ఎగబ్రాకుతున్న శరీరాన్ని, వెనక్కి నెట్టివేశాడు విధి. సముద్ర ప్రవాహానికి ఎదురీదే శక్తిగల శరీరం, వర్షించి కొండ శిఖరాల్ని కరిగించివేసే వేగంగల మేఘంలాంటి శరీరం, వికసించిన పుష్పాన్ని మళ్లా మొగ్గని చెయ్యగల విచిత్రమైన శక్తిగల ఆ శరీరం—యీ అల్పమైన ప్రేమ కోసం ప్రాకులాడి నశింపడం విషాదంగా తోచిందతనికి. ఆమె నోటిమీద తన అరచేతిని నొక్కి—

''వొద్దు కోమలి !—నా ప్రేమని పంచుకొని పాడు చెయ్యకు. నాకు మిగిలింది ప్రేమ ఒక్కటే'' అంటాడు దయానిధి.

ఇలాంటి సన్నివేశాలు సందర్భాలలో బుచ్చిబాబు శైలి ఒక నవశక్తిని పుంజుకొంటుంది. ఒక లాలిత్యాన్ని సమకూర్చుకొంటుంది. చాకచక్యంతో, చమత్కారంతో, సమర్థతతో చదువరులమీద పనిచేస్తుంది. చెరగని ముద్రలు వారి హృదయపీఠం మీద విడిచివేస్తుంది. అదీ అతని వచన రచనలో గం పలుకుబడి.

బుచ్చిబాబు—మానవునిలో దానవుని కాని, పాశవిక ప్రవృత్తులు కాని చూడడు. పాశ్చాత్యులు వాస్తవిక ధోరణిలోను, అధివాస్తవిక ధోరణిలోను చిత్రించిన తాత్కాలిక కామోద్రేకాలు వర్ణించేటప్పుడు కూడ మంచి నిగ్రహంతోను నిండు కళతోను వాటిని ప్రదర్శిస్తాడు. భారతీయ తత్త్వవేత్తలు కనిపెట్టిన మానవునిలోని దైవాంశ అతని మనఃఫలకంలో మెదలుతూ ఉంటుంది. మానవునిలో దేవతనే అతడు మనకు చూపిస్తాడు. జీవితానికి అర్థం ఏమిటి అన్న ప్రశ్నకు ఈ మేధావి సమాధానం—జీవించడమే అని. ఈ జీవించడంలో మానవుడు పడుతున్న పాట్లు, అనుభవిస్తున్న కష్టసుఖాలు, ఎదుర్కొంటున్న సంఘర్షణలు అతనికి తెలుసు. అందుచేత ఈ నిత్య సంఘర్షణలో మానవుని యెడల అతనికి సంపూర్ణ సహానుభూతి ఉన్నది. అందుకే కరుణామయంగా, ఆ కరుణలోని హాస్యంతోపాటు చిరునవ్వుల వందింపజేస్తూ రసాభాస్య కాని రమ్య దృష్టితో చూస్తాడు, జీవితానికి అర్థం తెలిసిన దయానిధి.

# ఔచితీ క్షేమేంద్రము

"కరుణశ్రీ"

[క్షేమేంద్రుఁడు పేరెన్నికగన్న ఆలంకారికుఁడు; మహాపండితుఁడు; మహాకవి; జన్మస్థానము కాశ్మీరము; జీవితకాలము 11 వ శతాబ్దము. క్షేమేంద్రుఁడు అభినవ గుప్తపాదుల ప్రియశిష్యుఁడు. ప్రసిద్ధ సాహిత్య ప్రస్థానములలో రససంప్రదాయమునకు భరతాచార్యునివలె, రీతిసంప్రదాయమునకు వామనునివలె, ధ్వనిసంప్రదాయమునకు ఆనందవర్ధనునివలె, వక్రోక్తి సంప్రదాయమునకు కుంతకునివలె, ఔచిత్య సంప్రదాయమునకు ఆచార్యస్థానము నధిష్ఠించినవాఁడు క్షేమేంద్రుఁడు. ఔచిత్య విచారచర్చ, సువృత్త తిలకము, కవి కంఠాభరణము, మునిమత మీమాంస, లావణ్యవతి, చారుచర్య, దశావతారచరిత్ర, భారత మంజరి, రామాయణ మంజరి, బృహత్కథా మంజరి మొదలగునవి క్షేమేంద్రుని కృతులు.

ఆ మహాకవి పదపద్మముల కిది నా హృదయ పుష్పాంజలి.]

క్షేమంబే కద నీకు నీకృతులకున్ క్షేమేంద్ర! మా మాధవా
రామక్షోణిఁ ద్వితీయ దర్శనము సంప్రాప్తించె నిన్నాళ్ళకున్;
శ్రీ మంతమ్ములు తావకీన కవితా సిద్ధాంతముల్ సాహితీ
సీమంతమ్ము నలంకరించె సుషమా సిందూర పూరమ్ములై.

ఆలోకంబు లభించి న, ట్లభినవం బాలోచనం బబ్బిన,
ట్లా లావణ్యవతీ కటాక్షములో మత్తెక్కించు చున్నట్లు, కా
వ్యాలంకారము గన్నటుల్ భరతనాట్యారంభమో యన్నటుల్
మా లో మాకనిపించు నేమిది రసాత్మా! నిన్ను దర్శించుచో.

నిత్య నితాంత కావ్య రమణీ రమణీయ కరానురాగ సాం
గత్యముతో 'సువృత్త తిలక' మ్మలికమ్మున దిద్దితీర్చి "యౌ
చిత్యవిచార చర్చ" విరచించు భవద్దరహాసముద్రలో -
న్నృత్య మొనర్చెనోయి రసనిర్ఝరి గుండెలు పుల్కరింపగన్.

అందము ఛందమై, యభినవార్ద్రి మనస్సుమనో మరంద ని
ష్యంద మమందమై, నవరస ప్రకృతుల్ కృతు లుల్లసిల్ల; స్వ
స్పంద మనోజ్ఞమా మధురభావ పరంపర పొంగులెత్త, నా
నంద తరంగితమ్ముగ నొనర్చితివా సకల ప్రపంచమున్.

"ఇందుముఖీ ముఖాగ్రమున నింపగు కస్తురి, శ్యామసుందరీ
సుందరఫాలభాగమున శోభిలు చందనబిందు; వల్లె కా
వ్యేందిర కౌటిలీ తిలక మెంతయు కాంతి ఘటించు" నంచు నీ
వందువు; ధన్యవాదము లయా హృదయప్రియ! నీదు వాణికిన్.

"ముని మత మీమాంసా" కృతి
సనాథమగు నీ యుదాత్త సాహితికి రస
ధ్వని శాంతముతో సాష్టాం
గ నమస్కృతి సేయు సుకవి కంఠాభరణా!

ఉరు శీలోజ్జ్వల విద్య చందమున, త్యాగోదగ్ర భాగ్యంబటుల్
సరసౌచిత్య సమృద్ధవాక్యము సుధీసంస్తుత్య; "మౌచిత్యమే
స్థిరమౌ జీవితమౌను కావ్యమున"కన్ సిద్ధామృతం-బిచ్చు నీ
హర కోటీర కుమార చంద్రు లెవరయ్యా! మీరు క్షేమేంద్రులా

ఔచిత్యైక మరందతుందిలములై ఆనంద మందారముల్
పూచెన్ నీ యెదలోని నందన వనంబుల్; నీ కళామంజరుల్
రోచిష్మంతములై దిగంతము లలర్చెన్; నీ వచో వైభవం
బా చంద్రార్కము పంచిపెట్టును కవీంద్రా! పచ్చ కర్పూరముల్.

ఆతఁడు మాధవుం, డభినవైక కళాధరుఁ, డుల్లసన్మహా
ద్వైత రసజ్ఞమూర్తి, విబుధప్రియదర్శనుఁ, డంచితాగమ
జ్యోతి రుదాత్త చిత్తుఁడు, సముజ్జ్వల లోచనుఁ, డౌచితీ జగత్
ప్రీతి విధాతయంచు విహరింతురు "క్షేమపథాన" భావుకుల్.

# మహత్తర పరివర్తనము - VIII

## [ఆధునిక రాజ్యనిర్వహణ]

### శ్రీ జాన్ స్ట్రాచీ

ఈ చివరి ఉపన్యాసాన్ని ఆ యా దేశాల ఆంతరంగిక స్థితి గతులపై కేంద్రీకరింప దలచాను. అంటే, వారి వ్యవహారాలను వారు ఎలా నిర్వహిస్తున్నదీ, ఆధునికరాజ్య నిర్వహణ ఏ రీతిని జరుగుతున్నదీ అన్న విషయాల గురించి మాట్లాడుతానన్నమాట. ఒక రాజ్యము స్వీయవ్యవహార నిర్వహణకు అవలంబించే విధానము మీదనే ఇతర దేశాలతోడి సంబంధ బాంధవ్యముల స్వభావం ఆధారపడియుండేమాట నిజము. అయితే, వారినిగురించి వివరించేటపుడు ఏ విషయానికి ఆ విషయాన్ని వేరుగా చూడాలి. అలా చేసినపుడు ప్రజా ప్రభుత్వ ప్రసక్తి వస్తుంది. అంటే ప్రజా ప్రభుత్వమంటే ఏమిటి, దాని ఎక్కువేమిటి అన్నచర్చ వస్తుంది.

ప్రజా ప్రభుత్వమంటేనే ననుకునేది ఏమిటో ముందు చెబుతాను. నేచేసే నిర్వచనం కట్టె, కొట్టె, తెచ్చె అన్న విధంగా ఉండవచ్చు. నేను రాజకీయ సిద్ధాంతాలను తెలియజేసేవాణ్ణికాదు. అధ్యాపకుణ్ణికాదు. మామూలు రాజకీయాలలో పాల్గొనేవాడిని. కాబట్టి, ప్రజాప్రభుత్వమని నేను చెప్పేదానికి, కమ్యూనిస్టులు చెప్పేదానికి గల భేదాన్ని—ఆ రెంటిని పోల్చి తెలిసికొనవచ్చును. స్థూలంగా చెప్పాలంటే, ఒక దేశ ప్రభుత్వం, ప్రజలందరికీ ఓటింగ్ హక్కు ఉండి, వారిచేత ఎన్నుకొనబడియున్నట్లయితే అది ప్రజా ప్రభుత్వమవుతుందని నా ఉద్దేశం. ఆవిధంగా అక్కడి ప్రజలు తమ కిష్టమైన ప్రభుత్వాన్ని ఎన్నుకొని, కొంతకాలమైన తరువాత ఆ ప్రభుత్వాన్ని తొలగించగలిగి, తమ కిష్టమైన మరొక ప్రభుత్వాన్ని ప్రతిష్ఠించగలిగితే ఆదేశంలో ప్రజాప్రభుత్వమున్నట్లవుతుంది. ప్రజాప్రభుత్వమంటే ఇంతేననికాదు. పాఠ్య పుస్తకాలలో దానినే ప్రజా ప్రాతినిధ్య ప్రభుత్వమంటారు. అయితే ఈ ప్రాతినిధ్య ప్రభుత్వము నేటి ప్రజా ప్రభుత్వ సిద్ధాంతానికి గుండెకాయలాంటిదనవచ్చు. పూర్తిగా నిర్వచన చేయకుండానే 'ఏ' అనే దేశం ప్రజాప్రభుత్వ దేశమనీ, 'బి' అనే దేశంకాదనీ చెబుతున్నాము. ఒక ప్రభుత్వాన్నికాదని, దానికి వ్యతిరేకంగా మరో ప్రభుత్వంకోసం ఓటు చేయడమేనని మనందరం అనుకునే నిర్వచన.

నే నిదాంక చెప్పినట్లు ప్రాతినిధ్య ప్రభుత్వమే ప్రజా ప్రభుత్వానికి వెన్నెముకలాంటిది. ప్రాతినిధ్య ప్రభుత్వముండాలంటే ఇంకా అవసరమైనవి చాలా ఉన్నాయి. వాక్ స్వాతంత్ర్యం అనేది ఉండాలి. అది ఉంటేకాని, వారనుకునేది చెప్పలేరు. అలా చెప్పగలిగితేకాని, ఇద్దరి పార్టీలమధ్యను, ఇద్దరి అభ్యర్థులమధ్యో ఫలాని వారిని ఎన్నుకోవాలని చెప్పలేరు. కాబట్టి వాక్స్వాతంత్ర్యము అనేది ప్రజా ప్రభుత్వానికి చాలా ముఖ్యం అని తేలుతోంది. అదేవిధంగా సంఘ స్వాతంత్ర్యంకూడా ఉండటం అవసరం. అంటే కార్మికులు యూనియనులను స్థాపించుకొనడానికి అవకాశ ముండాలన్నమాట. ఆధునిక ప్రజాస్వామ్యానికి ఈ రెండు స్వాతంత్ర్యాలు ప్రధాన లక్షణాలు. అవి అవిభాజ్యాలని నా నమ్మకము. పార్లమెంటుకు ఎన్నుకొనే విధంగానే ట్రేడు యూనియను అధికారులను కూడా ఎన్నుకొనే హక్కు లుండాలి. వీటితోపాటు స్వతంత్రమైన లా కోర్టులుండాలి. ఈ కోర్టులు, ప్రభుత్వం కోరినట్లుగా కాకుండా స్వంతంగా యోచించి తీర్పు లివ్వాలి. దీనికే చట్టయుతమైన పరిపాలన అంటారు. ప్రభుత్వంకూడా చట్టాలకి లోబడి పాలించాలి.

చట్టయుతమైన పరిపాలన అనేది క్లిష్టమైనది కాని, ప్రజా ప్రభుత్వానికిది అనాదిగాఉండే ప్రధాన సూత్రము. దాని ప్రాముఖ్యతను నేడు మనము విస్మరించలేము. ప్రజా ప్రభుత్వములు కానివి ఈ సూత్రాన్ని విస్మరించినవి. తమ పౌరులతో వ్యవహరించటంలో ఒక చట్టాన్ని అనుసరించి వ్యవహరించాలనే కట్టుబాటు వారికి లేకపోయినది. ఉన్నది ఉన్నట్లు నిజం చెప్పాలంటే, ఆ దేశ పౌరులు వారి ప్రభుత్వ దయా ధర్మానికి లోబడియుండవలసి వచ్చినది. ఇపుడు నేను చేసిన నిర్వచనను, మరొక రకపు ప్రభుత్వ పద్ధతితో అంటే కమ్యూనిస్టు పద్ధతితో సరిపోల్చనీయండి.

రష్యా, చైనా, హంగరి, పోలెండు, తూర్పు జర్మనీ ఇవే కాదు, మొత్తం కమ్యూనిస్టు దేశాలన్నీ కూడా ప్రజా ప్రభుత్వం ఉన్న దేశాలేనని కమ్యూనిస్టులు వాదించడం మీకు తెలుసు. ఈ దేశ ప్రభుత్వాలు వారన్నట్లు "ప్రజా ప్రభుత్వాలు" కావని ఎవరన్నా అంటే వారికి విపరీతమైన కోపం వస్తుంది. అయితే, ఈ ప్రజాప్రభుత్వమనే మాటకు వారు చెప్పే అర్థమేమిటి? పెట్టుబడివిధానము రద్దు చేశామని వారి తాత్పర్యం. ప్రజా ప్రభుత్వమంటే అంతవరకే వారి ఉద్దేశ్యం. కాబట్టి వారనుకునే ప్రజా ప్రభుత్వానికి, ఎన్నికలకు సంబంధంలేదు. స్వతంత్రమైన ట్రేడ్ యూనియనులకు సంబంధంలేదు. అలాంటి ట్రేడ్ యూనియన్‌లకు సమ్మెచేసే హక్కు ఉందా? అనే ప్రసక్తిలేదు. నేను నిర్వచించిన ప్రజా ప్రభుత్వ లక్షణాలు ఏవీ వుండవు. వారనుకునే ప్రజాప్రభుత్వానికి, నే ననుకొనేదనికి సంబంధంలేదు. పెట్టుబడి విధానం పోవడమే ప్రజాప్రభుత్వమని వారి ఉద్దేశ్యం.

అయితే నా నిర్వచనం సరైనదని, వారిది కాదని చెప్పే సూత్రం ఏమీలేదు. మాటలకి మనం ఇష్టం వచ్చిన అర్థం చెప్పవచ్చు. కాని, ప్రజా ప్రభుత్వాన్ని కమ్యూనిస్టులు చెప్పేవిధంగా నిర్వచించడం కేవలం అర్థాన్ని అటూ, ఇటూ చేయడమే. ఆ దేశాలను సోషలిస్టు దేశాలు అనిగాని, కమ్యూనిస్టు దేశాలనిగాని అంటే సక్రమంగానే ఉంటుంది. లేకపోతే, పెట్టుబడి విధానాన్ని రద్దు చేయడమైనదని తెలిపే ఏ పేరునైనా పెట్టినా సరిగానే ఉంటుంది. కాని, ప్రజా ప్రభుత్వమనే పేరును వాటికి తగిలించడం అసమంజసం. ఎందుచేతనంటే ప్రపంచంలో ప్రజా ప్రభుత్వమని ఇతరులనేదాని లక్షణాలు వీటికి లేవు.

ఆ లక్షణాలేవీ లేవని నేనన్నప్పుడు నేను కాస్త తమాయించాలి. కమ్యూనిస్టు రాజ్యాలన్నింటిలోను ఎన్నికలనేవి ఉన్నాయి. ఆ ఎన్నికలన్నింటికీ ప్రధాన లక్షణ మొకటి ఉన్నదని మీకు తెలుసు. అక్కడ ఒకే ఒక అభ్యర్థికి మించి ఎన్నికల్లో పాల్గొనరని కూడా మీకు తెలుసు. ఈ విధమైన ఎన్నికలను మా వృద్ధ ప్రధాన మంత్రి అట్లీ ఇలా చక్కగా వర్ణించారు—"కమ్యూనిస్టు ఎన్నికలు ఒకేఒక గుర్రం పరుగెత్తే గుర్రపు పందెము". ఈ ఎన్నికలను నిజంగా ఎన్నికలనడానికి వీలులేదు. ఎన్నిక అంటే ఏరుకొనడం అయితే ఒక నియోజకవర్గంలో ఒకేఒక అభ్యర్థివుంటే ఎన్నుకోవడమనేది ఉండదు. ఉన్న ఒక్క అభ్యర్థి తప్పకుండా ఎన్నుకోబడతాడు. వారుచేసే దేమీలేదు. తమ కిష్టమైన వారిని ఎన్నుకొనడానికి అవకాశంవుంటేనే, ఎన్నిక విలువకు ప్రమాణం. ఇక్కడ ఒక ఉదాహరణ ఇస్తాను.

ఇంతకుముందు పోలెండును గురించి చెప్పాను. 1956 లో పోలిష్ కమ్యూనిస్టులు తమపైన రష్యా ఆధిపత్యాన్ని తొలగించడానికి తీవ్రంగా ప్రయత్నించారు. అప్పుడే కొంతవరకు ప్రజా ప్రభుత్వాన్ని కూడా ప్రవేశపెట్టాలని అనుకున్నారు. అందుకనే నేను నిర్వచించిన ప్రజాప్రభుత్వంలోఉండే ఎన్నికలను ఒక విధంగా ప్రవేశపెట్ట దలచారు. అంటే ఎన్నికలలో పోటీకి అవకాశం ఉండాలని అనుకున్నారు. ఆ సమయంలో నేను వార్సాలో ఉన్నాను. నే నక్కడికి వెళ్ళిన కాసేపటికి పోలెండు కేంద్ర కమ్యూనిస్టు సంఘ ప్రముఖ సభ్యు లొకరు నన్ను ప్రక్కకు తీసుకువెళ్ళి ఇట్లా అన్నారు. "స్ట్రాచీ గారూ! మీ ప్రజా ప్రభుత్వం ప్రపంచంలో అన్నిటికన్నా పెద్దది. అందుకని మా దేశంలో కొంత నిజమైన ప్రజాప్రభుత్వాన్ని ఏర్పరచుకోవడం ఎట్లాగో చెప్పడానికి మిమ్ములను ఇక్కడికి ఆహ్వానించాము. ఎన్నికలలో పోటీ ఉండడం మా కిష్టం. అందుకని ప్రతి నియోజకవర్గంలోను ఒక అభ్యర్థికి మించి ఉండాలి. అట్లా ఉండడానికి ప్రయత్నిస్తాము. సాక్షాత్తు కమ్యూనిస్టేతరుడే కాకుండా, కమ్యూనిస్టు విరోధి కూడా ఎన్నికల్లో పాల్గొనేటట్టు చేయాలని మా ఉద్దేశ్యము. అయితే దీంట్లో ఒక చిక్కు ఉన్నది. మేము కనక కమ్యూనిస్టేతరుణ్ణి, కమ్యూనిస్టు ప్రతికక్షిని ఎన్నికలలో నిలవనిస్తే కమ్యూనిస్టు మాత్రమే ఎన్నికౌతాడనే గ్యారెంటీ ఎక్కడ ఉంది?"

ఆయన ఇలా అనడం హాస్యాస్పదంగా ఉన్నా, ఆయన నిజంగానే అలా చెప్పారు. నేను ఆయనకిలా సమాధానం చెప్పాను: "మీరు అనుకున్నదానికి ఉపాయం చూపేటంత శక్తి నాలో లేదు. అందుకు నేను చాలా విచారిస్తున్నాను. ఎన్నికల్లో ఒక అభ్యర్థికంటె ఎక్కువమంది నిలబడటం అనేదే ప్రజా ప్రభుత్వానికి లక్షణం కాదు. అలా నిలబడిన వారిలో ఎవ్వరు గెలుస్తారనే సందేహం ఉండడం కూడా అతి ముఖ్యము" నే నీమాట అనేటప్పటికి ఆయన చాలా ఆశాభంగంచెంది వెళ్ళిపోయాడు.

ఇక్కడ సింగపూరులో స్థితిగతులను గురించి ఒక చిన్న మాట చెప్పదలచాను. అది ఈమధ్య ఇక్కడ జరిగిన హాంగ్‌లిమ్ ఉప ఎన్నిక ఫలితానికి సంబంధించినది. ఆ ఎన్నికలో ప్రభుత్వ పక్ష అభ్యర్థి ఘోరంగా ఓడిపోయాడు. అందుకని ఇక్కడ ప్రజాప్రభుత్వం చక్కగా నడుస్తోందని నాకు నమ్మకం కలిగింది. ఎవ్వరు గెలుస్తారు అనేది ప్రభుత్వానికి ముందుగా తెలియదు. అలా తెలియక పోవడమే ఎన్నికయొక్క నిర్దుష్టత్వానికి చిహ్నము. అంటే హాంగ్‌లిమ్ ఓటర్లు—వారు సరైన వారిని ఎన్నుకున్నారో లేదో నాకు అక్కర్లేని విషయం—ఎవ్వరిని ఎన్నుకోవాలనేది తమకు తాము నిర్ణయించుకున్నారు. ఫలానావారికి ఓటు చేయాలని వారికి చెప్పి చేయించలేకపోయారు.

ప్రజా ప్రభుత్వమంటే నేను నిర్వచించినదే నని మీ అందరిచేత ఒప్పించగలిగినా, మీరొకమాట అనవచ్చు. "ప్రజా ప్రభుత్వమంటే మీరు చెప్పిందేకాని, దాని ప్రయోజనం సున్నా". నిర్నిబంధమైన ఎన్నిక లనేవిఉంటే, వాటివల్ల కొన్ని ఇబ్బందు లున్నాయన్నమాట నిజం. అక్కడి ప్రభుత్వాలు దాదాపు ఎప్పుడూ ఓటర్ల ఆగ్రహానికి గురిఅయ్యేస్థితిలో ఉంటాయి. అలాలేని ప్రభుత్వాన్ని నేను చూడలేదు. ఓటర్లు ఎప్పుడూ తప్పుగానే ఓటు చేశారని చేస్తారనీ వారు అనుకుంటూ ఉంటారు. ఓటర్లకోర్కెలను తీర్చడానికి ప్రయత్నించడమే కష్టమని వారి అభిప్రాయము. ఓటర్ల కోర్కెలు ఎల్లప్పుడూ సవ్యమైనవని అనుకోడానికి వీలులేదు. వారు కూడా ఇతరులవలెనే తప్పులు చేస్తూఉంటారు. అయినప్పటికీ కూడా వారికి ఇష్టము వచ్చిన వారిని ఎన్నుకొననిచ్చే వ్యవస్థ అన్నింటికన్న ముఖ్యమని నా విశ్వాసము.

ఆధునిక ప్రజా ప్రభుత్వములో ఓటర్లే పరిపాలన చేయడం సాధ్యముకాదు. ఇరవై లక్షల జనాభాకు తక్కువగా వున్న సింగపూరులో కూడా అది సాధ్యంకాదు. సింగపూరు ప్రభుత్వాన్ని ఓటర్లు నడపడమనేది అసాధ్యము. అలాంటప్పుడు మూడు కోట్లుగాఉన్న బ్రిటిష్ ఓటర్లకు, పదికోట్లుఉన్న అమెరికన్ ఓటర్లకు వారి వారి దేశాల ప్రభుత్వాన్ని నడపడం ఎంత అసాధ్యమో వూహించవచ్చు. ఇది ఎప్పటికీ సాధ్యముకాదు. ఎంత స్వేచ్ఛాయుతమైన ప్రజా ప్రభుత్వములో కూడా చేయగలిగింది ఓటర్లు తమ కిష్టమైన రాజకీయ పక్షాలనుంచి అభ్యర్థులను ఎన్నుకొనడం తప్ప గత్యంతరంలేదు. దానివల్ల వచ్చే ఫలితము ఒక రాజకీయ పక్షాన్ని అధికారంలో ప్రతిష్ఠింపచేయడమే. ఇంకొక పక్షాన్ని అధికారంనుంచి లాగివేయడము జరుగుతుంది. అధికారం నుంచి పోయిన పక్షం ప్రతికూల పక్షంగా మారి వ్యవహరిస్తుంది.

ఓటర్లు ఎన్నుకొనే ఈ రాజకీయ పక్షాలు అంటే ఏమిటి? కొందరు రాజకీయవాదులు కలిసి పక్షాలుగా ఏర్పడుతారు. (వీరిని కొంతమంది మొరటుగా ముఠాలంటారు.) ఇంతేకనుక అయినట్లయితే అడ్డంకులు అనేవి లేకుండా, వారినుంచి ఏరి ఎన్నుకోటం చాలా గొప్ప విషయం. ఈ విషయంలో నాకు కొంత అనుభవమున్నది. నేటి ప్రజాప్రభుత్వ విధానము మా దేశంలో గత 40 సం. లుగా పని చేయటం నేను గమనించాను. మిగతా దేశాలలో ఎలా పని చేస్తున్నదీ కూడా చూస్తూ ఉన్నాను. రాజకీయపక్షాలు ఒకదానితో ఒకటి పోటీపడటంవల్ల ఓటర్లకు కావలసినది దాదాపు లభిస్తుంది. నేటి ప్రజా ప్రభుత్వ విధానములో రాజకీయపక్షాలు ఎన్నికలలో నెగ్గడంకోసం ఓటర్లకు పోటీపడి వాగ్దానాలు చేస్తారు. కొంతవరకు ఆ వాగ్దానాలను చెల్లించుకోవలసి వస్తుంది. అయితే ఈ వాగ్దానాలను పూర్తిగా అమలు జరుపలేక పోతారు. ఎందుచేతనంటే కొన్ని అసాధ్యమైన, పరస్పర విరుద్ధ

# మహత్తర పరివర్తనము - VIII

మైన వాగ్దానాలు చేస్తూ ఉంటారు. కాని, తాము ప్రభుత్వాధికారంలోనికివస్తే తాము అవలంబించే వైఖరిని తప్పక చెబుతారు.

ప్రజా ప్రభుత్వం పని చేయాలంటే రెండుగాని, అంతకంటె ఎక్కువగాని రాజకీయ పక్షాలు ఉండితీరాలి. ఈ పక్షాల దృక్పథం నిజంగా భిన్నంగా ఉండాలి. వారిలో ఒకరు సోషలిజం, దాని కనువైన పథక నిర్మాణమూ కావాలంటారు. ఇతరులు పెట్టుబడి విధానము, స్వేచ్ఛా వ్యాపారమూ కావాలంటారు. వీరిలో ఎవరూ కూడా చెప్పినదంతా అమలు చేయలేరు. కాని, ఆ మార్గంలో నడవ వచ్చు. ఈవిధంగా రాజకీయపక్షాలు భిన్న దృక్పథాలు కలిగివుంటే ఓటర్లు ఎన్నికల ద్వారా ఒక పక్షాన్ని ప్రభుత్వాధికారంనుంచి దించి, మరొకరిని ప్రతిష్ఠించినప్పుడు నిజంగా మార్పులను తీసుకురావడం తటస్థిస్తుంది. రాజకీయపక్షాలు అన్నీ కనక, ఒక దృక్పథాన్ని కలిగిఉంటే ఓటర్లు తమకు నచ్చిన వారిని ఎన్నుకొనడ మనేది ఉండదు. అలాంటప్పుడు ఒకే పార్టీ ఒకే అభ్యర్థి ఉన్నట్టు అవుతుంది.

అయితే ఇక్కడ అంతగా కనపడని విషయం ఒకటి చెబుతాను. రాజకీయ పక్షాలు భిన్నంగా ఉండితీరాలి. వారు భిన్న మార్గాలను అవలంబించాలి. వారు తమ దేశాన్ని సోషలిస్టు మార్గంలోగాని, లేక పెట్టుబడిదారి విధానంలోగాని, తీవ్రమైన జాతీయ తత్వంలో, లేదా స్నేహ పూర్వకమైన అంతర్జాతీయ తత్వంలోగాని నడిపించి తీరాలి. అయితే రాజకీయపక్షాలు కేవలం సంపూర్ణంగా పరస్పర విరుద్ధమైనవిగా ఉండకూడదు. రాజకీయ పక్షాలకు కొంతవరకైనా ఏకాశయం ఉండాలి. ఒకరు పూర్తిగా పెట్టుబడి విధానం కావాలని, మరొకరు విప్లవభావంతో పెట్టుబడి విధానాన్ని పూర్తిగా భూస్థాపితం చేయాలని మొదలు పెడితే ప్రజా ప్రభుత్వ మనేది పని చేయలేదు. ఈ రెండు దృక్పథాలుగల పక్షాలమధ్య ఏ దేశం వేగలేదు. అలాంటి దేశము కొద్ది సంవత్సరాలలోనే దివాలా తీస్తుంది. ప్రత్యామ్నాయంగావచ్చే ప్రభుత్వం విప్లవ పూరితమైనదైతే, అంతకుపూర్వం అధికారంలోఉన్నవారు తేలికగా తొలగి, అధికారాన్ని అప్పగించరు. ఎందుకనంటే, తమను బ్రతకనియ్యరు అనేది వారికి తెలుసు.

కమ్యూనిస్టు వర్గాలలో ఒకరు ఈ విధంగా చమత్కరించారట. (అలా చమత్కరించినది బహుశః పోలిషు దేశీయుడై యుండవచ్చు. సాధారణంగా పోలిషువారే అలాంటి చమత్కార సంభాషణలు చేయగలరు.) ఆ కమ్యూనిస్టు తన సహచరుల కిలా చెప్పారట. "రష్యాలో ఒకే ఒకరాజకీయపక్షం మాత్రం ఉంటుందని చెప్పటం పట్టి అబద్ధం. రెండు పక్షాలు ఉండవచ్చు. అయితే ఒకటి అధికారంలో ఉంటుంది. రెండోది జైలులో ఉంటుంది" ఒక దేశంలో ప్రధానరాజకీయపక్షాలు రెండూ పరస్పర విరుద్ధ మార్గాలను అవలంబించినపుడు ఇలాంటిది సంభవిస్తుంది. కాబట్టి ప్రజాప్రభుత్వం పని చేయాలంటే ఆ యా పక్షాలు వేరు వేరు సూత్రాలకు సిద్ధాంతాలకు కట్టుపడినా, ఒకరి నొకరు ప్రతికూలభావంతో చూచినా, వీరందరికీ ఒక విషయంలో ఏకీభావ ముండాలి. ఈ విచిత్ర విషయాన్ని బ్రిటనులో మేము రెండు హెచ్చరిక మాటల ద్వారా తెలియజేస్తూ ఉంటాము. ఎదిరిపక్షపు పని, ఎదిరించట మనే మేమంటాము. ప్రభుత్వాన్ని ప్రతికూలమైన సూచనలతో వేధించాలి. అయితే దీనితోపాటు ఇంకోటి కూడా ఎపుడూ గుర్తుంచుకోవాలి. అది ఇది–"రాణి ప్రభుత్వము సాగిపోతూ ఉండాలి". అందుకని అవసరమైనప్పుడు కొంత సహకార భావమును ప్రదర్శించి దేశ వ్యవహారములు నడపగల ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయాలి. ఏ పక్షానికి ఆ పక్షం వేరు వేరు మార్గాలను అవలంబించదలచినా, అసలు వ్యవహారమనేది నడవటం ప్రధానమనే విషయం పై వారందరూ ఏకీభవిస్తారు.

పైన చెప్పిన ఈ రెండు సూత్రాలే కాకుండా, మూడవది ఇంకోటి ఉన్నది. అది రాణియొక్క ప్రతికూలపక్ష మనేది ఒకటి ఉండడం. ఈ విషయం చాలా క్లిష్టమైన విషయం. ఒక రకంగా నాజూకైన మాట. ఒకప్పుడు రష్యా ఆయన ఒకడు దీనికి అర్థం ఏమిటో చెప్పమని అడిగాడు. చెప్పడానికి ప్రయత్నించాను. కాని, నేను కృతకృత్యుడనైనానని అనుకోను. రాణి ప్రతికూలపక్ష మనేదాంట్లో పైకి కనపడని సున్నితమైన భావం చాలా ఉన్నది. ఇలాంటి సున్నితమైన భావాలపైనే ప్రజాప్రభుత్వం జయప్రదం అవటం ఆధారపడి ఉంటుంది.

ఒకదేశం ప్రజాప్రభుత్వ వ్యవస్థను నిర్మించగల పరిణతస్థితిలో ఉన్నప్పటికీ, ప్రజాప్రభుత్వమనేది మంచిదా? అది ఉత్తమ ఫలితాలను ఇవ్వగలదా? అని అడగవలసిఉంటుంది. ఎందుకనంటే, ప్రజా ప్రభుత్వం సత్ఫలితాలను ఇవ్వకపోతే ప్రజలుదానికి ఒప్పుకోరు.

మిగతా ఏ రాజకీయ విధానాన్ని పరీక్షించినట్టే ప్రజా ప్రభుత్వాన్ని కూడా పరీక్షించాలి. ఇంతకీ ఆధునిక ప్రభుత్వం అంటే ఏమిటి? ఆ యా నిర్ణయాలు చేసేటటువంటి యంత్రం తప్ప మరేమీకాదు. వివిధసమస్యలతో కూడిన నేటి సంఘం విషయంలో ఎడతెగకుండా ప్రభుత్వం అనేక నిర్ణయాలను చేయవలసి ఉంటుంది. ఈ నిర్ణయాలు పెద్దవి, చిన్నవి—మంచివి, చెడ్డవి కావచ్చు. కాని, నిర్ణయాలనేవి చేయడం తప్పనిసరి. ఈ నిర్ణయాలు చేయడంలో ప్రజాప్రభుత్వం నియంతృత్వమంత సమర్థతతో ప్రవర్తించలేదని, యూరపులోను, ఆసియాలోను, ఆఫ్రికాలోను చాలామంది అనుకుంటారు. ప్రజా ప్రభుత్వ మనేది సిద్ధాంతరీత్యా గొప్పది కావచ్చు. కాని, ఆచరణలోమాత్రం నియంతృత్వమే మంచిదని వారి అభిప్రాయం. వెనక ముస్సోలినీ కాలంలో "రైలు బళ్లు సకాలంలో నడుస్తున్నాయని" గొప్పగా చెబుతూ ఉండేవారు. ఇవి కేవలం పసితనపు మాటలు.

అయితే మొదట్లో ఇది కాస్త నిజమనిపిస్తుంది. ప్రజా ప్రభుత్వాలన్నీ ఎప్పుడూ సరైన నిర్ణయాలు చేయవనేది సత్యం. వారు అప్పు డప్పుడు ఘోరమైన తప్పులు చేస్తారనేది కూడా కాదనను. ఇది గుర్తించడానికి మా దేశ ప్రభుత్వం చేసిన తప్పులే చాలు. 1938 లో మా ప్రభుత్వం మ్యూనిక్‌లో చేసిన తప్పు తలుచుకుంటే చాలు. అప్పుడు బ్రిటిష్ ప్రభుత్వం హిట్లర్‌కు లొంగిపోయినట్లు అనిపించింది. ఆ లొంగిపోవడం తాత్కాలికం. ఒక సంవత్సరం తర్వాత హిట్లర్‌ను ఎదిరించే అవసరం ఏర్పడింది. అయినా మ్యూనిక్ నిర్ణయం అతి ఘోరమైన తప్పు. దానిమూలంగా బ్రిటన్‌యొక్క మనుగడకే ముప్పు వాటిల్లింది. ఆ నిర్ణయం మూలాన ప్రపంచం అనేక సంవత్సరాలుగా యుద్ధంలో చిక్కుకుంది. అందువల్ల ఆ నిర్ణయం నిజంగా చెప్పలేనంత

తప్పు. ఇంతేకాదు. ఈమధ్య సూయజ్‌పైన బ్రిటన్ చేసిన దండయాత్రలు చూడండి. అదీ భయంకరమైన తప్పే. అయితే ఈ తప్పుల విషయంలో మీరొకటి గమనించాలి. అదేమిటంటే— అవి సవరించబడ్డాయి. మ్యూనిక్ నిర్ణయాన్ని ఒక సంవత్సరంలో మార్చివేశారు. సూయజ్ నిర్ణయం ఇరవైనాలుగు గంటలలో మారింది. అంతర్జాతీయంగాను, జాతీయంగాను బ్రిటిష్ ప్రభుత్వం అతితీవ్రమైన విమర్శకు, ఒత్తిడికి గురిఅయింది. దాంతో దండయాత్రను చాలించడమేకాదు, విరమించింది. కాబట్టి ప్రజాప్రభుత్వం తప్పులు చేయదని అనడంలేదు. చాలా పెద్ద తప్పులు చేయడం కద్దు. అయితే చాలవరకు ప్రజాభిప్రాయానికి లొంగి తప్పులు దిద్దుకుంటుంది.

నియంతలు చేసిన తప్పులతో పోల్చిచూద్దాము. మొదట ఫాసిస్టు నియంతృత్వాలను పరిశీలిద్దాం. కొన్ని విషయాలలో హిట్లర్ నియంతృత్వం చాలా సమర్థతతో కూడిన ప్రభుత్వమని అంగీకరించక తప్పదు. అతను అధికారంలోకి వచ్చినప్పుడు దివాలాస్థితిలోఉన్న జర్మన్ ఆర్థికవ్యవస్థను పునర్నిర్మించాడు. ప్రపంచం అంతమట్టుకు కని విని ఎరుగనటువంటి సైనిక సంస్థను సృష్టించాడు. ఆస్థాయిలో ఆయన తీసుకున్న నిర్ణయాలు చాలా గట్టివి. కాని, ఆయన తీసుకున్న కొన్ని పెద్ద ప్రధానమైన నిర్ణయాలు చూడండి. కొంతకాలం అవి సరైనవిగానే కనిపించాయి. కాని, ఒక దెబ్బలో ఫ్రాంసును కొట్టివేశాడు. యూరపు సతించి బ్రిటన్‌ను తరిమివేశాడు. బ్రిటన్‌ను జయించడానికి వైమానిక శక్తిని వినియోగించాడు. కాని, ఆయన అనుకున్నట్టు జరగలేదు. ప్రతివిజేత కొన్ని అవాంతరాలను కూడా వూహించాలి. నాజీ నియంతృత్వంలో నిర్ణయాలను గురించినంతవరకు లోపం ఉన్నట్టు కనపడలేదు. ఒక దశవరకు హిట్లరు నిర్ణయం తప్పు అని ఎవ్వరూ అనడానికి వీలులేదు. కాని, హఠాత్తుగా ఎందుకో హిట్లరు ప్రపంచంలోకల్లా శక్తివంతమైనటువంటి రెండు దేశాలతో (అంటే రష్యా, అమెరికాలతో) యుద్ధానికి దిగాడు. ఆ క్షణంలోనుంచి జర్మనీస్థితి మారిపోయింది. ఇంత పెద్ద తప్పును ఎప్పుడూ ఏ ప్రభుత్వమూ చేసిఉండదు. దీనితో జర్మనీ విధి నిర్ణయమైపోయింది. పారిశ్రామికంగాను, సైనికంగాను బలంగా ఉన్నప్పటికి జర్మనీకి వినాశం తెచ్చిపెట్టింది. ఈ నిర్ణయం కేవలం వినాశకారణమైన నిర్ణయం; ఇదేమిటా అని అనుకున్నారు. ఈ తప్పు దిద్దుకోడానికి అలవికానట్టి తప్పు. ఇలాంటి నిర్ణయాలు చేయడం నియంతల స్వభావంలో ఉంది.

ఇలాంటిదే మరొక ఉదాహరణ ఇస్తాను. అది పెరల్‌హార్బరును కొట్టటానికి జపానువారు చేసిన నిర్ణయము. జపానుఈ నిర్ణయాన్ని ఎందుకు చేసినదని తెలిపే పత్రాలను చదువుతూ వచ్చాను.

హిట్లరు చేసిన రెండవ రకపు నిర్ణయముల మోస్తరే జపాను చేసిన నిర్ణయములలో కూడా లోటు అనేదిలేదు. వారు చేసిన ఏర్పాటులన్నీ సక్రమంగా ఉన్నాయి. అన్నివిధాల బాగా సిద్ధంగా ఉన్నారు. పెరలు హార్బరుమీద వారు చేసిన దండయాత్ర అతి అసాధారణ పద్ధతితోనూ, అసాధారణ ప్రతిభతోనూ కూడినది. గంటకు కొన్ని వందల మైళ్లు పోయే విమాన దళ వేగాన్ని గంటకు 10, 15 మైళ్లు పోయే నావికా దళవేగాన్ని సమన్వయ పరచటం జరిగినది. ప్రతిపక్షులు ఆశ్చర్యపోవటానికి హవాయి ఫిలిప్పైన్సు దీవులలో ఒకే సమయంలో దెబ్బతీశారు. ఇది సాధారణంగా వూహించటానికి వీలులేని దండయాత్ర. కాని జపానువారు కడు సమర్థతతో నిర్వహించారు. అయితేనేం ఈ నిర్ణయం నాశకారణమైనది. ఈ దండయాత్ర వ్యూహాన్ని రచించిన అడ్మిరల్ మంత్రివర్గ సభ్యుడు. అతను మంత్రివర్గానికి ఒక నివేదిక సమర్పించాడు. పెరల్ హార్బర్‌మీద దండయాత్ర అనుకొన్న దానికన్న తేలికగా జయప్రదమైనా, జపానుకు ఒక సంవత్సరకాలమే జయప్రదంగా జరుగుతుందని ఆయన తన నివేదికలో హెచ్చరిక చేశారు. అమెరికా కనుక ఒక సంవత్సరకాలము యుద్ధను సాగిస్తే ఆ తరువాత జపానుకు అపజయం తప్పదనీ అన్నాడు. తను అడ్మిరల్ ఇలా చెప్పినప్పటికి కూడా జపాను మంత్రివర్గము దండయాత్రకు ఉపక్రమించింది. నియంతృత్వ ప్రభుత్వాలుచేసే తప్పులకు ఇది రెండవ ఉదాహరణ. పథక రచనలో వారు అసమాన ప్రతిభావంతులు. కాని, వారికి జ్ఞానమనేది శూన్యం. ఈ తప్పు జపానుకు వినాశకారణమైనది.

కమ్యూనిస్టు నియంతృత్వాలు చేసిన తప్పులను చూడండి. చైనాగాని, రష్యాగాని, జపాను, జర్మనీ చేసినంత తప్పులు చేయలేదు. అలా చేయరనే మనము ఆశిద్దాము. జాతిని నాశనంచేసేటటువంటి తప్పులు యుద్ధసమయంలో మాత్రమే చేయటం జరుగుతుంది. న్యూక్లియర్ యుద్ధంలో దాదాపు మన మందరము నాశనమైపోతాము.

శాంతి సమయంలో కమ్యూనిస్టు నియంతృత్వాం ప్రవర్తనను పరిశీలిద్దాము. రష్యా సాధించినదానినిచూచి, అనేకులు ముఖ్యంగా ఈ ప్రాంతంలో ఆశ్చర్యపోయారు. అందులో ఆశ్చర్యమేమీలేదు. భౌతికశాస్త్రంలోనూ, గణితశాస్త్రంలోనూ రష్యనులు సాధించినది అసాధారణము. అందువల్లనే అంతరిక్షంలోకి వారు ప్రథమంగా మనిషిని పంపగలిగారు. అయితే గడచిన 40 సం. లో వారు తీసికొన్న ఒక పెద్ద నిర్ణయాన్నిగూర్చి ఆలోచించండి. శాంతికాలంలో తీసికొన్న నిర్ణయాంమాటనే నేను చెప్పేది. అది 1930 సం.లో రష్యయను కర్షకులందరిని సమిష్టి వ్యవసాయంలోకి బలవంతంగా దించటం. ఈ నిర్ణయం మూలాన 50 లక్షలమంది కర్షకులు మృత్యువాత పడవలసివచ్చింది. కేవలం తిండిలేక ఇంతమంది చావటం జరిగింది. రష్యను పట్టణాలలో తిండి లభ్యం కాలేదు. 1930 సం. లో నేను రష్యా వెళ్ళినపుడు ఇదంతా కళ్లారా చూచాను. దాని మూలాన్నే రాజకీయంగా కూడా ప్రమాదపరిస్థితి ఏర్పడి, రష్యను 1930 సం. రాలలో కుదించివేసినది. పరిపాలనశాఖలోనూ, సైనికశాఖలోనూ కడిగివేసినట్లు మార్పులు చేశారు.

• బలవంతంగా సమష్టివ్యవసాయం చేయించటం ప్రజాప్రభుత్వాలు చేసిన తప్పులుకన్న పెద్దతప్పు అని నా అభిప్రాయము. కృశ్చేవ్ పర్యవేక్షణక్రింద ప్రకటించబడిన కమ్యూనిస్టు పార్టీ చరిత్రలో కూడా సమష్టివ్యవసాయం ప్రవేశపెట్టడం స్టాలిన్ చేసిన పెద్ద తప్పులలో ఒకటి అని అంగీకరించారు. ప్రజా ప్రభుత్వాలు స్వతహా తెలివిగలవని నేను అనటంలేదు. వారి విధానంలో తప్పులు దిద్దుకొనడానికి వీలు అవకాశమూ ఉన్నవి. ప్రజా బాహు

# మహత్తర పరివర్తనము-VIII

శ్యంలో ఎక్కువ మందికి అయిష్టమైనవి (రష్యాలో ఎక్కువ మంది ప్రజలు సమష్టి వ్యవసాయమునకు విముఖులైనట్లు) ప్రభుత్వం చేసినట్లయితే, తరువాత వచ్చే ఎన్నికలలో ప్రభుత్వం నెగ్గక అధికారంలోంచి దిగవలసి వస్తుంది. ప్రజలు, ప్రభుత్వ ప్రతికూల పక్షానికి వోటు చేస్తుంది. ఒక నిర్ణయంయొక్క దుష్ఫలితాలు ఎక్కువై జాతికి ప్రమాదం తెచ్చిపెట్టేలోపున సరిదిద్దనికోటాకి వీలున్నది. అలా సరిదిద్దుకోటానికి అనువైన ఏర్పాటు ఉండాలి. ప్రజాప్రభుత్వంలోఉండే రహస్యమే అది. అసలు, ప్రజాప్రభుత్వం ఏమి చేస్తుంది అనేదానికంటే, ఏమి చేయనియ్యదు అనేది ముఖ్యం. ఈ అభిప్రాయం అంత ఉత్సాహకరంగా కనుపడకపోవచ్చు. కాని, నేను దానికే అంటిపెట్టుకొని ఉంటాను. నేను ప్రభుత్వంలో పనిచేసి లోతుపాతులను ఎరిగినవాడిగా చెబుతున్నాను. పరిపాలనచేసేవారు చాలా పెద్ద తప్పులు చేయటంకద్దు. అందుకని వారిని సరిదిద్దేటటువంటి ఏర్పాటు ఒకటి అవసరం. అంటే మీరు తప్పుమార్గాన్ని పోతున్నారని ప్రజలు హెచ్చరిక నిచ్చే అవకాశం ఉండాలి. గట్టిగా పట్టుకుని తప్పుదోవనుండి మళ్లించేటట్లు ఉండాలి.

రెండవ నియంతృత్వాన్ని అంటే చైనాను చూడండి. చైనాను గురించి గట్టిగా అప్పుడే ఇదమిత్థమని చెప్పటానికి వీలు లేదు. అయితే వారి వ్యవసాయ విధానం గురించి ఇదివరకే ఛెప్పాను. వారూ రష్యనులమోస్తరే సమష్టి వ్యవసాయాన్ని ప్రవేశపెట్టారు. రష్యనులకంటె ఇంకా తీవ్రమార్గాన్ని అవలంబిస్తున్నారు. చైనావారు ఎదుర్కొంటున్న కష్టాలు వాతావరణంమూలాన కాక, సమష్టివ్యవసాయం బలవంతాన రుద్దటం మూలాననే అని, ముందు ముందు చరిత్ర వ్రాసినపుడు తెలియగలదు. చైనాలోనే కనుక ప్రజాప్రభుత్వం అమలులో ఉండి ఉన్నట్లయితే ఈ విషాద సంఘటన జరిగేదికాదు. తప్పుత్రోవనుండి మళ్లించే యంత్రాంగం పని చేసేది.

నిర్ణయాలను చేయటంలోఉండే భేదమే నియంతృత్వానికి ప్రజా ప్రభుత్వానికి ప్రధానంగా ఉండే భేదమని నా అభిప్రాయము. అయితే ప్రభుత్వములు తప్పులు చేయకుండా చూడటమే ప్రజాప్రభుత్వ లక్షణమని మీరు అనుకోకూడదు. అంతకన్న ఎక్కువ చేయవలసి ఉన్నది. అన్నిటికన్న రెండు ముఖ్యంగా చేయవలసి ఉన్నది. మా ప్రాంతంలో పెట్టుబడి విధానము బాగా పెరిగినది. ప్రజాప్రభుత్వం నిలబడాలంటే, నిరుద్యోగ సమస్య, ఆర్థికమాంద్యం రెంటిని తొలగించాలి. ఈ రెండూ సాధిస్తేనే ప్రజాప్రభుత్వం నిలబడగలదు. పెట్టుబడి విధానాన్ని తరచు పోషలిస్టు గతిని మళ్ళిస్తుంటేనే ఆర్థికంగా నిలకడ అనేది ఏర్పడుతుంది. అది ఎలా చేయగలుగుతామనేది మనం ఇక్కడ వాదించనక్కరలేదు. కార్మికులకు జీవనప్రమాణాన్ని హెచ్చించే పద్ధతిని అవలంబించి ఆర్థికమాంద్యం అనేది ఏర్పడకుండా చూడాలి. ఒక ప్రభుత్వం, నిరుద్యోగ సమస్యను, ఆర్థికమాంద్యాన్ని పెరగనిస్తే ఆ ప్రభుత్వాన్ని వోట్లద్వారా దింపివేయవచ్చు. తరువాత వచ్చిన ప్రభుత్వం కూడా విఫలమైతే వెనుకటి ప్రభుత్వం వస్తుంది. అదీ విఫలమైతే, అపుడు ప్రజా ప్రభుత్వం భగ్నమవుతుంది. ఇలా జరగటం మూలానే జర్మనీలో రెండు ప్రపంచ యుద్ధాలమధ్య కాలంలో ప్రజా ప్రభుత్వం భగ్నమైపోయింది. 1929 సం.లో జర్మనీలో నిరుద్యోగసమస్యచాలాతక్కువలోనే యున్నది. కాని రెండు సం. లు అయ్యేసరికి నిరుద్యోగుల సంఖ్య 70 లక్షలకు పెరిగింది. కార్మికుల జీవన ప్రమాణము సగమునకు తగ్గినది. దానితో జర్మనీలో ప్రజాప్రభుత్వం ప్రాత తేలిపోయింది. ప్రజాప్రభుత్వం నైతికంగా గొప్పదని ప్రజలు దాన్ని బలపరచారు. అది కూడా ఇతర ప్రభుత్వముల మోస్తరే ఫలితాలను చూపించాలి. ఫలితాలంటే తిండి గుడ్డను ఇచ్చే ఫలితాలను చూపించాలి.

వెనుకబడిన ప్రాంతంలో ప్రజాప్రభుత్వం దేశాన్ని, పారిశ్రామికంగాను, ఇతర విధంగాను అభివృద్ధిపరచి, ముందుకు తీసికొనివెళ్ళే సత్తాను ప్రదర్శించాలి. కమ్యూనిస్టు నియంతృత్వాలంత త్వరగాకాకపోయినా, అంత బాగా మా దేశాన్ని బాగు చేయగలమని చూపెట్టాలి. తర్వాత ప్రజాప్రభుత్వం నిలబడగలగడానికి ఇదొక షరతుగా తయారవుతుంది.

నేడు ఒక దేశాన్ని పరిపాలించటానికి రెండు పద్ధతులున్నాయి. ఒకటి తలకాయలను లెక్కపెట్టే మార్గం. రెండోది తలకాయలను చితక్కొట్టేమార్గం. మూడోమార్గం అనేదేలేదు.

ఒక ప్రమాణంలో ఆర్థికసోమత, చదువు, నాగరికత జీవన ప్రమాణముఉంటేగాని—ప్రజాప్రభుత్వంఅనేది ఏ దేశంలోనూ పని చేయదని నేను అప్పుడప్పుడు అనుకునేవాణ్ణి. పడవలకు తొట్టిభాగంపైని ఒక గీత ఉంటుంది. ఆగీతవరకు దిగేవరకు బరువు వేయవచ్చు. తరువాత వేయటం చట్టవిరుద్ధం. అలాగే ప్రతిదేశానికి 'రాజకీయంగా' ఒక గీతవంటిది ఉండాలని అనుకుంటాను. ఒక దేశస్థితిని 'ఈగీతతో' పోలుస్తూ ఉంటాను. నిరక్షరాస్యతతోనూ, బీదరికంతోనూ కృంగిపోయే దేశాలు, ప్రజా ప్రభుత్వ విధానాన్ని నిర్వహించలేవు. వాటిపైనున్న భారము ఈ గీతను క్రుంగతీసేటంత పెద్దభారము.

గీనికి నిదర్శనము యూరపులోనే లభిస్తుంది. ఇటలీలో ఒక విచిత్ర స్థితి ఉన్నది. ఆ దేశ ఉత్తరభాగం పారిశ్రామికంగా బాగా అభివృద్ధిపొంది, అక్కడ జీవనప్రమాణం బాగా పెరిగి ఉన్నది. అక్కడ అంతా బాగా నడచిపోతున్నది. కాని దక్షిణ ఇటలీలో అంతా నాసిగా ఉంటుంది. జీవన ప్రమాణము చాలా తక్కువ. నిరుద్యోగ సమస్య ఎక్కువ. కర్షకులలో నిరక్షరాస్యత బీదరికము హెచ్చు. ఉత్తర ఇటలీలో ప్రజా ప్రభుత్వం బాగా నడుస్తుంది. దక్షిణాన కుంటుతుంది. పైన చెప్పిన గీత ఇటలీ దేశం మధ్యగా వెళ్ళింది.

సాధారణంగా ఒకదేశం మొత్తంమీద చూస్తే, మరీ ఎక్కువ స్థితిలోనో, తక్కువ స్థితిలోనో ఉండటము జరుగుతూ ఉంటుంది. అయితే ఈ విషయంలో ప్రత్యేక నిబంధన అనేదిలేదు. భారతదేశం తగిన స్థితిలో లేదని మీరనుకోవచ్చు. భారతదేశం సంవత్సరానికి వ్యక్తి ఆదాయం 77 డాలర్లు. అక్షరాస్యులు 100 కి 33. ఇలాంటిస్థితిలో ఆదేశం ప్రజా ప్రభుత్వ వ్యవస్థను నిలుపుకొంటూ, అభివృద్ధి చెందటం అసాధ్య విషయమని మీ రనుకోవచ్చు. కాని, ఆ దేశం బహు చక్కగా కార్యక్రమం సాగించుకొంటోంది. దానికి ముఖ్యకారణం ఆ దేశానికున్న నాగరిక సాంప్రదాయమని చెప్పాలి. మామూలుగా అక్కడి స్థితిగతులనుబట్టి

చూస్తే ప్రజా ప్రభుత్వ విధానము నడుస్తుందనే నమ్మకము కుదురదు. కాని, వారు సాధిస్తున్నది అతి ప్రశంసనీయము.

ఒకవిధంగా ఇది నిరుత్సాహాన్ని కలిగించవచ్చు. కాని, ఉన్నది ఉన్నట్లుగా చెప్పటం అవసరం. కొత్తగా ఆసియాలోనూ, ఆఫ్రికాలోనూ స్వతంత్రములైన కొన్ని దేశాలలో ప్రజాప్రభుత్వం విఫలమైనపుడు, ఎందుకు విఫలమైనదీ తెలిసికొనడానికి ఇది తోడ్పడవచ్చు. ఈ ప్రాంతపు కొన్ని దేశాలలో అది భగ్నమైనది. కాని, అది ప్రజా ప్రభుత్వ విధానపు లోటుకాదు. ఆ దేశాలు ఈ ప్రభుత్వ విధానాన్ని జయప్రదంగా నిర్వహించుకొనగలిగే దశకు రాలేదని చెప్పాలి.

అయితే మరేమిటి! ఈ దేశాలలో కమ్యూనిస్టు నియంతృత్వం రావడమో, లేక సైనికనియంతృత్వం రావటమో జరుగుతూన్నది. ఒకరు ఒక మార్గాన్ని, ఇంకొకరు ఇంకోమార్గాన్ని వెళుతున్నారు. సైనిక నియంతృత్వం కొంతకాలం బాగా జరుగవచ్చు. నిజానికి నాసర్ నియంతృత్వం, అంతకుపూర్వం ఈజిప్టులోఉన్న ప్రజాప్రభుత్వంకంటె అనేకవిషయాలలో చాలా మెరుగు. కాని, ఈ సైనిక నియంతృత్వాలలో ఒక లోపమున్నది. వారు తప్పు చేస్తే తప్పు అని చెప్పి, దిద్దించే సాధనంలేదు. అంతేకాదు. ఆ నియంత మరణిస్తే మామూలుగా సాగిపోటానికి ఏర్పాటు లేదు. మొదటి నియంత సాధారణంగా సమర్థుడైన వాడుగా ఉంటాడు. అతని మరణానంతరం అంతర్యుద్ధం రావచ్చు. సైనిక నియంతృత్వం అతి మొరటైన ప్రభుత్వ పద్ధతి. ఒక రాజకీయపక్ష నియంతృత్వంకన్నా కూడా మోటైనది. రాజకీయపక్ష ప్రభుత్వానికి కనీసం సాగిపోయే అవకాశంఉంది. అయితే ఈ లోపాలన్నింటికి క్రమ క్రమంగా ఆర్థిక, సాంస్కృతిక స్థితిని పెంపొందించడంతప్ప వేరే ప్రక్రియలేదు. ఆ స్థితిగతులు బాగుపడినప్పుడే ప్రజలు ప్రజా ప్రభుత్వ విధానాన్ని నడపగలస్థితికి వస్తారు; అభివృద్ధిక్రమంలో ఒక మెట్టు పైకి వెళ్ళగానే ప్రజా ప్రభుత్వ వ్యవస్థలో ప్రయోజనం బహుళమని గ్రహిస్తారు. సరిగ్గా ఈ సమయంలో రష్యా ప్రజా ప్రభుత్వ వ్యవస్థలద్వారా విశేషప్రయోజనాన్ని అభివృద్ధి పొందగల స్థితిలో ఉన్నది. 1920 సంవత్సరాల గడ్డు పరిస్థితుల్లో అయితే ఈ ప్రయోజనం ఉంటుందని చెప్పను. అప్పుడు ప్రజా ప్రభుత్వం పనిచేయగలిగేదికాదు. ఇప్పుడున్న పెరుగుతున్న జీవన ప్రమాణాన్నిబట్టి విద్యావంతులు ఎక్కువమంది ఉండడాన్నిబట్టి, అక్షరాస్యత బాగా పెరగడాన్నిబట్టి, ప్రజాప్రభుత్వ సంస్థల ద్వారా ఇప్పుడు చాల ఎక్కువ ప్రయోజనాలను పొందగలరు. కాలం గడచినకొద్దీ ఈ విషయాన్ని తెలుసుకొనడం మొదలెడతారు. వారు పాశ్చాత్య ప్రజా ప్రభుత్వ వ్యవస్థలనే అనుసరించనక్కరలేదు. వారుగనక మొదట అనుకున్న సోవియెట్ విధానాన్ని పునరుద్ధరిస్తే, ప్రజా ప్రభుత్వం దానిద్వారా చక్కగా పనిచేయగలదని నా వూహ. కావలసినదల్లా ఎన్నికలలో పోటీ చేయగలిగిఉండడం, వాక్స్వాతంత్ర్యం ఉండడం. రాజకీయ ప్రతిపక్షాలకు అవకాశం ఉండటం అతి ముఖ్యం. రష్యాలో ప్రస్తుతవిధానం పోయి అలా మారటానికి చాలాకాలం పడుతుంది. అయితే వారి సాంఘిక అభివృద్ధి గమనాన్నిబట్టి, శీఘ్రకాలంలోనే ప్రజా ప్రభుత్వ వ్యవస్థలు ఏర్పడవలసిఉంటుంది. అలాటి వ్యవస్థలను ఏర్పాటు చేయవచ్చు.

ఈ విషయంలో నా వైఖరి ఒక రాజకీయవాదవైఖరి. పరిస్థితులను ఉన్నవిధంగా చూడటం, ఆచరణ లోపయుతంగా ఉన్నదని గమనించటం అవసరం. అంతేకాని, పుస్తకాలలో చెప్పినట్లు చూడటంకాదు.

సింగపూరు, మలయాలోని పరిస్థితులకు అనుగుణంగా దీన్ని వర్తింపచేయడానికి నేను ప్రయత్నించటము లేదు. కాని, ఒక విషయంమాత్రం నేను చెప్పగలను. ఇక్కడి పరిస్థితులు—జీవన ప్రమాణము, అభివృద్ధి—ప్రజా ప్రభుత్వ వ్యవస్థ చక్కగా పని చేయడానికి అనుకూలంగా ఉన్నాయి.

ఇంతకూ ఈ ఉపన్యాసాలలో నేను చెప్పటానికి ప్రయత్నించింది ఏమిటి? ప్రపంచగతిని గురించి డెమక్రాటిక్ సోషలిస్టు, కమ్యూనిస్టు దృక్పథాలను ఒకదానితోనొకటి పోల్చి చూపటానికి ఎక్కువగా ప్రయత్నించాను. కమ్యూనిస్టులకు ఒక క్రమమైన, తార్కికమైన దృక్పథమైమున్నది. (అదెవరూ కాదనరు) అసలు దాని లోపమే అది. మానవ సంఘాలు ఏవిధంగా వ్యవహరించేది మనకు తెలిసినదానికంటే తమకు ఎక్కువ తెలుసునని వారి నమ్మకము. ఈ నమ్మకమే, అంటే "సిద్ధాంత సౌందర్యానికి లొంగిపోవటమే' నేడు కమ్యూనిస్టులు చేసిన వినాశకరమైన పెద్ద తప్పులకు కారణమైనది. హంగరీలో కార్మికులు రష్యను టాంకులక్రింద పడి నలిగిపోటానికి, చైనాలో ప్రస్తుతమున్న క్షామానికి కారణమైనది.

డెమక్రాటిక్ సోషలిస్టు దృక్పథము ఇంత గడబిడలతో కూడినది కాదు. కమ్యూనిస్టుల మోస్తరు సర్వతోముఖము, సర్వవ్యాప్తము—అయిన సిద్ధాంతము వీరికి లేదు. వీరు మనలను ఎదుర్కొనే అనేక ప్రశ్నలకు సమాధానాలు ఇవ్వలేరు. అందుకని కమ్యూనిజం అంత గొప్పగా కనుపడదు. కమ్యూనిస్టు తత్వానికి హృదయాన్ని అర్పించటం తేలిక. అయితే వాస్తవ విషయానికి డెమక్రాటిక్ దృక్పథం ఎంత ఎక్కువ సన్నిహితంగా ఉన్నదో చూపటానికి ప్రయత్నించాను. తమ సామ్రాజ్యాలు పోయినంత మాత్రాన పూర్వ సామ్రాజ్య దేశాలు బీదరికం అనుభవించకపోగా, ఎక్కువ సంపదను అనుభవిస్తున్నవనే విషయాన్ని ఎవరూ కాదనలేకుండా నిరూపించ ప్రయత్నించాను. సామ్రాజ్యవాద శకం పోయిందని ఋజువు చేశాను. కమ్యూనిస్టు మార్గంలో చైనా సాధించేదానికన్న భారతదేశం ప్రజా ప్రభుత్వ పద్ధతిలో కాస్త ఆలస్యమైనా నిలుకడైన అభివృద్ధిని సాధిస్తోందని చూపెట్టడానికి ప్రయత్నించాను. నియంతృత్వాలకన్న, ప్రజాప్రభుత్వాలు ఎక్కువ సమర్థనీయమైనవని చూపెట్టడానికి ప్రయత్నించాను. అసలు అదే నేను చెప్పదలచినది.

(స మా ప్తం)

## లేఖలు

# ‘అర్థిం జేసి’ - ‘అర్థి చేసి’

**“భారతి” సంపాదకులకు :**

అయ్యా;

శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రిగారిచే పరిష్కృతమైన—కాళహస్తి మాహాత్మ్యములో, పాఠము—“భక్తిదన్ శరణార్థిం జేసి” (4.53) అని యున్నది.

నేను,—‘అర్థింజేసి’ అనుట సరికాదు. ‘అర్థిసేయు’ అని క్రియ, కనుక ‘శరణార్థిచేసి’ అని యుండదగును. అప్పుడు—భక్తిన్—భక్తితో, శరణార్థిచేసి—శరణుకోరి—అని యర్థ మగును—అన్నాను. (1962 జూలై ‘భారతి’).

శ్రీ ఎస్. టి. సి. వి. రామానుజాచార్యులుగారు, ఇట్లు ఆక్షేపము తెలిపినారు:

“శరణార్థింజేసి—యనుచోట పిచ్చయ్యశాస్త్రిగారు ‘శరణార్థిచేసి’ యని సవరించినారు. ఈ సవరణ యుక్తముగం దోచుట లేదు. ‘శరణ’ యను పదమే యుండదు. ‘అర్థిచేసి’ యనునది యసమాపక క్రియగా భావించినను ‘శరణ’ పదముతో సమసింపదు. లట్లా సమసింపంజేయుట తప్పు. శరణ పదము మిత్రాదులలో పఠితము—18. బా. వ్యా. తత్సమము. దీని ప్రకారము ‘శరణము’—‘శరణుడు’ అను రూపములు మాత్రమే యుండును. శరణుంజొచ్చి, శరణు వేడి యనునట్టి ప్రయోగములు సుప్రసిద్ధములు. శాస్త్రిగారి సవరణ ప్రకారమైనచో ‘శరణ మర్థిచేసి’—‘శరణు నర్థిచేసి’ యనునట్టి రూపము లుండవలె గాని ‘శరణార్థిచేసి’ యని యుండరాదు. అందువలన ‘శరణార్థిం జేసి’ యను పాఠమే యుక్తము. ‘శరణు గోరిన వానినిగం జేసి’ యను నర్థమున్నా సరిపోవును. —శ్రీ శాస్త్రిగారు వేరుగం దలంపక నా సందియములు బోగొట్టి, యథార్థ్యము (?) నిర్ణయింప వలసినదిగా వేడుచున్నాను.” (ఆగస్టు ‘భారతి’).

శ్రీ ఆచార్యులుగారు అనవసరమైన శ్రమ కలిగించినందులకు ఖేదపడుచూ, విధిలేక, సమాధానము వ్రాస్తున్నాను.

అసలు పద్య మిదీ.—

“అని యక్క...ం జేరంగం బిలిచి, యేలా తల్లితోం
జోరంగా ?
బనిలేదా ? తిరు కాళహస్తిపతిం జూప న్నాది భారంబు, మా
వెనువెంటం జనుదెంపు, నమ్ముండు, నిశావేళం బ్రయా
ణంబు, రం
డన, భక్తిన్ శరణార్థింజేసి, తమ సోహంబెల్లం జెల్లిం
చుచున్.

వేశ్యలు కాళహస్తికి పోదలచుకొన్నారు. తల్లి వద్దని అటకాయించినది. పెద్ద జగడము జరిగినది. ఆ పిల్లలు తమ పట్టు వదలలేదు. ఒంటిగా పోలేక, తో డెవరైనా దొరికితే బాగుండు ననుకొన్నారు. అది రాత్రివేళ. ఇంటి వాకిట, జంగము వేషాలతో పొంచియున్న దొంగలు, ఇంటిలో జరిగిన జగడమును బట్టి సంగతి తెలిసికొని, ఆ కన్యలను పిల్చి,—మీకు కాళహస్తీశ్వరుని చూపించే భారము మాది, మా వెంట రండి—అన్నారు. వాండ్లు జంగములుగా నన్నందున, ఆ కన్యలు జంగమారాధన తత్పరలు గనుక, భక్తితో—ఆ దొంగలకు—శరణార్థిచేసి, వాండ్లవెంట కాళహస్తికి ప్రయాణమైనారు. ఇదీ సందర్భము.

ఆచార్యులుగారు,—‘శరణార్థిం జేసి=శరణు గోరిన వానినిగాం జేసి’ అని యర్థము చెప్పి, ఈ యర్థము సరిపోవునన్నారు.

అది యెట్లు సరిపోవునో నాకు బోధపడలేదు. శరణు గోరిన వానిగా చేసిన వా రెవరు ? వేశ్యలా ? ఎవరిని చేసినారు? జంగాలనా ! ఈ యర్థములో ఔచిత్యమున్నదా ?

జంగాల యనుగ్రహము సంపాదించుకొని, తత్సాహాయ్యమున తమ సంకల్పము నెరవేర్చుకొనవలసిన వాండ్లు వేశ్యలు. కార్యసిద్ధి కొరకు వేశ్యలు జంగాలను శరణార్థి చేయవలెనా ? జంగాలు తమ్ము శరణు గోరునట్లు చేసికొనవలెనా ? అసలు శరణు కోరవలసిన జరూరు జంగాల కేమున్నది ?

అది యట్లుండనిండు : ఆ వేశ్యలు జంగమ భక్తురాండ్రు. జంగములు వాండ్లకు ఆరాధనీయులు, ఈశ్వర స్వరూపులు. అట్టి జంగములను, తమ్ము శరణుగోరు వారినిగా ఆ వేశ్యలు చేసుకొందురా ? ఆ జంగాలు ‘శరణు’ అందురా ?

మరియు, ఎవడైనను, భక్తితో—శరణు—తనకై తాను కోరును గాని, ‘శరణు గోరినవానినిగా’, ఒకడు ఇంకొకనిని చేయుట లోకములో లేదు. వైష్ణవులలో నైనను అట్టి సంప్రదాయ మున్నట్లు కనబడదు.

ఆ జంగాలు పలువురు గనుక ‘శరణుగోరిన వానినిగం జేసి’ అని ఏకవచనములో చెప్పుటయు సరిపడదు.

ఈ కారణములచేత, ఆచార్యులవారు చెప్పిన అర్థము పద్యములో సరిపోవుటలేదు. వారు పద్యార్థము పరిశీలింపకయే ఆక్షేపము ప్రకటించినారు. ఇది వారి తొందరపాటును తెలుపుచున్నది.

ఇక వ్యాకరణ విషయము—

‘శరణార్థి’ సిద్ధ సమాసము. శరణ అర్థి—శర

ణార్థి—సవర్ణదీర్ఘసంధి. సమాసములోని 'శరణ' శబ్దము సంస్కృతము. తెనుగు కాదు.

కాబట్టి, 'శరణ' యను పదమే యుండ దనుటయు, శరణ పదము మిశ్రాదులలో పఠిత మనుటయు, బాలవ్యాకరణ సూత్రము నేకరువు పెట్టుటయు కేవల మసంగతము.

"అర్థిచేసి—యనునది యసమాపక క్రియగా భావించి నను, శరణ పదముతో సమసింపదు. అట్లు సమసింపఁ జేయుట తప్పు. శరణ మర్థిచేసి, శరణు నర్థిచేసి—అనునట్టి రూపము లుండునే గాని, 'శరణార్థి చేసి' యని యుండ రాదు." అన్నారు.

ఇది క్రియాస్వరూపము తెలియక వ్రాసిన వ్రాత. "శరణార్థిచేసి—యని యుండరా" దని శాసించుట అధికార మునకు మించిన పని. దాని తత్త్వ మేమనగా :

'అర్థిచేసి' యను 'అసమాపక క్రియ' "శరణ' కు అతికింపబడలేదు. 'శరణార్థి' అను విశేష్యమునకు 'చేయు' అను క్రియ అనుప్రయుక్తమై, 'శరణార్థి చేయు' అయినది. దీనిని శబ్దపల్లవ ధాతు వంటారు. 'శరణుకోరు' అని దాని యర్థము.

శ. ప. ధాతువుల తీరు తెన్ను లెట్టివో, కవులెన్నెట్లు వాడియున్నారో వివరింపవలెనంటే చాలా వ్రాయవలసి వస్తుంది. అందువలన నాకు పని భంగమే గాని, అది ఆచార్యులవారికి సులభముగా అర్థమయ్యేది కాదు. (ఇది వారి విమర్శను బట్టి నా కేర్పడిన భావము.) కాకపోయినను, లఘువుగా నైనను వివరింపవలసినదే గాని, మహానుభావుడు ధూర్జటి నా కా కొంచెము శ్రమయు లేకుండా చేసినాడు. ఎట్లంటారా?

ఈ క్రియనే 'శరణార్థి యొనర్చి' అనియు వాడినాడు.

"కపట కుమార జంగమ వికారమునం జనుదెంచు శైలజా
ధిపుఁ గని భక్తిపూర్వకమతిన్ శరణార్థి యొనర్చి"
( 1—34 )

శ్రీ పాపయ్యశాస్త్రిగారే,— "శరణార్థి యొనర్చి= శరణువేడి" అని టీక వ్రాసియున్నారు. ఇక నా వివరణ మెందుకు ?

'శరణార్థి యొనర్చి' అన్నను, 'శరణార్థి చేసి' అన్నను అర్థ మొక్కటే. కాబట్టి, ధూర్జటి ప్రయోగమునూ, శ్రీ శాస్త్రిగారి టీకనూ మననము చేసికొని, నా సవరణ తప్పో, తమ ఆక్షేపము తప్పో శ్రీ ఆచార్యులవారే తేల్చుకొందురుగాక. నేను చెప్పగలిగినది యింకేమీ లేదు. నా మాటయందు నమ్మకము లేకపోతే, వారు శ్రీ పాపయ్య శాస్త్రిగారినే అడిగి తేల్చుకొనవచ్చును. అది సర్వోత్తమము.

ఆచార్యులవారు "శరణుఁజొచ్చి" అను ప్రయోగము సుప్రసిద్ధ మన్నారు. అది సుప్రసిద్ధము కాదు. అప్రసిద్ధము. అనగా తప్పున్నమాట.

శరణుచొచ్చు—అని క్రియ. ఇదియును శబ్ద పల్లవ క్రియయే.

"సురలుఁ గుమారకున్ శరణు సొచ్చిరి" (నన్నె. కు. 12—128)

ఇత్యాదిగా ప్రయోగములు. ప్రయోగముల మాట యెందుకు. శ. ర. లో, శరణుచొచ్చు—శరణాగతిని పొందు— "వ. త త్కులగురుండైన వసిష్ఠు శరణుచొచ్చిన." — "వ. ప్రాణ భయార్తులై శరణు చొచ్చిన వారిని రక్షించుట కంటెఁ బరమ ధర్మంబు లేదు." (వి. పు. 5. ఆ) అని చెప్పబడి యున్నది. సూ. ని. యును 'శరణుచొచ్చు' అనియే చెప్పినది. (చూ. 'చొచ్చు' క్రింద.)

ఇంత యెందుకు, శ. ప. క్రియలలో, అరసున్నలు—ద్రుత కార్యములు ఉండవు. కనుక 'శరణుఁజొచ్చి' అనుట తప్పు. అట్లే, 'శరణార్థిఁ జేసి' అనుటయును తప్పే.

కాబట్టి "శరణార్థిఁ జేసి—యను పాఠమే యుక్తము" అనుట అయుక్తము.

శ్రీ ఆచార్యులవారు, 'పద శ్రమ'—'పనిలేదా ?' అని మరిరెండు పాఠములకు నేను సూచించిన సవరణలను గూర్చియు ఆక్షేపములు తెలిపియున్నారు. ఆ యాక్షేపములకు సమాధానములు చెప్పవలసిన అవసరము గాని, నా యభిప్రాయములను మార్చుకొనవలసిన అవసరముగాని నాకు కనబడలేదు. అవి పండితులు విచారించి తీర్మానించవలసిన విషయములు. కనుక వారికే వదలివేయుచున్నాను.

నేను చేసిన సవరణలలో పొరపాటు లుండవని గాని, విమర్శింప వలదని గాని నే ననను. తప్పొప్పులను తెలిసికొనక, అనవసరాక్షేపములతో నాకు పని కల్పింపవలదని మాత్రము శ్రీ రామానుజాచార్యులవారికి వినయముతో మనవిచేసుకొను చున్నాను.

—దీపాల పిచ్చయ్యశాస్త్రి.

# రాయచోటి ప్రాంత దేవాలయాలు

శ్రీయుతులు శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారును, గజపతి రాయవర్మగారును ఏకవీర, మాహురమ్మ, కాకతమ్మ శిలా ప్రతిమల రూప లక్షణములపై గావించిన చర్చలు కుతూహలము గలిగింపగా నొక కాలమున వీరశైవ మతమునకు ఆటపట్టయిన ఈ ప్రాంతమున గల పెక్కు శక్తిదేవాలయము లందు గూడ ఆ లక్షణములు గల మూర్తులు గనిపించునను నాసక్తితో నటనట తిరిగితిని. అందు నేను కనుగొన్న కొన్ని విశేషముల నిందు పొందుపరచుచున్నాను.

## 1. రాచవీడు

కడప మండలమున నేడు రాయచోటి అనబడు తాలూకాకు కేంద్రమైన రాయచోటి "రాచవీడు" అను పద మానోట నోట బడి నలిగి యేర్పడిన వికృతి యనుకొందును. ఇచటి వీరభద్రదేవాలయము వీరశైవ మతస్థులకు ప్రసిద్ధ

యాత్రాస్థలము. ఏబదిరెండడుగుల ఏకాండపు రాతిదీప మస్తంభుతో మూడువైపుల గాలిగోపురములతో నొప్పు వీరభద్రదేవాలయము చారిత్రకముగ గూడ ఘనమైనదియే. వీరశైవమత మీనాడీ ప్రాంతమున నామమాత్రావశిష్టముగ నున్నను మహమ్మదీయుల యాక్రమణకు పూర్వ మీ ప్రాంతమున జనసంఖ్యలో వీరశైవులదే ప్రధానస్థానమని యొప్పుకోదగి యున్నది. వీరభద్రస్వామి భక్తవర్గములో సుదూర ప్రాంత మున నున్న కన్నడసీమనుండియు, మహారాష్ట్ర దేశము నుండియు నేటేట నూర్లకొలదిగ వచ్చి మ్రొక్కుబడులు చెల్లించిపోవుట యాశ్చర్యము గొల్పును. ఈ యాలయమున ముఖమండపము పైకప్పంతయు లేపాక్షిలో వలె గిలాబుచేసి వర్ణచిత్రములు వ్రాయించియుండినట్లు తెలియుచున్నది. అది యంతయు పాలకవర్గ మనాలోచితముగ నేటేట పూయింపగా నేర్పడిన $1\frac{1}{2}''$, $2''$ అంగుళముల మందపు సున్నపు పొరలలో నణగిపోయినది.

శ్రీ వీరభద్రస్వామి విగ్రహమునకు సమీపమున గర్భ గృహములో నొక స్త్రీమూర్తి కలదు. త్రిశూల, డమరుకము లతో, ఖడ్గ రక్తపాత్రలతో నొప్పు నాలుగు చేతులతో భయంకరముగ నున్న ఈ మూర్తి నిచటివారు 'ఎల్లమ్మ'' అనెదరు. వీరభద్రుని యుత్సవములో ముందుగ నీమెను పూజించి తర్వాత యథావిధిగా వీరభద్రునకు ఉత్సవము చేయుట ఇచటి యాచారమట. ఈ ఎల్లమ్మ విగ్రహమున వరాహాది చిత్రములు పీఠమున లేవు.

## 2. అబ్బవరము

రాయచోటికి రెండుమైళ్లదూరమున "అబ్బ వరము" అను గ్రామము కలదు. ఇచట మిక్కిలి ప్రాచీ నములైన రెండు దేవాలయములు గలవు. వానిలో ప్రధాన మైనది శివాలయము ప్రాకార గోపురములు పూర్తిగా శిథిల ములు. ముఖమండపమున వరుసదీర్చి పెక్కు శిలా ప్రతిమలు అమర్చి పెట్టబడి యున్నవి. ఈ అద్భుతదృశ్య మీ ప్రాంతమున పెక్కు దేవాలయములందు బొమ్మల కొలువు వలె మనోహర ముగ నుండును. ఈ విగ్రహముల వరుసలో నొక స్త్రీమూర్తి అచ్చము శ్రీ గోపాలకృష్ణమూర్తిగారు పేర్కొనిన లక్షణ ములతో త్రిశూల డమరుక ఖడ్గ రక్తపాత్రలు గల చతు ర్భుజములతో, పాదపీఠమున వరాహప్రతిమతో కనిపించి ఆశ్చర్యముతోడి యానందము కలిగించినది. విచారింపగా నీమెయు "ఎల్లమ్మ" యే యని తెలిసింది.

ఈ ఆలయప్రాచీనతను గమనించు కుతూహలముతో ప్రదక్షిణించి రాగా దక్షిణమువైపున కూలిపోవుచున్న గోపు రము దాపున నిలువెత్తు నల్లరాతిపై గల శిలాశాసనము కుతూహలము గొలిపినది. శాసనశిరోభాగముపై సూర్య చంద్రులు—నడుమ శివలింగము, రెండవ వరుసలో నొక మునియు జ్యోతులును గలవు. శాసనములోని లిపి విస్పష్ట మైన తెలుగుతో సులభముగ చదువదగియున్నది.

శాసన మిట్లున్నది.

శ్రీ స్వస్తి సమస్త ప్రశస్తి సహితం శ్రీమత్ విక్రమ గాలమున శక వరుషంబులు "1174" అగు నేంటి విజయ సంవత్సరము వైశాఖ శుద్ధ 7 లు ఆదివారమునాడు స్వస్తి సమధిగత పూబ మహాపబ్బ మహా మండలేశ్వరం, కలుకడ మహా పుర వరాధీశ్వరం, అనేక సమర సంఘట్ట నోపలబ్ధమాన విజయలక్ష్మి నమాలింగిత విశాలవక్షస్థలం, క్షత్రియ పవిత్రం, భువన త్రినేత్రం, పాండ్య గజకేసరిం, ఆవుదుంబ వం (శా) భరణం, వైరి సంహరణం, సిద్ధవట్ట దేవర శ్రీ పాద పద్మారాధకం, పరబల సాధకం, శ్రీమత్త్రైలోక్య మల్ల భుజ వీర నారాయణ నిస్సంభద్రరాయ చక్రవర్తి కాంబదేవ మహా రాజులు మరుజవాడి యాండపురము రాజధాని గావించి యరువ లును సేరి సర్వదా వినోదుండై రాజ్యంబు చేయుచు సకల ధర్మములును స్థిరదమ్ముద్రలు గావించి యబ్బవరమున నబ్బే శ్వర దేవరకు అంగభోగములకు రంగభోగములకు గంగ సము ద్రము ధారాపూర్వకము చేసి యిచ్చిన వృత్తి,

శ్లో. స్వదత్తం పరదత్తంవా యో హరేతు వసుంధరాం
షష్టిర్వర్ష సహస్రాణి విష్ఠాయాం జాయతే క్రిమిః.

పద్మమ్మనకు వక్రమైనను పసుల బ్రహ్మల వధియిం చినవారు—మంగళం మహా శ్రీ శ్రీ॥ "కదమ్మ హేసెడువాడు బిలగుండు—తర్వాతి భాగము తమిళములో కలదు. అదియు భూమిలో బూడిపోయి ఉన్నది. శాసనములో క్రీగతలు గల పదములకు అర్థము కుదరలేదు. అబ్బ వరము అభయ వరము నకు వికృతియేమో. శాసనకాలమునాడే అబ్బవర మైనది. ఈ లిపినిబోలిన లిపిలో నిచటి లక్ష్మీనారాయణ దేవా లయము ప్రక్క నొక చౌకపు స్తంభము కలదు. ఇచటి పొలములలో త్రవ్వకములందు ఇంటి పునాదు లటనట కనిపిం చుట చూడ నీ ప్రాంతమున పూర్వ మొక పెద్ద గ్రామ ముండి కాలగర్భమున గలసిపోయినట్లున్నది—

శ్రీ కే. ఎం. మున్షీగారి యాధ్వర్యమున వెలువడిన చరి త్రలో ఔదుంబులను గూర్చిన ప్రశంస కలదు. వారి రాజ్య విస్తారము, సరిహద్దులు, వారి రాజధానియు నాకు బొత్తిగా తెలియవు. అబ్బవరము శాసనమున "అవుదుంబ వంశాభరణ కాంబదేవ" యని యుండుటచే చరిత్రకారుల కిది యుప యోగ పడగలదేమో యని శాసనము నుల్లేఖించితిని. ఔదుంబ వంశపు రాజులలో ప్రథముడు "ఇరుగప" యని ఆ చరిత్ర యందు కలదు. వారి రాజ్యము రేనాటి చోళుల రాజ్యమునకు*

సమీపమని యనుకొందును. ఇప్పటి కడపమండలమునందలి రాయచోటి, పులివెందుల తాలూకాలును, చిత్తూరు మండల మునకు జెందిన మదనపల్లె వాయిల్పాడు తాలూకాలును అనంతపురము జిల్లాలోని కదిరితాలూకాయు నౌదుంబుల సాంరాజ్య మగునేమో ! ఔదుంబులను గూర్చి సవిస్తరముగ నెవరేని పత్రికాముఖమున వెల్లడి చేసినచో జదువవలయు నను కుతూహలము నాకు మిక్కిలి కలదు.

రాయచోటితాలూకాలో నేటేట జాతరలు జరి పించుకొనుచు బహు జనాకర్షకములుగ నున్న ముఖ్య దేవాలయ ములలో గంగమ్మ—కేశాపురము, మల్లూరు, అనంతపురము అను గ్రామములందును, వంగిమళ్ల రాచపల్లెయందు ఆరె మమ్మయు, పాళెం పాలమున వీరనాగమ్మయు, హసనా పురమున ఇరుగమ్మయు ముఖ్యమైనవి. ఇరుగులమ్మ, దేవాలయము చాల ప్రాచీనమైనదని దాని నిర్మాణము చాటుచున్నది. ఈ దేవతను గొల్చి తదనుగ్రహపాత్రులై ఇరుగులమ్మ ఇరుగమ్మ, ఇరుగులయ్య యను పేర్లు పెట్టుకొన్నవారీ ప్రాంతమున నెందఱో కలరు. ఈ చుట్టుప్రక్కల 108 శివలింగములు కలవనిరి, గాని యవి రూపాంతరములు పొంది స్థలాంతరములు చేరినవి. ఇపు డిచట నొక శివలింగము మాత్రము నిత్యపూజకు నోచుకొన్నది. శివలింగము భక్తుల మొగములు ప్రతిఫలించునంత నున్నిగ్గ ముగ ప్రకాశించుచున్నది. జలదారికి గల రెండు శుకనాసలపై తమిళమున నేదియో రెండు పంక్తులలో వ్రాసి యున్నది. ఇరుగులమ్మ నేడు దుర్మార్గులచేతిలో మూడు ముక్క లైనది. దానవయ్య యను భటుని నిలువెత్తు విగ్రహము తునాతునక లైనది. ఆలయపు గోడలు బీటలువారినవి. ఇంత శిథిలావస్థలో నున్న ఈ ఆలయపు గోడలపై నెన్నడో వ్రాసిన రంగుల చిత్రములు మాత్రము శీతవాత వర్షములకు చెక్కు చెదరక చూపఱ నాకర్షించుచు నిలిచియున్నది. ఈ ప్రాంత మున పూర్వ మెన్నడో యొకనగర మున్నట్లు ఈ దేవా లయము లనుమానము కలిగించుచున్నవి. హసనాపురమున సంపూర్ణముగ నాలయప్రాకారగోపురములు శిథిలము లైనను నింతకాలముగ నున్న మఱులున విడిచిపోలేక కూలిపడ నున్న గర్భాలయములలో నిలిచి యున్నట్లు చెన్నకేశవుడు, వెంకటేశ్వరుడు, లక్ష్మి, ఆంజనేయులు నక్కియున్నారు. ఈ ఇరుగులమ్మ ఔదుంబుల ఇలవేలుపేమో యని నా యనుమా నము. ఔదుంబ ప్రథమ మహారాజు "ఇరుగప" గదా ! నా యూహయే నిజమగు పక్షమున నీ ప్రాంతమున నెందో ఔదుంబుల రాజధాని యుండి, శిథిలమై భూగర్భమున నణగి పోయినదేమో ! ఇది పరిశోధనార్హ మనిపించుచున్నది.

అనంతపురగ్రామము రాయచోటికి 6, 7 మైళ్లలో గలదు. ఇచటి జాతరకు నించుమించు 4 × 5 వేల మంది చేరు చుందురు. గాని ఇచటి యాలయమున పేర్కొనదగిన విశేషము లేవియు లేవు. అనంతపురమునకు పోవు దారిలో రాయ చోటికి రెండుమైళ్ల దూరమున నేటియొడ్డున నేనొక యపూర్వ శిలాశాసనము గంటిని. ఇది యొక విశాలమైన గచ్చురాయి—బండ పొడవు 4 గ, వెడల్పు 3 గజములును గలదు. ఇందలి శాసనము 15 పంక్తులలో స్పష్టముగ జదువదగి యున్నది. కాని యీ బండ 4 ముక్కలుగ పగిలిపోయి యున్నది. నలువురు సాయపడిన గాని బండను చదరమునకు దెచ్చి జోడించి చూచుట సాధ్యముగాదు. శాసనము నందలి లిపి వేంగీ లిపి కన్నను ప్రాచీన మగుటచే నావలన చదువ నైనదిగాదు. ఈ శాసనప్రస్తావన జిల్లా గజటీరునందు చేయబడలేదు. ఎవరేని పరిశోధకులు ఇందలి విషయములను లోకమున కంద జేయగలరేమో యను తలంపుతో నందలి యొక పంక్తి నిట పొందుపఱచుచున్నాను.

ఇట్టి వ్రాత గల మఱికొన్ని బండలు, బొమ్మలు చెక్కిన కొన్ని బండలు, 100 గజముల చదరము మేరలో నటనట భూమిలో బూడిపోయి తలలు మాత్రము కని పించునవి కలవు. ఇచట 3, 4 శాసనములు లభించునని యూహించుచున్నాను. ద్రవ్యసాధ్యమగు నీ పనికి పురాతత్వ శాఖ పూనుకొనదగును.

రాయచోటితాలూకా విష్ణ్వాలయముల కన్నను శివా లయముల కెక్కువ నెలవైనది. కాని ఇంచుమించుగ నన్ని దేవాలయములు జాలవఱకు శిథిలావస్థలో నున్నవి. ఎచట చూచినను కూలిపోవుచున్న గర్భగృహములు, బీటలువాఱిన గోడలు, నేలమట్టములైన ప్రాకారములు కలిగి ఈ దేవా లయములు హృదయవిదారకముగ గానిపించుచున్నవి. అర క్షితములై పాడువడిన ఈ యాలయములందు ధనము కల దను పేరాసతో విగ్రహములను పెకలించియు జటీబంధన పీఠ ములను బగులగొట్టియు, గర్భాలయ మధ్యభాగములను గుంతలు ద్రవ్వియు విధ్వంసము చేసివేసినారు. ముద్దుల మూటగట్టు నీ విగ్రహములు విదేశములలో పెద్ద వెలల కమ్ముడు పోవు నను దురాశతో దుర్మార్గు లొక ముఠాగా చేరి ఈ విగ్రహములను దూరప్రాంతములకు తరలించుకొని పోవు చున్నారు. అట్లెన్ని యపూర్వశిల్పకళాఖండములైన శిలా ప్రతిమలు విదేశములలో విచిత్రవస్తుప్రదర్శనశాలల నలంకరించినవో మఱియెన్ని యలంకరింప నున్నవో భగవంతునకే యెఱుక. అవకాశము లభించుచో మరికొన్ని విశేషము లింకొక మారు విన్నవించుకొందును.

—వి. వి. శేషాచార్యులు.

# శబ్దార్థ కల్పతరువు

"భారతి" సంపాదకులకు :

అయ్యా!

శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యవర్య పూజ్యపాద సర్వశ్రీ విభూషిత సుఖానందనాథగారిచే విరచితమైన శబ్దార్థ చింతామణి, తారానాథ వాచస్పత్యము మున్నగు నిఘంటువులను వీక్షింపకయే లిఖింపబడి, జూన్ 1962 భారతి—సాహిత్య మాసపత్రికయందు ముద్రింపబడిన బ్ర. శ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారి సమీక్ష వీక్షింపబడినది. అందు కొన్ని పుటలయందు గ్రంథ విషయము చక్కగ ప్రశంసింపబడియున్నది. సంతోషము.

శ్రీ శాస్త్రిగారు 'నేను ప్రమాదములని చూపునవి భ్రాంతి మూలకములు కావచ్చు' నని వ్రాసియున్నారు. అది సత్యమే. ఎట్లన. 1. 'ఆన్వీక్షికీ' పదము 130 వ పుటయందు చూడవచ్చును. 2. 'ఆశ్రపణ:' పదము క్రింద—శ్రయణపద మీయబడినది అని వ్రాసినారు.—యణమ్ అని ఈయబడినదే కాని శ్రయణ మని ఈయబడలేదు. కావలసిన మఱియొక పర్యాయము 140 వ పృష్ఠమున స్నేహార్ద్ర హృదయముతో నవలోకింపవచ్చును. శుతశ్రేణీ మొదలగు పదములను గురించియు శ్రీ శాస్త్రిగారు చాల పరిశ్రమించి లిఖించినారు. కారణము వారు పైన పేర్కొన్నదే కావచ్చును.

పరిష్కర్తల నియమము గీత (—) ఉన్నచోట పై పద మందలి త్యక్తాక్షరముల గ్రహణమే కాని పద గ్రహణముకాదు.

'చక్రగణ' పదమే నిఘంటువులోనిదో ?

తురీ యాశ్రమీయులు రచించిన శబ్దార్థచింతామణి యందలి తురీయ భాగమున 632 వ పేజీలో "శుతశ్రేణీ, స్త్రీ, ద్రవన్త్యామ్" అని కలదు. చూడదగును.

'సంజ్ఞప్తి' పదమునకు మరణము మరణమని రెండు పర్యాయములు వ్రాసినారే మారణము కదా! 'సంజ్ఞ' పదమే వెదకి చూడగా అని ముద్రింపబడినది. అది చతురక్షరము నాంతము నెట్లగును ? అచ్చు పొరబా ట్లనుకొనవచ్చును. 'సంజ్ఞపనమ్' చూడు మనుటకు కారణము పర్యాయ పదము తెలిసికొనుటయే.

'గమ్యుఁడు' అను పదము శబ్దార్థచంద్రికయందును కలదు. తద్వత్ 'గమ్యా' అని అనుకొనరాదా ? అస్తు. శబ్దార్థ చింతామణి ప్రథమ భాగము 785 పృష్ఠమున "గమ్యా—స్త్రీ—పత్న్యామ్. ఖేదాత్ స్త్రీషు ప్రవృత్తి: భవతి. సమానశ్చ ఖేద విభాగో గమ్యాయా మగమ్యాయాంచ. తత్ర నియమ: క్రియతే ఇయం గమ్యేతి భాష్యమ్. ఖేద యతీతి ఖేదో రోగ:. ఇంద్రియ నియమా సామర్థ్యంవా ఖేద ఇతి కైయట:. ఏవంచాగమ్యా నిషేధస్యేతరా భ్యనుజ్ఞా ఫలకతయా స్వదార గమనే దోషాభావ:" అని స్పష్టముగా దృగ్గోచర మగు చున్నది. సంశయాత్ము లెల్లరు వీక్షింపవచ్చును.

శబ్దార్థచంద్రిక యందు 'ఫేల' యను పదమునకు ప్రకాశమను అర్థము మృగ్యము. అంతమాత్రాన ఆ నిఘంటు వప్రమాణభూత మందురా ? మఱియు 'భల్లము' అను దానికి బల్లె మనుటకు బదులు బెల్లమని మూత్నముద్రమున నేత్రగోచర మయ్యెను. అచ్చు పొరబా టనుకొంటిని. ఆ ప్రమాణ మనుకొనలేదు.

వ్యుత్పత్తులు, సంబంధములు చూపించుటను పరిష్కర్తలు పాటించినవారు కారు. భూమికాదులను సమగ్రముగ సమీక్షించియున్న యిన్ని సందేహములు కలిగెడివి కావేమో! పరిష్కర్తలు చతుర్వింశతి నిఘంటువులను ముందిడుకొని పరిష్కరించినారే కాని స్వకపోల కల్పితము ఇందావంతయులేదు.

ఆత్మసాత్, ఆ నృశంసి, ఇదంతాది పదములు వాచస్పత్యాది ప్రాచీన నిఘంటువులలోనివే. కొన్ని పదములకు విశేషణార్థములు అనవసరములని గ్రంథ విస్తరభియా బుద్ధిపూర్వకముగా వదలివేసినారు.

గోరసమునకు ధూపద్రవ్య విశేష మను అర్థము అమర కోశమున లేనందున విడువబడినది.

చమరపుచ్ఛ శబ్దమునకు చామరమని యర్థ మనియు, కోకడశబ్దమునకు చమరీ మృగ మనియు అర్థభేద ముండ 'కోకడము' చూ. అని యెట్లు వ్రాయనగును ? కొంచె మోపికతో యోచింపవలసినది.

'తామ్రశిఖీ' పదము చింతామణి 1074 వ పుట లోనిది. అర్వాచీనముగ సృష్టింపబడినది కాదు.

నక్షత్రముల నామములు పెక్కు లున్నచోట ఒక్క చిహ్న మనావశ్యకమని విరసింపబడినది.

'చతుర్ముఖ' శబ్దమునకు తాళప్రాణ కళా భేదమను అర్థము ఇతర నిఘంటువులయందు లేనందున విడువబడినది.

"నిరర్థ:, నిరస్థి" రెండును విశేషణము లైనపుడు రెండును పొరబా టెట్లగునో స్వవచో వ్యాఘాతము. నిరర్థ: ప్రక్కన త్రి యనుటకు పుం అని పడినంత మాత్రాన నిఘంటు ప్రామాణ్యమునకు భంగము కలుగబోదు.

అల్పాక్షర పదముల కర్థము వ్రాసి, అధికాక్షర పదముల వద్ద ఆ యల్పాక్షరపదమును చూపి చూ. అని వ్రాయుట పరిష్కర్తల నియమము. గ్రంథము పెద్దది. కాకుండుటకును, ఆ పదముకూడ పర్యాయపదమే యని యెఱుంగుటకును అట్లు చేయబడినది.

గాంధి మున్నగు దేశనాయకాదుల పదములను పరిష్కర్తలే స్వయముగ చేర్చినట్లు చేసిన మనవిని భూమిక (51 వ పుట) లో క్షకార విషయము క్రింద రెండవ పేరాలో గమనింపదగును.

అర్థముల ప్రక్కన నిఘంటునామములు గ్రహింపబడకుండుటకును, గ్రంథము చాల పెద్దది యగు ననుటయే హేతువు.

శ్రీ శాస్త్రిగారు సూచించిన కొన్ని మంచి సూచనలకు హృదయపూర్వకాభి వందనములు.

—నారాయణమూర్తి

# గ్రంథ విమర్శనము

## తెలుగు ఛందోవికాసము

(రచన—కోవెల సంపత్కుమారాచార్య, ప్రాప్తిస్థానము—కులపతి సమితి, వరంగల్లు, వెల—పది రూపాయలు. పుటలు 18+330).

క్రీ. శ. 1022 వ సంవత్సరమునుండి 1063 వ సంవత్సరము పర్యంతము రాజమహేంద్రవరము రాజధానీ పత్తనముగా వేంగీ దేశము నేలిన చాళుక్య కులతిలకుఁడగు రాజరాజనరేంద్రుని యనుమతమున స్వస్థాన వేష భాషాభిమానులును, రస ప్రలుబ్ధధీ కుల్యునగుటచే నన్యభాషా కావ్యములను విడిచి వైకృత భాషా కావ్యములను బహూమానించుచున్న విద్వజ్జనుల యనుగ్రహమున ('స్వస్థాన వేష భాషాభిమతా స్సంతో రస ప్రలుబ్ధధియః, లోకే బహు మన్యన్తే వైకృత కావ్యాని చా న్యదపహాయ) నన్నయ్యగారు సంస్కృత కర్ణాట ప్రాకృత పైశాచి కాంధ్రభాషలలో సుకవిత్వ విభవముచేత కవిరాజశేఖరునిగా బ్రథితుడైన నారాయణభట్టు తోడయి నిర్వహింపగా (యః సంస్కృత కర్ణాట ప్రాకృత పైశాచి కాంధ్ర భాషాసు, కవిరాజశేఖర ఇతి ప్రథితః సుకవిత్వ విభవేన—నందమపూడి శాసనము) వ్యాసరచిత మహాభారత బద్ధ నిరూపితార్థమును తెలుఁగున వెలయింప నుపక్రమించుటతో నీ భాషలో సాహిత్య మవతరించినది. అవిచ్ఛిన్నముగా సాగుచున్నది. కవిరాజ శిఖామణి యగు నన్నెచోడుడును బూర్వము మార్గ కవిత్వము లోకమున వెలయుచుండగా జాలుక్య నృపాలురు దేశి కవితఁ బుట్టించి తెలుఁగు నంధ్ర విషయమున నిలిపి రని కుమార సంభవావతారికలోఁ స్పష్టీకరించినాఁడు. నన్నయ్యగారి భారతాంధ్రీకరణ కాలమున కించుమించు పది శతాబ్దముల పూర్వమునుండి తెలుఁగు భాష వ్యవహారమున నెలకొని యున్నదని నిరూపించుటకు సాధనము లున్నవి. ఈ పది శతాబ్దముల కాలమును ప్రాక్చాళుక్య పూర్వచాళుక్య యుగములుఁగా బరిశోధకులు విభాగించిరి. ఆ కాలమున బ్రకటితములైన సంస్కృత ప్రాకృతశాసనములలో గానవచ్చుచున్న గ్రామనామములును, సంస్కృతప్రాకృతభాషా విలక్షణములైన ప్రత్యయములును నాఁటి యాంధ్రభాషా స్వరూపమును నిరూపించుట కుపకరించుచున్నవి. క్రీ. శ. 6 వ శతాబ్దమునకు జెందిన వానినిగా రేనాటిచోళుల శాసనములను శాసనపరిశోధకులు గుర్తించినను భాషాతత్త్వశాస్త్రజ్ఞుల దృష్టిపథమున నేఁటికిఁ బ్రాక్చాళుక్య యుగాంధకారము క్రీ. శ. 641 వ సంవత్సరమునకుఁ జెందిన జయసింహవల్లభుని విప్పర్ల శాసనముతోడనే విదళిత మగుచున్నది. ఈ శాసనము వచనమున కూర్పఁబడినది. క్రీ. శ. 848 నుండి 892 వరకు తెలుఁగు నేల నేలిన తూర్పుచాళుక్య రాజగు గుణగవిజయాదిత్యుని ప్రథమ రాజ్య సంవత్సరమునకుఁ జెందిన పండరంగుడను సేనాపతిని ప్రస్తుతించుచున్న లద్దంకిశాసనమునం దారంభము శిథిలమైన తరువోజ కానవచ్చుచున్నది. ఈ తరువోజ తోడనే తెలుఁగున పద్యరచన మావిర్భవించినది. ఈ విధముగా నన్నయ్యగారు భారతము నాంధ్రీకరించుటకుఁ బూర్వము తెలుఁగుభాష నిత్యవ్యవహారోపయోగిగా శాసనరచనా ద్యల్ప ప్రయోజనముల కుపకరించునదిగా నున్నది. ఈ భాషను మహాకావ్య రచనోపయోగిగా నొనర్చుట కాయన చేసిన సంస్కారముయొక్క స్వరూపమేమి ? నాఁడు తెలుఁగులో ప్రచారమునకు వచ్చిన సంస్కృత వృత్తము లేవి ? దేశీయములగు ఛందస్సు లేవి ? ప్రకృతి ప్రత్యయముల స్వరూప ముచ్చారణానుసారిగా మారుచున్నదా ? లేక వ్యవస్థ యేర్పడినదా ? ద్రవరూపముగా నేక శబ్దమునకు బహువిధ రూపములు వ్యవహృతములగుచున్న స్థితిలో నన్నయ్యగారు కొన్ని రూపములను బ్రామాణికములుగా గ్రహించి భాషను స్థిరీకరించుటకుఁ జేసిన మహాప్రయత్నముయొక్క స్వరూప మేమి ? ఇట్లనంతముగాఁ బ్రశ్న లుదయించుచున్నవి. ఈ ప్రశ్నలను సమాధానించుట కనేకులు ప్రయత్నించినారు. నన్నయ్యగారికిఁ బూర్వకాలమున, సమకాలమున, బ్రకటితములైన శాసనములను శ్రీ జయంతి రామయ్య పంతులుగారు సేకరించి 'శాసన పద్య మంజరి' యను గ్రంథమును బ్రచురించినారు. ఈ గ్రంథము సర్వకృషికి మూలభూతము. ప్రకృత ముదయించినవిగాఁ జేర్కొనఁబడిన ప్రశ్నములను సమాధానించిన వారిలో శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు, శ్రీ గంటి జోగిసోమయాజిగారు ప్రథమతః గణనీయులు. వారు క్రమముగా రచించిన 'దక్షిణ దేశభాషా సారస్వతములు—దేశి', 'ఆంధ్రభాషా వికాసము' నను గ్రంథములను బరిశీలించినచో నీవిషయము స్పష్టమగును. విశేషించి ఆంధ్రభాషావికాసమున నన్నయ్యగారు నా డవ్యవస్థితముగా నున్న భాషను మహాకావ్యరచనాసమర్థముగా నొనర్చుటకుఁ జేసిన పరిశ్రమయొక్క స్వరూపము సమగ్రముగాఁ బరిశీలింపఁబడి నిర్ధారిత మైనది. ఈ రెండు గ్రంథముల నాధారపరచుకొని, స్వతంత్రముగాఁ బరిశ్రమించి శ్రీ దివాకర్ల వేంకటావధానిగారు 'ప్రాఙ్నన్నయ యుగము' అను గ్రంథమును రచించిరి. ఈ గ్రంథముల నాధారముగా గ్రహించి ప్రకృత గ్రంథకర్త 'ప్రాచీన తెలుగు చందస్సు', 'నన్నయ్యగారి చందః ప్రయోగము' నను రెండధ్యాయములను రచించెను. (ప్రకృత గ్రంథరచనావసరమున శ్రీ కోవెల సంప

త్కుమారాచార్యులు గారాంధ్రభాషా వికాస శాసన పద్య మంజరులను బరిశీలించినట్లు తోచదు. శ్రీ నిడుదవోలు వేంకటరావుగారి 'తెలుఁగు కవుల చరిత్రము' ను, శ్రీ దివాకర్ల వేంకటావధానిగారి 'ప్రాజన్నన్నయ యుగము' ను మాత్రమే పరిశీలించిరి. ఇది యంతగాఁ బ్రశంసింపఁదగినది గాదు)

గుణగ విజయాదిత్యుని అద్దంకి శాసనమున తరువోజ కానవచ్చుచున్నదికదా! తరువోజ లక్షణ మీ క్రింది విధముగా నప్పకవిచే నిర్దేశింపఁ బడినది.

శతమఖ త్రితయంబు జలజాప్తుఁ డొకఁడు
శతమఖత్రయి ఫీఁదఁ జను విశ్రమంబు
ప్రతిభ నీ యడుగులొప్పఁగ రెండు గూర్పఁ
బ్రతి మీర నొక్కొక్క పాదమై తనరు. 4—274

ఈ లక్షణమును చూపిన వెంటనే తరువోజ పద్యపాదము ద్విపదయొక్క రెండు పాదముల నొక పాదముగాఁ జేయుటచే నిష్పన్న మగునని స్పష్టమగుచున్నది. పద్యము లేర్పడు సంప్రదాయమును బట్టి చూచినచో ద్విపద లేదా మంజరీ ద్విపద ప్రాచీన మనియు దరువోజ దాని పరిణామ మగుటచే నర్వాచీన మనియు నిర్ణయము. ఈ తరువోజను గూర్చి విన్నకోట పెద్దన 'తలకొని తలఁబ్రాలు దంపెడిచోటఁ దరుణులచే సొంపు తనరుఁ దర్వోజ' (కావ్యాలంకార చూడామణి 8—50 యని చెప్పినాఁడు. స్త్రీలు శ్రమాపనోదనము కొరకు పాడునట్టి పాటలలో ద్విపదయొక్క భిన్న భిన్న స్వరూపములే కానవచ్చుచుండుటచే ద్విపదయు దద్భేదమైన తరువోజయుఁ బ్రాచీన కాలమునం దధికమైన ప్రచారము నొంది యున్నవని శ్రీ సంపత్కుమారాచార్యులవారి నిర్ణయము (చూ. పు 31). ఇట్లే నన్నయ్యగారికిఁ బూర్వమే ప్రచారమును బడసిన దేశీయములయిన ఛందస్సులగు తరువోజ, సీసము, మధ్యాక్కర, ఆటవెలది, తేటగీతి యను వానికిఁ గల పరస్పర సంబంధము రెండవయధ్యాయమున నిరూపింపఁ బడినది. నన్నయ్యగారికిఁ బూర్వము తెలుఁగులోనికి వచ్చిన సంస్కృత వృత్తముల విచార మనంతరము చేసిరి. రెండవ యుద్ధమల్లుని కుమారుఁడుగు బాదప మహారాజు వేయించిన 'ఆరుంబాక' తామ్రశాసనమున యతిప్రాసలతోఁ గూడిన కందపద్య మున్నది. ఈ పద్యములోని భాష సంస్కృతమే యయినను యతిప్రాసలతోఁ గూడియుండుటను లక్షణము తెలుఁగునకు సంబంధించినది. గుణగ విజయాదిత్యుని సాతలూరు శాసనమున ప్రాస నియమముతోఁ గూడిన చంపకమాలావృత్తము కానిపించుచున్నది. క్రీ.శ. 1022 లో బేతనభట్టుచే సంస్కృతమున రచింపఁబడిన కోరుమిల్లి శాసనమున రగడ కానవచ్చు చున్నది. ఈ సంస్కృత శాసనములను బరిహరించి ప్రసంగింపవలసి వచ్చుచో తెలుఁగులో సంస్కృత వృత్తముల ప్రవేశము నన్నయ్యగారి కర్ధ శతాబ్దము పూర్వము మాత్రమే జరిగిన దనవలెను. క్రీ. 1000 ప్రాంతమునకుఁ జెందిన విరియాల కామసాని శాసనమున మూఁడు చంపకమాలలు, రెండు ఉత్పలమాలలు కానవచ్చు చున్నవి. "నన్నయ్యగారి ఛందః ప్రయోగ' మను నధ్యాయమునం దాయన యుపయోగించిన సంస్కృతవృత్తములు, దేశీయ విశేష పద్యములు పేర్కొనఁబడి, వాని సంఖ్య పరిగణింపఁబడినది. సంస్కృతములోని వృత్తములను దేశభాషలోనికిఁ దెచ్చు టన్నది కన్నడమున ప్రారంభమయి విస్తరిల్లినది. ఆ పద్ధతినే నన్నయ్యగా రవలంబించిరి. కర్ణాట భాషయందు ప్రచురముగా నుపయుక్తము లగుటచే చంపకోత్పల మత్తేభ శార్దూలవిక్రీడిత స్రగ్ధరామహాస్రగ్ధరలను ఖ్యాత కర్ణాటకవృత్తములని లాక్షణికులు నిర్దేశించిరి. ఆ దృష్టితోఁ జంపకోత్పలములు, మత్తేభ శార్దూలములు తెలుఁగున ఖ్యాత వృత్తములు. ప్రసక్తమగుచున్న యధ్యాయమున నన్నయ్యగారా వృత్తములనే, జాత్యుపజాతులనే యుపయోగించుటకుఁ గల హేతువులు నిరూపితములైనవి. తరువాత నన్నయ్యగారి సీసములందు కాననగు విశేష నియమములను బరిశీలించి శ్రీ గిడుగు సీతాపతిగారు నిర్మించిన కోష్ఠకమును, నన్నయ్యగా రుపయోగించిన పదమూఁడు విధములగు సీసములకు నుదాహరణములును గ్రంథకర్తచే నొసఁగఁబడినవి. ఆటవెలది, తేటగీతులం దాయన పాటించిన నియమములను సోదాహరణముగా నిరూపితము లైనవి. ఇఁక తగవులకుఁ దానకమగు మధ్యాక్కర మిగిలినది. మధ్యాక్కర లక్షణ మప్పకవ్యాది లాక్షణికులచేఁ గ్రింది విధముగా నిర్దేశింపఁ బడినది.

'చన నింద్ర యుగళంబు మీఁద జలజాప్తు నొక్కనిఁజేర్చి
యునుమడించిన నారు గణము లెసఁగిన నొక్కపాదంబు.'
4—277.

లాక్షణిక మతానుసారము చతుర్థ గణాద్యక్షరము యతి స్థానము. తద్విరుద్ధముగా నన్నయ్యగా రైదవ గణము తొలి యక్షరమును యతి స్థానముగా గ్రహించిరి. నన్నయ్యగారికిఁ బ్రాచీనమగు యుద్ధమల్లుని బెజవాడ శాసన మందలి నాల్గు మధ్యాక్కరలలోను బంచమ గణాద్యక్షరమే విశ్రామ స్థానముగా నున్నది. (పరగంగ బెజవాడఁ గొమరు సామికి భక్తుఁడై గుడియు.) నన్నయ్యగా రాదికవి యగుటచే లాక్షణిక నిర్దేశము తద్రచనా పద్ధతిని నియమింపఁ జాలదనుట నిర్వివాదము. ఇంకొక పరిష్కారము నపేక్షించు చిక్కున్నది. ఆయన రచించిన భారత భాగములలోఁ గానవచ్చు మధ్యాక్కరలలో శ్రీ గిడుగు సీతాపతిగారి ప్రకారము పంద్రెండు పాదములందు శ్రీ దివాకర్ల వేంకటావధానిగారి ప్రకారము పదునారు పాదములందు గణవిభజనము పొసఁగుటలేదు. శ్రీ గిడుగు సీతాపతిగారు మధ్యాక్కరలో మూఁడవ గణముగానుండు సూర్యగణము రెండవగణముగానో నాల్గవ గణముగానో యుండవచ్చునన్న యనుమతి పూర్వ ముండియుండునని యూహ గావించి కొన్ని పాదములను సమన్వయించినారు. ఈ యూహ నిరాధార మగుటచే శ్రీ దివాకర్ల వేంకటావధానిగారు పదిపాదములకుఁ బాఠాంతరములను సూచించినారు. ప్రకృత గ్రంథకర్త శేషించినవానికిని పాఠాంతరములను కల్పించి సులభమగు పరిష్కార మార్గమును బ్రదర్శించెను. ఈ పాఠసంస్కారము 'స్థితస్య గతిశ్చిన్తనీయా' యను నియమమునకు విరుద్ధము. హర్షింపఁ దగినది గాదు. ఈ ప్రాథమిక మగు నాక్షేపము నటుంచి శ్రీ సంపత్కుమారా

చార్యులుగారు సూచించిన పాఠములను నాకు రుచించుట లేదని పాఠకులకు విజ్ఞాపనము. ఉదాహరణముగా నీ క్రింది పద్యమును జిత్తగింపుఁడు.

> 'ఏమేమ మున్ను పూజింపుదుము రుద్రునిం దనివేడ్కఁ
> తో మునికోటి దారున్న నీశుఁడం దొరకును బ్రీతి
> గా మతిలోఁ గోటి రుద్ర రూపముల్ గావించెనదియు
> భూమిఁ బ్రసిద్ధమై రుద్రకోటి నాఁ బొలిచ్చి వెలింగె'
>
> ఆరణ్యపర్వము 2—256.
>
> ( వావిళ్ల, 1952 వ సం. )

'పూజింపుదుము' అను ప్రయోగ మర్వాచీన మగుటచే నన్నయ్య గారు 'పూజింతుము' అనియే ప్రయోగించి యుందురని శ్రీ గిడుగు సీతాపతిగారి నిశ్చయము. (చూ. తెలుగులో చందో రీతులు—పు. 203). కావున పద్యపాదము 'ఏమేమ మున్ను పూజింతుము రుద్రు నిం దని వేడ్కఁ' గా మార్పు పొందును. నాల్గవ గణము జగణమై లక్షణభంగ మగుచున్నది. ప్రకృత గ్రంథకర్త ప్రసక్త పద్యపాదమును,

'ఏమేమ పూజింతుము మును రుద్రునింద మని వేడ్కఁ' యని సంస్కరించిరి. ఈ సంస్కృతపాఠమునను గణభంగము పరిష్కృతముగాక నిలిచిపోయినది. ప్రస్తరించినచో ఇం + ఇం + సూ + ఇం + సూ + సూ ఏర్పడుచున్నది. ఇది మధ్యాక్కర లక్షణము గాదు. అర్థభంగ మేర్పడుచున్నది. మునికోటి ఈ ప్రదేశమున రుద్రుని ముందుగా నేమఁ పూజింతుము, ఏము పూజింతు మనుచుండఁగా వారికిఁ బ్రీతి కలుగునట్లుగాఁ బరమేశ్వరుఁడు శతకోటి రుద్రరూపములను గావించెననియు నా ప్రదేశము భూమి రుద్రకోటి యను పేరు బ్రసిద్ధ మైన దనియుఁ బద్యార్థము. అందుచేతఁ గవిచే 'ఇంద' ను నది ప్రదేశార్థకముగా నుద్దిష్టమని స్పష్టము. ఈ ప్రదేశమను నర్థము నిచ్చు పదమును గ్రహణార్థకముగా వీరు మార్చిరి. ఈ మార్పుట రుచిర మనఁజాలము. సన్నిహిత భాషయగు కర్ణాటకమునఁ బ్రచలితమైన చంపూ సంప్రదాయమును నన్నయ్యగా రవలంబించినారనియు దానికి నిర్దేశింపఁ దగిన కారణముల విస్తరణమును 'చంపూ సంప్రదాయ' మను నధ్యాయమునఁ గానవచ్చుచున్నవి. 'ద్విపద సంప్రదాయ' మను నధ్యాయమునఁ బాల్కురికి సోమనాథుఁడు దానిని మహా కావ్య రచనోపయోగిగా నొనర్చుటకుఁ జేసిన సంస్కారము యొక్క స్వరూపము నిరూపితమైనది. ఆంధ్రభాషకు యతిప్రాసలు సహజాలంకారములను భావము లోకోత్తర ప్రకృష్ట పరిశీలన మాధారముగా నేడవ యధ్యాయమున వ్యక్తము చేయఁబడినది. తెలుగు ఛందోగ్రంథములను పేర వెలయు నెనిమిదవ ప్రకరణ మతి విస్తృతము. ఈ ప్రకరణమున తెలుగులోని ప్రధాన చందోగ్రంథములు: గురు లఘు నిర్ణయము, గణములు, కన్నడ, తమిళ గణములు, కవిజనాశ్రయ యతులు, యతి సూచిక, ప్రాస సూచిక, వాని సమీక్ష వృత్తసంఖ్యా సూచిక, వాని సమీక్ష మున్నగు బహువిషయములు కానవచ్చు చున్నవి. ఈ యధ్యాయమునం దప్పకవి యతులను స్వర యతులు, వ్యంజనాక్షర విరతులు, ఉభయవళులు, ప్రాసవిశ్రాంతు లను పేర నాలుగు వర్గములుగా నేర్పరుచుట సమ్మతింపఁబడి యాతఁడు లక్ష్య లక్షణ పూర్వకముగాఁ దృతీయాశ్వాసమున విస్తరించిన నలువదియొక్క యతి భేదముల నిరువదియొక్క భేదములుగా నెట్లు సమీకరింప వచ్చునో నిరూపిత మైనది. ఈ నిరూపణము గ్రంథకర్తయొక్క ధీవైశద్యమునకు, గాఢ పరిశ్రమమునకు స్ఫోరకముగా నున్నది. ఇట్లే 'ఆధునిక ఛందస్సు' అను ప్రకరణము సర్వము నితర గ్రంథానపేక్షమై కర్తృ ప్రతిభా సంపత్తికిఁ బతాకా ప్రాయముగా నున్నది. ఈ ప్రకరణము మూఁడు భాగములుగా విభజింపఁ బడినది. తొలి భాగమున నవ్య సాహిత్య పరిషత్కవులచేఁ బద్య రచనా మార్గమునఁ గావింపఁబడిన స్వల్పములగు మార్పులు ప్రదర్శితములు. రెండవ భాగమున గురజాడ అప్పారావుగారిచే సృజింపబడిన ముత్యాల సరమను మాత్రా ఛందము భామినీ షట్పది యొక్క వికారమని నిరూపితము. ఆధునిక గేయ చ్ఛందస్సులకు రగడలలో నంతర్భావము నిర్దేశింపఁ బడినది. మూఁడవ భాగమున వచన పద్య ప్రక్రియా పరిశీలనము జరిగినది. పరిశిష్టయను నధ్యాయమున పద్య రచనా శిల్పాదులు స్పృశింపఁ బడినవి.

'తెలుగు ఛందోగ్రంథము' లను ప్రకరణమును గూర్చి యొండు రెండు మాటలు నివేదింపవలసి యున్నది.

ర కార ల కారములకు యతిగ్రాహ్యము గాదని అప్పకవియు, కూచిమంచి తిమ్మకవియు నిర్దేశించిరి. ఈ నిషేధము సమంజసమా కాదను గ్రంథకర్త నిరూపణముతో విప్రతిపత్తి లేదు. ఈ యతిని సమర్థించుట కహోబలపతిచే నుదాహృతములైన వసు చరిత్ర మందలి పద్య పాదములను శ్రీ సంపత్కుమారాచార్యులుగా రుదాహరించినారు. అహోబలపతి పేరు మాత్ర మెత్తలేదు. ఈ యక్షరములకుఁ బ్రాసయు సమ్మత మనుటకు సుమతి శతకము నుండి ప్రయోగమును బ్రదర్శించిరి. ఇంతకంటె ప్రామాణికములగు ప్రయోగములను బ్రదర్శించు టుచితము. ఈ యతి శ్రీనాథ రామరాజభూషణాది మహాకవులకు సమ్మతము.

> హాలాపాన మొనర్చి యుద్ధరును నన్యోన్యంబు
> మత్తిల్లి కం
> కేళీ నృత్త వినోద కందుకమణి క్రీడా విహార క్రియా
> లీలా హాస్య కళా ప్రసంగముల నుద్రేకించి వర్తింతురె
> క్కాలంబున్ ఘట జన్మ ! కాశి నడుమున్ గర్వించి
>
> యద్దేవతల్—కాశీఖండము 6—210.

అనునాసికాక్షర యతి సరసయతిలో నంతర్భవించునని నిరూపించినారు. (చూ. పు. 153). అనుస్వార సంబంధయతిని ఖ్యాతము ప్రత్యేకముగా నంగీకరింపక తప్పదని నిర్ణయించినారు. అనుస్వార సంబంధయతి యనఁగాఁ బంచమాక్షరములు దక్క టవర్గాక్షరములకు పూర్ణానుస్వార పూర్వకములై పరస్వరము చెల్లుట. 'పెక్కుచం, దాలంబండు నొకప్పుడుం దరుఁగ దింటం బాడియుం బంటయున్' అని యుదాహృతి. శాసనములను బరిశీలించినవారి కెల్ల వర్గ పంచమాక్షర లేఖన ప్రాచుర్యము పరిచితమే ! అనుస్వార పూర్వక త వర్గాక్షరములకు

# గ్రంథ విమర్శనము

మాఱుగా 'న' కారమునుం న్దా—(ప్రకృతోదాహరణమున) అనుస్వార పూర్వక ట వర్గాక్షరములకు మారుగా 'ణ' కారమును (ణ్టా—ప్రకృతోదాహరణమున) వచ్చును గదా! అనుస్వార సంబంధయతి యీ హేతువును బురస్కరించుకొని సంయుక్త విశ్రామమున సరసయతి యగుచున్నది. ఈ వర్గపంచమాక్షర లేఖన పద్ధతిని నేఁ డంగీకరింపఁ బనిలేదు. గాని యనుస్వార సంబంధయతి కీ సామ్యము మూలమని నిరూపింపవలెను. అర్వాచీన లాక్షణికులు కావించిన నియమముల ననుసరించి యనునాసిక ప్రాస మనావశ్యకమని నిరూపించినారు. (పుట 168). ద్రుతమునకు సరళ స్థిర పరకత్వమున బాలవ్యాకర్తచే లోప సంశ్లేషములు విధింపఁబడినవి. నన్నయ్యగారిచే కేచిత్పక్షముగా సరళస్థిర పరకత్వమున బిందువు విధింపఁబడినది. ఈ బిందువు నంగీకరింపక తప్పదు. క్రింది ప్రయోగమును దిలకింపుఁడు.

> డుంఠీశు భైరవుని సితి, కంఠు విశాలాక్షి దండ
> కరుజాహ్నవి వై
> కుంభపతి గుహుని లోలా, ర్కుంఠే వలు మీర భూవ
> రుఁడు పొడగనియెన్
>
> —అప్పకవీయోదాహృతము 4—154.

సంశ్లేష రూపమునే చెప్పుకొన్నచో పై ప్రాస భేదమున నకారమును తొలఁగించ వచ్చునని సంపత్కుమారాచార్యులు గారు 'ధాతంనాభిని' అన్నచో 'ధాతన్నాభిని' అని సంశ్లేషమును స్వీకరింప వచ్చును. ఉదాహృత పద్యమున నెట్లు? వారి నిర్దేశమవ్యాప్తి దోషదుష్టమగుచున్నది. స్వభావసిద్ధముగా మ కార పూర్వ బిందువు మా ముడి యగునని నిర్దేశించి ప్రౌఢ వ్యాకర్తృ సూత్రమును 'కమ్మని లతాంతములకు మ్మొనసి' యను తదుదాహరణమును గ్రంథకర్త పేర్కొనెను. ప్రాచీనుల పక్షమున 'కుం మొనసి' యనిగదా రూపము. ఈ రూపమర్వాచీన కాలమున మారిన దనవచ్చును గాని ప్రౌఢ వ్యాకర్తృ సూత్ర మాధారముగా ననునాసిక ప్రాస మనావశ్యక మనరాదు. 'ముందర గ జ మ కారము, లొందిన నాంతముల తుదల నుండు ద్రుతములం, గ్రందుకొని వికల్పంబున, బిందువులుగఁ జేసి కృతులు బెట్టుదు రొకచోన్' (4—157) అని అప్పకవి నిరూపణము. 'కావ్యాలంకార చూడామణిలో—"పుడమి విశ్వ విభుని భుజమునకుఁ దొడవు' అను "ముకారయతి' కి లక్ష్యమందు ము విభక్తికే యతిని చూపినాఁడు. ఇట్లే అనంతుఁడు కూడ.

> 'వెలసిన పుఫు బుభు వర్ణం
> బులు పోలికవడి మ్ము కారముగ నిడదగు ని
> మ్ముల హరిచరణ సరోరుహ
> ములు నా హృత్సరసి యందుఁ బొదలుననఁగన్.'

అని లక్ష్యము ము విభక్తికే చూపినాఁడు. (పుట. 151). ప్రకృత లక్ష్యమున 'చరణ సరోరుహములు' అనుచోఁ గానిపించు ముకారము విభక్తి ప్రత్యయ మనుట వ్యాకరణ సమ్మతము గాదు. 'వానికి ము వర్ణ కేతరంబయిన విభక్తి పరంబగునపుడు ము గాగమంబగు' నను సూత్రముచే బహువచన ప్రత్యయ పరకత్వమున ప్రాప్తించిన యాగమ మువర్ణ మనవలెను. పు, ఫు, బు, భు లకు ము ప్రత్యయముతో విశ్రామము ము విభక్తి యతి. ఈ వర్ణములకు శబ్దగత ము కారముతో యతి ము కార విశ్రామము. ఈ సందర్భమున శ్రీ దువ్వూరి వేంకటరమణ శాస్త్రిగారు శ్రీనాథుని 'బొడ్డుపల్లెను గొడ్డేరి మోసపోతి' నను పంక్తి నుదాహరింతురు. ఈ లక్షణాతిక్రమమును ప్రకృతగ్రంథకర్త విస్మరించుట విస్మయముఁ గొల్పుచున్నది.

శాస్త్రగ్రంథరచనము కావ్య నిర్మాణము వలె ప్రతిభా మూలకము గాదు. బహుగ్రంథములందు విక్షిప్తములై యున్న విషయములను బరిశీలించి ప్రకృత విషయానుకూలములైన వానిని సేకరించి సమన్వయపూర్వకముగాఁ బ్రదర్శించుట తద్గ్రంథ రచనా లక్షణము. అనఁగా సమన్వయించుటకు వలసిన బుద్ధి సూక్ష్మతయు, సుబోధకముగా నా విషయములను బ్రతిపాదించు నైపుణ్యము నావశ్యకములు. ఈ రెండు లక్షణములకును బ్రకృతగ్రంథము నిధానము. విషయ వివరణ పద్ధతి సర్వత్ర సుబోధకముగా, మనోజ్ఞముగా నున్నది. ఈయన మల్లంపల్లి వీరేశ్వర శర్మగారి శిష్యులఁట! శ్రీ దువ్వూరి వేంకటరమణ శాస్త్రిగారి వ్యాకరణ పాఠ సంప్రదాయముననే క్లిష్టములగు విషయములను మనోజ్ఞముగా బోధించుటను లక్షణ మున్నది. లక్షణ గ్రంథములను రసబంధురముగా బోధించు టాయనకే చెల్లును. ఏ తల్లక్షణమున కీ గ్రంథ ముదాహరణప్రాయమై ముద మావహింపఁ జేయుచున్నది.

—వి. జి. కె.

# ఉపనిషత్ సముచ్చయము

(ప్రథమభాగము: ఆంధ్రానువాద, ప్రభానామకవ్యాఖ్యా సహితము. కర్త: సాహిత్యాచార్య, కవిశేఖర, వేదాంత విమర్శన విశారద శ్రీ పంతుల లక్ష్మీనారాయణశాస్త్రిగారు. ప్రచురణ కర్త: కీ. శే. శ్రీ దశగ్రంథాల సుబ్బయ్యశాస్త్రి. ప్రాప్తిస్థానము: గ్రంథకర్త, పేర ఆంధ్ర భాషా ప్రధానాధ్యాపకుడు, ప్రభుత్వ మహారాజా సంస్కృత కళాశాల, ప్రత్తిపాటివారివీధి, విజయనగరము 26+20+41+51+12=150 పుటలు. వెల: రు. 4.)

బంధము అవిచారకృతము. మోక్షార్థియైనవాడు విచారము చేయవలెను. అధ్యారోపము, అపవాదము అనువాని స్వరూపములను నిశ్చయించి, వాని ద్వారమున తత్త్వము నెరుగవలెను. అందులకై జగత్తు, జీవుడు, పరమాత్మ అనువానిని గూర్చిన విచారమవసరము. విచారము మోక్ష సాధకమనుచు, పైంగలోపనిషత్తు ఇట్లు చెప్పుచున్నది: 'అవిచారకృతోబన్ధో విచారాన్మోక్షో భవతి తస్మాత్ సదా విచారయేత్ అధ్యారోపాపవాదత: స్వరూపం నిశ్చయీకర్తుం శక్యతే। తస్మాత్ సదా విచారయేత్ జగజ్జీవ పరమాత్మన:। జీవ భావ జగద్భావ బాధే ప్రత్యగభిన్నం బ్రహ్మైవావశిష్యత ఇతి. కాని ఈ తాత్త్వికవిచార మెప్పుడు నుండవలసినదనుట గమ

నింపదగిన యంశము. 'సదా విచారయేత్' అని పైంగలమనగా అధ్యాత్మోపనిషత్తు ఎంతో తొలగించినను నాచు యథాపూర్వముగా నావరించునట్లు మాయ ప్రాజ్ఞునైనను మరల నావరించునని ఇట్లు చక్కగా చెప్పుచున్నది: 'యథాపకృష్టం శైవాలం క్షణమాత్రం న తిష్ఠతి। ఆవృణోతి తథామాయా ప్రాజ్ఞంవాపి పరాఙ్ముఖమ్।' కనుక సాధకునకు విచారము 'సదా' ఉండవలసినదే. ఇక కర్మ జ్ఞానములలో నేయొక్కటియోకాక, రెంటిని అనుసరింపవలెననియు కర్మమార్గమువలన వివేకముగలిగి జ్ఞానమార్గము సుగమముగుననియు వేదాంతశాస్త్రము చెప్పుచున్నది. కర్మచితములైన లోకముల పరీక్షించి తెలిసికొని నిర్వేదముపొంది సాధకుడు దరఖలు గ్రహించి గురువును వెదకికొనుచు పోవలెనని ఉపనిషత్తు చెప్పుచున్నది. కాని, నేటి లోక మట్టి వ్యవస్థకు సుముఖముగా లేదు. గురు సాహాయ్య మర్థింపక, యొగ్గర్సుగా వ్రాసిన పుస్తకములు చదువుకొని పండితులమైతి మనుకొనుట నేటి లౌకిక విద్యల మహత్తులలో నొకటి. ఏ విద్యకైనను అంత:కరణ వృత్తియైన అనుసంధానము జ్ఞానసాధకమగుచున్నది. అతి రహస్యము గుప్తము, అనుభవైకవేద్యము అయిన ఆత్మవిద్య విషయమున ఈ అనుసంధాన మెంతముఖ్యమో చెప్పనిలేదు. ఆత్మనిష్ఠులగువా రనుసంధానమున కెట్లును అలవాటుపడియుందురు గనుకనే ముఖ్యముగా వారికిని ఆసక్తిపరులైన తదితరులకును వ్యాఖ్యాన సమన్వయాదు లుపకరింపగలవనుటలో సందేహములేదు. ఆంధ్ర ధ్వన్యాలోక లోచనములకు ఆంధ్రానువాద ప్రభామతి వ్యాఖ్యలు ఘటించిన సాహిత్యాచార్యులు శ్రీ పంతుల లక్ష్మీనారాయణ శాస్త్రిగారు ఈ గ్రంథమున ఈశావాస్య, నిరాలంబ, పైంగలాధ్యాత్మికోపనిషత్తులకు ఆంధ్ర పద్యానువాదముతోపాటు శంకరాదుల భాష్యములు సమన్వయించి స్వాభిప్రాయము తెలిపెడు 'ప్రభా' నామక వ్యాఖ్యనుగూడ వెలయించినారు.

ఈ నాలుగు ఉపనిషత్తులును శుక్లయజుర్వేదమునకు చెందినవి. శాస్త్రిగారు వీనిని కూర్చిన క్రమము సాధకులకుత్తరోత్తర మభ్యసింపునట్టిది. ఈశావాస్యము పదునెనిమిది మంత్రములుమాత్రముగల కొంచిపాటి గ్రంథమైనను, గుణముసగొప్పది. ఇందు జ్ఞానయోగకర్మయోగములు, ఆత్మతత్త్వము, కర్మోపాసన సముచ్చయము, సంభూత్యసంభూత్యుపాసన సముచ్చయములును, అర్చిరాదిమార్గమున బ్రహ్మలోకప్రాప్తియు ప్రతిపాదింపబడినవి. కార్యరూపమైన బ్రహ్మము నుపాసించుట (హిరణ్యగర్భాది సగుణబ్రహ్మము,(సంభూత్యుపాసనము. కారణమగు అవ్యక్త ప్రకృతి నుపాసించుట అసంభూత్యుపాసనము. ఈ రెంటిడింటి నుపాసింపవలెనని చెప్పుచున్నను మొదటిదాని కణిమాది సిద్ధులును రెండవదానికి ప్రకృతి లయమును ఫలములు.

నిరాలంబోపనిషత్తు సాధకునకు కైపొత్తమువంటిది. బ్రహ్మమేది? ఈశ్వరు డెవడు? మొదలుగా నలుబదియొక్క ప్రశ్నలు వానికి సమాధానములు ఇందుకూర్పబడినవి. కర్మ స్వరూపము నీయుపనిషత్తు ఎంత సుగమముగా చెప్పుచున్నదో చూడుడు: 'కర్మేతి చ క్రియమాణేంద్రియై: కర్మాణ్యహం కరోమీత్యధ్యాత్మ నిష్ఠతయా కృతం కర్మైవకర్మ॥' "నేను చేయుచున్నాను" అను సాహంకారభావము భావముతో నధ్యాత్మనిష్ఠముగా చేయునదియగు కర్మయే కర్మమగుచున్నది. అట్టి కర్మ ఫలము బంధమగునని యభిప్రాయము. అట్లే స్వర్గ నరకములను గూర్చిన ఈ యభిప్రాయముల చిత్తగింపుడు. 'స్వర్గ ఇతిచ సత్సంసర్గ: నరక ఇతిచ అసత సంసార విషయ జన సంసర్గ ఏవ నరక:॥'

పైంగలోపనిషత్తున అద్వితీయ బ్రహ్మస్వరూపాదుల వివరణము, అధ్యారోపము అపవాదము అనువాని తెలివిడి, జ్ఞాన సహితమైన ధ్యానముయొక్క మహిమ చెప్పబడినవి. శరీరాదులను రథాదులుగా నిరూపించి నారాయణుడే ప్రత్యగాత్మయని చెప్పెడు 'ఆత్మానం రథినం విద్ధి, శరీరం రథమేవతు' ఇత్యాది మంత్ర మిందులోనిదే.

ఇంక అధ్యాత్మోపనిషత్తు సాధకులకు చక్కగా నుపకరింపగల సరళగ్రంథము. ఉపనిషత్తుల కన్నిటికి వ్యాఖ్యలు వ్రాసిన ఉపనిషద్బ్రహ్మయోగి అధ్యాత్మికోపనిషత్ మొదలగు కొన్నింటికి అవతారికలు మాత్రము వ్రాసినారు. కాగా శాస్త్రిగారి కావారి సాహాయ్యము లభింపకపోయినను శాంకర సిద్ధాంతము ననుసరించి వ్యాఖ్య వెలయించినారు. వైరాగ్యము, బోధ, ఉపరతి సిద్ధించినట్లు సాధకుడెట్లు తెలియగల డనుదాని కీ యధ్యాత్మోపనిషత్తు ఇట్లు గుర్తులు చెప్పుచున్నది: 'వాసనానుదయో భోగ్యే వైరాగ్యస్య తదావధి: అహంభావోదయాభావో బోధస్య పరమావధి: లీనవృత్తే రనుత్పత్తి ర్మర్యా దోపరతేస్తుసా॥' దీనికి శాస్త్రిగారి సరళమైన వ్యాఖ్య: 'అనుభవింపదగిన శబ్ద, స్పర్శ, రూప, రస గంధములను విషయములయందుగల ప్రీతి తొలగి అది తిరుగ పుట్టకుండినయెడల వైరాగ్యము లభించినదనియు, నేను అను తలంపు కలుగకుండిన యెడల జ్ఞానము సిద్ధించినదనియు, ఆత్మయం దడగిన చిత్తవృత్తి వెలికి రాకుండ నచటనే నిలుచుచుండిన యెడల నుపరతి ప్రాప్తించినదనియు తెలిసికొనవలయును. అట్లుగాక, శాస్త్ర పాండిత్య మున్నంత మాత్రమున వైరాగ్య, బోధ, ఉపరతులు సిద్ధించెనని తలచుట మౌఢ్యమే అగును. ఈ వైరాగ్యాదులు లేనియెడల ఆత్మప్రాప్తి కలుగదు. ఆత్మలాభములేనిఎడల, పశువులయందెల్ల నుత్తమమగు మానవ జన్మము ఫలవంతము కానేరదు లోకానువర్తనము దేహానువర్తనము అనువానితోపాటు, శాస్త్రానువర్తనము కూడ వాసనయే యగుననియు, నందుచే, నీ మూటిని త్యజించి స్వాధ్యాసాపనయము చేయుమనియు ఈ యుపనిషత్తే బోధించిన భావమీ వ్యాఖ్యలో సమన్వయింపబడినది.

శాస్త్రిగారు పండితులేకాక, సాధకులు గూడనని వినుదుము. 1938 నాడెప్పుడో 'వేదిక్ రిసర్చ్' పత్రికలో విపులమగు వ్యాఖ్యలతో ప్రకటించిన నిరాలంబ పైంగలోపనిషత్తులను, అట్లే 1939 లో ప్రకటించిన అధ్యాత్మోపనిషత్తును, 1953 లో ప్రకటించిన ఈశావాస్యమును సంక్షిప్తమగు సరళ వ్యాఖ్యతో నిప్పుడిట్లు సముచ్చయముగా ప్రకటించి శాస్త్రిగారు ముముక్షువులకు, జిజ్ఞాసువులకు మేలు చేసినారు. వారి ఆత్మ నిష్ఠకీ గ్రంథ మందలి ప్రభావైశద్యమే గురుతు. అధికారులు చదువతగిన ఉత్తమ గ్రంథము.

ఎస్. కె.

# గ్రంథ విమర్శనము

## సంస్కృత వాఙ్మయచరిత్ర

(ద్వితీయ సంపుటము: లౌకిక వాఙ్మయము. కర్త: మహోపాధ్యాయ, అభినవ వాగనుశాసన—శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు. ప్రకాశకులు: ఆంధ్ర సారస్వతపరిషత్తు, తిలక్‌రోడ్డు, హైదరాబాదు. 490 పుటలు. వెల: రు. 8.)

సంస్కృత వాఙ్మయచరిత్ర విమర్శములమీద ప్రకాశన ప్రచారములమీద మహారాష్ట్రులు చూపిన, చూపుచున్న శ్రద్ధాసక్తులు గమనించినచో తెలుగువా రిట్టి మార్గమున నంతగా నాసక్తులు కృతపరిశ్రమలు కారేమో అనుసందేహము కొంత కలుగక మానదు. అయినను ఆ కొరత తీర్పగల పండితులు కొందరైనను తెలుగునాట లేకపోలే దన్నది సమీక్షకునివంటివారి కొక తృప్తి. వేళ్లమీద లెక్కపెట్టదగిన ఆ కొలదిమందిలో శ్రీ మల్లాది సూర్యనారాయణ మహోపాధ్యాయు లొకరు. సంస్కృత కవుల జీవితము వ్రాసిన శ్రీ శాస్త్రిగారు పదపడి వైదిక వాఙ్మయము ప్రథమ సంపుటముగా లౌకిక వాఙ్మయము ద్వితీయ సంపుటముగా సంస్కృత వాఙ్మయ చరిత్రమును 1936 లోనే వెలయించినారు. హైదరాబా దాంధ్ర సాహిత్య పరిషత్తువారు ఈ రెండు సంపుటములకు ద్వితీయ ముద్రణము కూర్చుట ముదావహము.

సంస్కృత సాహిత్య చరిత్రమును తడవిన పాశ్చాత్యులే అనేకులున్నారు. మాక్స్‌ముల్లర్, వీబర్, మాగ్డొనెల్, కీత్ మొదలగు వారి పేర్లు సుపరిచితములే. శాస్త్రిగారి ఈ తెలుగు సంపుటములు రెండును అంతపెద్దవి, అంత చిన్నవి కాక, సామాన్య పాఠకుని కుపకరించునవి యనుటలో సందేహములేదు. దీనికంటెను ఈ గ్రంథరచనలోని శాస్త్రిగారి స్వతంత్ర మార్గము గ్రంథమున కుత్కర్షహేతువనక తీరదు. గ్రంథమున చారిత్రక విషయముతోపాటు విమర్శభాగముండుట రచనలోని కథనదక్షత గ్రంథమునంతయు చదివించు మరికొన్ని గుణములు.

ఇపుడు సమీక్షింపబడుచున్న ద్వితీయ సంపుటము (లౌకిక వాఙ్మయము)ను శాస్త్రిగారు తొమ్మిదధ్యాయములుగా నిగదించినారు. ప్రథమాధ్యాయమున ఉపవేదములు ద్వితీయాధ్యాయమున రామాయణ భారతములు, తృతీయమున పురాణోపపురాణ తంత్రములు, చతుర్థమున దర్శనములు, పంచమమున శాస్త్రములు, షష్ఠమున అలంకారశాస్త్రము, సప్తమమున కావ్యములు, అష్టమమున రూపకములు, నవమమున కోశములు పరామర్శింపబడి పాఠక సౌలభ్యము సమకూర్పబడినది.

శాస్త్రిగారి స్వతంత్రదృష్టి కుదాహరణములుగా కొన్ని అంశముల స్పృశింపవలసియున్నది. రామాయణ భారతములలో మొదటి దాదికావ్యమనియు, రెండవది అర్వాచీనమనియు మనమందరము నమ్మెదుము. కాని, వాష్‌బర్న్ హాప్కిన్స్‌వంటి పాశ్చాత్యులు భారతమే ముందుదని వాదించినారు. శాస్త్రిగారు రామాయణ భారతములలోని ఆంతరంగిక సాక్ష్యమును, పౌరాణిక సాక్ష్యమును చూపి రామాయణమే మొదటిదని సప్రమాణముగా నిర్ణయించినారు. దీనితోపాటు "యవను'లనబడువారు అలెగ్జాండర్, డెరియస్‌ల కంటె పూర్వము వారనియు, దాదాపు క్రీ. పూ. వెయ్యి సంవత్సరములకుమునుపే ఉత్తర హిందూదేశమున నుండినవారని—శాకటాయనుడు యవన శబ్దమును పేర్కొనుట ఆధారముగా నిశ్చయించినారు. రామాయణ భారతములు క్రీ. పూ. 12, 11 శతాబ్దముల నాటివని శాస్త్రిగారి విశ్వాసము. ఇట్లే రామాయణ బాలకాండమునందలి మూడు నాలుగు సర్గలు ప్రక్షిప్తములన్న విశ్వాసము చాల సముచితము. ఉత్తరకాండ రచన పిదప నెవ్వరో దానిని పూర్వగ్రంథముతో లగించుటకుగానీసర్గలు చేర్చియుందురనుట సుసాధ్యమైన సంగతి. రాక్షసుల యుదంతములు హనుమదాది శూరుల వృత్తాంతములతో నలుబది సర్గలు జరిగి పండ్రెండు సర్గలలో సీతావిసర్జన ఘట్టమేర్పడి, నృగనివ్యాదుల కథలతో మరికొన్ని సర్గలు వ్యయమై అరువదియైదు సర్గల తర్వాత కుశలవ జన్మ వృత్తాంతమంకురించిన ఉత్తరకాండరచన గుణమునుబట్టిగాని, సంవిధామునుబట్టికాని వాల్మీకి రచన కాజాలదనుటయే లెస్స.

అట్లే భర్తృహరియే భట్టికావ్యకర్తయని శాస్త్రిగారు చక్కగా నిరూపించినారు. భాసనాటకముల విషయమున శ్రీ పరంజపేగారితో నేకీభవించుచు, దొరికిన పదమూడు నాటకములకు భాసకర్తృత్వము నంగీకరించినారు. కుందమాల కర్తృత్వ విషయమున బౌద్ధుడైన దిఙ్నాగుడు రామకథ వ్రాయునా యను సందియమునుబట్టియు 'ధీరనాగు'డను పేరు తంజావూరునందలి లిఖిత ప్రతులలో నాటకాంత గద్యలలో కానవచ్చుటచేతను (కవేర్ధీర నాగస్యకృతిః కుందమాలా నామ నాటకం సమాప్తమ్) ఏత ద్గ్రంథకర్త ధీరనాగుడనియు, శృంగార ప్రకాశకర్త భోజదేవునకు ముందెవ్వరును కుందమాలా శ్లోకముల నుదాహరింపక పోవుటనుబట్టియు భోజుడు పేర్కొన్నాడు గనుక, నాతనికి కొంచెము పూర్వుడైన ధనంజయునికి ధీరనాగుడు సమకాలీనుడు కావచ్చుననియు శాస్త్రిగారి యూహ.

కాలగతిలో సవశముగా నేర్పడిన లౌకిక వాఙ్మయ వికాసమును శాస్త్రిగారిట్లు స్వతంత్రవృత్తితో నుల్లేఖించి వాఙ్మయ చారిత్ర జిజ్ఞాసువుల కుపకార మొనర్చినారు. మధురమగు రచన. సాహిత్య విద్యార్థు లందరు చదువవలసిన గ్రంథమే.

ఎస్. కె.

# వార్తలు

సెప్టెంబరు 7 : జెనీవాలో నిరాయుధీకరణ సభ రెండు నెలలు వాయిదా. ఐదు నెలల చర్చలు విఫలమైనవని రష్యా విమర్శ. కేవలం నిష్ఫలం కాదని అమెరికా వివరణ.

—కామన్వెల్తు ప్రధానుల సభకు నెహ్రూ లండన్ ప్రయాణం.

—భారత జాతీయ గీతాలాపనపై జకార్తా ప్రేక్షకుల అపహాస్యం. ఇండొనీసియా ప్రభుత్వానికి భారత్ అధిక్షేపణ.

—తూర్పు పాకిస్తాన్‌లో వినోబాజీ భూదానోద్యమం.

సెప్టెంబరు 9 : అణ్వస్త్ర పరీక్షలవల్ల కొన్ని వేల ఏళ్లపాటు మానవజాతికి చెరుపు తప్పదని నాలుగు సంవత్సరాల పరిశోధన అనంతరం ఐక్యరాజ్యసమితికి వివిధ దేశాల శాస్త్రవేత్తల నివేదికలో హెచ్చరిక.

—రాజేంద్రప్రసాద్ సతీమణి శ్రీమతి రాజవంశీదేవి పాట్నాలో మృతి.

—సమష్టి విఫణిలో కామన్‌వెల్తు సహా సభ్యత్వం కొత్తరకం వలస తత్వానికి దారితీస్తుందని లండన్‌లో ప్రధాని నెహ్రూ ప్రకటన.

—కొమింటాంగ్ చైనాకు చెందిన యు 2 విమానం కమ్యూనిస్టు చైనాచే కూల్చివేత. అంతరిక్ష సరిహద్దును అతిక్రమించినట్లు ఆరోపణ.

—హైదరాబాదులో రష్యా సహాయంతో ఔషధాల ఫ్యాక్టరీ నిర్మాణానికి కేంద్రమంత్రి శ్రీ కె.సి.రెడ్డి శంకుస్థాపన.

—అల్జీరియా రాజధానిలో బెల్లా సేనల విజయ ప్రవేశం. ప్రజల అపూర్వ స్వాగతం.

సెప్టెంబరు 11 : పసిఫిక్‌లో అమెరికా జలాంతర్గామి దళం. పోలారిస్ రాకెట్లతో సహా చైనాకు 1750 మైళ్ల దూరంలో సమీకరించాలని నిర్ణయం.

—బ్రిటన్ కూడా ఐరోపాలో భాగస్వామేనని సమష్టి విఫణిలో అది చేరక తప్పదని లండన్‌లో సమావేశమైన కామన్‌వెల్తు ప్రధానులకు బ్రిటిష్ ప్రధాని మాక్మిలన్ స్పష్టీకరణ.

—నేపాలును నొప్పించే మాటలు అనవలదని ఢిల్లీలో నేపాల్ విదేశాంగ మంత్రి శ్రీ రిషికేష్ షా విజ్ఞప్తి.

సెప్టెంబరు 12 : సికింద్రాబాదు కేంద్రంగా కొత్త రైల్వే మండలం ఏర్పడగల అవకాశం. కేంద్రం నుంచి హైదరాబాదుకు వార్త.

—ఏ దేశం దురాక్రమణకు గురైనా రష్యా సహాయపడుతుందని మాస్కో హెచ్చరిక. క్యూబాపై అమెరికా చర్యలు అణ్వస్త్ర యుద్ధానికి దారితీయగలవని కూడా స్పష్టీకరణ.

—అమెరికా ఎన్నికల వరకు జర్మనీ శాంతి సంధిని వాయిదా వేయాలని రష్యా ప్రతిపాదన.

సెప్టెంబరు 13 : హైదరాబాదులో ప్రాచీన రికార్డుల భాండాగారం ఏర్పాటుకు 15 లక్షలతో నిర్మిస్తున్న భవనానికి కేంద్ర మంత్రి శ్రీ కబీర్ శంకుస్థాపన.

—కృష్ణా, గుంటూరుజిల్లాలలో కుంభవృష్టి. వరదలు.

—చైనా సేనలచే మెక్‌మాహన్ సరిహద్దు శ్రేణి అతిక్రమణ.

సెప్టెంబరు 16 : వరదలవల్ల విజయవాడ, ఏలూరు, నూజివీడుల మధ్య రాకపోకలు బంద్. హైదరాబాద్‌కు బస్సుల ప్రయాణం జనగాం మీదుగా మళ్లింపు.

—అమెరికా భారత సంబంధాలపై వాషింగ్టన్‌లో ఆర్థికమంత్రి శ్రీ మొరార్జీ చర్చలు.

—మద్రాసులో శస్త్ర పరికరాల ఫ్యాక్టరీకి మంత్రి శ్రీ కె. సి. రెడ్డి శంకుస్థాపన.

—గుల్హాటీ సంఘం సిఫార్సులు ఆంధ్రకు హానికరమని మంత్రి శ్రీ ఆలపాటి విమర్శ.

సెప్టెంబరు 19 : తిరువేంద్రంలో ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్ష కార్యదర్శుల సమావేశం. కాంగ్రెసులో బినామీ సభ్యత్వంపై చర్చలు.

—లండన్‌లో కామన్వెల్తు ప్రధానుల సభ ముగింపు.

—సమితి సర్వ ప్రతినిధిసభ అధ్యక్షులుగా శ్రీ జఫ్రుల్లా ఎన్నిక.

సెప్టెంబరు 20 : టిబెట్ సరిహద్దున ప్రమాద పరిస్థితి.

సెప్టెంబరు 21 : నిరాయుధీకరణ చర్చలలో ఫ్రాంసు పాల్గొనాలని పారిస్‌లో ప్రధాని నెహ్రూ సూచన.

—జంట నగరాలలో వరదల భీభత్సం.

—అల్జీరియా ఎన్నికల్లో బెల్లా వర్గ విజయం.

—గురజాడ శతజయంతి ఉత్సవాలు ప్రారంభం.

—విజయవాడ పురపాలకసంఘం అధ్యక్షులుగా కాంగ్రెసు అభ్యర్థి శ్రీ ఎం. ఎస్. ఖుద్దూన్ ఎన్నిక.

సెప్టెంబరు 23 : ఈశాన్య సరిహద్దుల్లో చైనా భారత సేనల మధ్య కాల్పులు.

సెప్టెంబరు 25 : పంజాబు గవర్నరుగా కేరళ ముఖ్యమంత్రి శ్రీ పట్టంతానూపిళ్ల నియామకం. కేరళ ముఖ్యమంత్రిగా శ్రీ ఆర్. శంకర్ పదవీస్వీకారం.

సెప్టెంబరు 27 : ఎమన్‌లో తిరుగుబాటు. ఇమామ్ రాజు సజీవంగా స్వంత భవనంలో దగ్ధం. రిపబ్లిక్ స్థాపన.

సెప్టెంబరు 28 అటవీశాఖ మంత్రి శ్రీ పళ్లంరాజు కాలధర్మం.

**Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna, at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras—1. Editor: S. Sambhu Prasad.**